


గురూపదేశ రత్నమాల (వచన గ్రంథము)

తమిళ మూలం : శ్రీ మురుగనార్

"గురువాచక కోవై"కు శ్రీ సాధుఓం వచనం

తెలుగు సేత : తాడిమేటి సత్యనారాయణ

శ్రీ రమణాశ్రమము తిరువణ్ణామలై-606603

## ప్రకాశకుల మాట

భగవాన్ శ్రీ రమణమహర్షి అనుగ్రహానికి పాత్రులైన వారిలో మహాకవి మురుగనార్ ఒకరు. మహర్షి 'ఉపదేశసారము'నీ, 'ఉన్నదినలువది'నీ మనకి అనుగ్రహించటానికి కారకులు మురుగనారే. భగవాన్ ఉపదేశాలు ఈ రెండు రచనల్లోనూ నిక్షిప్తమై ఉన్నాయి. ఈ రమణుల వాక్కులు ఉపనిషత్తులలోని వాటివలె సంక్షిప్తంగానూ, భావగర్భితంగానూ ఉంటాయి. భక్తులకీ, సాధకులకీ ఆ వాక్యాలకి సంబంధించిన వివరాలను శ్రీ భగవానే సందర్భానుసారంగా అనుగ్రహించారు. ఈ వివరాల ఆధారంగా మురుగనార్ భగవాన్ ఉపదేశాన్ని తమిళ పద్యాలుగా వ్రాశారు. వ్రాసిన పద్యాలను ఎప్పటికప్పుడు శ్రీ భగవాన్కి నివేదించేవారు. మహర్షి వాటిని చూచి, ఆమోదించేవారు. కొన్ని చోట్ల వారే ఇంకా విషయాన్ని వివరిస్తూ తమిళ పద్యాలను కూడా వ్రాసేవారు. శ్రీ మురుగనార్ తన పద్య సంకలనానికి "గురువాచక కోవై" అని పేరుపెట్టారు. ఈ కవితలకి వచన రూపాన్ని కవిగారి శిష్యుడు సాధు ఓం రచించారు. ప్రస్తుత గ్రంథం “గురూపదేశ రత్నమాల" ఆ రచనకు తెలుగు అనువాదం,

తెలుగు నాట భక్తులకు దీనిని అందుబాటులోకి తీసుకురావాలన్న మా వాంఛకు రూపమే ఈ తెలుగు గ్రంథం. దీనిని శ్రీ తాడిమేటి సత్యనారాయణ గారు తెలుగు వచన రూపంలో అనువదించారు. ఈ వచన గ్రంథాన్ని తెలుగు భక్తులకు ఇప్పుడు ఆశ్రమప్రచురణగా అందిస్తున్నందుకు చాలా ఆనం దిస్తున్నాము.

మహాపూజరోజు
24-5-2003

ప్రెసిడెంట్
రమణాశ్రమము.

ఓం నమో భగవతే శ్రీ రమణాయ

## అనువాదకుని మాట

ఈ గ్రంథం తెలుగు సేతకి ఎందరో చేయూత నిచ్చారు. తెలుగులో వ్రాయటానికి అవకాశమిచ్చిన శ్రీరమణాశ్రమం అధ్యక్షులు శ్రీ వి.ఎస్. రమణన్ గారికి వందనములతో కూడిన కృతజ్ఞతలు. గ్రంథ రూపకల్పనకు కావలసిన సలహాలిచ్చిన శ్రీ టి.వి.చంద్రమౌళిగారికి, తమిళపదాలకి అర్థ వివరణ లిచ్చిన శ్రీమతి టి.ఆర్. కనకమ్మగారికి, ప్రస్తుతం తిరుచినాపల్లి వాస్తవ్యులు శ్రీ ఎమ్. గోవిందరాజన్ గారికి, తిరువణ్ణామలై శ్రీరమణనగర్ వాస్తవ్యులు శ్రీ ఎన్. శంకరన్ గారికి కృతజ్ఞతలతో నమస్కరిస్తున్నాను.

ఈ గ్రంథ ప్రతిని ఆసాంతము చదివి, సరిదిద్ది సూచనలిచ్చిన రమణ భక్తులు, పూజ్య మిత్రులు, శ్రీ పింగళి సూర్య సుందరం గారికి, శ్రీ దోనేపూడి వెంకయ్యగారికి శతసహస్ర వందనములు.

ఈ "గురూపదేశ రత్నమాల" గ్రంథాన్ని భక్తులు చదివి తరిస్తారని ఆకాంక్షిస్తూ. తాడిమేటి సత్యనారాయణ

## గురువాచక కోవైలో అన్నారయా

ఉన్నాడయా రమణుడున్నాడయా,
కన్నులకు కన్నుగా ఉన్నాడయా,
మన్ను మిన్ను ఏకముగ ఉన్నాడయా, అన్నియుతానైయై ఉన్నాడయా.
గురువాచకకోవైను కూర్చెను మురుగనార్, రమణోపనిషత్తుగా అన్నారయా, నిరతాధ్యయనమునకు అన్నారయా, పరతత్త్వసాధనకు అన్నారయా.
మురుగనారుడు రమణ భక్తాగ్రణి సుకవి, “గురువాచక కోవై”ను కన్నాడయా,

గురుముఖ వినిర్గత మ్మన్నాడయా,
పరసుధా మధుధార అన్నాడయా.
పరగ ముత్తెపు రుచిర సరులునై విరిసరుల, సిరులునై వరలెనని అన్నారయా,
పరమపద వివరణము లన్నారయా,
గురువాచక కోవైలో అన్నారయా.

గేయ రచన : శ్రీ దోనేపూడి వెంకయ్య గారు.

# గురూపదేశ రత్నమాల

ఓం నమో భగవతే శ్రీ రమణాయ
పరమార్థదీపం అను గురూపదేశ రత్నమాల (వచనం)

## 1. గురుప్రార్థన

1. అహంకార మమకారములనే మోహము నుండి రక్షించి, మోక్ష లక్ష్యం నెరవేరక నిరాశ నిస్పృహలకు లోనుగాకుండా, "గురూపదేశ రత్నమాల" అనే ఈ పరమార్ధ దీపం, భక్తుల మనస్సులను వికసింపజేస్తుంది. ఆత్మ స్వరూపంగా ప్రకాశిస్తుంది.

2. ఈ శరీరమే నేనని ఎంచి దుఃఖించిన నన్ను మలమయమైన ఈ జడరూపం నేను కాదని గ్రహింపచేసి జ్ఞానాన్ని బోధించే గురు రూపంలో వచ్చి కరుణతో అనుగ్రహించిన మౌన గురువగు శ్రీ రమణుల పాదద్వయాన్ని నా శిరస్సుపై ధరిస్తున్నాను.

3. విభిన్నమైన సిద్ధాంతాలకీ, సంవాదాలకీ వెనుకనున్న ఒకే ఒక సత్యాన్ని సంగ్రహంగా వివరించి ఉపదేశించు జ్ఞాన వల్లభుడు శ్రీరమణుడు. ఆ సద్గురు పాదాలను నా శిరస్సున ధరిస్తున్నాను.

## 2. గ్రంథనామం, అవతారిక

4. జ్ఞాన స్వరూపమైన ఈ పరమార్ధ దీపాన్ని సద్వస్తువంటే ఏమిటో తెలియని ఈ అజ్ఞాని వెలిగించినది కాదు. నన్ననుగ్రహించిన శ్రీ రమణ భగవానుని జ్ఞానంతో ప్రజ్వలింపజేసిన దీపం.

5. పరమాత్మస్వరూపుడు అనుగ్రహమూర్తి అయిన శ్రీరమణ తమ భక్తుల అజ్ఞానం తొలగటాని కుపదేశించినటువంటి బోధనలలో నా బుద్ధికందిన కొన్నిటిని హృదయంలో పదిలపరచి (రాబోవు పద్యాలలో) చెబుతున్నాను. ఇక్కడ వచనములని గ్రహించవలెను.

6. ఏ అద్వైతజ్ఞానానుభవ స్థితిలో సదా సంస్థితమై ఉంటూ శ్రీరమణ సద్గురువు నన్ను తనలో ఐక్యపరచుకున్నారో, ఆ ఐక్యస్థితిలో నేనూ ఆ సద్గురువుతో ఉంటూ అనుభవ పూర్వకంగా తెలుసుకొన్న పరమార్థతత్త్వాలు కొన్ని చెబుతాను.

7. “ఈ శరీరమే నేను" అని విజృంభించిన అహంభావం నశించునట్లు నన్ను తీర్చిదిద్దిన శ్రీరమణగుర్వనుగ్రహంతో నేను తెలుసుకొన్న పరమార్థాన్ని

* తమిళ కవితల మాలగా కడతాను.

* ఇక్కడ తెలుగు వచనములని గ్రహించవలెను.

## 3. గ్రంథ పఠన ఫలితం

8. నిరంతరం తాను తప్ప అన్యముకాని పరమాత్మస్వరూపంగా వెలుగొందటం వలన, దానిని పొందటమనే క్రియ అంటూ ఏదీ నిజంగా లేనే లేదు.అందువల్ల (మోక్షేచ్ఛగల్గిన) మనస్సు ధర్మార్థకామాలనబడే చాంచల్యాన్ని పోగొట్టుకోవటమే పరమార్థ దీపం అనే ఈ గ్రంథ పఠన ఫలితం.

వివరణ :ధర్మం, అర్థం, కామం, మోక్షం అని పురుషార్థాలు నాలుగని విన్నాం. వీటిలో మొదటి మూడు పొందవలసినవికావు. ఈ సత్యాన్ని బోధించి దాని కోసం చేసే ప్రతి క్రియని ఈ గ్రంథం నిరోధిస్తోంది. పైగా, మోక్షం అంటే పొందవలసిన పురుషార్థమేకదా! దాని కోసం మానసిక ప్రయత్న రూపమైన ఒక చలనం అవసరం కాదా? అని ప్రశ్నిస్తే పరమాత్మ నిత్యసిద్ధం కావటంచేత పొందటమనేది మోక్ష విషయంలో పొంతనలేనిదని ఈ గ్రంథం దారి చూపిస్తోంది.. అంతే కాకుండా చలన రహితమైన పరిపూర్ణ నిత్యసిద్ధ నిశ్చలస్థితినే ఈ గ్రంథం అనుగ్రహిస్తోంది. అందుచేత ఇంతకన్నా గొప్ప ఫలితం - పురుషార్థం వేరేముందని భావం.

9. ఇహపర సుఖాలన్నిటికీ సుఖస్వరూపమైన తన ఆత్మే మూలం. అందువల్ల వాటిపై వ్యామోహంతో అల్లాడక ఆత్మనిష్ఠలో నుండటమే ఈ గ్రంథం వలన ముఖ్యంగా మనం పొందే ఫలితం.

## 4. గ్రంథకర్త వేడుకోలు

10. గురూపదేశ రత్నమాల అనే మధురమైన గ్రంథాన్ని, మందబుద్ధిని విమూఢాత్ముడను అయిన నేను నా మనస్సుతో ఆలోచించి రచించలేదు. ఆ పరమపుణ్యుడైన భగవాన్ శ్రీ రమణులు మనోతీతావస్థలో నా చేత వ్రాయించారు.

11. నేనన్న కర్తృత్వభావంతో రచించని ఈ గ్రంథాన్ని నేను ఎట్లాగ వినయంతో నాదని చెప్పుకోగలను? మహాత్ములు వారి హృదయంలో అనుభవించు మౌనసమాధిస్థితి చేత తెలుసుకొనే ఆ పరమపురుషుడైన శ్రీ రమణభగవానునిదే ఈ గ్రంథరచనా బాధ్యత.

## 5. అంకితం

12. కల్లాకపటం లేని సద్గుణవంతురాలైన నా తల్లి, నా అజ్ఞానం నశించి జ్ఞానాన్ని సంపాదించుకోవాలని నాకు జన్మనిచ్చింది. అందుకు నాతల్లి జ్ఞాపకార్థం ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నాను.

## 6. గ్రంథకర్త

13. సకల సంపదలకు నెలవు శ్రీరమణ భగవాన్ పాదాలను చేరటమేనని భక్తి భావంతో ముగవైకణ్ణ మురుగనార్ తమ సద్గురువుల ఉపదేశాలు కొన్నింటిని ఒక మాలగా కూర్చి శ్రేష్టమైన ఒక జ్ఞాన నిధిగా దీనిని రచించారు.

*ఈ వచనమును మరొక భక్తుడు రచించారు.

(గ్రంథకర్త అసలు పేరు రామనాథపురం కృష్ణస్వామి సుబ్రహ్మణ్యన్. వారికి తమిళభాషంటే ఎంతో మక్కువ. ఆ భాషాభిమానంతో తన పేరును రామనాథపురం = ముగవై, కృష్ణ = కణ్ణ, సుబ్రహ్మణ్యం = మురుగన్ అని మార్చుకొన్నారు. వారిని గౌరవంగా మురుగనార్ అని పిలుస్తారు).

# ఆత్మవిచారణ

## మంగళం

14. ఈ భూదేవి (ఈ భూలోకవాసులు) చేసిన తపస్సు యొక్క ఫలితమే, ఆ శుద్ధపరబ్రహ్మ స్వరూపం, శ్రీరమణ గురువుగా శరీరం దాల్చి అవతరించింది. ఆ జ్ఞాన పాదపద్మాలను మన హృదయాలలో పదిలపరచుకుందాము.

15. సమస్త జీవులలో హృదయమై ప్రకాశించునది “అహం” అనే శుద్ధ బ్రహ్మము. అదే, అజ్ఞానుల మోహాన్ని నాశం చేస్తున్న జ్ఞానగ్రంథమైన గురూపదేశ రత్నమాలకు అనుగ్రహాన్నిస్తుంది. మంగళం చేకూరుస్తుంది.

16. మననిజ స్వరూపానుభవము పూర్ణ మౌనంగా గోచరిస్తుంది. దేహమే నేను అని లేచే అహంభావానికి అధిష్టానమైన సత్యాత్మరూపంగా అది ప్రకాశిస్తుంది. ఆ పరిశుద్ధ పరమాత్మ స్వరూపమైనటువంటి పాదాలను మన శిరస్సున ధరింతుము.

17. అంతర్ముఖ సాధన చేపట్టిన ముముక్షువులకు విసుగుకలగకుండా సదా ఆత్మసుఖంలోనే ఉండునట్లు ఉత్సుకతను కలిగించే దివ్యఫలంగాను, ఆత్మలక్ష్యానికి మార్గాన్ని చూపించే జ్యోతిగాను, తురీయమే తన నిజస్వరూపంగాను ప్రకాశిస్తున్నారు శ్రీరమణ సద్గురువులు. వారి అనుగ్రహమొక్కటే పొందవలసిన సద్వస్తువు.

18. బంధ విముక్తులులేని హృదయం కలవాడు, ఆత్మజ్ఞానం వల్ల కలిగిన త్యాగమే సౌందర్యంగా కలవాడు, మఱపుచేత కలిగిన దుఃఖాలు పూర్తిగా తొలగిపోవునట్లు నన్ను అనుగ్రహించిన శ్రీరమణుని పాదాలే నాకు లక్ష్యము. అవే నాకు ఆశ్రయం. అవే నాకు శరణ్యం.

### 1. జగత్స్వరూపం

19. కారణమైన చైతన్యమే కార్యరూపమైన జగత్తుగా కనబడుతోంది. ఈ జగత్తుని శాస్త్రాలు నామరూపాలుగా వర్ణిస్తాయి. ఈ ప్రపంచానికి మూలకారణమైన చైతన్యమే హస్తామలకంవలె నత్యంకాబట్టి, ఈ జగత్తు కూడా చిన్మయసత్యమే యని నీవంటావు.

వివరణ : శాస్త్రాలు ఈ ప్రపంచాన్ని నామరూపాలుగా వర్ణిస్తున్నాయి. ఈ నామరూపాలు
రెండూ కారణ బ్రహ్మ యొక్క కార్యాలేయని చెప్పవచ్చు. సత్ చిత్ ఆనందం, నామం రూపం అనే బ్రహ్మ యొక్క ఐదు అంశాలలో మొదటి మూడు సత్యాంశాలు. నామరూపాలు మిధ్యాంశాలు. సచ్చిదానందం స్వప్రకాశమైనది. అయితే నామరూపాది ప్రపంచం అట్లాగకాదు. సచ్చిదానంద అధిష్టానం యొక్క ఉనికి వలన అవి ఉన్నట్లు కనబడతాయి. ఒకని నీడ మరొకనిని సూచించక అతనినే సూచించినా, నీడ మాత్రం అతను కాదు. మానవుడుండుటవలన నీడ కూడా నిజమైనట్లు, కారణ వస్తువుపైన బ్రహ్మయొక్క సత్యంవలన కార్య వస్తువుపైన జగత్తు కూడా సత్యమని గోచరిస్తుంది. కనుక నామరూపాలని త్రోసిపుచ్చి, ప్రపంచపు సత్యాంశాన్ని బట్టి ఈ ప్రపంచమూ సత్యమనిపిస్తుంది.

20. నిరంతరం ప్రకాశించే ఆత్మ దృష్ట్యా ముల్లోకాలనీ, సప్తలోకాలనీ చెప్పబడేటటువంటి ఈ లోకాలన్నీ గోచరించటంవలన అవి నిజమే. కాని నామరూప ప్రపంచ దృష్ట్యా చూస్తే కారణవస్తువుపైన సత్యాత్మ వస్తువుకూడా శూన్యంగానే కనబడుతుంది.

21. తాను చూసే జగత్తు నిజమని ఆనందించు అజ్ఞానులకు, ఈ ప్రపంచం ఈశ్వరుని సృష్టియని శాస్త్రాలు చెప్పవలసి వచ్చింది. అయితే బంధహేతువు, మోహపూరితమైన ఈ దృశ్యమానజగత్తు జ్ఞానులకు మాత్రం మనఃకల్పిత దృశ్యంగానే కనబడుతాయి.

22. ఇంద్రియజ్ఞాన రూపంగా గోచరమవుతున్న ఈ అల్ప నామరూప జగద్దృశ్యాలన్నీ, ఆ సచ్చిదానంద ఆత్మస్వరూపంలో ఉద్భవించినట్లు గోచరించే మనోవ్యాపార మాత్రములే అని గ్రహించు.

23. తాను తప్ప అన్యమేదీ లేదని తెలుసుకొన్న జ్ఞానులు, లేనటువంటి ఈ జగత్తును సత్యమని చెప్పరు.

24. దూదికాయలను పండు అనుకొని దానికోసం వేచి యుండు చిలకవలె, కనబడే జగత్తును, నిజమైన ఒక వస్తువుగానెంచి సుఖానికై ఆరాటపడే ఓ మానవుడా! కనబడటంవలన ఈ జగత్తు నిజమైతే, కనబడే ఎండమావి కూడా నిజమని నీవు అనుకోవచ్చుకదా!

25. చూసే నీ స్వరూప జ్ఞానాన్ని వదలిపెట్టి, చూడబడుతున్న ప్రపంచాన్ని నిజమని భ్రమించి దాని వెంటపడకు. ఎందువల్లనంటే ఈ దృశ్యం మాయమయ్యేది. అది నిజంకాదు. కాని చూసే నీ నిజస్వరూపం ఎప్పుడూ మాయమవ్వదు. ఎప్పుడూ ఉండేదే. అదే సత్యమని గ్రహించు.

26. ఆత్మయొక్క మాయావికార రూపమే మనస్సు. ఆ మనస్సుకే ఈ జగత్తు తెలుస్తుంది తప్ప, ఆత్మ స్వరూప జ్ఞానంలో కాదు. అందువల్ల ఈ ప్రపంచానికి సత్యత్వం ఆపాదించగలమా? కాదని తెలుసుకో!

27. నిద్రయనే అజ్ఞానాంధకార ఆధారం వలననే స్వప్నం కనబడుతోంది. అట్లాగే, తన స్వరూపాన్ని మరచిన అజ్ఞానాంధకార ఆధారం వలననే కనబడుతున్న ఈ తుచ్ఛమైన ప్రపంచాన్ని చూసి భయపడకు. దట్టమైన అజ్ఞానాంధకారంలో మునిగిన ఈ అసత్యపు ప్రపంచం, నచ్చిదానందపు వెలుగులో అదృశ్యమైపోతుంది.

28. ఈ ప్రపంచాన్ని చూసి భయభ్రాంతులు చెందుతున్న సాధకులారా! ప్రపంచమంటూ ఏదీ లేదు. దీనికి భయపడటం రజ్జుసర్పభయం వంటిదే.

29. తలపుల మయమైన జాగ్రత్స్వప్నావస్థలలోనే ఈ ప్రపంచం నిస్సందేహంగా గోచరిస్తోందే తప్ప, ఏ తలపులూ లేని సుషుప్తిలో గోచరించదు. కాబట్టి తలపులే (వాసనలే) ఈ ప్రపంచానికి ఆధారం.

30. తలపులే ఈ ప్రపంచమైతే, మెలకువలో తలపులులేక ప్రశాంతంగా నుండే ఒకానొక సమయంలో (ధ్యానసమయంలో) కూడా కలలు కలిగినట్లు తలపులు లేచి ప్రపంచ రూపాన్ని సృష్టిస్తాయి. మునుపటి తలపుల వేగ ప్రభావం వల్లనే అట్లు జరుగుతున్నదని తెలుసుకో!

31. గూటి కోసం తన నోటి నుండి దారాన్ని సృష్టించి, మళ్లీదానిని తన నోటిలోనికే లాగుకొనే విచిత్ర శక్తిగల సాలీడువలె, మనస్సు కూడా తనలో నుండే ఈ ప్రపంచాన్ని సృష్టించి, మళ్లీ తనలోనే మాయం చేసుకొంటుంది.

32. మెదడు ద్వారా, పంచేంద్రియాలద్వారా మనస్సు బహిర్గతమైనపుడు, (జగత్తయిన) నామరూపాలు లోనుండి త్రోయబడి దృశ్యాలుగా కనబడుతున్నాయి. అట్లాగే మనస్సు అంతర్ముఖమై హృదయంలో నెలకొని ఉన్నప్పుడు ఆజగత్తూ తిరిగి లోనికి ప్రవేశించి హృదయంలో విలీనమవుతున్నది.

33. నామరూపల భేదాలతో గోచరించే ఈ జగత్తు, నామరూపాల కల్పితాలు పోతే బ్రహ్మంగా గోచరిస్తుంది. మూర్ఖుడైన మనిషి బ్రహ్మమును నామరూప కల్పనలతో కప్పి, తర్వాత దానిని ప్రపంచంగా చూసి వ్యామోహంలో పడుతున్నాడు.

34. నామరూప మాత్రంగా గోచరించే ఈ ప్రపంచాన్ని అహంకారం, సత్యంగా చూపిస్తోంది. దానిపై వ్యామోహాన్ని కల్పించి, తన్ను తాను మోహపాశానికి బద్ధ మొనరించుకుంటున్న ఒక మహాయాయ.

35. తలపులలో గోచరించు ద్వంద్వాలు, త్రిపుటితో కూడిన ఈ ప్రపంచమనే వ్యవహారం, ఆత్మదృష్టిలో లేనివి. ఉప్పు మూటను కాల్చి తిప్పితే చీకటిలో కన్పించే నిప్పురవ్వల వలయంలాగ కల్పితమైనవి. అది మనస్సు యొక్క అజ్ఞాన చక్ర భ్రమణమేయని తెలుసుకో.

36. జ్ఞానుల బోధనలను గ్రహించలేని లౌకిక బుద్ధి గలవాడా! దృష్టిలోపంవల్ల ఉబ్బినట్లు గోచరిస్తున్న ఈ ప్రపంచాన్ని కనుక పరిశీలిస్తే, అది నీ వాసనల ప్రభావం (పన్నుగడ) వలన కల్గిన అసత్య దృశ్యమే తప్ప మరేదికాదు అని తెలుస్తుంది.

37. కామెర్ల కళ్లకు అంతా పచ్చగా కనబడుతున్నట్లు కనిపించే ఈజగత్తంతా అహంకార మయమైన కామక్రోధాది వాసనలతో నిండిన మనోమయ దృశ్యమే. కాని నిజానికి అది నిత్యముండే పూర్ణజ్ఞానమే.

38. వెలుతురులో పసుపురంగు వెలిసిపోతుంది. అట్లాగే ఈ నామరూప ప్రపంచ దృశ్యమంతా జ్ఞానమనే వెలుతురులో మాయ మగుట చేత ఈ ప్రపంచం జ్ఞానసూర్యుడైన పరాత్పరుని సృష్టికాదు. ఈ ప్రపంచం నెమలి ఫించంలోని రంగులచిత్రంవలెనూ, మనోదర్పణంపై కన్పించే ఒక మానిని ప్రతిబింబంవలెనూ అసత్యరూపం,

39. ఆత్మ స్వరూపానుభవ జ్ఞానంలో కన్పించే ఈ ప్రపంచ దృశ్యం, ఆకాశంలోని దట్టమైన నీలిరంగు వంటిది. దేహమే నేను అనే అహంకారమోహంతో చూచే ఈ జగత్తంతా కేవలం కల్పితమని గ్రహించు.

40. ఒక్క జ్ఞానులను తప్ప, ఎంతటివారినైనా వంచించగల ఈ మాయా ప్రపంచం ఎట్లాగ జనించింది? ఆత్మస్వరూపమైన తన్ను తాను పట్టి నిలబడక, దాని నుండి జారిపడినందువల్లనే, ఈ ప్రపంచం గోచరిస్తోందే తప్ప మరే విధంగానూకాదు.

41. ఇష్టానిష్టాల ఆధారంగా నడుస్తున్న జీవితమనే ఈ వ్యామోహం, నిద్రలో నిజమైనదిగా కనబడి (అజ్ఞానంలో), మెలకువ (జ్ఞానం) రాగానే అది అసత్యమై పోవటానికి కల్గిన ఒక నిరుపయోగమైన కల.

42. తన ఆత్మ స్వరూపంలో చిత్తం కరిగి రూపం నశిస్తే ఇచ్ఛయనే పలురకాల శక్తులు (ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి) కూడా తన జ్ఞాన స్వరూపంలో అసత్యకల్పితములుగా గోచరించినవే యని (ఇంకెపుడూ ఆమాయాదృశ్య రహితంగా) తప్పుకొంటాయి.

43. పరాశక్తి యొక్క లీలావిలాసాలే త్రిపుటి రూపంలో కనబడుతున్న ఈ ప్రపంచ దృశ్యాలన్నీ, ఈశ్వరుడు అధిష్టానంగాగల తెరవలె వుండి, దానిపై కనిపించే దృశ్యాలే అవి యని గ్రహించు.

44. త్రాడులో పాము, మోడులో దొంగ, భ్రాంతి కలిగించే ఎండమావి ఎట్లు అసత్యమో, అట్లాగే ఉన్నట్లు గోచరించే ఈ జగత్తు కూడా అసత్యమే.

45. బంగారం ఆధారంగా కలపే అయినా, వివిధంగా కన్పించే సకలాభరణాల వలె తానే మూలమైనా, తనకు కనబడుతున్న ఈ చరాచరనామరూపమయ ప్రపంచమంతా తనకంటే భిన్నమైందా? ఎందువల్లనంటే చూడబడే అన్ని రకాల ఆభరణాలు కూడా బంగారం యొక్క నైజమే కదా?

46. ప్రపంచం కనబడుతున్నప్పుడు ఆత్మస్వరూపం అదృశ్యమవుతోంది. ఆత్మస్వరూపం గోచరిస్తున్నప్పుడు ప్రపంచం అదృశ్యమవుతోంది. అంతేగాని రెండూ ఒకేసారి కనబడటంలేదు. రాతితో చేసిన కుక్క ప్రతిమలో ఆ రాతిని చూస్తే కుక్క కనబడదు. కుక్కని చూస్తే రాయి కనబడదు. (రెండూ ఒకే సారి కనబడవు)

47. ఆత్మ గోచరించకుండా దాచే ఈ ప్రపంచం ఒక కల వంటిది. కనిపించే ఈ ప్రపంచం ఆత్మ స్వరూప దర్శనం చేత వశమై అందులో కరిగి పోతే అది ఆత్మస్వరూపంగానే ప్రకాశిస్తుంది.

48. నిజమని ఒప్పించి మన బుద్ధిని భ్రమింప చేసే ఈ మాయా ప్రపంచమంతా సద్వస్తువైన ఆత్మకంటే వేరుకాదు. ఎల్లప్పుడూ ఆత్మే ఆధారంగా గల శక్తి స్వరూపము.

49. దట్టమైనపొగతో కప్పబడిన నిప్పువలె, ప్రకాశిస్తున్న జ్ఞాన జ్యోతి ఈ ప్రపంచనామ రూపాలతో కప్పబడి ఉంది. దాని అనుగ్రహం చేత నామరూప అస్పష్టత పోయి జ్ఞానం తేటతెల్లమయితే ఈ ప్రపంచపు నిజ స్వరూపం జ్యోతివలె ప్రకాశిస్తూంది.

50. ఆత్మజ్ఞానంలో నుండే జ్ఞానులకు ఈ ప్రపంచమంతా తమ ఆత్మస్వరూపమే. జ్ఞానులు ప్రపంచాన్ని సత్యమని చెప్పేమాటలలోని నిజాన్ని అజ్ఞానులెట్లు గ్రహించగలరు?

51. పంచేంద్రియములవలన కలిగిన జ్ఞానాల్లో ఏదీ మిగలకుండా సన్యసించి అవి ఇంకెపుడు అంటకుండా, పరమాత్మజ్ఞానాన్నిపొంది, మాయాధీనం నుండి విడివడిన మనస్కులైన జ్ఞానులే "జగత్తుసత్యం" అనే మాటని పూర్తిగా గ్రహించగలరు.

52. తన దృష్టిని జ్ఞానమయంగా చేసుకొని ఆ దృష్టితోచూచినట్లైతే, ఆకాశం మొదలు పంచ భూతాలతో కూడిన ఈ ప్రపంచం కూడా జ్ఞానమయమైన ఆత్మవస్తువుగా సత్యమని తెలుస్తోంది. అట్లాగే చూడు.

53. తన దోష దృష్టిని పరబ్రహ్మస్వరూపంగా చేసుకొని, ఆ స్వరూప దృష్టితో చూచినట్లైతే దుఃఖసాగరంగా కనిపించే ఈ ప్రపంచమంతా ఆనంద సాగరంగా కనిపిస్తుంది.

54. సచ్చిదానందమయమైన దృష్టితో చూసే జ్ఞానులకు, ఈ ప్రపంచం కూడా నిజానికి సచ్చిదానందమే అవుతుందని గ్రహించాలి.

55. మోహ దృష్టితో చూసే స్వప్నం వలె, మనఃకల్పితమైన ఈ దృశ్యమాన ప్రపంచపు స్వభావం, మనోమాయాతీతమై ప్రకాశించు పరిపూర్ణ జ్ఞాన దృష్టికే చక్కగా గోచరిస్తుంది.

56. నీ వలె తోచు స్వప్నాన్ని చూసి మోహితుడవవుతున్న ఓ దుర్బలమనసా! నీ నిజస్వభావాన్ని నీవు తెలుసుకున్నట్లైతే సచ్చిదానందమైన ఆ స్వభావానికి భిన్నంగా ఈ ప్రపంచం ఉంటుందా? (ఉండదని భావం)

57. అనేక నామ రూపాలుగా వ్యాపించి, మోహానికి హేతువైన ఈ మాయా ప్రపంచం మొదట ఏకమైన సుఖరూపమే. ఎన్నో వన్నెల నెమలి యొక్క అండం మాత్రం ఒకే రంగులో ఉన్నట్లు (రకరకాల రంగుల్లో కాదు) జగత్ సత్యాన్ని ఆత్మ నిష్ఠలో నుండి చూడు.

58. సిద్ధి పొందిన ప్రాజ్ఞులు, అనేక (నామరూప) వికారాలమయమైన దానినిగాఈ ప్రపంచాన్ని ఎప్పుడూ చూడరు. ప్రపంచం వలె కన్పిస్తున్న ఈ విభిన్న రూపాలన్నీ ఏకవస్తువు యొక్క అనుగ్రహవిలాసమే.

59. శరీరమే “నేను” అని అభిమానించే అహంకారంతో సంబంధంలేక, ఆత్మస్వరూప స్థితిలో సంస్థితమై ఉన్న జ్ఞాన నిష్ఠునకు ఈ జగత్తు తన ఆత్మ స్వరూపంగానే గోచరిస్తుంది. అందువల్ల మనం ఈ ప్రపంచాన్ని వేరైన జడమైన నామరూపాలుగా చూడటం తప్పు.

60. అంతర్ముఖదృష్టితో ప్రాపంచిక వ్యామోహాన్ని పోగొట్టి, ప్రపంచ దృశ్యం అదృశ్యమైన తర్వాత మిగిలియున్న శూన్యాన్ని "ఇదిశూన్యం" అని ఒక దృశ్యంగా చూచే ఆత్మ జ్ఞాన సాగరంలో ఆ శూన్యాన్ని కూడా ముంచి నాశనం చేసి ఉండెదవుగాక!

61. ఏ జ్ఞాన రూపంగా ఈ జగత్తంతా ప్రకాశిస్తోందో, ఆ సచ్చిత్స్వరూపంగా హృదయంలో నీవు యుండగలిగినట్లయితే, భయభ్రాంతులను కలిగించే
ఈ అసత్యపు ద్వైతంపోయి, ఆత్మస్వరూపంలో ఈ జగత్తు ఏకమై గోచరిస్తుంది.

62. ఇంద్రియ వ్యాపారాలమయమైన ఈ జగత్తుని పరమాత్మ జ్ఞాన స్వరూపంగా ఎవరు చూస్తున్నారో ఆ జ్ఞాని, ఆ ఆత్మస్వరూపాన్నే పంచేంద్రియాలచేత తెలుసుకొని అనుభవించునని తెలుసుకో.

## 2. జగన్మిథ్యాత్వం

63. కంటికి కనబడు ఈ జగత్తు నిత్యం కానప్పటికీ, అది సత్పదార్థమేయని కొందరు వాదిస్తారు. అయితే అవ్యయము, నిత్యము అనేవి ఆ సత్పదార్థానికి ఉండవలసిన ప్రమాణాలు కదా! అని మనం నిరాకరిస్తున్నాం.

64. "కనబడే ఈ జగత్తు అఖండ ఏకవస్తువుగా కాకుండాపేర్వేరైనప్పటికీ నిజానికి వేఱుకాదు" అని కొందరు వాదిస్తారు. కాని "మార్పుచెందని ఏకత్వం, అవిభాజ్యం ఆ సద్వస్తువుకి ప్రమాణాలే కదా" అని మనం నిరాకరిస్తున్నాము.

వివరణ : నాశనములేనిది, మార్పు చెందనిది, స్వయం ప్రకాశమైనది. ఈ మూడు సద్వస్తువు యొక్క లక్షణాలుగా పరిగణించాలని శ్రీరమణులమాట.

65. కాలమనే చక్రాయుధం నాశనం చేస్తున్న ఈ జగత్తుని సత్పదార్థమని జ్ఞానులనరు. నిత్యమై దేశకాలాతీతమైన స్వయం ప్రకాశకత్వమే ఈ సత్పదార్థపు లక్షణం.

66. ఆ శాంతిమయమైన సదాశివమే సత్పదార్థము. ఇక్కడ కనిపిస్తున్న పాపాలన్నీ విచ్ఛిన్నమువలన కలిగిన మనస్సు యొక్క అసత్యభావనయే.

67. ఆత్మ తప్ప తనకు వేరొక ఉనికి లేని ఈ లోకాన్నంతా ఆత్మకి అన్యమనీ, దేహాత్మబుద్ధి చేత దానిని మరొక వస్తువుగా భావించటం అజ్ఞానం యొక్క పర్యవసానమే.

68. ప్రపంచ వ్యవహారాల్లో పడి దుఃఖిస్తున్న ఓ మనసా! ఇపుడైనా నీవు అన్వేషించి తెలుసుకొని సత్యాన్ని మాట్లాడు. అసత్యమైన ఈ దేహేంద్రియాలతో గ్రహింపబడే ప్రతీది అసత్యమా లేక సత్యమా? (అసత్యమే యని భావం)

69. సత్యరూపమైన తమ ఆత్మస్థితి నుండి జారి అజ్ఞానాంధకారంలో మునిగ్ని "దేహమేనేను" అని భావించే జీవులు,తమకు ఎదురుగా ఉన్నట్లు చూస్తున్న ఈ జగత్తు అసత్యమేకాని సత్యంకాదు.

70. చిదాభాసంలో నిజమనితోచి మోహాన్ని కలగజేస్తున్న వ్యావహారిక జగత్తు శుద్ధచైతన్య స్వరూపంలో కేవలం మిథ్యయేయని గ్రహించు.

వివరణ : చిత్ యొక్క ప్రతిబింబమే విధాభాసం. 'చిత్' అనే శుద్ధ జ్ఞానంతో 'తం' అనే మాలిన్యమైన ఉపాధి సంబంధంతో కలిగినట్లు కన్పించే అజ్ఞానమే 'చిత్తం' అంటే, ఈ వివరణ 244వ వచనంతో కలిపి గ్రహించాలి.

## 3. ప్రపంచ వ్యామోహం

71. మేక మెడ క్రింద వ్రేలాడు (నిరుపయోగమైన)స్తనం వలె, లౌకిక ప్రయోజనాలకు కర్మల నాచరించటానికి లోకులెంతో శ్రమపడతారు. మోక్షాన్నిచ్చే ఆత్మసాధనాలను ఏవగించుకుంటారు. వీరి శ్రమని చూస్తే ఎంతో జుగుప్సాకరంగాను, భరించలేని విధంగానుంటుంది.

72. మానవులు ఆవగింజంత సుఖం కొరకు తమ మనస్సును వంచించే ఇంద్రియాల మార్గంలోనుపయోగించి శ్రమపడుతున్నారు. అయితే తలపులన్ని ఎక్కడ నుండి మొలకెత్తుతున్నాయో, ఆ క్షేత్రమనే హృదయాన్ని "నేనెవరు" అనే విచారణతో దున్ని, అంతులేని ఆనందం అనే పంటని మాత్రం వాంఛించరు. ఇది ఎంత ఆశ్చర్యం!

73. ఆత్మభాస్కరుని ధర్మపత్ని చంద్రుడనే జీవుడు (మనస్సు). ఆత్మగృహమనే హృదయంలో ఉండవలసినది చంద్రుడనే స్త్రీ. ఆ ఆత్మ సుఖాన్ని వదిలిబాహ్య ప్రపంచాన్ని అనుభవించాలనే కోరికతోపరుగులెత్తటం ఎట్లాగున్నదంటే తన పాతివ్రత్యాన్ని పోగొట్టుకొన్నదాని వలె ఉంది.

74. ప్రపంచ వ్యామోహం నశిస్తేనే తప్ప ఆనందమనే ముక్తి స్థితి చేకూరదు. ఆ మాయాకల్పిత ప్రపంచానికి సత్యత్వాన్ని అంటగట్టటం ఎట్లాంటిదంటే, కామాంధుడు వ్యభిచారిణిని పతివ్రతయని పొగడటం వంటిది.

వివరణ : వ్యభిచారిణి పతివ్రతగా కనబడటానికి ఒకని కామమే కారణం. అట్లాగే ఈ జగత్తు సద్వస్తువని లోకులు వాదించటానికి కారణం ప్రాపంచిక సుఖాలపై వారికున్న మోజే కారణం.

## 4. జడ ప్రపంచం

75. ఈ అసత్య ప్రపంచాన్ని సత్యమని భావించే పిచ్చివాళ్లకి మాత్రమే జగద్వస్తువులు రమించటానికి తగినవికాని, జ్ఞానులు రమించటానికి బ్రహ్మం తప్ప మరో వస్తువేదీలేదు.

76. ఆత్మానుభవంకలిగిన మహనీయులు, గర్హించతగ్గ ప్రపంచ వ్యవహారాల్లో ప్రవేశిస్తారా? (ప్రవేశించరు). అసత్యమైన ఈ ప్రపంచ వ్యవహారాల్లో దిగటం జంతు స్వభావం కదా!

77. "అంతులేని విషయభోగాలని త్యజించి కేవలం జ్ఞానాన్ని మాత్రం పొందటం వలన ప్రయోజనమేమిటి?" అని ప్రశ్నిస్తే, హృదయంలో నిరంతరం ఆత్మస్వరూపానందం సహజంగా అనుభవించటమే ఆ జ్ఞానంవలన కలిగే ప్రయోజనమనాలి.

78. ప్రపంచంలో ఏ వస్తువూ సుఖాన్నివ్వదు. దాని నుండి సుఖం పొందుతున్నట్లు ఈ మూఢ మనస్సు తలచి మోహంలో పడటం తగునా?

79. ఈ క్షణం పొందిన విషయభోగాలను మూఢులు గర్వంతో ఆనందిస్తారు. వారు దుఃఖించునట్లు, ఆ వస్తువులు ఒక రోజు వారిని వదిలిపోతాయి.

80. వెంటాడుతున్న పాత వాసనలచేత కన్పించే ఈ నిరుపయోగ, లౌకిక జీవిత స్వప్నమనే ఎడారిలో జీవులు తిరిగి తిరిగి పేసారి భోగత్రయాగ్నిలో దహించుకుపోతున్నారు. ఆ తాపాన్ని, పూర్తిగా పోగొట్టేది, తురీయావస్థలో ప్రకాశించే విశాలమైన బోధి(జ్ఞాన) వృక్షమే(నీడ) ఆత్మ.

వివరణ : భోగత్రయాలు: కామిని, కాంచనం, కీర్తి.

## 5. ప్రపంచ వ్యవహారం

81. తన నిజస్వరూపాన్ని తెలుసుకొని ఎల్లప్పుడు బ్రహ్మం వలె నుండి తాను ధరించిన మానవ వేషానికి తగినట్లు సుఖదుఃఖాలని పొందే వానివలె జగత్తులో ఈ జీవిత నాటకాన్ని నడపెదవుగాక.

82. తెలుసుకొనవలసిదంతా తెలుసుకొని, పొంద వలసిన దాన్ని పొందినా, ప్రాజ్ఞులు ధర్మం తప్పి నడచుకొనరు. అందుచేత ప్రపంచంలో నీవు ఏ వర్ణ శాఖకి చెందిన వానిగా కన్పిస్తున్నావో ఆ వర్ణ శాఖ ధర్మాన్ని పాటించు, అందుకు తగినట్టు నడచుకో!

## 6. మిథ్యాజగత్తు(ప్రాతిభాసికసత్యం)

83. సత్పురుషులకి సద్వస్తువును ఉపదేశించుటకు అవతరించిన శ్రీ రమణ సద్గురువులు, వారనుగ్రహించిన "ఉన్నది నలుబది" గ్రంథపు మొదటి శ్లోకంలో

సర్వైర్నిదానం జగతోఽహమశ్చ
వాచ్యః ప్రభుః కశ్చి దపారశక్తిః
చిత్రేఽత్ర లోక్యంచ విలోకితాచ
పటః ప్రకాశోఽవ్యభవత్సఏకః

అని బోధించుట చేత, వారు యితర సిద్ధాంతాలను త్రోసిపుచ్చి ప్రాతిభాసిక సత్యాన్నే (దృష్టి-సృష్టి) నిజమని బోధించారని గ్రహించు.

వివరణ : శ్రీ భగవాన్ రమణుల నిజానుభవ సిద్ధాంతం అజాతమే అయినా దృష్టి సృష్టి (ప్రాతిభాసికసత్యం- వివర్తమని తమిళంలో) భావాన్నే ఉన్నది నలుబదిలో ఉపదేశించారు. ఈ ప్రపంచ సృష్టికి భగవంతుడే కారణమని, జగత్తు కార్యమని భావించిన పిదప, అవి యెప్పుడు వేర్వేరుగా గోచరిస్తాయని ఒక సిద్ధాంతం. తర్వాత రెండూ ఏకమవుతాయని మరొక సిద్ధాంతం: ఇప్పుడు రెండూ ఏకమైయున్నాయని ఇంకొక సిద్ధాంతం. ఇట్లాగ వివిధ సిద్ధాంతాలున్నాయి. అయితే ఇవి మంద, మధ్యమ, తీవ్ర జిజ్ఞాసువులకే తగినవి. తీవ్రజిజ్ఞాసువులకైతే ఈ జగత్ దృశ్యం, దానిని వివరించే జ్ఞానం, అది గోచరించు ఆధారం, దానిని గ్రహించే జీవుడు కార్యకారణ భేదాలు లేక ఏకకాలంలో గోచరించే ఒక వస్తువే యని నిర్ధారించటం దృష్టి సృష్టి (ప్రాతిభాసిక సత్యం) సిద్ధాంతం. ఇది గోచరిస్తున్న జగత్తు యొక్క యునికికి ఒక రాజీ మాత్రమే. అయితే అజాతవాదము జగత్తు కనిపిస్తోందని గాని, సృష్టింపబడిందనిగాని ఒప్పుకోదు. ఉన్నది వున్నట్లే ఎప్పుడూ వుందని సిద్ధాంతీకరించుటచేత అది తీవ్రజిజ్ఞాసువులకు మాత్రమే స్పష్టమవ గల గొప్ప సిద్ధాంతం. అయితే శ్రీభగవాన్ దాన్నుండి ఒక మెట్టు దిగి దృష్టి - సృష్టి సిద్ధాంతాన్ని "ఉన్నది నలుబది"లో ఉపదేశించారు. తీవ్రజిజ్ఞాసువులు గ్రహించలేని అజాతం వారు అంగీకరించని ద్వైతం మొదలైన ఇతర సిద్ధాంతాలతో వారి మనస్సు శాంతించక పోవడం చేత, వారి మనస్సుకి తగినట్లు దృష్టి సృష్టి సిద్ధాంతాన్నే (ఇతరములు కావు) బోధించారని గ్రహించాలి.

క్రింద రాబోవు 100 వ భావాన్ని కూడా చూడండి.

84. మనస్సు దాని ప్రవృత్తులు ద్వారా బయటికి వచ్చి చూచే నామరూప ప్రపంచమంతా పాతరవలె హృదయంలో వాసనారూపంలో మునుపు నిక్షిప్తమై ఉన్నవే. అవి ఇప్పుడు బాహ్యంగా ఇంద్రియాల ద్వారా చూడబడుతున్నట్లు చేసిన పాత కథయని తెలుసుకో!

85. ఆత్మ తానే (తనమాయ చేత) అనేక రకాల నామరూప ప్రపంచంగా గోచరిస్తున్నదే తప్ప, తాను ఒక నిమిత్త కారణమాత్రుడై (ఈశ్వరుడుగా) సృజించుట, పోషించుట, లయించుట అనే ప్రవృత్తులు కలవాడైన వాడు కాదు.

86. "తానే యీ జగత్తుగా చూడబడుతున్నా" డన్న సత్యాన్ని తాను తెలుసుకొన లేక తనకు ఎందుకు ఒక భ్రాంతి కలిగిందని అడిగితే, "ఈ భ్రాంతి ఎవరికి?" అని విచారించి తన సత్యాన్ని గ్రహించినట్లయితే ఈ భ్రాంతి ఆత్మకు ఎప్పుడూ లేదని స్ఫురిస్తుంది.

వివరణ : అహంభావానికే ఈ భ్రాంతి తప్ప తనకు ఎప్పుడూ లేదనే అజాతానుభవం గోచరిస్తుంది. ఇది తర్వాత భావంలో చూడవచ్చు.

87. "ఆత్మ తానే జగత్తుగా చూడబడుచున్నది" అంటే, ఒక త్రాడు తానే పాముగా తన్ను చూడటమే యన్నట్లుంటుంది. ఆలోచించి చూస్తే అసలు పాము లేదు. అందుచేత ఉన్నట్లు అనిపించే ఈ సృష్టి ఒకప్పుడు సృష్టింపబడ లేదన్నదే అజాతం (పారమార్థిక సత్యం).

88. పరిశీలించగా తెలిసేది ఇది: ఆ పాము భ్రమ తప్ప వేరేమీ కాదు. ఆ తలంపే కదా ఒక పామును కనబడేట్టుచేసి, దానిని చూసి భయ భ్రాంతులయేట్టు చేసి, ఆపాముకొక అస్తిత్వాన్ని కలిగిస్తుంది. ఆ తలంపే భ్రాంతి వీడిన తరువాత ఆ భ్రమని త్రోసి పుచ్చి నశిస్తుంది. (పామును కనబడకుండా చేస్తుంది.)

వివరణ : కనుక సృష్టి, స్థితి, లయములకు విచారణ చేయక పోవుట వలన కలిగిన అజ్ఞానమే కారణమూ, కర్త అవుతాయేతప్ప ఆత్మకాదు. ఈ గ్రంథంలోని 91వ వచనమును కూడా ఇక్కడ గ్రహించాలి.

89. విత్తనము, మొక్క, ఒకదాని కొకటి కారణమై తమలో ఏకమై యుంటాయి. (కార్యరూపము దాల్చిన తర్వాత కారణము మాయమవుతోంది కాబట్టి) పిదప ఒకదాని కొకటి విరుద్ధమై నశించేవే. ఈ కార్యకారణ వ్యవహారం అజ్ఞానరూపమైన మనః కల్పనయేతప్ప, నిజానికి అట్లాగ ఒక దానినుండి ఒకటి కార్యరూపం దాల్చుట లేదు.

90. ఆత్మే ఉనికి, ఎఱుక. ఈ రెండూ కాదని మనం జీవించే దృశ్యం లోపభూయిష్టమైన అవగాహనే. ఎలాగనంటే రజ్జు సర్ప న్యాయంలో ఆ రజ్జువు ఉనికి మరియు ఎఱుక కూడా. తనను అది పాముగా ఎలా చూస్తుంది?

91. ఆత్మ తన ఉనికిని వదలి చలించుట చేతనో లేదా వేరే కారణం చేతనో ఈ జగత్తు ఏర్పడిందని భావిస్తే, అజ్ఞానం చేత ఈ ప్రపంచం రూపొందినదే తప్ప, ఆత్మకి ఎప్పుడూ చలనం లేదని తెలుసుకో.

92. ఘటాకాశం మహాకాశం వేర్వేరు కావని చూచే ఏక దృష్టిలో ఉపాధిగా వేరుపడిన ఘటమే కనబడదంటె యిక ఆ ఘటచలనం వలన దానిలోని ఆకాశం చలిస్తుందని చెబితే యది అజ్ఞానమే యవుతుంది.

93. పరిపూర్ణమైన ఆత్మలో అనాత్మ శరీరం, జగత్తు అను భిన్న వస్తువులు ఎప్పుడూ గోచరించ లేవు. అట్లుండగా నశించు దేహ జగత్తుల చలనం చేత ఆత్మకి చలనం ఉన్నదని చెప్పటం అవివేకం.

94. పరిపూర్ణము, చలనరహితమైన ఆత్మ, ఉపాధి యైన మనస్సుకు ఏర్పడే చలనం చేత తానే చలిస్తునట్లు తోచినా, ఆత్మ యొక్క ప్రతిబింబంగా (చిదాభాసంగా) "నేను" అని ఉదయించు మనస్సుకే చలనము తప్ప, సత్య పరమాత్మకి ఎప్పుడూ చలనమే లేదని గ్రహింపుము.

95. అద్వితీయమైన పరబ్రహ్మమునకు అంధకారమయమైన (మనస్సు- బుద్ధి చిత్తం - అహంకారం అనే) అంతః కరణ ఉపాధి ఎట్లు కలిగిందంటే,మాయారూపమైన జీవుని దృష్టి వలన కలిగిందే తప్ప (అంటే కలిగినట్లు తోస్తుందే తప్ప) జ్ఞాన రూపమైన ఆత్మకి ఉపాధి సంబంధం నిజంగా ఏర్పడ లేదని తెలుసుకో.

వివరణ : ఆత్మకి ఉపాధికలిగిందని, అదిఎట్లాగని ఆశ్చర్యంతో ప్రస్తావించే వారు జీవులే తప్ప జ్ఞానులు కారు. ఆత్మదృష్టి లో తమకి అంతఃకరణ ఉపాధులు కలిగాయన్న యనుభవమే లేదు. భ్రమించిన వాని దృష్టిలోనే త్రాడు పాముగా

కనబడుతోందే తప్ప, త్రాటికి సర్పత్వం నిజంగా కలగ లేదు అంటే త్రాడు పాముగా మారలేదు. కనుక ఆత్మకి ఉపాధియెన్నడూ లేదనే అనుభవం.
'సరే, అయితే ఆ దోషదృష్టి ఆత్మకి ఎట్లాగ కలిగింద"ని జ్ఞానులను ప్రశ్నించవచ్చుకదా అని అంటే అది కూడా సమంజసం కాదు. కారణం దోష దృష్టి కలిగిందని వారంగీకరించరు. అందుచేత అజ్ఞానులే ఎట్లాగా? ఏమిటి.? ఎవరికి? అని విశ్లేషించాలి. అలాంటి వాదననే అంగీకరించని జ్ఞానులు అది కలగడానికి కారణం ఏమిటని చెప్పటానికి ప్రయత్నిస్తారా? అందుచేత శ్రీభగవాన్ "వచ్చింది. అది వుంది నిజమని నీవే చెబుతున్నావు కాబట్టి, నీవే అది (అహంకారం) ఏమిటని, ఎక్కడ నుండి పుట్టిందని, ఎట్లాగని విచారించి చెప్పాలని" తరచు అంటూండేవారు.

96. (అఖండంగా జ్వలించే అగ్ని స్తంభం నుండి నిప్పుకణాలు రాల లేవు. కారణం ఆ అగ్ని స్తంభానికి అన్యంగా నిప్పురవ్వలు పుట్టి రాలటానికి స్థలమేది లేదు. అయితే). ఖండమైనటువంటి జ్యోతిస్తంభం నుండి నిప్పురవ్వలు పుట్టి అన్నిచోట్ల వ్యాపించి రాలుతాయి. అట్లాగే, అఖండమైన పరవస్తువు నుండి జీవుడు "నేను" అనే రవ్వంత జ్ఞానముదయించటానికి వీలుగాదని గ్రహించు.

97. మాయా బలం చేత భ్రమించిన మనస్సు యొక్క బహిర్ముఖ దృష్టిచే దేహమొకటి కనబడుతోందే తప్ప, ఆత్మ దృష్టిలో దేహమంటూ ఒకటి లేదు. అందువలన ఆత్మని "దేహి" అనటం తప్పు.

వివరణ : క్షేత్రం - క్షేత్రజ్ఞుడని, దేహం- దేహియని భగవద్గీతలో చెప్పారు. ఇవిఅజ్ఞాన మనస్సుకు మరోలా చెప్తే గ్రహించటం కష్టమని, భగవత్కృపతో చెప్పిన అనునయ వాక్యాలే తప్ప నిజానికి కాదన్నట్లు భావం.

98. “దేహమే నేను" అని అహంకారం వ్యవహరిస్తునప్పుడు చరాచరమైన జగత్తనే ఒక అన్యవస్తువు గోచరిస్తుంది. అట్లాగ వ్యవహరించనపుడు జగత్తు గోచరించదు. అన్యమేదీ గోచరించని ఏకశుద్ధ స్థితిలో ఆత్మని "సాక్షి" అని అనటం కూడా తప్పే.

వివరణ : ఆత్మని "సర్వసాక్షి" అని గ్రంధాలంటాయి. 97 వ వచనంలో చెప్పిన అనునయ వాక్యాలే తప్ప నిజం కావు. కారణం ఇతర వస్తువులను చూస్తున్నప్పుడు మాత్రమే చూచేవాడు వాటికి సాక్షియవుతాడు. ఇతరములు లేని ఏక స్థితిలో దేనినీ చూడని అతను దేనికి సాక్షి యవుతాడు? అందుచేత ఆత్మని "సాక్షి" యని చెప్పటం కూడా తప్పని ఉపదేశం.

99. శరీరం లేనిదే జగత్తు లేదు. మనస్సు లేనిదే శరీరం లేదు. మనస్సు స్ఫురణ రూపమైన చిత్తును వదలి ఒక క్షణమైనా ఉండలేదు. ఆ చిత్తు కూడా ఉన్నటువంటి సత్తును కాదని ఒక క్షణమైనా అన్యంగా ఉండలేదు. (కనుక జగత్తు మొదలు అన్నీ సచ్చిత్ రూపాత్మయే. లేదా ఆత్మ ఒక్కటే ఉన్నది. ఇతరములనేవి ఏవి లేవని నిశ్చయమైన అభిప్రాయం)

## 7. అజాత సిద్ధాంతం

100. వారి వారి నమ్మకాలని బట్టి, స్థితి గతులను బట్టి శ్రీరమణులు వివిధ సిద్ధాంతాలను వారిని ప్రశ్నించే భక్తులకి చెప్పేవారు. అయినా వారు తమ నిజానుభవం అజాత సిద్ధాంతమే యని చెప్పగా నేను విన్నాను. అందువలన అజాతమే సత్యమని గ్రహించండి.
(అజాతం : త్రికాలాల్లోను, ముల్లోకాలలోను జగజ్జీవేశ్వరులనే త్రిపదార్థాల దృశ్యమంటూ ఏదీ ఏర్పడలేదు. ఉన్నది ఉన్నట్లే ప్రకాశిస్తున్నదనే ఒక సత్యం)

101. మునుపు భగవద్గీతారంభంలో (2వ అధ్యాయం) శ్రీకృష్ణభగవానుడు అర్జుననుకు బోధించినది ఉత్తమమైన ఈ అజాత సిద్ధాంతాన్నే. అయితే దానిని గ్రహించే స్థితి అర్జునునికి లేక పోవుటచేతనే శ్రీకృష్ణుడు ఇతర సిద్ధాంతాలను తదనంతరం పదహారు అధ్యాయాల్లో చెప్పవలసి వచ్చిందని తెలుసుకో!

## 8. సృష్టి - విభిన్న సిద్ధాంతాలు

102. శాస్త్రాలు సృష్టి గురించి భిన్న రీతుల్లో చెబుతున్నాయి. వాటి భావం మాత్రం ఒకటే. ఈ విధంగానే ప్రపంచం సృష్టింపబడిందని చెప్పటం ఆ శాస్త్రాలు అభిమతం కాదు. సృష్టికి మూలమైన ఆది వస్తువును విచారించి తెలుసుకోమని సాధకుని ప్రోత్సహించటమే వాటి ఉద్దేశ్యం.

## 9. దైవం యొక్క పాత్ర

103. నిర్వికార ఆత్మ తన మాయా బలం చేత తాను అగోచరుడై, జాగృత్ స్వప్న సుషుప్తి అనే అవస్థాత్రయాలనే త్రాటిని మనోకాశంపై విసిరి, దానిని నిలబెట్టి, దేహాభిమానుడైన జీవుని ఆ త్రాటిపైనెక్కించి గిరగిర త్రిప్పుతూ ఆడిస్తున్నాడు.

104. మాయకి అధికార మిచ్చిన పరమేశ్వరుడు, ఆ మాయ యొక్క ఆదేశాలకి తాను కూడా వశమై ప్రవర్తిస్తున్నట్లు బహిర్వర్తనులైన జీవుల దృష్టికి గోచరిస్తుంది.

వివరణ : వాసనలే తలపులకి రూపాన్నిస్తాయి. అట్లాగ పరిణమించటానికి మనం అనుమతించడాన్నే మాయకు భగవంతుడు అధికార మిచ్చాడనటం . తర్వాత "నేను శరీరం" అనే ఉత్తమ పురుష భావం కలుగుతోంది. తర్వాత మధ్యమ, ప్రధమపురుషలకి సంబంధించిన ప్రపంచ సృష్టి కూడా కలుగుతోంది. ప్రారంభంలో ఉదయించిన "నేను" అనే జీవుని దృష్టికి (తాను బంధింపబడినాడు కాబట్టి తాను అనుమానిస్తున్న దైవం - జ్ఞానులు మొదలైన వారుకూడా మాయాధికారాకిని వశమైన వారేయన్నట్లు అతనికి తోచటంలో ఆశ్చర్యం లేదు.
దైవం - జీవన్ముక్తులు కూడా అప్పుడప్పుడు మాయకి వశమైనట్లు పామరులు భావిస్తున్నారంటే అది వారి అజ్ఞాన దృష్టి దోషమే తప్ప నిజం కాదు. శ్రీభగవాన్ రమణులు దేహం తో ఉన్నప్పుడు వారు ప్రాపంచిక రీతులకు అనుగుణంగా ఉన్నట్లు అప్పుడప్పుడు పామరజనులకు గోచరించటం ఈ తత్త్వం వలనే యని తెలుసుకో.

105. ఏ సంకల్పాలు లేక ఆకాశంలో ఉదయిస్తున్న సూర్యుని సన్నిధిలో ఎన్నోరకాల చరాచరాలు వ్యవహరిస్తున్నాయి. అట్లాగే భగవంతుని వలనే అన్ని జరుగుతున్నాయిని శాస్త్రాలు చెబుతున్నాయి.

106. చెకుముకి రాయి నిప్పురవ్వలను పుట్టిస్తుంది. తామర మొగ్గ వికసిస్తుంది. కలువపూవు ముడుచుకొంటుంది. సకల ప్రాణులు లేచి తిరిగి తిరిగి శ్రమించి విశ్రమిస్తాయి. ఇవన్ని సూర్యుని సన్నిధిలోనే జరుగుతున్నాయేగాని సూర్యునికి సంకల్పమో, కర్తృత్వమో లేదని భావం.

107. చంద్రుని క్రింద చంద్రకాంతం (చలువరాయి) చెమర్చటం, (తామర) ముడుచుకొనటం, కలువలు వికసించుటవలె జరుగుతున్నదే, దైవం పంచకృత్యాలను (సృష్టి, స్థితి, లయ, తిరోధానం, అనుగ్రహం) సంగరహితుడై చేస్తున్నాడు.

108. సంకల్పరహితుడైన భగవంతుని సన్నిధిలో లెక్కలేని కర్మలకు అధీనులగుచున్న జీవులు అనేక మార్గాలలో తమ కర్మానుసారం తిరిగి వేసారి, తర్వాత అది నిష్ప్రయోజనమని గ్రహించి వైరాగ్యంతో అంతర్ముఖులై ముక్తినొందుతున్నారు.

వివరణ : బంధ విమోచనాలకి కారణం జీవుడు తప్ప ఈశ్వరుడు కాదు. కోరినపుడు బంధమూ, మోక్షము గాని జరిగితే అది ఈశ్వర సన్నిధి యొక్క అనుగ్రహ విశేషమే అయినా ఈశ్వరుడు మాత్రం కారణం కాదు.

109. ప్రపంచంలో జరుగుతున్న శుభాశుభాలు సూర్యుని అంటవు. తక్కిన (భూమి, నీరు, అగ్ని, వాయువు) నాల్గు భూత గుణాలు కూడా (రూప,చలన, ఉష్ణ, వేగం) అనంతాకాశాన్ని అంటవు. అట్లాగే జీవుల కర్మలు మనోతీతమైన పరమాత్మకి అంటవు. ఇది నిశ్చయం.

## 10. త్రిపదార్థములు

110. జీవుడెవ్వరు? అని పట్టుదలతో విచారిస్తే జీవుడంటూ ఎవరూలేరని శివుడే (ఆత్మ) యని అనుభవమవుతుంది. ఈ లోకాన్ని ఎంతో రక్తితో చూసిన జీవుడు, విచారణ చేత తానేలేకుండా పోయిన తర్వాత, దృశ్యమానజగత్తొకటి ఉందని భావించటం పిచ్చితనం తప్ప మరేదికాదు.

111. ఇట్లు విచారించగా జీవుడు జగత్తూ రెండూ అదృశ్యమై ప్రత్యక్షంగా గోచరించేది (ఆత్మయైన) శివుడే. ఇదే పారమార్థిక సత్యం. అయినా తాను (జీవుడు) నశించిన తర్వాత ఆ సత్యాన్ని "ఇది అద్వైత" మని అనుకొనే వారెవరు? అనుకొనే దెట్లాగ?

(అందుకే అద్వైతం ఒక మతం కాదు. అది మనస్సు కతీతమైంది).

112. భగవంతుని వలె జగత్తు జీవుడు నిత్యముండే వేర్వేరు రెండు సద్వస్తువులని వాదిస్తే అది భగవంతుని పరిపూర్ణత్వాన్ని చులకన చేసి మాట్లాడట మవుతుంది. భగవంతుడు పూర్ణుడు కాదంటేనే తప్ప జగజ్జీవేశ్వరులు మూడూ సత్యమని వాదించటం తగదు.

113. విర్రవీగుతున్న జీవుడు ఈశ్వరుని కన్యంగా ఒక ఆది వస్తువుగా ఉన్నాడని అంటే, "జీవుని కార్యాలు శివుని కార్యాలే" యని చెప్పే పండితుల మాట అనుభవంతో కాకుండా కేవలం వారు కల్పించిచెప్పినమాట అని చెప్పినట్లుంటుంది.

(అట్లాగ మనం భావించడం సబబేనా? కాదంటే జీవుడు దైవాని కన్యంగా ఒక వస్తువని చెప్పటం సరికాదని గ్రహించు)

114. సినిమా తెరపై పడిన కాంతి (పట్టపగలు సూర్యరశ్మి లోపల ప్రవేశించుటచేత) పెద్ద కాంతిలో విలీనమైతే, అప్పుడు తెరమీద బొమ్మలుకూడా మరుగైపోతాయి. అట్లాగే, సచ్చిత్ప్రకాశంలో ప్రతిబింబమైన మన:ప్రకాశం కరగి మాయమైతే జీవేశ్వర జగద్దృశ్యాలు కూడా కరగి మాయమవుతాయి.

115. ఈ విధంగా సద్వస్తువు ఏకమై ఉండుటచేత, జగజ్జీవేశ్వరులనే త్రిపదార్థాలున్నట్లు (పండితులు, శాస్త్రాలు) మతాలన్నీ అవునని మొదట అంగీకరించి పిదప జ్ఞానం బోధించటం ఎందుకంటే, ఈశ్వరుని ఏకత్వసత్యాన్ని బోధిస్తే సామాన్యులు గ్రహించలేరు. కాబట్టి బహిర్వర్తనులైన జీవులకి అనుగుణంగా చెప్పవలసి వచ్చింది.

వివరణ : భగవాన్ శ్రీరమణుల ఉన్నది నలుబదిలోని రెండవ పద్యభావం ఇక్కడ అన్వయించుకోవాలి. ప్రారంభంలో ఆవును మంచిదని ఉపదేశించి, తర్వాత గ్రహించేవాని మానసిక పక్వాన్ని బట్టి "కాద"ని మార్చి ఉపదేశించటం సకల మత గ్రంథాల రీతి.

## 11. తిరోధానం

116. పరులను హింసించి, పరులచేత హింసింపబడి లెక్కలేని జన్మలలో జీవులు పొందిన దుఃఖ సంఘటనల జ్ఞాపకాలు మనస్సులో లేకుండా పోయే మఱపు భగవంతుని అనుగ్రహమే యని గ్రహించు.

117. ఈ జన్మలో సంభవించిన (సంభవిస్తున్న) కొన్ని దుఃఖ సంఘటనలు మనస్సులో తలపుల రూపంలోరేపే జ్ఞాపకమే వారి జీవితాన్ని దుఃఖమయంగా చేస్తుంది. కాబట్టి మఱపే అందరూ ఆశించతగ్గది.

వివరణ : గత జన్మల గురించితెలుసుకొనే శక్తిని పొందాలని సాధకులు కొందరు కోరటం బుద్ధి తక్కువ పని యని 116, 117 వచనములు బోధిస్తున్నాయి

ప్రపంచం, జీవితం రెండూ తలపుల మయమే అయినా, మొదటి తలపు 'నేనుఇది అనెడు అహంకారానికి కలిగే యితర తలపులే ఈ జీవితం. ఈ మొదటితలంపే మన ఆనందానికి శత్రువు. అందుచేత దీని నుండి లేచిన యితర తలపులలోసుఖం ఎట్లుంటుంది? కనుక జీవితంలోని సుఖదుఃఖాలు రెండూ కష్టాలే. అందువల్ల కష్టాలను మరవటమే నిజంగా మనం ఆశించ తగినదని భావం.

## 12. వ్యక్తిత్వం

118. వేర్వేరు దేవతలు, వారి శక్తులు వాటిని మెచ్చే వారి మనఃకల్పితాల వలనే నిజమనిపిస్తాయి. జీవులను భ్రమింపచేసే ఆ మనస్సు అనేమాయకు అతీతంగా ఉన్న ఆత్మకి మాత్రం అవి నిజం కావు.

వివరణ : ఆత్మకి అన్యంగా ఒక వ్యక్తి వలె దేవతలకి ఒక వునికి, వారి శక్తులు అంతా భ్రమ. కనుక మాయారహిత ఆత్మ దృష్టిలో వ్యక్తి శక్తి అనే వివాదాలు నిజంగా లేవని గ్రహించు.

119. మానవులు తమ అల్పబుద్ధిచేతనే జ్ఞానికొక వ్యక్తిత్వముందంటారు. జ్ఞానులు పరమాత్మ స్వరూపులు. వ్యక్తావ్యక్తాల కతీతులు. కనుక వారి వ్యక్తము అవ్యక్తమే. వారికి వ్యక్తిత్వమున్నట్లు చూడటం, చూచేవారి వ్యక్తిత్వం యొక్క ప్రతిబింబమే తప్ప వేరుకాదు.

120. ఆత్మవిచార శీలుర హృదయాలలో జ్ఞానమే సద్వస్తువుగా వెలుగుట వలన, శరీరాభిమానమే లేని వారిని 'ఆయన ఒక గొప్ప జ్ఞాని' 'వీరొక మహాత్ముడ' ని లోకులు జ్ఞానిని అద్వితీయుడనో, సాటిలేని వాడనో అనటం వింత కదా! అట్లాగ సూచించటానికి జ్ఞానులు నిజంగా శరీర రూపులా? (కాదని భావం)

121. "ఆ మహాత్ముని దర్శించాలి: ఈ మహాత్ముని దర్శించాల"ని ఎంతో ఆదుర్దాతో తిరుగుచున్నారే! ఇక్కడే మీ హృదయాలలో ప్రకాశిస్తున్న మీ మహా ఆత్మని (ఆత్మస్వరూపుని) హృదయంలో విచారించి తెలుసుకొంటే, ఏ మహాత్ములైనా ఒక్కరే యని స్పష్టమవుతుంది.

122. తానొక ప్రత్యేక జీవుడనే (దేహమేనేనని) వ్యక్తిత్వ భావన ఒకనికున్నంత వరకు, అతనిని ప్రజలు పూజించినా కొనియాడినా అతను ఉన్నతమైన సాధకుడేగాని సహజజ్ఞాని కాలేడని తెలుసుకో.

123. వ్యక్తిత్వ రహిత ఆత్మస్ఫురణ తప్ప (తానుంటూ) చూపిస్తున్న ఇతర అణిమాది అష్టసిద్ధులూ వ్యర్థమే. తన ఆత్మస్వరూప మహిమను గ్రహించక, వ్యక్తిత్వాన్ని వదలని మూర్ఖులు తప్ప మరెవరైనా అటువంటి పిచ్చి సిద్ధులను ఆశిస్తారా? (ఆశించరని భావం)

వివరణ : 'తాము యిటువంటి వార" ని రూపం గురించిన ప్రత్యేకత్వమే వ్యక్తిత్వం. సిద్ధులు సుకృతం వలన సిద్ధించి జ్ఞాన ప్రాప్తి కలిగినవాడు సాక్షి మాత్రంగా "తన" ఆత్మలో నిత్యతృప్తుడై యుండటమేతప్ప, ఆసిద్ధులకు తాను కర్తయని పొంగిపోడు. ఉన్నది నలుబది అనుబంధంలోని 15 శ్లోక భావంతో పోల్చుకోవాలి.

124. (వ్యక్తిత్వం నశించిన తర్వాత) నిరాకారుడైన ఆ పరమాత్ముడు సకలసిద్ధ పురుషుల రూపాంతర మవుతాడు. (ఆ సిద్ధపురుషులవలనే అవి సిద్ధిస్తున్నట్లు గోచరించే) సకల సిద్ధులు వాటికి సాక్షీమాత్రంగా నుండే ఆ జ్ఞానిపే. అతడే శ్రీ దక్షిణామూర్తి యని గ్రహించు.

వివరణ : సిద్ధులన్నీ జ్ఞానిపే యని యన్నారు. సామాన్యులు భావిస్తున్నట్లు ఆ జ్ఞాని ఒక ప్రత్యేకమైన వ్యక్తి కాడు. ఈశ్వరాంశుడు కూడా కాదు. త్రిమూర్తుల కన్నా మిన్నయైన గురువు. కాబట్టి దానిని వివరించటానికే శ్రీదక్షిణామూర్తి యని పైన తెల్పారు.

# 13. అనుచిత తాదాత్మ్యం

ఈ గ్రంథంలో శ్రీ భగవాన్ రచించిన వానిలో ఇది మొదటిది.

## భగవాన్ - 1

ఈ శరీరం “నేను” అనే భావన నశించాలి. నిత్యానందమయమైన తనను (ఆత్మను) తెలుసుకో. నశించే ఈ శరీరాన్ని పోషించే ప్రయత్నంతో పాటు తన్ను తెలుసుకోవాలనుకోవటం నదిని దాటటానికి మొసలిని తెప్పగా ఉపయోగించినట్లుంటుంది.

125. ఈ శరీరంపై వ్యామోహం పెంచుకోవటంతోపాటు ఆత్మని తెలుసుకోవాలని చెప్పే సాధకుల స్థితి నదిని దాటడానికి మొసలిని తెప్పలాగ ఉపయోగించే వానివలె వుంది.

వివరణ : శరీరాన్ని పోషించుకొని ఆరోగ్యంగా వుంటే ఆయువు ఎక్కువవుతుంది. దానివల్ల ఎక్కువ రోజులు తపం చేసి జ్ఞానం పొందవచ్చు అనే సాధకులకి ఈ పద్యభాగం ఒక హెచ్చరిక. అంతేగాకుండా శరీరారోగ్యం, దారుఢ్యం వశీకరణశక్తి యివే సాధనకు ముఖ్యమైన గుర్తులనుకొని ఎప్పుడూ శరీరం పై ధ్యాస పెంచుకొనే సాధకులను కూడా ఈ పద్యం హెచ్చరిస్తోంది. నిద్రలేవటం, భోజన కాలం వీటిని క్రమంతప్పకుండా అనుసరించటంలో విపరీతమైన శ్రద్ధ, పథ్యం, సాత్వికాహారాలను వెదకి వెదకి ఎంచుకోవటం, వీటిలో ఏ మాత్రం లోపం కనిపించినా వెంటనే కలత చెందటం, మొండితనంగా వీటినే తింటాను (పాలు పళ్లు వంటివి) అని అనటం వంటి నిరుపయోగ మైన పనుల మీద ఎక్కువ శ్రద్ధ తీసుకొని తనను, తనను పోషిస్తున్న సంఘాన్ని ఎంతో యిబ్బంది పెట్టే 'యోగులు' అనే సాధకులను కూడ ఖండిస్తోంది ఈ పద్యభావం. శరీర పోషణ అంటే కనీస అవసరాలని (కూడు, స్నానం, గుడ్డ) అనుకోకూడదని శ్రీభగవాన్ చెప్పేవారు. సూక్ష్మంగా చెప్పాలంటే, శరీరంపై ధ్యాస ఎక్కువైతే ఆత్మపై దృష్టి అసాధ్యమవుతుంది. శరీరచింతన సాధన చేయనీయదు. బ్రతుకునే తినేస్తుంది. అందుకే శరీర పోషణని మొసలి అనే తెప్పతో పోల్చారు. మొసలివలె శరీర పోషణ మనల్ని మింగేస్తుంది. శరీరపోషణ గురించిన తలంపు తగ్గాలన్నదే భగవాన్ బోధనాభావం.

126. సచ్చిదానందమైన తనను (ఆత్మని) ధ్యానించకుండా స్థూల శరీర పోషణలో జీవితకాలాన్నంతా గడపటం వరిపంటకి బదులు గడ్డికి ఏతం వేయడం వంటిది.

127. శరీరమే "నేను" అనే భావంతో అల్పజీవితాన్ని చేబట్టిన పామర జనులు, తమ హృదయంలో గల అత్యుత్తమ, సదానందమయ జీవితాన్ని కాదని నిరాకరించి పోగొట్టుకొన్నవారే.

128. కంటికెదురుగా కనిపిస్తున్న లోకం తనకు కీడు కల్గిస్తోందని తెలుసుకొనక, అదే శుభాన్నిచ్చే సద్వస్తువని భావిస్తున్నారు. వారు ఏటిలో తేలుతూ వస్తున్న ఒక ఎలుగుబంటిని తెప్ప అనుకొని దానితో ఏరుదాటుతున్న వ్యక్తి వంటివారు. వారు భవసాగరంలో మునిగి నశించి పోతారు.

వివరణ : తెలియక అది మంచి తెప్ప అని పట్టుకొని తర్వాత అది ఎలుగుబంటని తెలిసి దానిని వదలుదామన్నా అది మనలని వదలదు. అట్లాగే ఈ ప్రపంచం కూడా. మళ్లీ మళ్లీ మనలని బహిర్ముఖ వృత్తులలో పడేసి ముంచేస్తుంది.

129. తాము ప్రయాణిస్తున్న వాహనముల యొక్క రాకపోకలు తమ గమనాగమములేయని భ్రాంతితో భావిస్తున్నట్లు, అహంకారానికి చెందిన ఈ సంసారం కూడా తమదే అన్న అపోహతో అజ్ఞానులు దుఃఖపడతారు. వారు తమ నిజస్వరూపం ఆత్మయని తెలుసుకోలేరు.

130. జగత్తు, శరీరం సత్యమని యెంచే అవివేకులు శాంతిని పొందాలంటే, అవి సత్యమనే అజ్ఞానాన్ని వదలాలి. హృదయంలో వెలుగొందు ఆత్మని ఉడుంవలె పట్టుకొన్నవాడు దుఃఖాన్ని ఎప్పుడూ పొందడు.

131. అసత్య విషయాలను కోరి ఆనందించే లోకులు మోహావేశపరులై నశిస్తారు. అందుచేత నిరహంకార, పరమాత్మస్వరూప జీవనమే అనుభవింప తగ్గ సుఖం.

## 14. పండితుడు

132. నేర్చిన విద్యలన్నీ కేవలం అజ్ఞానమే యని గ్రహించి, వాటిని నేర్చిన "తానెవరు?" అని తనని విచారించి తెలుసుకొన్న విద్యే నిజమైన పండితుని లక్షణం..

వివరణ : తాను శరీరమని యెంచే అజ్ఞానమే అహంకారం . అందువల్ల ఈ అజ్ఞానంతో నేర్చిన విద్యలన్నీ అజ్ఞానమే. కనుక తనని తప్ప వేరేది నేర్చినా అది అజ్ఞానమే. ఇది తెలుసుకో. ఇది తెలుసుకొన్నవాడు నిజమైన పండితుడు.

133. విద్యలు నేర్చిన "నేనెవరు?" అని విచారిస్తే "నేను" అనే అహంకారం పూర్తిగా దగ్ధమై పోగా మిగిలిన తన నిజస్థితిని ఉన్నదున్నట్లుగా తెలుసుకొన్నవాడే పండితుడు. అట్లాగ తెలుసుకోని అహంకారి పండితుడగునా? చెప్పండి.

134. నేర్చిన వన్నీ మరచిపోవడం నేర్చుకొని, ఆత్మవిచారణచేత అంతర్ముఖుడైన వాడే ఆత్మ నిష్ఠుడు. అంతేగాని మరచిన విషయాన్ని మళ్లీ మళ్లీ జ్ఞాపకం చేసుకొనేవాడు అసత్యవస్తువైన సంసార తాపాగ్నిలోపడి దగ్ధమై పోతాడు, లేదా యిష్టానిష్ట బాధలతో కలత చెంది కృంగి కృశిస్తాడు.

135."అన్ని విద్యలు నేర్చినానని గర్వపడే ఓ అల్పుడా! నేర్చుకొన్న నీవెవరని తెలుసుకున్నావా?" అని ఒక ఆత్మనిష్ఠుడు నిన్ను ప్రశ్నిస్తే, తడబడి సిగ్గుతో తలదించుకొనే బుద్ధిమంతుడా! నీ అహంకారం బూడిదై నశించుగాక!

వివరణ : ఇది శాపం కాదు. అహం దగ్ధమైన తర్వాత గర్వం పోయి ఆత్మ ప్రకాశించాలని ఆశీర్వదించటమే ఈ వచన భావం.

136. విపరీత సందేహాల రూపమైన అజ్ఞానం నశించి జ్ఞానంచేత తన్మయనిష్ఠలో నున్న జ్ఞాని, జ్ఞాన విద్యాపారంగతుడవుతాడు.

137. 'నేను' అనే సహజమైన ప్రథమ పురుష ఏకవచనంగా, "ఉన్నాను" అనే క్రియావాచకంతో కూడి ప్రకాశించే సత్చిత్తును, నిరహంకారియై ఉన్నదున్నట్లు ఎవడు గ్రహిస్తాడో, అతడే నిజమైన పండితుడు. (అపరోక్షానుభవంగా తెలుసుకొనడమని భావం)

## 15. కవి

138. కవియైనవాడు నరస్తుతి చేసిన తన నాలుక నీచత్వాన్ని తెలుసుకొని, మధనపడి, 'ఇక భగవత్ స్తోత్రం తప్ప నరస్తుతి చేయన" ని దృఢమైన మనస్సుతో ఉత్తముడుగా జీవించుగాక!

139. భగవదనుగ్రహంతో తాము పొందిన కవితా వాణిని దైవస్తుతికే వినియోగించక, అంటడానికి కూడా అర్హత లేని నరశరీరాన్ని పొగడిన వారు, తమ కవితా కన్యను వేశ్యవృత్తిలోకి నెట్టినవాడే యవుతారు. ఎంత విషాదకరం!

140. అంతర్ముఖుడై తాను కాని అన్నమయ కోశాదులపై "నేను" అనే అభిమానాన్ని నాశనంచేసి, అందువల్ల శాంతించిన హృదయం కలవాని నుండే నిజమైన కవిత్వం పుడుతుంది.

## 16. నిరర్థక విద్య

141. జీవులు తరించటానికి అన్ని జ్ఞానశాస్త్రాలు "మనస్సణగటమే ముక్తికి మంచి మార్గ" మని చెబుతున్నాయి. అది తెలుసుకున్న తర్వాత కూడా అనేక శాస్త్రాలు ఇంకా చదువుతూండటం వలన ఒకడు పొందే లాభమేమిటి?

142, ఆస్తిక జీవితానికి అర్హతలేని నడతగల లోకులు వేదాంతగ్రంథాలని పరిశీలించి పవిత్రమైన ఆ వేదాంతాన్ని అపవిత్రం చేస్తున్నారు.

వివరణ : జ్ఞానమార్గంలో పయనించే వారికి మనోనైర్మల్యం చాలా అవసరమని ఉపదేశం.

143. అశాశ్వతమైన ఈ భౌతిక శరీరాన్ని 'నేను' అని అభిమానిస్తున్న లోకులు, తాము నేర్చుకొన్న విద్యలు, అహంకారం నశించే ఆత్మసాధనకి ఉపయోగపడకపోతే అవి అజాగళస్తనం వలె నిరర్థకం.

144. ఏ సాధనవల్లనైనా మనోనాశనమొంది, స్వస్వరూపం ప్రకాశించి అందుచేత వాసనాక్షయం అయితేనే తప్ప, కేవలం విద్యార్జన వల్లనే అజ్ఞానం పోవాలను కోవటం గుఱ్ఱానికి కొమ్ములులాగ అసాధ్యం.

145. గాలిలాగ నిత్యము చలించి అలసిపోతున్న జీవునికి తన ఉత్పత్తి స్థానమైన హృదయమే సంగమమయ్యేస్థానం. తాను నేర్చిన విద్యలు శాంతినివ్వవు. అవి అరుపులు కేకలతో నిండిన అశాంతి మయమైన బజారువంటివి.

వివరణ : వేగంగా ప్రవహిస్తున్న నదికి తన ఉత్పత్తి స్థానమైనసముద్రంతో ఏకమైతేనే తప్ప శాంతి మరెక్కడాలేదు. అట్లాగే తిరిగి తిరిగి వేసారిన జీవునికి తృప్తి, శాంతి, తనునేర్చిన విద్యలలో దొరకదు. కారణం మనోవృత్తి విశేషాలే విద్యలు కాబట్టి. హృదయంలోకి జొచ్చి నిష్ఠలోనుండటమే అంతిమస్థితి. శ్రీ అరుణాచలాష్టకంలోని 8వ పద్య భావాన్ని ఇక్కడ పోల్చుకోవలెను.

146. వేదాగమ కర్మలు, విధులు ఆచరించకుండా ఆత్మ విచారణ చేత అంతర్ముఖుడుకాగల కౌశలం గలవాడే సద్వస్తుజ్ఞాన సహాయంతో నిస్సారమైనటువంటి విషయ భోగాలను త్రుంచివేయగలడు.

147. "ఇవి నిష్కళంకమైన జ్ఞాన గ్రంథాలు" అని వాటిని ఎంతో ఉత్సాహంతో చదివే జ్ఞానగ్రంథాలని కూడా ఆత్మనిపొందాలని ప్రయత్నిస్తున్న నిదిధ్యాస సమయంలో మఱచి విడచి పెట్టాలి.

వివరణ : శ్రవణ సమయాలలో జ్ఞాన గ్రంథాలపై మోజుపడటం సహజం, అవసరం కూడాను. మనన కాలంలో గ్రంథాభిప్రాయాలకి తగినట్లు మనస్సులో మనపైఖరిని మార్చుకుంటాం. కొన్నాళ్ళకి వాటి కొత్తదనాన్ని అవి పోగొట్టుకుంటాయి. కనుకమళ్లీ చదవాలని కోర్కెపుడుతుంది. తర్వాత నిదిధ్యాన సమయంలో అంతర్ముఖమవటానికి శాస్త్ర వాసనలే పెద్ద ఆటంకాలని ముముక్షువులు త్రోసిపుచ్చి ఉదాసీనంగా వుండటం చేత సకల మనోవృత్తులన్నీ పోయి తాను మాత్రం మిగిలిపోవటం అవసరమవుతుంది. కనుక జ్ఞాన గ్రంథాలని కూడా మఱవవలసినదే.

## 17. వేదాంత సత్యం

148. లౌకిక ప్రజలు ఇంద్రియ విషయానుభవాలను తప్ప, అవినాశియగు సద్వస్తువు మరొకటున్నదని గ్రహించలేరు. శోభస్కరము, ఫలవంతమూ అయిన జ్ఞానాన్ని వారు మెట్టవేదాంతమంటారు.

వివరణ : జ్ఞానం శుష్కమని, లౌకిక విషయాలు పచ్చనివని పామరులభిప్రాయం. దీనికి విరుద్ధంగా శ్రీభగవాన్ ఉన్నది నలుబది అనుబంధంలోని 29వ పద్యభాగంలో జ్ఞానాన్ని వసంత ఋతువుగా వర్ణించారు.

149. కోర్కెలు త్యజించిన వారికే వేదాంతానుభవమవుతుంది. కోర్కెలున్న వారికి అది దూరం. వారు భగవద్భక్తిని పెంచుకొని, కోర్కెలు పోవటానికి తపస్సు చేయటమే తగిన చర్య.

వివరణ : ఆత్మానుసంధానమే పరమేశ్వర భక్తి యని శ్రీ భగవాన్ తమ 13వ రచనలో (పుట 166) ఉపదేశిస్తారు.

## 18. ప్రారబ్ధపు గమనం (తీరు)

150. ప్రారబ్ధం ప్రకారమే ఒకడనుభవించేవి వస్తాయని తెలుసుకొన్న వివేకులు తమ జీవితంలో అటువంటి ప్రారబ్ధానుభవాలకు ఎప్పుడూ చింతించరు. వాటిని ఆశించినా ఆశించకపోయినా ఎవరికైనా సరే అవి ప్రారబ్ధం ప్రకారం రాకమానవు. తాను వండిన పదార్థాలను తాను తిన వలసిందే కదా! కనుక చింతించకు.

151. జీవుడు అతని ప్రారబ్ధాన్ని అతడు అనుభవిస్తున్నాడు. భగవంతుడు దానికి సాక్షీభూతుడుగా హృదయంలో ప్రకాశిస్తున్నాడు. కనుక కర్మఫలాన్ని అనుభవిస్తున్న తాను భోక్తయని తలంపక, తాను సచ్చిదానందుడని అనుకున్నవాడే పరమాత్ముడు.

## 19. ప్రారబ్ధపు బలం

152. దీపం క్రింద చీకటి పోకుండా ఎప్పుడూ ఉన్నట్లు, దేశకాల పరిమితులకి అతీతుడైన సద్గురువు పాదాల దగ్గర కదలక ఏళ్లతరబడి శిష్యులు నివసించినా, అహంకార మోహాంధకారాలు నశించకుండా ఆఖరికి మరణించిన వారి స్థితికి వారి అపరిపక్వతే కారణమని గ్రహించు.

శ్రీమురుగనార్ యిచ్చిన వివరణ:

అదృష్టవశాత్తు లభించిన జ్ఞాన గురువుని చేరి, తాము దేనికోసం వారి దరి చేరారో, ఆ కార్యాన్ని మరచిపోకుండా నిరంతరం అదే ధ్యాసతో వారి అనుగ్రహ సహాయంతో ఆత్మలాభాన్ని పొంది తీరాలి.

153. అష్ట సిద్ధులు, ఆత్మజ్ఞానం రెండూ కావాలని ఆశించిన వాడు ఎందుకు రెంటినీ పొందటం లేదంటే ఆ రెండూ ఒకదానికొకటి విరుద్ధమైన లోక రీతులు.

వివరణ : విధివశాత్తు లభించిన అష్టసిద్ధులు, అనుగ్రహం చేత ప్రాప్తించిన ఆత్మజ్ఞానం, ఈ రెండూ లోకంలో విరుద్ధమైనవి. కర్మలకు జీవుడే కర్త. జ్ఞానానికి దైవం లేదా ఆత్మ కర్త. కర్మ జ్ఞానాన్నివ్వదని, సిద్ధులకు కర్మ, జ్ఞానానికి దైవానుగ్రహమే కారణమని పెద్దల వాక్కు. దైవం-ధనం ఎటువంటివో అట్లాగే జ్ఞానం-సిద్ధులు ఒకదానికొకటి విరుద్ధమని ఈ పద్యభావం.

శ్రీమురుగనార్, ఇందువల్ల కొందరనుకొనునట్లు సిద్ధపురుషులందరు జ్ఞానులవలే, జ్ఞానులందరు సిద్ధపురుషులవలె, ఉండాలని గాని ఉండకూడదని గాని భావింపఅవసరం లేదని గ్రహించాలన్నారు.

## 20. ఆత్మ, జీవుడు

154. పిశాచంవలె గంతులేసి నికృష్టపు పనులు చేయటం, ఒక సన్మార్గంలో కాకుండా అనేక మార్గాలని అనుసరించటం, అనేక ఆలోచనలలో మునిగిపోవటం, వాటి వలన కలిగిన సుఖదుఃఖాల సుడిగుండాలలో చిక్కుకొనటం, ఇవి జీవుని సహజ లక్షణాలు. అయితే ఆత్మ యొక్క సహజ స్వభావం వాటికి విరుద్ధంగా సచ్చిత్గా ఉండటమే.

## 21. వాసనాబలం

155. అల్ప ప్రాణులు కొందరు ఆత్మనదీతీరాన స్థిరంగా నిలబడ లేక సంసార ప్రవాహంలో, తమ వాసనలనే అల్లరి మూకల చేత త్రోయబడి కొట్టు మిట్టాడుతుంటారు.

వివరణ : సాధన కాలంలో ఆత్మనిష్టలో నుండ లేక అవస్థ పడుతున్న జీవులు, వారి పూర్వ వాసనాబలం చేత మళ్లీ బాహ్య ప్రపంచంలోనికి నెట్టవేయబడి దుఃఖిస్తున్నారు.

## 22. చిజ్జడ గ్రంథి

156. ఆత్మ సౌందర్యాన్ని దర్శించవలసిన మన దృష్టి అహంకారం చేత అది తప్పి “నేనుయిది” యనియెంచే వ్యష్టిభావనా దోషమే మన ముందున్న జగద్వస్తువులుగా చూడటమవుతుంది.

వివరణ : అఖండము సహజమునైన మన ఉనికిని అహంకారరూపమైన మన దేహానికి పరిమితం చేసి చూసినపుడు నిత్యమైన మన ఆత్మ స్వరూపమే, చూచేమనకంటే అన్యమైనజగత్తుగాను, దైవం గాను గోచరిస్తోందని భావం. ఈ దృశ్యం జీవుడైన అహంకారానికే గాని ఆత్మకి కాదని మరచి పోకూడదు.

157. ఈ దేహాన్ని నిజమనుకొని “నేను” అని అభిమానించి వంచిస్తున్న చిజ్జడ గ్రంథి (అహంకారమనే ముడి జీవుడు), గగనంలో కనబడే కల్పితమైననీలం రంగువంటిది, అనేక విషయాలను చూసి భ్రాంతి చెంది, వాటిని కోరి, ఆ కోరికల బలం చేత ఆ గ్రంథి యింకా గట్టిపడుతోంది.

158. తన ఆత్మ స్వరూపాన్ని తెలుసుకోలేని దోష దృష్టి, పంచకోశమయ శరీరాన్ని "తాను" అని యెంచి, వాటి చేత తననే మరుగుపరచుకొని, తన ఎదుట జగదృశ్యమనే బాహ్యవస్తు జాలాన్ని తానే తనకు గోచరించుకొంటోంది.

159. దేహాన్ని తన నివాసంగాను, ఆ దేహమే “నేను” అని యెంచి అవిద్యతో జీవిస్తున్న జీవుని బ్రతుకు పరమాత్మ శివ స్వరూపంలో కల్పితంగా చూసే స్వప్నమే తప్ప నిజం కాదు.

(శివం-మంగళ స్వరూపం. అహంకార జీవితం - రోతపుట్టించే మురికి కూపం)

160. “నేను దేహం” అనే అహంకార రూపంతో వ్యవహరించే జీవుడు కూడా ఈ ప్రపంచ చిత్రంలో ఒక బొమ్మ.

వివరణ : సినిమా హాలులోని తెరవంటిదీ ఆత్మ. అదే నిజమైన ప్రాణం. తెరపై కన్పించే బొమ్మలే ఈ ప్రపంచంలోని నామరూప చిత్రాలు. వీటిని చూసే జీవుడు కూడా ఈ బొమ్మలలో ఒకడే. తెరపై కనిపించేవాడే. ఈ అసత్యపు జీవుడు పోతే (అంటే మనోనాశనమైతే) తెరలాగా ఆధారభూతమైన ఆత్మ ఎటువంటి వికల్పాలు లేక ఎప్పుడూ ప్రకాశిస్తుంది.

సినిమాలో చూసే రాజు ఒకడు, తన సభను చూస్తున్న తాను, ఒక “చూచే వాడు" (ద్రష్ట) అవుతున్నాడు కదా! అయితే అతడు కూడా దృశ్యాలైన చిత్రాలలో ఒకడే కదా! అట్లాగే ప్రపంచాన్ని చూసే జీవుడు కూడా ప్రపంచమనే అసత్య దృశ్యాలలో ఒకడే తప్ప నిజంగా జీవి కాడు.

## 23. అహంకారం యొక్క బలం

161. అహంకారం నశిస్తేనే ఎవడైనా నిజమైన భక్తుడవుతాడు. అహంకారం. నశిస్తేనే ఎవడైనా జ్ఞానియవుతాడు. అతడే దైవం అవుతాడు. అహంకారం నశించిన ఆక్షణమే అనుగ్రహం ద్యోతకమవుతుంది.

162. అహంకారాన్ని ధ్వంసం చేసిన ధీరుడే నిజమైన సన్యాసి, అతనే నిజమైన బ్రాహ్మణుడు కూడా. ఇక దేహాభిమానం గల ఆశ్రమ సన్యాసులు, వర్ణ బ్రాహ్మణులు "నేను సన్యాసిని ఉన్నతాశ్రమవాసిని: నేను బ్రాహ్మణుడను అగ్రవర్ణుడను" అని తిరుగుతున్న అహంభావ భారాన్ని వేరుతో పెకిలించటం అమ్మో! ఎంత కష్టం!!

వివరణ : వర్ణాశ్రమ భేదాలు దేహానికే. అందువల్ల "దేహం నేను" అనే అహం భావం గలవాడే "నేను సన్యాసిని, నేను బ్రాహ్మణుడను" అనే వాదనలతో తిరుగుతాడు. అది అహంభావమే కనుక దానిని పోగొట్టుకొన్నవాడే నిజమైన సన్యాసి. బ్రహ్మమును తెలుసుకొన్న వాడగుట చేత బ్రాహ్మణుడవుతాడని భావం.

163. తనకు అన్యంగా, అనేకంగా ప్రపంచాన్ని చూసే దృష్టి గలవాడు నాలుగు వేదాలని అధ్యయనం చేసినంత మాత్రాన బ్రాహ్మణుడు కాలేడు. తన అహంకార నాశనాన్ని చూసినవాడే, వేదార్థాన్ని గ్రహించిన వాడవుతాడు. అట్లు కానివాడు దిగజారి నిందలతో మానసిక క్షోభను అనుభవిస్తాడు.

164. భక్తి పారవశ్యంతో తన కళ్ళనే ఈశ్వరునికిచ్చిన కన్నప్పకి కూడా ఆ కళ్లను పీకి శివలింగానికి పెట్టేవరకు "నాకు అందమైన నేత్రాలున్నాయి" అనే గర్వంతో కూడిన దేహాభిమానం ఉన్నదంటే ఆ అహంకారాన్ని సమూలంగా నాశనం చేయటం మాటలా? అమ్మో! ఎంత కష్టమైన పని!

వివరణ : కన్నప్ప చరిత్రలో ఒక భావాన్ని శ్రీభగవాన్ యిక్కడ తెలియపరిచారు. కన్నప్పకు ఎంతో అందమైన కళ్లుండేవని, దానివల్ల ఎంతో గర్వపడే వాడని శ్రీభగవాన్ మాటల వల్ల తెలియవస్తోంది. కన్నప్ప భక్తి. అతని కళ్లపై అతని కున్న అభిమానంవాటిని స్వీకరించిన శ్రీ కాళహస్తీశ్వరునికే కదా బాగా తెలియాలి? అందుకే కన్నప్ప నేత్రాలను తాను తీసుకొని, దాని ద్వారా అతని అభిమానం పూర్తిగా ఈశ్వరుడైన తన మీదే తప్ప మరే విషయం మీద లేకుండా అనుగ్రహించారు పరమేశ్వరుడు.

"నా భక్తుని అభిమాన వస్తువులన్నిటినీ నేను గ్రహిస్తాను. దానివల్ల అతడు నన్నే సంపూర్ణమైన మనస్సుతో ప్రేమించి ఆరాధించునట్లు చేస్తానని"భగవంతుని భావమేమో! ఈ పద్యవచనం, తర్వాత వచనంలో తెల్పిన కన్నప్ప వివరాలు శ్రీ భగవాన్ చెప్పినట్లే యథా తథంగా శ్రీమురుగనార్ నుండి శ్రీ సాధుఓం గారు విని ఇక్కడ వివరించారు.

165. తన నేత్రాలు అందమైనవన్న దేహాభిమానంతో ఉన్న కన్నప్ప తన కళ్లను ఈశ్వరునికివ్వగా, ఈశ్వరుడు స్వీకరించటం, జడమైన శరీరాన్ని నేననుకొనే అహంకారం చేత తన భక్తునికి కలిగే నష్టాన్ని పోగొట్టటానికే. శివ భక్తి మహిమ, శివుని అపార కరుణ యిదే.

## 24. అహంకార నాట్యం

166. ఆలోచించి చూస్తే, అహం లేస్తే అన్నీ లేస్తాయి అని తెలుస్తుంది. అహమణిగితే సకలం అణగిపోతాయి. ఇదే ఆదివస్తువైన భగవంతుని నియతి.

వివరణ : మొదటి రెండు వాక్యాలే ఉపదేశం. ఇవి "నేనెవరు" అనే రమణోపదేశ గ్రంథంలోని చివరి మాటలు

167. మహా మాయలోపడి ముల్లోకాలలో జీవిస్తున్న జీవులు శవంలో పిశాచి ఆవేశించి ఆడుతున్న ఆటకు సమానము.

వివరణ : తనకంటూ ఒక రూపం లేని అహంకారం ఒక పిశాచి వంటిది. ఈ శరీరం ఒక శవం వంటి జడపదార్థం. అందుచేత శ్మశానంలోని శవాన్ని పిశాచి ఆవేశించి ఆ శరీరాన్ని ఆడించటం వంటిదే ఈ ముల్లోకాల్లోని జీవుల బ్రతుకులని భావం.

168. ఈ లోక విచిత్రం వినండి! ఎటువంటి పక్షపాతం లేకుండా అన్ని ప్రాణులపై కరుణగల దైవం తమకు ఆలోచించే శక్తి ప్రసాదిస్తేనే తప్ప. తమంతట తాము ఆలోచించలేని లోకులు, కర్మలపైగల వ్యామోహం వలన (మేము ఇది చేసాం అది చేసామని) గంతులు వేయడమే విచిత్రం.

169. "శత్రు సైన్యాన్ని నేనొక్కడినే జయించి వారిని పీనుగుల పోగుగా చేస్తాను. అయితే ముందు ఎవరైనా నన్ను నిలబెట్టాల"ని ఒక కుంటివాడు చెప్పిన మాటలకి సమానమే ఈ కర్మాభిమానుల ప్రగల్భాలు.

## భగవాన్ - 2

168, 169. వచనములను ఒక వెణ్బాపద్యంలో భగవాన్ రచించారు. దాని వచనమే ఇది:

మనోవాక్కాయ శరీర కర్మల చేత తమకు కదలిక లేదా గమనాన్నివ్వడానికి ఈశ్వరుని కరుణ కావాలి. ఆ సత్యాన్ని గ్రహించలేక "అన్ని రకాల సిద్ధులలో నేను మొనగాణ్ణి" అని గర్వంతో గెంతులేస్తారు. అది ఎటువంటిదంటే! "నేను లేచి నిలబడటానికి ఎవరైనా సహాయపడితే చాలు, ఈ శత్రుమూక నాకెంత?" అని గుండెలు చరచుకొని చెప్పే కుంటివాని మాటలవలెనున్నాయి.

170. ఆహా! ఒక పూచిక పుల్లనైనా కదలించడానికి వాయువు, దహించటానికి అగ్ని దేవతలు కూడా స్వతః శక్తిలేని వారే. అట్లాంటిది "నేను" అనే అహంకారంతో తాము ఏ కార్యాన్నైనా సాధిస్తామనటం ఎవరికి సాధ్యం?

వివరణ : 'శివుని ఆజ్ఞలేనిదే ఒక అణువైనా కదలదు' అనే భావానికి అనుగుణంగా చెప్పారు ఈ వచనాన్ని.

171. మాయ చేత ఆత్మస్ఫురణ అగోచరమై, పాప కర్మల చేత బంధింపబడి, దుఃఖించి, స్వరూప దృష్టిపోయి సద్వస్తువు ఉనికినీ దాని మహిమనుఅనుగ్రహాన్ని తెలుసుకొనలేని జీవులు, "నేను" అనే అహంకారంతో చేసేప్రయత్నాలు నిజంగా హాస్యాస్పదం. అవి గోపురాన్ని మోస్తున్నట్లు కనిపించే ప్రతిమలకు సమానం.

172. భారమైన సామానులను తేలికగా, అతి వేగంగా ఎంతో దూరం యీడ్చుకెళ్లే రైలు బండిలో ప్రయాణం చేసే బుద్ధిమంతులు, తమ మూటలను నెత్తిమీద పెట్టుకొని బరువును మోస్తారా? మోయరు.

173. అట్లాగే పరాశక్తి అనేక ప్రపంచ భారాలని తన సహజ గుణంచేత చక్కగా భరిస్తోంది. కనుక జీవులు తమ మనఃక్లేశాలనే భారాలను ఆ పరాశక్తిపై మోపి నిశ్చింతగా నుండటమే శ్రేష్ఠం.

## భగవాన్-3

171, 172, 173. వచనముల భావాన్ని శ్రీ భగవాన్ ఈ క్రింది భావంలోనుపదేశించారు. లోక రక్షణను ఈశ్వరుడు వహిస్తుండగా జీవుడు దానిని మోయటానికి ప్రయత్నించటం, గోపురాన్ని మోస్తున్నట్లు ఆగోపురంలోనే చెక్కిన ప్రతిమలవలె హాస్యాస్పదంగా ఉంటుంది. వాటి బాధ్యత ఏమాత్రం? పెద్ద బరువులను యీడ్చుకెళ్లే రైలు బండి ప్రయాణీకుడొకడు తన సామానును ఆబండిలోనే పడేసి సుఖంగా నుండక తన తలపై పెట్టుకొని మోసుకుంటూ కష్టపడితే అది యెవరి తప్పు? జీవుని అజ్ఞానమే అది.

వివరణ : లోకంలోని కష్టాలని చూసి "ఈ ప్రపంచ స్థితి గతులు మార్చా"లని, దానికై యోగాభ్యాసాలని చేయాలనుకొనేవారు మన మధ్యలో చాలామంది కనబడతారు కదా! వారి అజ్ఞానాన్ని వేలెత్తి చూపించి, మార్గం తప్పకుండా, దైవాన్ని పొందటానికి ఆత్మ సమర్పణ మార్గాన్ని దీని ద్వారా శ్రీ భగవాన్ సూచిస్తున్నారు.

174. ధ్యాన సమయంలో భయం, శరీరం వణకటానికి కారణం అహంకారం కొంచెం మిగిలి యుండటం చేతనే. దేహాత్మ భావం పూర్తిగా నశించి చిదాకాశంలో నెలకొని శాంతించగా, శరీరంలో వణకు భయం పోతాయి.

వివరణ : అహంకార నాశనమే ఆత్మ సిద్ధి. తన నాశనం సమీపిస్తున్నప్పుడు అహంకారం, ఆ శరీరాన్ని అంటి పెట్టుకొని వుంటుంది. ఆత్మ విచారణ చేత ఆ శరీరాశ్రయం పోతున్నప్పుడు మరణావస్థ వంటి అనుభవం పొందుతుంది. అందుచేత భయమూ, శరీరబంధం నుండి గ్రంథి భేదం జరిగి, వళ్లు వణకూ, కొంత మందికి అప్పుడప్పుడు ఏర్పడుతాయి అందువల్ల ఈ సందేహ నివృత్తి.

175. అడ్డు అదుపు లేకుండా తిరుగుతున్న దుష్టమనస్సు యొక్క అజ్ఞానం తొలగగా, కలిగిన జ్ఞానం వలన అలలు లేని ప్రశాంతమైన సాగరంవలె అహంభావం అణగి ఆత్మాభిముఖమైన నిష్ఠయే శ్రేష్ఠం.

176. అవిద్యా రూపమైన అహంతకున్న భ్రాంతులనుండి విడివడి, అవన్నీ భగవంతుని లీలలేయని గ్రహించి, మహాదోషమైన కర్తృత్వభావన అంతంకావటమే నిజమైన తపశ్శక్తి పొందిన స్థితి.

వివరణ : యోగ శక్తులచేత గొప్ప పనులు చేయటం తపశ్శక్తి కాదు. కర్తృత్వ భావం తొలగిన స్థితే నిజమైన తపశ్శక్తి యని భావం.

## 25. ఆత్మకి అపకారం

177. అనేకాలుగా గోచరిస్తున్నా వివిధ లోకాలు, అందందున్న జీవులు తానేయని, వాటిని తనలో విలీనం చేసుకొన్న చిదాకాశాత్మ స్థితిని తెలుసుకొనలేక, మాయలో పడిన వారే, ఆత్మద్రోహానికి పాల్పడిన పాపులు.

## 26. స్వర్గం - నరకం

178. జనులారా! స్వర్గాది లోకాలున్నాయని లేవని మీలో మీరు వాదించుకోవద్దు. మనం వసిస్తున్నామనుకుంటున్న ఈ లోకం ఎంత నిజమో, స్వర్గాదిలోకాలు కూడా అంతే నిజమని మీరు అనుకోవచ్చు.

వివరణ : స్వర్గ నరకాలనే లోకాలున్నాయనటం నిజమేనా అని ఎంతో ఆసక్తితో తర్కించుకుంటారు. చూసే తాను సత్యమని తలచే వారు తన కన్యంగా గోచరించే ఈ ప్రపంచాన్ని కూడా నిజమనుకుంటున్నారు. తర్వాత, శాస్త్రాలలో చెబుతున్న స్వర్గ నరకాలు తమ కళ్లకి కనబడకపోవటం చేత అవి కేవలం కల్పితాలేమోనని సందేహిస్తున్నారు. వాటి వాస్తవికత గురించి వాదించుకుంటున్నారు. వీరి ఆలోచనలో ఎక్కడ పొరపాటు అని ఈ పద్యభావంలో శ్రీ భగవాన్ చక్కగా వివరించారు.

దృష్టి ఎలాగో దృశ్యం కూడా అలాగేనన్న న్యాయం ప్రకారం, లోకాలని చూసే తాను ఎంత నిజమో, చూడబడే ఈలోకపు వాస్తవికత కూడా అంతే. అందువల్ల అశాశ్వతమైన తాను, అంటే అహంకారం, ఒక అసత్యపు రూపమని ఆత్మజ్ఞానం చేత గ్రహిస్తే యిక జీవుడు చూసే ఈ లోకం కూడా యిప్పుడే అసత్యమని తెలుసుకోవచ్చు. తర్వాత యితరలోకాలనబడే స్వర్గనరకాలు అబద్ధమని నిర్ధారించవచ్చును. అయితే ఆత్మజ్ఞానం పొందటానికి ముందు తానూ,ఈ లోకమూ నిజమని చూడటం చేశ స్వర్గనరకాది లోకాలు కూడా వారి వారి పాప పుణ్యాల ఫలితాలకి తగినట్లు అనుభవించవలసిన లోకాలేయని అతను ఒప్పుకోవలసిందే. వాటిని అసత్యాలుగా చేయాలంటే వాటితో పాటు యీ ప్రపంచం, దానిని చూచే తాను, యిందులో జీవిస్తున్నట్లు కనబడే “తన జీవితం" అన్నీ అసత్యాలుగా చూడటమే తగిన మార్గం.

179. ఇదిగో ఈ దేహం! ఇదిగో ఈ ప్రపంచం! అని నిజంగానే ఉన్నాయని తీర్మానిస్తున్న పండితులు మాతో కలసి పరిశీలిస్తే, స్వర్గ నరకాది లెక్కలేని ఇతర లోకాలు కూడా నిజంగానే ఉన్నాయని వారితో మేమూ తీర్మానిస్తాం.

## 27. నరక భయం

180. దుఃఖ స్వరూప మిటువంటిదని (అహంకారమని) గ్రహించలేని వారే తాము నరకమంటే భయంతో వణకుచున్నామంటారు. నరక రూపమైన అహంకార దోషగుణాన్ని తెలుసుకొన్నవారు, దానిని ఉపాయంతో అంతంచేసి తప్పకుండా తాము నిజ స్థితిని పొందుతారు.

## 28. నరకునిపై విజయం

181. శ్రీమన్నారాయణుడు నరకాసురుని వధించాడని పురాణ కథ. దుఃఖనిలయమైన ఈ దేహాన్ని "నేను" అని వ్యవహరించే వాడే (అహంకారం) ఆ నరకాసురుడు. ఆ నరకాసురుడు ఎక్కడ నుండి ఉదయిస్తున్నాడని విచారించి అహంకారాన్ని నాశం చేసిన వారే నరకాసురుని వధించిన శ్రీమన్నారాయణ మూర్తి యని గ్రహించండి.

182. నరకాసురుడు నివసించే స్థలం (నేను-పుట్టు స్థానం) యేదని విచారించి, ఆ అహంకారమనే నరకాసురుని వధించి జ్ఞాన స్నానం చేయడమే (ఆత్మజ్ఞానం పొందటమే) నరకచతుర్దశి స్నానం (దీపావళి అభ్యంగన స్నానం).

## భగవాన్ - 4

181, 182 పద్యాలను సంగ్రహించి శ్రీభగవాన్ రచించినది ఈ క్రింది పద్యభావం, "దుఃఖమయమైన ఈ శరీరమే నేను" అనే దేహాత్మ బుద్ధిచేత నరకలోకాన్ని పాలించే నరకాసురుడు ఎక్కడున్నా? డని విచారించి ఆత్మజ్ఞాన మనే చక్రాయుధం తో నరకాసురుడనే అహంకారాన్ని చంపిన వాడే శ్రీమన్నారాయణుడు. అట్లాగ అహంకారం నశించిన రోజే నరక చతుర్దశి అనే పర్వ దినం.

183. మాంసపు ముద్ద ఈ శరీరం. మలమయమైన ఈ నరకాన్ని "నేను" అని అభిమానించు నరకాసురుడనే అహంకారాన్ని తానేవిచారించి వధించి, నిత్య ప్రకాశ పరమాత్మ జ్యోతివలె గోచరించేదే దీపావళియని తెలుసుకో!

## భగవాన్-5

నరకలోక రూపము, దుఃఖ శరీర మైన ఈ ఇంద్రియ గృహాన్ని "నేను" అని అభిమానించి చెడిపోయిన నరకాసురుడైన మహాపాపిని విచారించి, చంపి, ఆత్మయే తానుగా ప్రకాశించటమే దీపావళియని తెలుసుకో!

## 29. అంతర్ముఖత్వం

184. అన్యాలను ఇంద్రియాలచేత తెలుసుకొనేది అహంకారం. ఆ అహంకారం యొక్క నిజ స్వరూపం ఆత్మ. ఆ ఆత్మే లక్ష్యమై యుండగా, దానిని కాదని సాధకులు దాని కన్యమైన మధ్యమ, ప్రథమ పురుషలకి సంబంధిత విషయాలలో ఏదో నొకదానిపై ధ్యానలక్ష్యంతో శ్రమించడం, వస్తువుని వదలి దాని నీడను పట్టుకొనడం వంటిదే (అజ్ఞానం).

వివరణ : 354వ వచనమును దీనితో అన్వయించుకోవాలి.

185. తన ముందు కనబడుచున్న బాహ్య వస్తువులను కాంక్షించి అస్తవ్యస్తమై వ్యాకులపడే మనస్సు ఆత్మలో ఉండాలంటే, ఆ అల్ప విషయాలను కాక్షించే నేను "ఎవరు" అని తన ఉనికిని తెలుసుకొనడానికి ప్రారంభించటమే మార్గం.

186. ద్రష్టని చూడటానికి అంతర్ముఖం కాలేక, కనబడే వస్తువులను చూసి దుఃఖించే ఓ జీవుడా! నీదృష్టి అన్య విషయాలపై ప్రసరించకుండా, అంతర్ముఖమై అద్వితీయంగా నుండటమే సుఖం..

187. మనసా! నీకు బహిర్వర్తనం తెలివైన పనికాదు. హృదయంలో ప్రవేశించి అక్కడ ఉండటమే లాభదాయకం, శ్రేయస్కరం. నిన్ను బహిర్ముఖమొనర్చి నాశం చేసే మాయ యొక్క తంత్రాలకి చిక్కకుండా హృదయంలోనే దాగుకొని అణగివుండు.

వివరణ : కీర్తి కోసం నిన్ను ప్రకటించుకోవటం తెలివి తక్కువ పనియని భావం.

188. బహిర్ముఖమై యాతనలతో అలసి పోయి, వింత వింత విషయాలని వాంఛించి, వాటిని పొందిన ఆనందంతో గంతులేసి జీవితాన్ని వృధా చేసుకోకుండా, విచారణతో హృదయంలో ఆత్మ స్వరూపాన్ని దృఢంగా గ్రహించి అక్కడే సంస్థితమై ఉండటమే శ్రేష్ఠం.

189. ద్వైత భావమే దుఃఖానికి కారణం. అదే అశాంతిని కలగజేయడం వలన, ఆ ద్వైత మోహానికి లోబడక చిత్త వృత్తి యణచుటయే ధర్మం,

190. శివుడు తనలోనే ఉన్నాడని గ్రహించక, శివ దర్శనానికై క్షేత్రాలకి పక్షులలాగ ఎగురుకుంటూ దేశాటనం చేసే యాత్రీకుల్లారా! హృదయంలో నిత్యం నెలకొని ఉన్నటువంటి జ్ఞానమే పరమశివుడు! అదే పరమశివ దర్శనం.

191. తెరచియుంచిన తెరచాప గాలికి వూగి పాడైపోతోంది. అట్లాగే మనస్సు బహిర్ముఖమై వ్యాపించడం వలన చేటు తెచ్చుకొంటోంది. అట్లాగ కాకుండా, సముద్రంలో పడివున్న లంగరువలె మనస్సు హృదయంలో మునిగి ఉండటమే జ్ఞానం.

192. బయటికి ఎంతో వేగంగా దూసుకుపోయే మనస్సుని అరికట్టి, హృదయంలో స్థిరంగా నిల్పి కాపాడటమే ముముక్షువులాచరించవలసిన ధర్మం.

193. బాహ్య విషయాలపై పోయే అహంకారం, తన సహజ స్థితిని, ఉనికిని, వెదకటానికి ప్రారంభిస్తే అప్పుడు, జ్ఞానం చేత నీచమైన అహంకారం ధ్వంసమై ఇతరములు కూడా నశిస్తాయి.

వివరణ : ఈ వచనభావంలో శ్రీ భగవాన్ విచార మార్గ ధర్మాన్ని తెల్పి దాని ఫలితాన్ని కూడా చెబుతున్నారు.

## 30. శివలోకం

194. శివలోకం ఎక్కడో ఉందనే తలంపురావడానికి, "ఈ దేహమే నేను" అనే దేహాత్మ బుద్ధి యొక్క మోహమే కారణం. మనం చేరవలసిన ఆ శివలోకం మన హృదయంలోనే తప్ప బయట మరెక్కడా లేదని తెలుసుకో!

వివరణ : అల్పమైన దేహాత్మ భావం చేతనే శివలోకం ఎక్కడో వుందని అనుకోవలసిన అవసరం కలిగింది. నిజానికి మన యదార్థ పరంధామం నుండే జగజ్జీవేశ్వరులు మొదలైన కల్పనలు సృష్టింప బడ్డాయి. ఆ సృష్టి యొక్క మూల స్థానం మన ఆత్మ స్వరూపమే. అదే శివుడు, శివలోకమని తెలుసుకోవలసిన బాధ్యత.The kingdom of God is with in you" - పరంధామం నీలోనే వున్నది' అనే బైబిల్ భావమిదే.

195. శివలోకం ఒకటి ఉందనీ, అది ఒక అద్భుత ప్రపంచంలా ప్రకాశిస్తున్నదని అంటావు. అలాగ ప్రకాశిస్తు ఉండటానికీ స్వప్రకాశమైన ఆత్మజ్ఞానము నీవే. అది తెలుసుకోవటమే జ్ఞానం. ఆ శివలోకం నీలోనే ఉంది.

వివరణ : తన ఉనికి చేత ఇతరలోకాల ఉనికి, తాను ఉన్నానను జ్ఞానం చేత ఇతర లోకాల గురించిన జ్ఞానం కలుగుచున్నదని భావం.

196. భక్తులు తమ మనస్సణగినటువంటి నిష్ఠలో ఇంతవరకు పొందని ఒక కొత్త అనుభవాన్ని పొందుతారు. ఆ అనుభవమే పూర్ణంగా ఉప్పొంగుతున్న తురీయాతీతము. అది ఆత్మ స్వరూప జ్ఞానప్రకాశం చేత వెలుగొందుచున్నది. అదే నిజమైన, అరుదైన, గొప్ప శివలోకము.

వివరణ : శివలోకమంటే ఇంద్రియ గోచరమగు దేవతలు, వస్తువులుండే ఒక స్థలమని అనుకోరాదు. ఇంద్రియాతీతమైన జ్ఞానమే నిజమైన శివలోకమని ఉపదేశిస్తున్నారు.

## 31. శివత్వం

197. తిరిగే చిత్తమనే అజ్ఞాన రాక్షస అహంకారం నశించి, దాని వల్ల భేదభావం పోయి సహజ సమాధియైన జ్ఞానలో మునిగిన వాడే శివుడు.

198. వ్యష్టిభావంతో శ్రమిస్తోంది అహంకారం. ఆ అహంకారం నశించి తాను ఆత్మేయనే భావం హృదయంలో నెలకొనగా, వివిధములైన వాసనలు దగ్ధమైన పిదప అనుభవమయ్యే చిత్స్వరూపాన్ని తెలుసుకోగలిగిన వాడే శివుడు.

వివరణ : చిత్తం అనే పదంలో 'తం' అనే పదం మాలిన్యాన్ని, అజ్ఞానాన్ని సూచిస్తుంది. అదిపోతే మిగిలింది చిత్ - ఆత్మే. కనుక చిత్తం యొక్క మలం 'తం' పోవుటచేత శివమవుతున్నది. ఇది శివభక్తుడు పండితుడైన శ్రీమాణిక్యవాచకుల వాక్కు. 244వ వచనమును కూడా ఇక్కడ అన్వయించుకోవాలి.

199. సర్వవ్యాపకమై, సర్వాతీతమై అచ్యుతమై భాసించు సూక్ష్మమే దైవం. బహిర్ముఖమైన మనస్సు తన మూలస్థానమైన హృదయంలో నెలకొన్న స్థితే శివస్వరూపం.

## 32. హరి హరుల అభేదం

200 హరుడు జీవులకు జ్ఞానాన్ని ప్రసాదిస్తాడని, హరి ప్రపంచ భోగాలను ఇస్తాడని లోకులు చెబుతారు. కాని నిజమేమంటే, దృఢమైన జ్ఞానమే దైవంగా, స్వర్గంగా వెలుగొందుతోంది. అదొక్కటే హరి హరులవుతోందని గ్రహించండి.

## 33. శక్తి శివుడు

201. మూలమైన తనని వదలి (ఆత్మ స్వరూపాన్ని) మనస్సే తన రూపంగా యెగసిన ఆ అద్భుతచిత్ శక్తి ఏమాత్రం ఉండలేదు, మనస్సుదయించే ఆ హృదయమే (ఆత్మ స్వరూపమే) శుద్ధ పరమాత్మ.

202. దేనిని పొందిన తర్వాత మనస్సు మహదానందాన్ని అనుభవించి అటు పైయిక సుఖభోగాలకై అన్యవస్తువుల వెంట పరుగెత్తదో, ఆ జ్ఞానానుభవాన్ని మనస్సుకి ప్రసాదించే హృదయమే శివుడు (ఆత్మ).

203. ఆత్మపై ప్రేమానురాగాలు నిండిన భక్తుల చిత్తము, కృష్ణునిపై అత్యంత ప్రేమానురాగాలు పెంచుకొని సొక్కి సోలిపోతున్న గోపికల చిత్తం వంటిది. శలభాలను (దీపపు పురుగులు) ఆకర్షించి మాడ్చివేసే దీప జ్వాలలవలె, తనవశం చేసుకొని అహంభావాన్ని పూర్తిగా నాశనం చేసే ఆత్మే గోపికావల్లభుడని గ్రహించు.

## 34. శివ పూజ

204. పరిపూర్ణ ఆత్మ స్వరూపమైన సచ్చిత్ నుండి వేరు పడకుండా అఖండాకార వృత్తి చేత (అంటే వృత్తి రహిత స్థితి లేదా అఖండ మౌనంలో) యేకమై యుండు శాంత తత్త్వమే శివపూజ యని దృఢంగా తెలుసుకో.

వివరణ : ఆత్మ నుండి వేరుపడిన మనోవృత్తి ఆత్మని న్యూనమొనర్చేపని. దానికి బదులు ఆత్మకు అనన్యంగా నుండటమే, అంటే ఆత్మ నిష్ఠయే ఆత్మని పూజించడం. " కనుక ఇదే శివపూజయని బోధిస్తున్నారు.

205. తన ఆయువును మించి జీవించడానికి మార్కండేయుడు యమునితో పోరాడి జయించాడు. కనుక శక్తిమంతుడైన కాల నాశకుని (అంటే శివుని) భక్తితో ఆరాధించినట్లయితే కాలపాశం బలహీనమై తెగిపోతుంది.

206. తలపుల వల్ల ఉన్నట్లు గోచరించి అందమైన అష్టమూర్తి స్వరూపంగా ఉన్న (భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, జీవుడు) ఈ జగత్తంతా దేవుని స్వరూపమే అన్న అభేద దృష్టి గలవారై ఆ అష్టమూర్తులకు ఆయా దేశ కాల అవసరాలకు తగినట్లు హితం కలగచేసే సేవలన్ని శ్రేష్ఠమైన శివపూజయని తెలుసుకో.

వివరణ : ఉపదేశ సారంలోని 5వ శ్లోకభావాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి.

## 35. సాష్టాంగ నమస్కారం

207. అసంపూర్ణుడైన జీవుడు తనను పాలించే ఈశ్వరుని పాదాలపై గర్వంతో బరువెక్కిన తన శిరస్సు నుంచి చేసే నమస్కార భావమేమంటే, "దేహమే నేను" అనే అహం భావం అణగి దానిపై ఆత్మభావం తలెత్తటమే.

(ఉదయించిన శివత్వంలో జీవత్వం అణగి మాయమవటమే సాష్టాంగ నమస్కారం యొక్క భావం)

## 36. విగ్రహారాధన

208. విగ్రహారాధనని దూషించే మానవుడా!

జంగమ రూపంలో సంచరిస్తున్న జడ శరీరమైన విగ్రహమే చైతన్య స్వరూపుడైన నీవు అని భ్రాంతి చెంది (ప్రతి దినం తప్పకుండా దేహమైన ఆవిగ్రహానికి స్నానపానాదులిచ్చి) ఆరాధించటం న్యాయమేనా?

వివరణ : శరీరభావం ఉన్నంతవరకు విగ్రహారాధన చేయడం తప్పుకాదు. బాగా ఆలోచిస్తే మొదటిదే రెండవదానికి కారణమని తెలుస్తుంది. అందుచేత తమ దేహారాధనని చేస్తున్నవారు విగ్రహారాధనని నిందించి ఖండించడం తగదు. వారు మొదట "తాను దేహం" అనే భావాన్ని వదలక పట్టుకోవటాన్ని నిందించనీయండి, వదలేయమనండి. తర్వాత, అవసరమైతే విగ్రహారాధనని ఖండించవచ్చునని ఉపదేశం.

## 37. విభూతి

209. అనాదిగా మనస్సులో పేరుకుపోయిన పాత వాసనలు గల అహంకారం జ్ఞానాగ్నిలో బూడిదై పోగా మిగిలినది స్వచ్ఛమైన ఉనికే. ఇదే దేవుని విభూతి.

210. జ్ఞాననేత్రుడైన శివుడు గురురూపం ధరించి, లోకంలో కలత చెందుతున్న జీవుని (శిష్యుని) అహంభావం దహించేటట్లు గొప్ప ఉపదేశాన్ని పరా వాక్కుతో (మౌనంతో) బోధించి స్వచ్ఛమైన జ్ఞానాగ్నిని ముట్టించి, పరిశుద్ధ హృదయంలో పుటం వేసి తీసిచ్చే బ్రహ్మజ్ఞానమే విభూతియని తెలుసుకో.

211. అటువంటి విభూతిని ధరించిన వారు అన్ని విధాలా సాటిలేని వారు. మనోరహితము, అద్భుతమైన ఈ జ్ఞానానుభవమే (విభూతే) నాశనము లేని స్వచ్ఛమైన సంపద.

212. మహిమాన్వితమైన ఈ జ్ఞాన వస్తువు కొరకు ప్రయత్నించే వారు - ఆ జ్ఞానమే - ఆ విభూతియే తాము అవుతారు. ఈ విధంగా అహంకారం నశించి జ్ఞానాత్మ స్వరూపాన్ని పొందటమే విభూతి తత్వమని తెలుసుకో!

213. ఆత్మాన్వేషణతో అంతర్ముఖమై హృదయంలో దగ్ధమవడానికి సిద్ధపడిన జడమైన అహంకారం, నింగి నేల పాతాళం మొదలైన లోకాలన్ని పూర్తిగా దహించేటట్లు మండే జ్ఞాన జ్వాల యొక్క చిహ్నము. అదే (స్త్రీలు నుదుట ధరించే) ఎర్రసింధూరం కూడా.

## 38. వృషభ వాహనం

214. వృషభ వాహనం వంటి అనేక రూపాలని శివుడు ఆనందంతో పాలించాడని ఎందుకు చెబుతున్నారంటే: సృష్టిలోగల చరాచర రూపాలన్నీ శివుని రూపాలేయన్న జ్ఞాన దృష్టిని కొంచెం కొంచెం లోకులలో కలగజేయడానికే.

## 39. శక్తి, శాంతి

215. "ఆత్మశక్తి చేత వీలుకాదు. సాయుధబలంతోనే ఈ కార్యం నెరవేరుతుంది" ని కొందరి వాదన. ఆ వాదన దేహాత్మ బుద్ధితో కలిగిన అహంకార దోషం వల్లనే కలుగుతోంది. ఆత్మ బలమంటే దైవ శక్తి. ఆత్మ బలం చేత సాధించలేని కార్యమేదీ లేదు.

216. శక్తి వేరు, శాంతి వేరు, అవి రెండు వేర్వేరు వస్తువులని కొందరంటారు. అటువంటి వారు వాటి సత్యాన్ని అనుభవంలో ఉన్నదున్నట్లుగా తెలుసుకోనివారే. అంతర్ముఖంలో దేనిని శాంతియని చెబుతున్నారో, అదే బాహ్యంలో శక్తిగా ప్రకటితమవుతోంది.

## భగవాన్ - 6

అంతర్ముఖమైనప్పుడు ఏది శాంతియని అనుభవింపబడుచున్నదో, అదే బాహ్యంలో శక్తిగా చూడబడుతోంది. తమను (బాహ్యాంతంరాలలో) బాగా అన్వేషించి సత్యాన్ని తెలుసుకున్న జ్ఞానులకు శక్తి శాంతి ఒక్కటే, పేరుగావు.

217. ధర్మ ప్రవర్తకుడైన ఉత్తముడొకనికి, ఇతరులను దండించే శక్తులనేకం ఉన్నా అణకువ అనే సద్గుణం కలిగి యుండటం చేత అతడు జ్ఞానానుభూతి పొందిన వాడనటానికి చిహ్నము.

వివరణ : ఇతరులను దండించగల శక్తులు కలిగి వుండటం కంటే, వారిని క్షమించి శాంతంగా ఉండగలిగే గుణమే (శాంతమే) నిజమైన, శ్రేష్ఠమైన శక్తి విలాసమని భావం.

## 40. మహత్, అణువు

218. ఒక పెద్ద అయస్కాంతాన్నీ ఒక చిన్న అయస్కాంతాన్నీ ఒక దానికొకటి అభిముఖ ధ్రువాలుగా ఉంచినట్లయితే, పెద్ద అయస్కాంత శక్తిని చిన్న అయస్కాంతం పొంది, దానితో సరిసమానమవుతోంది.

వివరణ : ఈ వచనంలో కేవలం ఒక ఉపమానం చెప్పారు. ఉపమేయమేమంటే మహత్ అయిన దేవుని పాదాలు, అణువైన జీవుని శిరము రెండూ భిన్న ధ్రువాలు. దేవుని పాదాలపై జీవుడు శిరముంచితే ఆ రెండు ధ్రువాలు కలిసినట్లవుతాయి. అట్లాగ జీవుడు తన ప్రత్యేకతను కోల్పోయి జీవుడు శివుడవుచున్నాడు. ఆసత్తైన అహంకారం, ఆత్మలో అణగి నశిస్తే తన అణుత్వాన్ని కోల్పోయి ఆత్మ మహత్ వెలుగొందుతుందని భావం

## 41. సిద్ధులపై ఆశలు

219. (తన భక్తులకు) సర్వము తానై తనకుతానే సమర్పించుకొనే దైవాన్ని అల్పమైన సిద్ధులను యాచించడం ఎటువంటిదంటే, ఉదారగుణ స్వభావుడైన ఒక దాతను కేవలం పాడైపోయిన గంజిని కోరడం వంటిది.

220. అనంత చిదాకాశ రూపమైన ఆత్మ సిద్ధలోకంలో ఉంటూ (జ్ఞానుల పాదాల వద్ద కూర్చొని) అణిమాది అష్టసిద్ధుల కొన్నిటిని కోరటం ఎటువంటిదంటే, దేవలోకానికెళ్ళి అమృతానికి బదులు పులిసిన గంజిని కోరడం వంటిది.

వివరణ : ఆత్మ సిద్ధలోకమంటే, నిత్య సిద్ధముగా నుండే ఆత్మవద్ద ఈ అహంకారం (సాధకుడు) జీవించియుండి కూడా అనీ, ఆత్మ జ్ఞానుల నీడను చేరినా అని కూడా అర్ధం చేసుకోవచ్చును. శ్రీ భగవాన్ రమణులను గురువులుగా స్వీకరించిన కొందరు సిద్ధులను ఆశించి యాచించి, పిదప వారిని వదలి వెళ్ళిన విషయాన్ని గుర్తు చేస్తూ ఈ పద్య రూపంలో హెచ్చరిస్తున్నారు. దీనిని గ్రహించాలి. ఆత్మజ్ఞానం పొందాలని కోరే సాధకులొకరు సిద్ధులను ఆశించటం ఎంత హీనమైనదో ఈ వచన భావం విశదపరుస్తుంది.

221. పరాభక్తి అనే జ్వాలలో దగ్ధమవుతున్న భక్తులను అన్ని రకాల సిద్ధులు చేరతాయి. అయినా భక్తులు ఈశ్వరుని పాదాలకే తాము పూర్తిగా ఆహారమై నశించిన తర్వాత ఆసిద్ధులపై ఎటువంటి ఆశలు పెట్టుకోరు.

222. ముక్తి మార్గంలో నడచే సాధకులు, మార్గ మధ్యంలో కలిగే సిద్ధులపై మనస్సుని పోనిస్తే, అహంకారం ఎక్కువై, బంధం బలపడుతుంది.

## శ్రీ భగవాన్ - 7

చిత్తం యొక్క ప్రధాన గుణం చలనం. అది పోయి శాంతించుటయే ముక్తినొందుట యని పెద్దలు నిర్ధారించారు కాబట్టి, చిత్త ప్రకాశం లేనిదే శక్తిలేని అష్ట సిద్ధులలో మనస్సుంచిన ముముక్షువులు, చిత్తభ్రమలులేని ముక్తి సుఖాన్ని ఎట్లు పొందగలరు? (పొందలేరని భావం)

223. మనుష్యుల్లారా! ఎటువంటి దోషాలు లేని పరిశుద్ధ చిదాకాశ స్వరూపాత్ములైన మీరు, శరీరంతో ఒక నిజమైన వస్తువువలె ఉద్భవించి (లేచి), కర్మానుసారం జనన మరణాది నాటకాలాడటమే అత్యంత గొప్ప సిద్ధి అయిన వింత. అంతేగాని ఇతర అష్ట సిద్ధులు వింతకావు.

వివరణ : విరోధ ధర్మమైన శరీరాదులను నీవు నీ శాశ్వత నిజ స్వరూపంవలె కల్పించుకొని చిజ్జడ గ్రంథియైన జీవునిలా మారినది ఒక విచిత్రం. రాకపోకలులేని ఆత్మయగు నీవు అహంకారంగా ఉత్పన్నమవటం ఇంకా విచిత్రం. అచల స్వరూపమైన నీవు చలనమే రూపమైనటువంటి అహంకారంగా గంతులేయటం అంతకంటే గొప్ప విచిత్రం. అహంకారం విజృంభించటం, గంతులేయటం అణిమాది సిద్ధులన్నిటిలోను ఎంతో వింతైనది. ఆత్మ అసంపూర్ణ రూపమైన అహంకారంగా మారినట్లు (మనుష్యులవలె) గోచరించటం సిద్ధులలోకెల్ల అత్యంత సిద్ధి కదాయని భావం.

224. ముక్తి యొక్క వైభవం, ఆది వస్తువైన తన ఆత్మ స్వరూపాన్ని పొందటమే. అదే నిజమైన సిద్ధి. సిద్ధులని చెప్పబడే అణిమాది అష్టరకాల సిద్ధులు అజ్ఞాన రూపమైనటువంటి మనఃకల్పనా శక్తి యొక్క వికారాలే.

## 42. అమరత్వం

225. తాను శాశ్వతము అని తాను తెలుసుకోనీయకుండా మభ్యపెడుతుంది, ఈ అసహ్యమైన దుర్వాసనా భరితమైన శరీరం. అటువంటి ఈ శరీరాన్ని "నేను" అని అభిమానించి తిరిగే అహంకార పిశాచిని నాశం చేసినవారికే శాశ్వత స్థితి (అమరత్వం) కలుగుతుంది.

వివరణ : దేహాన్ని చాలకాలం పోషించి, దాన్ని శాశ్వతంగా ఉంచటమే అమరత్వమని భావించి, దాని కోసం యోగ సాధనాలలో మునిగిన వారు ఎందరో! అందువల్ల వారిపై ఎంతో కరుణతో శ్రీ భగవాన్ నిజమైన అమరత్వాన్ని ఇక్కడ ఉపదేశించారు.

226. ఈ శరీరమే నిజమనే వ్యామోహం వల్లనే జనన మరణాలు తనకే కలుగుతున్నట్లు గోచరిస్తాయి. అందుచేత ఈ వ్యామోహం నశిస్తే స్వస్థితియైన అమరత్వం లభిస్తుంది.

227.తన కన్యంగా నుండే దేహమే "నేను" అని తోచు భ్రాంతి తప్ప మరణమంటూ ఏదీ లేదు. భ్రాంతి రూపమైన ఈ అహంకారం నశించగా కలిగిన అనన్య ఆత్మజ్ఞాన సుఖమే అమరత్వం.

228. ఈ దేహమే 'నేను' అని అంటున్న వాడు ఈ శరీర మరణానికి భయపడుతాడు. “నేనెవరు?” అనే విచారణతో తాను ఆత్మయని తెలుసుకుంటే ఆ అహంకార బుద్ధినశిస్తుంది. అమరత్వం సిద్ధిస్తుంది. మరే ప్రయత్నం చేత సిద్ధించదు.

229. చిత్త వికారాలు లేని జ్ఞానమే శ్రేష్ఠమైన అమృత స్థితియని గ్రహించు. శుద్ధ స్ఫురణ తప్ప మరో దాని వల్ల లోనున్న భ్రాంతి అనే మరణం పోనేపోదు.

వివరణ : మరణం కేవలం తప్పుడు జ్ఞానము కాబట్టి సత్యజ్ఞానమైన ఆత్మజ్ఞాన మొక్కటే మరణమనే భావాన్ని నిర్మూలించగలదని భగవాన్ వాక్కు.

## 43. అమరత్వసారం

230. కనబడి అదృశ్యమయ్యే ఈ శరీరాన్ని సత్యమైన వస్తువుగా చెప్పడం వాడుక మాట. అందరూ తెలుసుకోవలసిన ఆత్మజ్ఞాన మొక్కటే సత్యమైన వస్తువు.

వివరణ : శరీరం సత్యం అనేవి వాడుకలో నున్న మాటలు. అంతేగాని, రాక్షసుడు పుణ్యాత్ముడంటే ఎంత నిజం కాదో, అవి కూడా నిజం కావు. ఈ వచనంలో మురుగనార్ భావం ఏమంటే

అర్థ కామాలే గాకుండా ధర్మం కూడా జ్ఞానానుభవంచేత నశిస్తుంది. అలా కాక ఆత్మజ్ఞానానుభవం, దాని రూపమైన ముక్తి శాశ్వతం కాబట్టి అదే సత్యమని అభిప్రాయం

231. మఱిమఱి విజృంభిస్తున్న అహంకారం దాని మూలంలో అణగిపోతే, అప్పుడు ప్రకాశించే అతి స్వచ్ఛమైన ఆత్మజ్ఞానమే అసలైన మందు అని తెలుసుకో.

## 44. కాయసిద్ధి

232. సమస్త వ్యాధులకి మూల వ్యాధి శరీరం. దానిని తెలుసుకోలేనివారు, ఆ మూల వ్యాధిని నివారించటానికి బదులు, ఆవ్యాధిని (శరీరాన్ని) చాలా రోజులుంచటానికి, ఉపయోగంలేని గడ్డికి నీరుపోసినట్లు, కాయసిద్ధికై తపిస్తారు.

233. పీడించే వ్యాధులన్నిటికీ మూలమైనది, విషమయమైనది, నిజంగా ఉనికి లేని అహంకారాన్నే రూపంగా ధరించిన మూర్ఖులు, తమను పట్టి పీడిస్తున్న రోగాన్ని తీవ్రతరం చేయటానికి మందులు మ్రింగే వారివలె, దృఢమైన శరీరం కొరకు అవిశ్రాంతంగా తపస్సు చేస్తారు.

234. ప్రాకులాడి దరిద్రాన్ని సాధించినట్లు, తపస్సుతో పరిపూర్ణ మౌనస్థితిని పొంద × వాంఛింపక, కాయసిద్ధిని వాంఛించడం మోహంతో కూడిన అజ్ఞానం.

235. జ్ఞానులకు ఈ దైహిక జీవనం కేవలం మనోమాత్రంగా, అసత్యంగా గోచరిస్తుంది. కనుక తపస్సుతో జీవితకాలాన్ని పొడిగిస్తే జీవులకి కీడు కలిగిస్తుందే తప్ప మంచి కలగదని గ్రహించు.

## 45. వైరాగ్యం

236. తపస్వీ! లోకులు తమ కోరికలు నెరవేరటానికి నిన్ను ఆశ్రయించి, నీవు ఆనందించేట్లు చేసే పొగడ్తలు, పూజాది ఉపచారాలు నిన్ను బంధించే బంగారు గాలములని తెలుసుకో.

వివరణ : ఇతరులు చేసే స్తోత్రపూజాదులవల్ల తన మనస్సు కొంచం ఉప్పొంగినా అది ఒక ఎరలా సాధకునికి కీడు కలగ చేస్తుంది. జీవన్ముక్తునికి చేసే ఈ స్తోత్ర పూజలు అతని బంధించవు. ఈ భేదాన్ని తెలుపడానికే ఈ ఉపదేశం. అంతేగాకుండా, సాధకులందరూ పూర్తిగా మనోనాశనం కాక ముందే, లోకులు చేసే ఉపచారాలకి సంతోషించి పరవశులై గమ్యాన్ని మరచిపోతారు. స్తోత్ర పూజాదులకొరకే ఊళ్లు తిరిగి ఉపదేశించటం, ఆశీర్వదించటం వంటి రక రకాలైన ఎన్నో

అసత్ కార్యాలను గమనించుకొని వాటి నుండి తప్పించుకోవాలనే ఈ ఉపదేశం. ఇటువంటి స్తోత్రోపచారాలు గొప్పవిగా తోచినా, వాటి వల్ల సాధకుని అహంకారం బలపడి ప్రగతికి అవరోధాలుగా ఉంటాయని హెచ్చరిస్తున్నారు.

237. పూర్వజన్మ తపస్సువల్ల ఇప్పుడు ఎవరి హృదయాలలో ఇహపరలోకాల సుఖాల రెంటిపట్ల సహజమైన అనాసక్తత ఏర్పడుతుందో, వారికి సులభంగా ఆత్మజ్ఞానమేర్పడుతుంది.

వివరణ : ప్రారబ్ధవశంగా కల్గిన ఇహలోక సుఖాలను లెక్క పెట్టక, రాబోవు సుఖాలకై అర్రులు చాచకుండా ఉండే వారే తపోధనులు. వీరే భాగ్యవంతులు

238. జ్ఞానానందమయమైన శాంతి ఆత్మస్వరూపంలో లభిస్తుంది. అంతేగాని, ఈ జగత్తులో, మోహపూరితమైన జీవితంలో, లేశమైనా శాంతి లేదు. ఈ సత్యాన్ని గ్రహించి, మహామౌన స్థితియగు ఆత్మజ్ఞానాన్ని పొందుము.

239. దట్టమైన మోహాంధకారాన్నీ, ఆశలన్నిటినీ నశించేట్టు చేసి జ్ఞానజ్యోతిని వెలిగించు నా ప్రియమిత్రుడైన వైరాగ్యమా! నీ స్నేహాన్ని ఆశించే నన్ను ఎప్పటికి వదలకు.

వివరణ : వైరాగ్యాన్ని ఒక హితునిగా ఊహించుకుంటూ ఈ పద్యరచన చేశారు. ఎప్పుడూ ఏ పరిస్థితుల్లోనూ వైరాగ్యాన్ని మనం వదలకూడదని ఉపదేశం.

240. పిశాచి స్నేహం నుండి విడిపడడం కష్టమని పెద్దలంటారు. అలాగుండగా, ఏ జన్మలోనైనా నన్ను దుఃఖాల బారి నుండి కాపాడి నన్ను ఎంతో సహన గుణంతో చేర్చే సన్మిత్రుడవైన వైరాగ్యమా! నీ స్నేహాన్ని వదలి వేయవలసి వస్తే అది మాత్రం పరులపై విరోధం పెంచుకోవడం కంటే చాలా ఘోరమైన అపరాధము.

241. ఎటువంటి తలపులు లేచినా, అవి విస్తరించకుండా, వాటిని ఆ క్షణమే అవి పుట్టిన స్థలంలోనే నాశనం చేయడం అతి తీవ్రవైరాగ్యమవుతుంది.

242. చిత్తమనే కోట నుండి వాసనలనబడే శత్రువులు తలపుల రూపాలలో బయటికి వచ్చినపుడల్లా, లెక్కలేని ఆ శత్రువుల నొక్కక్కరిని అద్భుతమైన ఆత్మవిచారం చేత హతమారిస్తే, చివరికి శత్రువులు కోట (చిత్తం, మనస్సు) మన వశమవుతుంది.

## 46. జ్ఞానవైరాగ్యాలు

243. చూడబడే ఈ ప్రపంచం చూచేవానికి వేరుగా లేకుండా యుండటమే జ్ఞానం. మనస్సు బాహ్య ప్రపంచాన్ని పట్టుకోకుండా, హృదయంలో సంస్థితమై, ప్రపంచమంటూ ఒకటి లేదని త్రోసి పుచ్చటమే వైరాగ్యం.

వివరణ : జ్ఞానికి, అజ్ఞానికి లోకం కన్పించినా జ్ఞానికి కనిపించే లోకం అతని కంటే అన్యమైనది కాదు. అది జ్ఞానస్థితి. అట్లు గాకుండా, ఈ లోకం అన్యంగా తోస్తే అది అభ్యాసస్థితే . కాబట్టి, దానిని కాకుండా ఆత్మనే పట్టుకోవాలంటే ఆ దృశ్యాలు కేవలం కల్పితాలని యెంచి త్రోసి పుచ్చాలి. అదే వైరాగ్యం. "నేనెవరు" గ్రంథంలో “అన్యము నాసింపకుండుట వైరాగ్యము, తనను వదలకుండుట జ్ఞాన"మన్న ఉపదేశవాక్యాలే ఈ వచన భావం.

## 47. చిత్తం యొక్క సామర్థ్యం

244. ఎర్రమందార పుష్పం యొక్క రంగు పడిన అద్దం ఎర్ర అద్దం వలె కన్పిస్తుంది. అట్లాగే చిత్కు పంచేంద్రియ విషయదోషాలు అంటుకుంటే అది "చిత్తం" అవుతోంది. అందుండే 'తమ్' అనే మాలిన్యం పోతే ఆ చిత్తమే చిత్ అవుతుంది. తమ్ అనే పదం మాయని సూచిస్తుంది.

వివరణ : చిత్తం అనే పేరుతో పిలువబడే దాని నుండి మాయను ఆత్మవిచారణ చేత తొలగిస్తే చిత్తమలం పోయి మనం ఎప్పుడూ శివుని వలె ఉంటామని గ్రహించవచ్చు.

## 48. చిత్తశుద్ధి

245. అనేక రకాల వస్తువులు పంచేంద్రియ విషయాలుగా మోహాన్ని కలిగించి ఇహపరములలో ఎంతో కీడు కలిగించేవో, అలాంటి వస్తువుల వలె కాకుండా పవిత్రాత్మ మహానందాన్ని కల్గిస్తుంది. అందువల్ల చిత్తశుద్ధి పొందిన వానిని "దైవమే ప్రత్యక్షమై నడయాడుతున్న ఒక అపురూప దృశ్య"మని ఆశ్చర్యంతో స్తుతిస్తారు. చిత్తశుద్ధిగలవాడు శివుడే.

246. కీటక నాశానికి దీపం హేతువు. నాగుపాము నాశానికి కట్లపాముతో సంభోగమే హేతువు (Cobra mating with the viper). అట్లాగే ఆత్మసౌందర్యం కాదని బాహ్యవిషయ సౌందర్యవాంఛయే నాశానికి హేతువవుతుంది.

## 49. మృత్యువు

247.పరిపూర్ణ ఆత్మ అవ్యయము, మహానంద నిలయము, మహానంద మయము. అది మూల వస్తువు. జ్ఞానాకాశం అది. దాని నుండి జారిపోవుటయే మరణం.

248. ఆత్మ నుండి విడిపడి జీవితాంతం తాను అనుభవించిన దుఃఖానికి కారణం తెలుసుకోటానికి సద్గురువుని సేవించి, ఆయన అనుగ్రహం చేత, తాను ఆత్మ నుండి అహంకారంగా విడిపడటమే కారణమని గ్రహించి, పిదప తన్నుతాను తెలుసుకొని ఆత్మలో మునిగి స్థిరముగా నుండుటయే జీవితానికి శ్రేయస్కరం.

## 50. ప్రాణస్థానం

249. హృదయంలోనే జీవుడు (ప్రాణం) జీవిస్తున్నాడు. అతని వాసనలకి కూడా అదే స్థానం. అలాగ కాక సహస్రారమే వాటి స్థానమైతే శిరము నరకబడితే వాసనలు కూడా నశించాలి కదా! అట్లు నశించవు కాబట్టి హృదయమే ప్రాణం (వాసనలతోపా) యొక్క స్వస్థానమని గ్రహించు.

వివరణ : శ్రీ కావ్యకంఠగణపతి శాస్త్రిగారు ఒకమారు సహస్రారమే ప్రాణ స్థానమని, వాసనల కేంద్రం కూడా అదేనని శ్రీ భగవాన్ వాదించారు. శ్రీ భగవాన్ వారితో ఏకీభవించక యీ భావాన్ని బోధించారు. యుద్ధ భూమిలో ఒకని తల నరికితే, హృదయమే ప్రాణ స్థానం కాబట్టి, అతని శరీరం కొట్టుకొని ప్రాణ చలనాన్ని సూచిస్తోంది. వాసనల స్థానం శిరమైతే ఆ మరణంతో వాని వాసనలు కూడా నశించి ముక్తి పొందాలి కదా! అందువలన తలనునరికితే మాత్రం వాసనాక్షయంకాదు. కనుక హృదయమే ప్రాణం, వాసనలకు నిలయమని శ్రీ భగవాన్ ఉపదేశించారు.

250. కుండలినీ శక్తి మూలాధారం నుండి పైకి ఎగప్రాకుటవలన, సహస్రారం నుండి అమృతధార క్రిందికి ప్రవహించుటవలన, వీటి రెంటి లక్ష్యం హృదయమే కాబట్టి అదే మూలస్థానమని, అదే ప్రాణ స్థానమని గ్రహించు.

251. తమ ఆత్మ శరీరంలో ఏయే చక్రాలలో నున్నట్లు సాధకులు ధ్యానిస్తున్నారో, వారి మనోబలంచేత ఆయా స్థలాలలోనే ఆత్మ గోచరిస్తున్నట్లు తెలుస్తుంది. అయినప్పటికి 'నేను' అనే జీవికి తానుదయించడానికి, అణగి యుండటానికి స్థానమని చెప్పే హృదయమే ముఖ్యమైన స్థానం. అదే ఆశ్రయం కూడాను.

252. సర్వావస్థలలోను అహంకారానికి ఆధారమైన హృదయాన్ని వదలి (ఆత్మని వదలి) షట్చక్రాలలో ఏదో ఒక దానిలో తానున్నట్లు భావించి ధ్యానించే వాడు, ఆయా చక్రాలలో కొంచెం కాలం లయించి మైకంలో నుంటాడే తప్ప, ఉన్న వస్తువైన తనను తెలుసుకొని ముక్తి చెందలేడు.

వివరణ: షట్చక్రాలలో ఏదో నొకదానిపై మనస్సుని లగ్నం చేసి ధ్యానించే సాధకుడు ఆ స్థానంలో ఒక రకమైన లయంలో మునిగి తర్వాత, ఆ కర్మఫలితంగా మరొక జన్మనెత్తుతాడే తప్ప, ఆత్మజ్ఞానం పొంది ముక్తినొందలేడు. కనుక ఆ అభ్యాసాల అజ్ఞానాన్ని పోగొట్టి, ధ్యానంలో 'నేనున్నాను' అనే స్ఫురణతో నుండటమే నిజమైన యోగాభ్యాసమని ఈ వచనంలో ఉపదేశించారు.

## 51. హృదయం

253. హృదయము వర్ణింపదగినదని, గ్రహింపదగినదని రెండు రకాలు. ఇంద్రియాలకి స్థానము, ఛాతికి ఎడమవైపుగల మాంసపిండమైన హృదయం జడమగుటచేత అది వర్జింపదగిన ప్రథమ వర్గానికి చెందింది.

వివరణ : రెండూ వేర్వేరు. మాంసపు ముద్దగా ఛాతికి ఎడమ భాగంలో ఉంటూ స్పందిస్తున్నట్లు కొందరి అభిప్రాయం. అందువల్ల ఆత్మ నిలయమైన ఆధ్యాత్మిక హృదయం కూడా అక్కడే వుండవచ్చని వారి అభిప్రాయం. వారి తప్పుడు అభిప్రాయాన్ని త్రోసి పుచ్చటానికి “వేర్వేరు" అని సెలవిచ్చారు. ఉన్నది నలుబది అనుబంధములోని 22వ పద్యాన్ని యిక్కడ అన్వయించుకోవాలి.

254. శరీరంలోపలా బయటా అంతటా వ్యాపించి విరాజిల్లుతున్న హృదయం (శరీరంలో దానికో స్థానం చూపాలంటే అది) రొమ్ముకి కుడివైపు గలదని జ్ఞానులకు తెలిసిన విషయం. దేహం "నేను" అని వ్యామోహంలో పడ్డ అజ్ఞానికే మాంసం ముద్ద రూపంలో ఎడమ వైపు కలదని అభిప్రాయం కలుగుతుంది.

The wise man's heart is at his right, but a fools heart at his left. జ్ఞాని యొక్క హృదయం అతని కుడి వైపున ఉంటుంది, కానీ మూర్ఖుని హృదయం అతని ఎడమ వైపున ఉంటుంది"

ఉన్నది నలుబదిలోని 22వ పద్యంలో శ్రీ భగవాన్ చెప్పిన “అది లోపల వెలి యందుండును, లోవెలి లేకుండును' అన్న మాటని గమనించాలి..

255. ఆత్మ (నేను అన్నపదానికి రూపాంతరం) శరీరంలో రొమ్ముకి కుడి పక్కనుండి నిరాటంకంగా గోచరించకపోయినట్లయితే, మనుషులకు “నేను నేను" అని కుడివైపు రొమ్ముని తమ చేతులతో ముట్టుకొని తెలుపటం ఎట్లు వీలవుతుంది? అందరికి ఆ అలవాటు ఉండటం వలన ఆత్మకి స్థానం రొమ్ముకి కుడివైపునే.

256. నిజమైన హృదయం ఈ ప్రపంచం కన్పించే అద్దం వంటిదని చెప్పవచ్చు. “ఉన్నాను” అను (ప్రజ్ఞ) ఎరుక మాత్రంగా ప్రకాశించు పరిశుద్ధ ఆత్మాకాశం అదే. అదే మౌన వస్తువు.

వివరణ : ఉపదేశసారం గ్రంథంలోని 26వ శ్లోకభావం: "తాను తానుగా నుండుటయే తన్నెరుగుటయగును లేక తన స్వరూపాన్ని తెలియుటయగును" అన్నది ఇక్కడ రూఢి పరుస్తుంది.

257. హృదయమైన ఆ మూలవస్తువే అన్నిటికీ ఆదిమధ్యాంతము పరమాకాశమైన అది అరూపమైన సచ్చిత్ అవుతుంది.

వివరణ : అహంకారమే అంతా. కనుక అహంకారముదయించు స్థలమే హృదయం. అన్ని చరాచరాలకి నిలయం హృదయం. కనుక అది పామరులు భావించే రూపం కాదు. పూర్ణమైన సచ్చిత్ అకాశమే అది.

258. సంతత మౌనం అంటె జ్ఞాన స్వరూపసాగరమైన తన ఆత్మలో మనస్సు నశించి కరగిపోవటమే. శాంతి రూపము, ఆనందసాగరమైన హృదయ ప్రకాశమే నిజమైన మన స్వరూపం. ప్రేమ రూపమైన మనం. (అంటే మనం సచ్చిదానంద సాగర మని భావం)

259. అద్వితీయము, పరిపూర్ణమూనైన పరవస్తువును నీవు అంచనా వేయలేవు. మనస్సు అణగి, ఎటువంటి తలపులు లేక "ఉన్నాను" అన్న ప్రజ్ఞ మాత్రంగా గోచరించే సచ్చిదానందమే హృదయం. అదే అణ్ణామలై అనబడే మన ఆత్మ స్వరూపం.

వివరణ : బ్రహ్మ విష్ణువులైన బుద్ధి అహంకారాలు తెలుసుకోలేని వస్తువుకే అణ్ణామలైయని పేరు. ఆ పరవస్తువు యొక్క మహత్తును మనస్సుతో తెలుసుకోలేని ఆత్మ అని చెబుతున్నారు. ఆత్మ విద్యా కీర్తనలో కూడా "లోనున్న మనమం దలరున్న రుణాచలాత్మ తెలియునే" అన్నారు శ్రీ భగవాన్. అంటే అణ్ణామలై నా ఆత్మ అని చెప్పిన విషయాన్ని గుర్తించుకోవాలి.

260. ఆ హృదయాన్ని తెలుసుకొన్నవారు చెడిపోరు. వారు బంధవిముక్తులు. వారే పరమవస్తువు. ద్వంద్వములు లేని వారు. మోహరహితులై లోనున్న సత్యపరమానందాన్ని అనుభవించు వారు వారే.

261. ఆ హృదయం లోపలా బయటా ఉన్నటువంటిదైనా, శరీరంలోపలగాని, బయటగాని అది లేదు. ఎందువలనంటే "లో బయట" అనే భేదాలకి నిలయమైన ఈ శరీరం మనఃకల్పితమే. కనుక ఆత్మ శరీరంలోనో, లేక భగవంతునిగా ఎక్కడో పరలోకంలోనో బయట ఉందని చెప్పటం కూడా కల్పనే. నిజానికి అది సర్వాతీతము.

262. ఆత్మలో ఈ శరీర ముండగా, దానికి విరుద్ధంగా తాను ఈ శరీరంలో ఉన్నట్లు అహంకారంతో భావించువాడు, సినిమాలో కనిపించే దృశ్యాలకు ఆధారమైన తెరమీద కనబడి కదలుతున్న దృశ్యాలలోనే ఆతెర ఉందని భావించు వాడవుతాడు.

## భగవాన్ - 8

ఆత్మయైన తనలో ఈ శరీరముండగా, తానైన ఆత్మ ఈ జడ శరీరంలో నున్నట్లు తలచే వాడు, సినిమాలో కన్పించు దృశ్యాలలోనే ఆ దృశ్యాలకు ఆధారమైన తెర ఉందని అజ్ఞానంతో భావించే మూఢుడవుతాడు.

263. కనుక, ఈ శరీర రూపమైన "నేను" అన్న అహంకారాన్ని నశింప చేసుకొన్న జ్ఞానులే మోహరహితులై సూక్ష్మ బుద్ధితో ఈ హృదయం అంతటా వ్యాపించి ఉన్నట్లు అనుభవంతో గ్రహించి శ్రేష్టులవుతున్నారు.

వివరణ : హృదయం అంటే ఒక స్థానం కాదని అది ఆత్మయేయని గ్రహించటమే శ్రేష్ఠం.

264. మౌనానుగ్రహ భరితమై గోచరిస్తున్న భగవంతుని హృదయమే అసమానమైన కైవల్యస్థితి. దీని ముందు స్వర్గాది పదవులు కూడా అల్పంగా నిస్సారమైపోతాయి.

వివరణ : హృదయమే కైవల్యమని భావం. బట్టబయలునకాసే నిండువెన్నెల జ్ఞాని ఆత్మ సుఖానికి సమమనీ వెన్నెల రాత్రులలో దట్టమైన వృక్షం కింద, ఆకుల సందుల్లోంచి భూమి పై పడుతున్న వెన్నెల కాంతి తునకలు, జీవులు బ్రహ్మలోక పర్యంతం వెళ్లి అనుభవించే భోగాలకి సమానమని శ్రీ భగవాన్ పోల్చి చెప్పేవారు.

265. అంతులేని ఆలోచనలు ఎగసి తిరిగి తిరిగి అల్లాడటం (విక్షేపం), దానికి కారణమైన ఆవరణము (అంటే తన్ను మరచినటువంటి మరపు) పూర్తిగా తొలగితే ఏకమై, నిత్యమై, సత్యమై యీ హృదయం ప్రకాశిస్తుంది. ఈ హృదయమే శ్రేష్ఠమైన పరమాత్మ లోకం. దీనిని స్వర్గాన్ని ఏలే ఇంద్రాది దేవతలూ పొందాలని తపిస్తారు.

## 52. సద్గురువు

266. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాల్లో ఏ ఒక్కదానిపై కూడా “నేను ఇది” అనే అభిమానం లేక బంధరహితమై గోచరించు సచ్చిత్తే సృష్టిలోని సకల జీవరాసుల హృదయంలో తానై వెలుగొందు అఖిల పరాశక్తి.

వివరణ : 'సద్గురువు' అనే ఈ అధ్యాయంలో పరాశక్తి అని తెల్పటంలో భావమేమంటే, సచ్చిత్ ఊరకయుండే స్థితి సర్వశాంతిమయమైన స్థితి. అందుచేత అది కలిగిన వాడే పరాశక్తి గలవాడు. అటువంటి వానినే గురువుగా పొందాలని భావం. ఈ భావాన్నే రాబోవు 268 వచనంలో కూడా సెలవిచ్చారు.

267 ద్వంద్వాలు లేక హృదయంలో సచ్చిదానందంగా ఊరక నుండటయే సత్స్వభావం. అదే మౌనం అనే అంతిమ జ్ఞానం. అది అహంకార రూపమైనటు వంటి ఆసురీ మనస్సు యొక్క అనుభవానికి అందని మౌనమనే జ్ఞాన అవధి.

వివరణ : పై రెండు వచనములలో సద్గురు లక్షణాలను వివరించారు. సద్గురువు యొక్క నిజమైన లక్షణం ఏమంటే వూరక "నేను ఉన్నాను (సత్‌్చిత్)"అనే సహజ స్వభావ స్థితిలో నెలకొని ఉండే మహామౌనమే. ఆ మహామౌనం మహా శక్తివంతమైనది. అదే అఖిల పరాశక్తి స్థితియని ఎరుక పరచి ఇక అటువంటి గురువునే అన్వేషించి గురువుగా స్వీకరించాలని భావం. ఈ భావమే రాబోయే వచనంలో కనబడుతుంది. మౌనం జ్ఞానానికి సరిహద్దు. మౌనమే జ్ఞానానికి చిహ్నం. ఇదే ఈ భావంలోని

268. అటువంటి సహజ స్థితిలో నున్నవాడే, తనను శరణు వేడి వచ్చే ఏ ప్రాణినైనా వాగతీతము, అద్వితీయము ఐన జ్ఞానాత్మ స్వరూపంలో కరుణతో చేర్చ గలిగే ఒక సద్గురువు.

వివరణ : పరిపక్వ చిత్తులు కాని వారైనా, శాస్త్రాలచే నిషేధించబడిన ప్రాణులైనా, అధమ జీవులైనా సరే వాటికి కూడా సద్గురువు తన అవ్యాజ, అపరిమిత కరుణతోను, మహాశక్తితోనూ స్వరూప సాక్షాత్కారం కలుగ చేయగలడని ఉపదేశం.

269. బ్రహ్మమే మౌనస్థితి. ఆ మౌనమనే మహత్తర కాంతిలో నేను అనే అహంకారం నశిస్తే పరాభక్తిధార ప్రవహిస్తుంది. అదే ఉత్తమ శిష్య స్థితి. అదే ఉత్తమ గురు పదమని తెలుసుకో.

270. జీవులను ఆత్మ స్వరూపం వైపు తీసుకెళ్లి పరమాత్మ బోధనను అనుగ్రహించే వాడే సద్గురువు. అతనిని సర్వేశ్వర రూపమని జ్ఞానులు స్తుతిస్తారు. అది తెలుసుకొని ఆ సద్గురువునే శరణొందు.

వివరణ : జ్ఞానులు సద్గురువుని సర్వేశ్వరునిగానే స్తుతిస్తున్నారు. ఆ సర్వేశ్వరుడు ఆత్మ స్వరూపమే తప్ప వ్యక్తి కాదు. కనుక గురువుని పొందాలనుకొనే నీ ఆత్మ స్వరూపమూ, జగద్రక్షకుడైన సర్వేశ్వరుని స్వరూపమూ రెండూ నీ కళ్లముందు మానవరూపంలో కనిపిస్తున్న గురురూపమేయని జ్ఞానులంటారు. కనుక వానినే శరణొందు. ఆత్మస్వరూపానికి మనలను అభిముఖం చేయువాడే గురువని, సద్గురువు సర్వేశ్వరుడే యని భావం.

271. తనను శరణు వేడిన శిష్యునికి ఒక సాధనా మార్గాన్ని ఉపదేశించి అనుసరించమని చెప్పే గురువు ఆ శిష్యుని పట్టుకొని నరక లోకంలో దండనలకు గురిచేసే దుష్టయముడో మరి వానిని జన్మలకు గురిచేయు బ్రహ్మదేవుడో అవుతాడు.

(అట్లుకాకుండా, కర్మబంధాలకి భయపడి తనను శరణొందిన) శిష్యుని "ఇక నీవేమీ చేయకు; ఊరకవుండు" మని ఉపదేశించి అతనిని కృతకృత్యుని చేసే వాడే నిజమైన సద్గురువని తెలుసుకో.

వివరణ : అనేక జన్మలలో లెక్కలేని కర్మలాచరించి వాటి ఫలితాలననుభవించటం తప్ప యిక వేరే మార్గం లేదని గ్రహించి, తరించే మార్గానికై గురువును చేరితే, గురువు ఇంకా చేయవలసిన పూజజపధ్యాన యోగాలనబడే కర్మభారాలను అతనిపై మోపి కష్టపెడితే ఆ గురువే అతనికి యముడవుతున్నాడు.

ఆత్మసాధనాలవలె అగుపిస్తున్న వీటిని చేయటానికి "నేను" అను కర్తృత్వ భావం వుండాలి కదా! కర్తృత్వం ఉన్నంత వరకు కర్మ, దాని ఫలితమైన జన్మ వదలవు కదా! అట్లాగ తిరిగి జన్మలో త్రోయటం వలన ఆ గురువు అతనికి

బ్రహ్మ అవుతున్నాడు. ఇట్లాగ మోక్షాన్ని కలుగ చేయక, కర్మలను విధించువాడు నిజమైన గురువు కాలేడు. ఈ సత్యాన్ని గ్రహించిన వాడు కాబట్టి, సద్గురువు తన శిష్యుని కర్మ ధర్మ యోగానుష్ఠానాలలో పడకుండా "ఊరకవుండు" అని వుపదేశించి అభయమిస్తున్నాడు. మనోవాక్కాయాలని శాంతింపజేస్తున్నాడు. అతనిని మౌనంలో ముంచి కృతకృత్యుని చేస్తున్నాడు. ఈ విధంగా ఆత్మ మార్గాన్ని అనుసరించమని చెప్పినటువంటి సద్గురువులు శ్రీరమణ మహర్షులు మనలందరినీ ఊరక యుండునట్లు చేస్తున్నారు. ఇదే నిజమైన సద్గురువు యొక్క లక్షణం.

272. లోకం నిజమనే మోహభావంతో, బహిఃప్రవృత్తితో పరుగెత్తి, "ఊరకవుండు" అనే సత్యోపదేశాన్ని పెడచెవిని పెట్టిన కారణం చేతనే, బయట మానవ శరీరరూపంలో గుర్వాకరు అవసరమవుతున్నారు.

వివరణ : మనస్సుని అంతర్ముఖంచేయించి ఊరక ఉండునట్లు చేసే ఆత్మే గురువు. "అహమహ"నే ఆ స్ఫురణను అనుసరించి తపనతో హృదయంలో మునగటమే ఉపదేశాన్ని వినడమంటే. ఇట్లాగ వినలేని వారికి బయట ఒక గురువు కావాలి. అట్లాగ బయట లభించిన గురువు నిజమైన సద్గురువైతే, తన వద్దకు వచ్చిన వారిని "తాను ఎవరు?" అని తనలోపల అన్వేషించి, అంతర్ముఖంగావించి, ఊరక ఉండేట్టు చేస్తాడని మనకు తెలుస్తోంది. నిజమైన గురువు లెవరో సాధకులు అన్వేషించి తెలుసుకోవాలి.

273. వస్తువులన్నిటి యందు తానే ఆ వస్తువుగా వుండు సత్-చిత్ స్వరూపమే గురువు.

274. మానవ రూపంలో కనిపించినా, ఆత్మ స్వరూపునిగా గోచరించే జ్ఞాన గురువును నామరూపాలకి అతీతమైన పరవస్తువుగా చూడలేని లోకులు దురాచార పరులలో ప్రథములు.

వివరణ : గురువు నిజానికి మానవ రూపికాదు. మానవ రూపంలో మనం చూస్తున్నాము. నామరూప రహితుడైన వాడే గురువు. ఇది గ్రహించలేని వారు దురాచారపరులు.

## 53. గుర్వనుగ్రహం

275. అజ్ఞాన మోహాంధకారాల చేత చేసిన సత్కర్మల, దుష్కర్మల వలన కల్గిన సంసారదుఃఖాలలో బంధింపబడిన జీవులకు సద్గురువుల అనుగ్రహానందమే ఔషధము.

వివరణ : వివిధ కర్మలచేత సంసారం, సంసారం చేత చిత్త వృత్తులు, చిత్త వృత్తుల వలన దుఃఖాలు జీవులకు కల్గుతున్నాయి. మనో విక్షేపమే దుఃఖము. అందువలన గుర్వనుగ్రహానికై ప్రాకులాడి వారి ఉపదేశాలని పాటించిన మనస్సే ఎంతో ఉపశమనం కలిగించే ఔషధము.

276. కర్మల వశం చేత చెదరి తనను ఆశ్రయించిన జీవులకి దుఃఖాలని నివారించి ముక్తి సుఖాన్నిచ్చే వాడే సద్గురువు.

277. తుప్పు పట్టిన ఇనుమును సైతం బంగారంగా మార్చగలది స్పర్శవేది. అట్లాగే ఉపాధిదోషవశులైన జీవులను సద్గురువుల అనుగ్రహదృష్టి ఆత్మజ్ఞాన స్వరూపమైన బంగారంగా మార్చగలదు. కనుక మనోమాలిన్యాలని శుభ్రపరచి, అతి శ్రద్ధతో మనం స్తుతించే దైవ దర్శనం అదే (సద్గురు కటాక్షమే).

278. స్థూల కాంతి పుంజాలైన సూర్య చంద్రాగ్నులను కూడా ప్రజ్వలింపచేసేది ఆత్మజ్యోతి. అసత్య దేహాది ప్రపంచాన్ని సత్యమని నమ్మే జీవులకి అది అసత్యమని గ్రహింపచేసేవారే ఆత్మజ్యోతి స్వరూపులైన సద్గురువులు.

వివరణ : ఉన్నదినలుబది అనుబంధంలోని 7వ పద్యభావాన్ని ఇక్కడ అన్వయం చేసుకోవాలి.

279. అనుగ్రహాకాశమూ, సత్యజ్ఞానమూర్తి ఐన సద్గురువు, అల్పుడైన జీవుని దేహాత్మభావాన్ని పూర్తిగ నశింప చేసి పరిపూర్ణ జ్ఞాన స్థితిలో స్థిరముగా నెలకొల్పుతాడు.

280. జగన్మాయకులోబడిన అల్ప లౌకిక వాదులను ఓడించిన సత్యజ్ఞాన గురువు మహామౌనులలో శ్రేష్ఠుడు.

వివరణ : వాదనలలో ఓడిన వారు ఓటమి వల్ల మానసికంగా క్రుంగి పోతారే తప్పతమను జయించిన విద్యావంతులకు వినమ్రులై అణకువగా నుండలేరు. కాని సద్గురువు తమ మౌనంతో వాదించే వారిని జయించినపుడు, వారి హృదయంలో ప్రేమజ్ఞాన రూపంలో జయాన్ని స్థాపిస్తారు. అందువల్ల వారు ఆ క్షణం నుండి సద్గురువులపై ఎంతో భక్తి కలవారై శరణాందుతారు. ఈ జయమే శాశ్వతమైన జయము. మౌనంచేత జయించువారే ఉత్తమ సద్గురువులు.

281. అసత్యమైన ఈ దేహాది ప్రపంచాన్ని లేనట్లు చేసి, ఉన్నది ఆత్మయేయని గోచరింపచేసి, తమచూపులతో సద్గురువులు అహంకారాన్ని చంపకుండానే చంపుతారు.

వివరణ : సముద్రంలో కలిసిన నది తన ప్రవాహ రూపాన్ని పూర్తిగా కోల్పోయినా దాని నీరు మాత్రం నశించకుండా ఉన్నట్లు, చంపబడినది జీవుని ఉపాధి మాత్రమే తప్ప సత్ చిత్ కాదన్నదే భావం.

282. జ్ఞాన ఖడ్గంతో మనోరూప రాక్షసుని నరికి హతమార్చిన వీరుడే సద్గురువు. మన మనశ్చాంచల్యాలు ఆయన అనుగ్రహం చేత పోతేనే తప్ప, పరమాత్ముని అద్భుత జ్ఞాన తాండవాన్ని హృదయంలో దర్శించటం అరుదు.

వివరణ : సద్గురు కటాక్షంతో మనస్సు చేసే కోతి చేష్టలు నశిస్తేనే, నటరాజుని ఆత్మ తాండవం చూడగలమని సెలవిస్తున్నారు.

283. ఏనుగు స్వప్నంలో సింహాన్ని చూసిన వెంటనే నిద్ర నుండి మేల్కొంటుంది. అట్లాగే అవిద్య అనే నిద్రలో చూస్తున్న స్వప్నం వంటి జాగ్రత్తులో తన ముందు కనిపిస్తున్న సద్గురువు వల్ల సాధకుని ఆవరించిన అజ్ఞాన నిద్రపోయి జ్ఞానమనే మెలకువను పొందుతాడని తెలుసుకో.

284. సద్గురువుల అనుగ్రహ కటాక్ష వీక్షణాలకి పట్టుబడిన వారు, పులినోట బడ్డ లేడి తప్పించుకోలేనట్లు, అహంకారం నశించి కైవల్యస్థితిని పొందుతారు. వారు ఎప్పటికీ వదలిపేయబడరు. ఇది ముమ్మాటికీ నిజం.

285. సూర్యుని తేజస్సు వంటి జ్ఞాన ప్రభావంగల సద్గురువుని ఆశ్రయించి, వారి పాదాలనే జ్ఞాన జ్యోతిలో మునిగిన శిష్యుని మనస్సు మళ్లీ త్రిపుటీభేదాలలో పడి చిక్కుకొనదు.

వివరణ : భేద త్రయము : జాగ్రత్స్వప్నసుషుప్తులు అనుమూడవస్థలు. సత్వరజస్తమో గుణాలనే మూడు గుణాలు. ద్రష్ట దృశ్యం దృష్టి అనే మూడు మొదలైనవి.

ఒకసారి సూర్యరశ్మి సునిశితమైన ఫలకం పై (Sensitive Plate) పడితే ఆ ఫలకం ఇక మరెటువంటి రూపాన్ని గ్రహించే శక్తిని కోల్పోతుంది. అట్లాగే గుర్వనుగ్రహంచేత జ్ఞాన రశ్మి సోకితే శిష్యుని మనస్సు మళ్ళీ ఈ ప్రపంచ మోహంలో పడదు. శ్రీభగవాన్ అనుగ్రహించిన అరుణాచలాష్టకంలోని 5వ పద్యభావాన్ని ఇక్కడ గుర్తుంచుకోవాలి.

286. అన్నిటినీ 'నేతి' ద్వారా త్రోసిపుచ్చగా చివరికి మిగిలి గోచరమయ్యేది ఆత్మ. ఆత్మని దర్శింపచేసేటట్టు మౌనంగా ఉపదేశించు జ్ఞానగురువు, యోగ్యుడైన శిష్యుడు యిద్దరూ తమకళ్లతో నేత్ర దీక్షాపరులైతే చాలు. ఇక గురువాక్కు ద్వారా అనుగ్రహించవలసిన మహా వాక్యాది ఉపదేశాల ప్రయోజనం ఏమిటి? అనవసరం అని భావం.

వివరణ : స్పర్శదీక్ష కంటె చక్షుదీక్ష, చక్షుదీక్ష కంటె సంకల్పదీక్ష వరుసగా సూక్ష్మము, శక్తివంతము, శ్రేష్ఠమైనవని శాస్త్రముల మాట. పద్యభావంలో చెప్పినది నయన దీక్ష. అది మధ్యేమార్గమైన దీక్ష. ఈ మూడు విధాల దీక్షలలో ఫలితంలో మిన్నయైనది. శక్తివంతమైనది మౌన దీక్షయని శ్రీభగవాన్ తరచూ చెప్తూండేవారు. దానిని సూచించటానికే పై

వచనంలో దానిని మళ్లా చెప్పారు. 'రెండు నేత్రాలు కలిస్తే యిక మాటలు వృథా" అన్న తిరుక్కురళ్ ద్విపదభావాన్ని ఆత్మ జ్ఞాన ధర్మానికి తగినట్లు చక్కగా ప్రయోగించుటచేత, తమిళ గ్రంథమైన “తిరుక్కురళ్" కి ఒక ప్రత్యేక గౌరవాన్ని కలిగించారు శ్రీ మురుగనార్.

287. సద్గురువుల అనుగ్రహంతో తెలుసుకొనే వేదాంతసారం, నిర్మలమైన, విశుద్ధమైన, మౌనంలో గోచరించే బ్రహ్మజ్ఞాన సద్వస్తువు, తనంతటతానుగా హృదయంలో "నేను నేను” అనే స్ఫురణానుభవంగా ప్రకాశిస్తుందని జ్ఞానులు చెబుతారు.

## 54. దృఢ విశ్వాసం

288. వాక్కుకి అతీతమైనటువంటి సద్గురువుల వాక్కులను గ్రహించవలసిన రీతిలో గ్రహించి, మనముందు కన్పించే మాయా ప్రపంచ దృశ్యాలపై బుద్ధి చలించకుండా, ఊరక యుండటమే సుఖము.

వివరణ : "అనుగ్రహమంటే ఆత్మ. అది అందరి హృదయాల్లో “నేను నేను” అని గోచరించే స్వయం ప్రకాశ"మని శ్రీభగవాన్ తరచు చెప్పే మాట. ఆ మాటప్రకారం గుర్వనుగ్రహాన్ని చక్కగా గ్రహించటమంటే "నేను" అనే స్వయం స్ఫురణను విడవక పట్టుకొని యుండటమే. అదే ఊరక యుండటం. ఊరకయుండుట అంటే సోమరితనంగా ఉండటం కాదు. ఏదీ తెలియని స్థితిలో ఉండే కాష్ఠ లయ సమాధులూ కావు. నిరంతరం లో దృష్టిలోనుండటమే. అదే మన సహజ స్థితి అనే జ్ఞానం కలిగితే అప్పుడే సహజ సమాధియవుతుంది. ఇది అప్రయత్నంగా జరిగే గొప్ప ప్రయత్న స్థితి.

289 “నేనెవరు" అని తనను విచారణ చేయుట వలనగాని లేదా భగవంతుని పాదాలను వదలక భక్తి పారవశ్యంతో మనస్సు ద్రవించుటవలనగాని, దేహమే నేను అనెడి అహంకారాన్ని సమూలంగా నశింపజేయుటమే జ్ఞాన ప్రకాశ రూపమైన హృదయాన్ని చేరటం.

వివరణ : ఆత్మ విచారణ లేదా ఆత్మ సమర్పణ ద్వారానే అహంకారం నశిస్తుంది. తనకు ఏ మార్గ ముచితమని తోస్తుందో ఆ మార్గాన్ని అనుసరించి అహంకారాన్ని నాశనం చేయాలి. అహంకార నాశనమే ప్రధానమని భావం. అహంకారం లేని హృదయమే ఆత్మస్థితియని తెల్పారు.

290. సద్గురువుల అనుగ్రహం చేతనే మనశ్శాంతి పొందగలం. మరోవిధంగా అది ఎవరికీ, ఎక్కడా, ఏవిధంగాను లభించదు. అందువలన నిరంతరం తదేక నిష్ఠతో కూడిన హృదయంతో ఆ సద్గురువుల అనుగ్రహాన్ని కోరి పొందాలి.

291. తాము ముక్తి నొందాలని ఆశించే వారికి ఇది నిశ్చయమైన మాట. అయిదు అంగాలని లోపలికి ముడుచుకొనే తాబేలులాగ, పంచేంద్రియాలు వశమై అణగిన మనస్సు ఆత్మనిష్ఠలో నుండటమే సుఖం.

వివరణ : ఇప్పుడు ఎంతో దుఃఖంలో ఉన్నామే, విముక్తి ఎప్పుడు? ఎట్లాగ పొందగలము? అని పరితపించి అమరత్వం పొందాలనే జిజ్ఞాసువులకే ఈ మాటలు చెప్పారు. ఇతరులకి ఇవి చేదుగా ఉంటాయి, తప్పుడు ధ్యేయంగా తోచినా ఆశ్చర్యం లేదు. కనుక అటువంటి వారిని త్రోసిపుచ్చి, నిజమైన జిజ్ఞాసువులకే విశ్వాసాన్ని ఇచ్చే ఈ మాటలు చెప్పారు.

232. "నేను ఉన్నాను" అనే నిజమైన స్ఫురణ అందరికీ, ఎప్పుడూ ఉంటుంది. ఆ స్ఫురణే దైవమని హృదయంలో స్థిరపరచుకోవాలి. ఎటువంటి సందేహాలు లేక, పై మాటలపై విశ్వాసంతో నిజమైన ఆత్మస్ఫురణే దైవమని ఎంచి అనుభవిస్తే మహానందం వరదయైపొరుతుంది.

293. నామరూప మయంగా గోచరించే ఈ ప్రపంచమంతా కేవలం స్వప్నమని తృణీకరించి దానిని తిరిగి ఆశ్రయించకుండా ధైర్యంతో చిదానందమైన ఆత్మనే ఆశ్రయించు.

వివరణ : నామరూప ప్రపంచాన్ని చూడకుండా సచ్చిదానంద ప్రపంచాన్ని అంటే లోకంకాని లోకాన్ని- ఆత్మని దర్శించమని ఉపదేశం. సత్, చిత్, ఆనందం, నామం రూపమనే అయిదు అంశాలలో మొదటి మూడు బ్రహ్మం యొక్క

సత్యాంశాలు చివరి రెండూ మిథ్యాంశాలు. కనుక నామరూపాలని త్రోసిపుచ్చి చూస్తే లోకం సచ్చిదానంద బ్రహ్మమవుతుంది.

294 అజ్ఞాన భ్రాంతి వలన కనబడుతున్న దేహాన్ని "నేను" అని అభిమానించి భ్రమించే జీవులకు ఆత్మ స్వరూపాన్వేషణ ఒక్కటే, వారిని భవసాగరాన్ని దాటించి ముక్తి తీరాన్ని చేర్చేనావ అవుతుంది.

295. అనాది, అనన్యమైనటువంటి వస్తువు ఆత్మస్వరూపంగా తనలో ప్రకాశిస్తున్న శుద్ధసచ్చిత్ ఒక్కటే సద్వస్తువని గ్రహించకపోతే జీవులకు మోహభ్రాంతి నుండి విముక్తి లేదు.

296. లోక వ్యవహారాల్లో విసుగూ విరామం లేకుండా తిరుగాడుతున్న విక్షేపావరణ రూపమైన మానసిక దౌర్బల్యాన్ని (మోహాన్ని) విడనాడు. చంచలమైన అహంకారాన్ని నశింపజేయి. వాసనలను పూర్తిగా తొలగించు. శుద్ధజ్ఞాన ఈశ్వరమయముగా ప్రకాశించుము.

297. అనాత్మ విషయాలు, దహించే ఎడారి వంటివి. అటువంటి ఎడారి ఇసుకను తింటూ తిరిగి అలసి పోవద్దు. చల్లటి నీడ వ్యాపించిన శాంతి నిలయమే హృదయం. ఇక్కడకి వచ్చి ఆత్మభోగమైన విందునారగించు.

298. భక్తి పొంగగ, భగవంతుని పాదాలనే శరణొంది తపస్సు చేస్తున్న సాధకుడా! అణిమాది అష్ట సిద్ధులపై ఆశలు పెంచుకొన్నవానివలె మారకుండా, వాటిని పూర్తిగా పరిత్యజించు, సదాశివమైన ముక్తి పరమానందాన్నే పొంది అనుభవించు.

వివరణ : "అణ్ణామలై నా ఆత్మ" అని శ్రీ భగవాన్ చెప్పినట్లు, శివుడు, హర, సదాశివం, గురుపదం వంటి పదాలన్నీ ఆత్మనే సూచిస్తాయట.

299. మనస్సుని మఱపు, ఎఱుకలకు లోబడనీయకు. భగవదనుగ్రహాకర్షణకు వశమై, నిర్మల జ్ఞాన స్తంభమైన పరమ శివుని జ్యోతిర్మయ పాదాలయందు రమించియుండు.

300. మోహరూపమైన అహంకారమే మానవుడు. అతడు భగవంతుని అనుగ్రహాన్ని తోడుగానుంచుకొని లోదృష్టి అభ్యసిస్తేనే తప్ప భయంకరమైన జనన మరణ సుడిగుండాలనుండి తప్పించు కొనలేడు. పూర్వకర్మలచే ఏర్పడిన వాసనాబలాన్ని కేవలం మానవశక్తిచేత జయించలేడు.

## 55. ఉచ్ఛిష్టము

301. ఆత్మసిద్ధుడైన సద్గురువు, స్వానుభవంతో శిష్యునికి అనుగ్రహించు జ్ఞానోపదేశ వాక్కులే ఆయన భుక్తశేషమయిన ఉచ్ఛిష్టము. అది విని శిష్యుడు మౌనంగా, మనస్సు ఎగసి పడనీయక తన స్వరూపనిష్ఠలో నుండటమే ఆ ఉచ్ఛిష్టాన్ని ఆనందంగా ఆరగించుట.

302. మౌన గురువునకు తన దేహాభిమానాలను సమర్పించిన తర్వాత (ప్రసాదంగా) మిగిలినది ప్రకాశవంతమైన ఆత్మస్ఫురణ. దానిని హృదయంలో అనుభవించటమే గురుప్రసాదాన్ని శిష్యుడు భుజించుట.

303. ఆత్మస్థితులై జీవించే జ్ఞానులు ఈ భువిలో జీవించియుండటమే ఈలోకానికి లభించిన ఈశ్వర ప్రసాదమని పూర్వులు అనేవారు. జ్ఞానుల జీవితమే పాపాలన్నిటినీ పోగొట్టగల పరమపావనమైన ఉచ్ఛిష్టము.

వివరణ : జ్ఞానులు ఈ భూమిపై ఉంటే చాలు. పాపాలన్నీ పోతాయి. ఇక వారు మాట్లాడవలసినదిగాని, ఉపదేశించవలసినదిగాని ఏదీలేదు. వాటి అవసరమూ లేదు.

# 56. గురుపూజ

304 తనను అనుగ్రహించిన సద్గురువుకి దాసుడైన ఉత్తమ శిష్యుడు చేసే సేవలు భార్య భర్తకి చేసే సేవలవలె వుంటాయి.

(ఉన్నది నలుబది - అనుబంధంలోని 39వ శ్లోక భావం - గురువుల వద్ద అద్వైతం కూడదని ఉపదేశం)

305. సద్గురువులు నిర్మల జ్ఞాన జ్యోతి వంటివారు. ఆ గురుపాదాలే తనకి సకలమూ అని ఎవరు శరణువేడుతారో ఆ శిష్యులకి గుర్వనుగ్రహం వలన చిత్త శుద్ధి కలిగి జ్ఞాన సిద్ధి కలుగుతుంది.

306. సద్గురుపాదాలే తమకు గతియని జీవించే శిష్యులకు భక్తి పెంపొందుతూనే ఉంటుంది. అట్లాగ కల్గిన శివ (గురు) భక్తి శివ (ఆత్మ) జ్ఞానమై, ప్రపంచ భోగాలపై గల అన్ని వ్యామోహాలను దహించి వేస్తుంది.

307. కరుణాసముద్రుడైన శ్రీకృష్ణ భగవానుడు మనకీ ఆయనకీ మధ్య అర్జునునుంచుకొని అతనికి చెప్పే నెపంతో మనకిచ్చిన ఉపదేశమిదే. "నీవు నన్ను పొందినట్లయితే, పాపపుణ్యాలనే కర్మబంధాలనుండి నిన్ను విముక్తుని చేస్తాను. తెలుసుకో" అని అభయమిచ్చి తననే (ఆత్మనే) ఆశ్రయించమని బోధించారు.

308. సద్గురు చరణాలను పూజించే భక్తి నిజమైన మంత్రం. అది తలెత్తే వాసనలని నాశనంచేసి బ్రహ్మజ్ఞానాన్ని కలగజేస్తుంది. కనుక గురుభక్తియే శ్రేష్ఠమైన మంత్రము.

309. జ్ఞాన గురువుగా మానవ రూపం ధరించి మనలను అనుగ్రహించిన పరమేశ్వరునికి పూజాది సేవలు చేసినా కూడా, ఆ పరమాత్మునితో జీవ బ్రహ్మైక్యమే చేయతగ్గ శ్రేష్ఠమైన పూజ.

వివరణ : ఈ దేహంతో చేస్తున్న పూజలన్ని జీవబ్రహ్మైక్యక్రియలవలె నిరంతరం చేయటం కష్టం. అందువల్ల ఐక్యమే అన్నిటికన్న శ్రేష్ఠమైన పూజ, ఉపదేశసారం 30వ పద్యభావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

310. శిష్యుడనీ గురువనీ, జీవుడనీ శివుడనీ ద్వైతబుద్ధిని అహంకారం, కలుగజేస్తుంది. అటువంటి ద్వైతబుద్ధి లేశమైన తలెత్తని మౌనస్థితియే శిష్యుడు గురువునకు చేసే నమస్కారానికి అర్థం.

311. భగవంతుడే జ్ఞాన గురువు. ఆయన దివ్య బోధలనెడి జ్ఞానాగ్నితో "నేను శిష్య" డను (వారు గురువులు) అనే ద్వంద్వ భావం నశిస్తుంది. దాని ఫలితంగా వాసనారహిత మౌన నిష్ఠయే వారికి చేసే ఉత్తమ పూజ.

312. "నేనెవరు?" అని అంతర్ముఖంగా ఆత్మ విచారణ చేసి ఫలితంగా ఆత్మరూపుడైన గురువుతో సారూప్య స్థితిని పొంది, అదే నిష్ఠలో ఉంటూ తాను శిష్యుడు అన్న భేద భావాన్ని నశింపజేసుకోవటమే ఉత్తమ శిష్యుడు గురువుకు చేసే పూజ.

వివరణ : ఉపదేశసారంలోని 29వ పద్యభావాన్ని ఇక్కడ గుర్తుచేసుకోవాలి.

313. చిదాకాశమే గురురూపంలో అవతరించింది కాబట్టి, ఆ చిదాకాశంలో తనకొక జీవరూపం లేకుండా, ఉత్తమమైన సహజ స్థితిలో ఉండే నిష్ఠయే ఆ గురువునకు చేసే గురుపూజయని గ్రహించు.

314. అహం, ఇదం అనేవి ఒకదానితో నొకటి బద్ధమై కనిపించే ఈ జగత్తంతో తన గురుస్వరూపమే అనే శిష్టాచార దృష్టే ఉత్తమ శిష్యుడు తన సద్గురువుకు చేయతగ్గ గురుపూజ.

315. "దేహమే నేను" అనే అహంభావమను మంచు గడ్డ ఆత్మరూపమైన గురురూప సాగరంలో కరిగి ఏకమైపోవటమే ఉత్తమమైన గురుపూజ.

316. గురువుల అఖండాకార స్థితిని పరిచ్ఛిన్నం చేసే (అనేక జీవరాసులుగా చూడబడే) అహంకార దోష దృష్టి కలగకుండా ఉండటమే సమతల భూమిపై కొండ వంటి గురువునకు చేసే శ్రేష్ఠమైన పూజ.

317. తనువును ధనమును ప్రాణాన్ని సద్గురువుకు సమర్పించిన తర్వాత వాటిని మళ్లీ నేను, నాది అని అభిమానిస్తే అది దత్తాపహారం (ఇచ్చిన దానిని తిరిగి అవహరించటం). అది నింద్యము. ఆ నింద నుండి తప్పించుకొనటమే గురుపూజ.

వివరణ : అహంకార నాశమే సంపూర్ణ సమర్పణా సిద్ధి అని భావం.

318. రగులుతున్న తాపత్రయాన్ని చల్లార్చిన సద్గురువుల పాదచ్ఛాయను (ఆత్మను) వీడి, భోగాలనబడే మండుటెడారిలో తిరిగి అల్లాడే మన శ్చేష్టలుపోయి ఆత్మ నిష్ఠలో నుండటమే గురుపాద పద్మాలకుచేసే ఉత్తమ పూజ.

319. మనో రూపంలో పరుగెడుతున్న అహంభావాన్ని "నేనెవరు?" అని వెదకి హృదయంలో మునిగి ఉండటమొక్కటే, మనోతీతమైన సద్గురు పాదాలను అర్చించటం.

320. జడమైన శరీరంతో ముడిపడి ఉన్న అహంభావం చైతన్యం వలె నటిస్తూ వంచిస్తుంది. అటువంటి అంధకారం మనలో వ్యాపించకుండా మెలకువతో నుండటమే సద్గురువుల పాదకమలాలకు చేయతగిన పూజ.

## 57. గురు మహాత్మ్యము

321. దుర్గుణాలు పోయి సద్గుణాలు కలిగినా, బంధువులను, సుఖాలను త్యజించినా, శ్రుతులు చెప్పిన నియమాలు పాటించినా కూడా, జ్ఞాన గురువును పొందే వరకు ఎంతటి విద్యావంతుడై ఎదిగినా కైవల్య స్థితిని పొందడు.

322. త్రిపుటీ భేదరహితమై, ఏకాత్మ స్వరూపంగా గోచరించు సద్గురు పాదాలను చేరితేనే తప్ప పరమ పురుషార్థమైన చిదానంద మయ జీవితాన్ని పొందడానికి ఎవరికీ వీలుకాదు.

323. లోపల "నేను"గా బయట కనిపించే ప్రతి ఒక వస్తువుగా, ఇహంలో పరంలో అన్ని కాలాలో అన్ని దేశాలలో సర్వత్ర వ్యాపించియున్న సద్గురువు తన భక్తుల హృదయాలలో జ్ఞానదీపంగా సదా వెలుగుతున్న జ్యోతి స్తంభమవుతున్నారు.

324. సద్గురువును అత్యంత భక్తితో కొలుచుట వలన ఆయన వర్షిస్తున్న అనుగ్రహ వీక్షణమే గతియని నమ్మే భక్తులు ఈలోకంలో ఎటువంటి బాధలు లేక ఇంద్రునివలె జీవిస్తారు.

325. పాపములన్నిటినీ నాశనము చేసిన సద్గురువు తమ భక్తుల హృదయాలలో పర్వతం లాగ గంభీరంగా కొలువుంటారు. ఆ ఆనందాన్ని అనుభవించిన వారు వివరించలేరు. దానిని వ్యాఖ్యానించే పండితులు ఆ నిజస్థితిని అనుభవించిన వారు కారు. ఇది భక్తులందరు అనుభవంతో చెప్పిన మాట.

326. నిరహంకారయుతమై నిర్మోహమైన సద్గురువుల ఆత్మనిష్ఠ పదునైన కత్తివంటిది. అది, తనని ప్రేమతో దరిచేరు భక్తుల హృదయ గ్రంథులను వేళ్లతో సహా ఛేదించగలదు.

327. సద్విద్యఫలితంగా జ్ఞాన విచారణను అనుసరించి, మనస్సును అంతర్ముఖ మొనర్చి దృఢ విశ్వాసంతో హృదయంలో నెలకొని స్వస్థితి నొందుటయే నిజమైన ఉపదేశమని గ్రహించు.

## 58. సజ్జన సాంగత్యము

328. ధర్మమార్గమిదని తెలిసి స్వస్థితిలోనుండక, ఆత్మజ్ఞానానికై విధించిన సాధనలను ఆచరించక, లోక వ్యవహారాలను గురించి మాట్లాడే వితండ వాదులైన అల్పుల దగ్గరకి బుద్ధిమంతులెవ్వరూ చేరరు.

329. విసుగు విరామం లేకుండా మాట్లాడే పిచ్చివారితో (అంటే జ్ఞానానుభవం లేని వారితో) స్నేహం అనేక కీడులను కలిగిస్తుంది. మనస్సు నశించి శుద్ధ మౌనస్థితిలో నుండే జ్ఞానుల సాంగత్యమే ఉత్తమ స్నేహ మగును (సత్సంగం).

330. మనసా! కాని పనులను న్యాయమేనని వాదించి, కూడని చెడుమార్గాలలో వెళ్లే నీచులతో దురదృష్టవశాత్తు ఇంతకాలం సాంగత్యం చేసావు. ఇక వెంటనే వారిని వదలి, నీవు జ్ఞాన స్థితిలో నుండే సజ్జనులతో కూడి జీవించు.

331. స్వరూప నిష్ఠనుండి జారిన ప్రమాదంచేత సకల దుర్గుణాలు కలుగుతాయి. అందువలన అహంకార రహితమైన శాంతమే అన్ని సద్గుణాలు కలిగిన స్థితి.

332. నిర్మలాత్మజ్ఞానులే సద్గుణసంపన్నులు. అజ్ఞానులు దుర్గుణవంతులు. అందువలన, ప్రపంచ భ్రాంతి తొలగి ఆత్మ స్థితిలోనుండు జ్ఞానులను చేరి ముక్తి నొందాలని గ్రహించు.

## 59. భక్తుల గొప్పతనం

333. పరిపూర్ణ స్థితిలో నుండే సద్గురువుల కరుణాకటాక్షాలకు గురి అయ్యే గురు భక్తి గలవారి గొప్పతనం మాటల కతీతమైనది.

334. పరమేశ్వరుడు తన భక్తులను సంతృప్తి పరచడానికి సద్గురు దేహాన్ని ధరించి, భక్తులతో కూడి ఆనందిస్తాడు.

వివరణ : సద్గురువు సాక్షాత్తు పరమేశ్వరుడే యని భావం.

335 భక్తుల గొప్పతనాన్ని ఇంతని చెప్పలేము. వారు శివ విష్ణువులకంటే గొప్పవారు. శివ, విష్ణువులు అనేక సందర్భాలలో భక్తులకు లోబడి సేవలు కూడా చేసినట్టివారు. ఇటువంటి భక్తుల గొప్పతనాన్నే వేదాలు కూడా కొనియాడుతున్నాయి.

## 60. బ్రహ్మవిద్య

336. కనిపించే ఈ జగత్తును చూడకుండా, దానిని చూచే తానెవరని ప్రయత్నించి విచారణ చేయటమే సాధకులు నేర్చుకోవలసిన బ్రహ్మవిద్యయని ఆత్మ దర్శనం పొందిన పెద్దలంటారు.

337. ఎండమావివలె గోచరించే ఈ మిథ్యాజగత్తు, ఈ జగత్తును చూసేవాడైన మనస్సు, నేత్రాల ద్వారా ప్రకాశంగా కన్పించు ఈ దృశ్యంగా (ద్రష్ట. దృశ్యము, దృష్టి అనే త్రిపుటీగా), పరిణమించు దేహాత్మబుద్ధి రూపుడైన జీవుని ఆత్మవిచారణ చేత దహించివేయగా మిగిలిన ఆత్మని దర్శించడమే విద్యలలో కెల్ల శ్రేష్ఠమైన బ్రహ్మవిద్య. ఇతరము లేవీ విద్యలు కావు.

## 61. మతాలలోని సత్యం

338. చూచే తాను లేక ఏ వస్తువుకి ఉనికి లేదు. అటువంటి ఉనికి యొక్క నిజ స్వభావాన్ని "ఉన్నటువంటి నేను ఎవరు?" అని తనలో పరిశీలించే లోదృష్టి ఒకటే జీవులకి మోక్షాన్నిస్తుంది. ఇదే అనేక మతాల బోధనలలోని ప్రధానమైన సత్యమని గ్రహించు.

339. మణులమాలలోని సూత్రమువలె, ప్రాణులన్నిటి యందు స్వయంగా "నేను" అని ప్రకాశించే జ్ఞాన దీపమే ఈశ్వరుడు. అట్లాగే అన్ని మతాల్లో అభేదమైనటువంటి ఆత్మ స్వరూపం ఆ ఈశ్వరుడే.

వివరణ : అరుణాచలాష్టకంలోని 5వ పద్యభావాన్ని యిక్కడ గ్రహించాలి.

340. వెలిగించిన జ్వాల ఒక్కటే అనేక ప్రమిదలలో అనేక దీపాలుగా గోచరిస్తున్నట్లు, అనేక స్థితులలోగల ఉపాధులలో తానైన ఆత్మ ఒక్కటే వివిధ ప్రాణులవలె కనబడుతోంది.

341. ఆత్మ స్వరూపాన్ని స్పష్టంగా గోచరింప చేసే ఒక మహావాక్యం మతాలలో లేనట్లయితే, ఆ మతాలు ఘోషించు తత్త్వ తర్క వాదాలన్ని నిరుపయోగా లైన బజారు కేకలకి సమానము.

వివరణ : పర్వతం ఎటువంటి అడ్డంకులు లేకపోతే చక్కగా కనబడుతుంది. అటువంటిదే మహావాక్యం కూడా. మతాలన్నిటిలో పరమాత్ముని అతి సులభంగా ఎఱుక పరచే సాటిలేని మహావాక్యం ఒకటైనా ఉండి తీరాలని చెప్పారు. వాటికి ఉదాహరణంగా శ్రీభగవాన్ చెప్పినది.

1. హిందు మతంలో- తత్వమసి, అహం బ్రహ్మాస్మి

2. ఇస్లామ్ మతంలో - అన అల్ హక్ అనే వాక్యం

3. క్రైస్తవ మతంలో - "నేను నేనే" I AM THAT I AM ఈ వాక్యాల తత్త్వమే భగవంతుడని తెల్పుతూ పర్వత శిఖరాన్ని ఉదాహరణంగా తెల్పినారు.

342. జనుల మానసిక పరిపక్వతను బట్టి సిద్ధాంతాలని బోధించే విధంగా వివిధ మతాలేర్పడ్డాయి. అందుచేత జనులు అనుష్టించే మతాలలో దేనినీ ద్వేషించకుండా సమబుద్ధి కలిగి యుండటమే వివేకం,

## 62. అనంత దృష్టి

343.జ్ఞానుల దృష్టిలో, వారు తెలుసుకోటానికి వారికి అన్యంగా ఏ వస్తువు లేదు. ఎందువలనంటె, దేహమే 'నేను' అని భావించే అజ్ఞానం పూర్తిగా నశించి, వారు కేవలం జ్ఞాన రూపమయంగా అరూపమై భాసించుటచేతనేయని గ్రహించు.

344.ఈ శరీరం సంచరించే దేవాలయం. అందుండే దేవుని విచారించి తెలుసుకొన్న జ్ఞానులు, ప్రపంచమనే దేవాలయంలో కూడా ఆ భగవంతుణ్ణి చూస్తారు.

345. ప్రాణులకే ప్రాణమైన ఈశ్వరుడే సత్యమని బాగా తెలుసుకొన్న జ్ఞానులకు, ఇతరులు ఏవగించుకొనే చిన్న పురుగు కూడా భగవంతుని సన్నిధిగానే తోస్తుంది.

346. ఆత్మ స్వరూపమే తామైనటువంటి జ్ఞానులకు అజ్ఞాన రూపమైన మనస్సు నశిస్తుంది. అటుపై వారి దృష్టిలో అన్ని పదార్థములు, అన్నిచోట్లు సచ్చిదానంద రూపాలుగానే గోచరిస్తాయి.

347. ఈశ్వరుణ్ణి, చర్మచక్షువులతో చూచేవారు చక్కటి అందమైన వస్తువులలోనూ, శ్రేష్ఠులైన యోగులు వారి హృదయ కమలములలో ఆసీనుడైన వానిగనూ, యజ్ఞయాగాదులు చేసే బ్రాహ్మణులు అగ్నిహోత్రంలోనూ చూస్తున్నారు. కాని అనంత దృష్టి గలవారైన జ్ఞానులు మాత్రం భగవంతుని అంతటా చూస్తారు.

348. తాను శరీరం అనే భావం పూర్తిగ నశించి, మనస్సు దుఃఖస్వరూపమనే భావం తొలగి, జ్ఞాన మాత్రంగా నిలచి యుండు స్థితే, ఈశ్వరుని నిజంగా, పూర్ణంగా చూడటమవుతుంది.

349 వంచించే పంచేంద్రియాలని నియంత్రించి వశపరచుకొని, చంచలమైన మనస్సును అచలంచేసి, తన సహజ స్థితిలో తటస్థంగా నుండే శక్తిని పొందితే అదే శివస్థితియవుతుంది.

350. సత్యాత్మదర్శనమే పొంగిపొరలే మహానందసాగరమనే ఉత్తమ స్థితి. మనస్సు యొక్క వూహాలకు అందనిది, తన్మయంగా అనుభవమయ్యే మౌనస్థితే ప్రాణులకు నిష్కళంకమైన మహనీయ స్థితి.

## 63. అహంకార నాశం

351. దుఃఖరూపమై విజృంభించే ఈ అహంకారాన్ని 'నేను' అని అంటున్నామే తప్ప, ఈ మాటకి ఏదైనా పదార్థం నిజంగా ఉందా? లేదే! ఒకవేళ ఒక పదార్థముండాలంటే కల్పితమైన సర్పానికి రజ్జువైనట్లు, 'నేను' అనే పదానికి ఆత్మయే వస్తువు.

వివరణ : అహంకారానికి నిజంగా ఉనికి లేదని, అది ఆత్మయొక్క భ్రాంతి రూపమని భావం. ఉపదేశసారంలోని 19, 20, 21 పద్యాలలోని ఉపదేశాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి.

352. అహంకారం నశిస్తే దాని అధిష్టానమైన ఆత్మస్థితి పూర్ణంగా గోచరిస్తుంది. అహంకారం నశిస్తే నీ నిజస్థితియైన ఆత్మ స్వరూపానికి ఎటువంటి నష్టం కలగదు. కనుక ఈ నాశనానికి ఏమాత్రం దుఃఖించవద్దు.

353. జ్వలించి ప్రకాశిస్తున్న జ్ఞాన తపస్సనే విచారణాగ్నిలో తమ మనస్సుని ఆత్మయైన ఈశ్వరునికి ఆహుతి చేసే వారు శివస్వరూపమే అవుతారు.

అ) అటువంటి జ్ఞానులను శివ స్వరూపంగా సేవించి మనమూ అపురూపమైన శివ స్థితిని పొందాలి.

ఆ) అటువంటి జ్ఞానులు శివస్వరూపులే కాబట్టి మనమూ ఆ విధంగానే అహంకారాన్ని విచారణాగ్నిలో ఆత్మకి ఆహుతి చేసి శివస్థితిని పొందటమే ఉత్తమమైన పురుషార్థం.

354. ఈ అహంకారాన్ని పూర్తిగా వదిలేస్తే ఏం జరుగుతుందో అనే సందేహం. గాని భయంగాని చెందవద్దు. చెట్టు కొమ్మని వదలేస్తే నేల మీదపడి ఇక ఎప్పుడూ జారి పడని స్థిరమైన స్థితిని పొందేటట్లు, మన నిజ స్థితియైనటువంటి ఆత్మనే పొందుతాము.

355. నిద్రలో "నేను ఈ దేహము" అనే అహంకారం నాశమైనా, అప్పుడు కూడా "నేను ఉన్నాను" అనే ఆత్మ జ్ఞానము నిజంగా ప్రకటితమవటం చేత “నేను” అనే పదానికి నిజమైన అర్థం అవినాశియైన ఆత్మేనని వొప్పుకోవటం న్యాయం.

356. నేను అనే తలపు కించిత్తైనా లేవని మన సహజ స్థితే "తాను” అనే ఆత్మ స్వరూప స్థితి. నిద్రలో “నేను” అనే ఈ అహం లేవక ఉండినప్పుడు మనం ఎవరైనా లేకుండా నశించామా?

357. అహంకార రహిత స్థితే మన నిజమైన జ్ఞాన స్వరూపం. అటువంటి పరిశుద్ధమైన ఆత్మ స్థితిలో మనం ఎటువంటి బాధలకు లోనవుట లేదు కదా! ఈ సత్యాన్ని జాగృత్ సుషుప్తియైన సమాధిలో అనుభవించితెలుసుకో!

358. అహంకార రహితమైయుండే స్థితే మన జ్ఞాన స్వరూప స్థితి. ఇదే సుఖశాంతిమయమైన శివునిగా మనం వెలుగొందే స్థితి. జనన మరణాలకతీతంగా బ్రహ్మనిర్వాణమనే కైవల్యం కూడా అదే.

వివరణ : ఉన్నది నలుబది - అనుబంధంలోని 13వ పద్యభావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

## 64. శుద్ధ సత్యం (నిజమైన నేను)

359. "నేను" అనే అహంకారం పూర్తిగా నశిస్తే, అఖండమైన 'ఆత్మయేనేను' అనే శుద్ధ సహజ స్వభావం ప్రకాశిస్తుంది. ఇది శరీర రూపం దాల్చి సంసార చక్రంలో పడి భ్రమించే అహంకారంలా కృత్రిమమైంది కాదు.

360. సహజము, నిరాటంకము, అఖండము, నిర్వికారము, మహిమాన్వితమునైన హృదయం అనే ఈ "నేను"ను జీవన్ముక్తుల వ్యవహారాలలో ఎటువంటి కర్తృత్వం లేని 'శుద్ధ అహంకార' మని అంటారు.

361. ఈ “శరీరమే నేను” అనే లోప భూయిష్టమైన అహంకారం నశించి పరిపూర్ణ జీవితాన్ని గడిపేవారు ఎటువంటి దుఃఖాలు, మనశ్చాంచల్యాలు లేక, శాంతి మయమైన తమ సహజ స్థితిలో రమిస్తూ ఉంటారు.

## 65. ఆత్మ జ్ఞానోదయం

362. తనకు మూలమైన హృదయాన్ని విచారణ చేసి తెలుసుకొంటే, తానే మూలవస్తువని ఇన్నాళ్లు మిథ్యగా వ్యవహరించిన “నేను” అనే అహంకారం నశిస్తుంది. ఆ మిథ్యాతత్త్వమైన “నేను” దాని ఉత్పత్తి స్థానంలో అణగగా అ సద్వస్తువైన ఆత్మ అపరోక్షంగా ప్రకాశిస్తుంది.

363. అజ్ఞానాంధకారంలో పుట్టి, ప్రపంచమంతా తానేయని జడలు విరబోసికొని గంతులేస్తున్న అహంకార రాక్షసుని "ఈనేను ఏవరు?" అని విచారణ చేస్తే (పెళ్లిలో ఎవరూ అడగనంత వరకు ఇరువైపుల ఒక బంధువులా నటించి, ఆరాతీయగానే గుట్టుచప్పుడు కాకుండా పారిపోయే పరాయి వ్యక్తివలె) అది ఎక్కడుందో తెలియకుండా మాయమైపోతుంది. అప్పుడు స్వద్వస్తువైన ఆత్మరవి చక్కగా ప్రకాశిస్తాడు.

364. అహంకారం మౌనస్థితిలో మునిగి నశించటమే జ్ఞానమయ జీవితం. కల నిజముకానట్లు, ఈ అసత్య అహంకారం మౌనసాగరంలో మునిగి నశించినపుడు యదార్థమైన 'నేను' తానై ఆత్మగా ప్రకాశిస్తుంది.

365. ఈ దేహమే శిలువ. 'దేహమే నేను' అనే అహంకారమే ఏసు. విచారణ చేత అహంకారాన్ని శిలువ వేస్తే (అహంనాశనమైతే) ఇక ఎటువంటి దుఃఖాలు లేని సత్యాత్మ గోచరిస్తుంది. అదే ఏసు పునరుజ్జీవన తత్త్వం.

366. అద్వితీయమైన సద్వస్తువు అప్రమేయమైన పరమ మౌన స్థితిలో అహంకారం నశించి ఆత్మగా ప్రకాశించడమే కైవల్య సిద్ధి అంటారు. ఆ జ్ఞాన స్థితిలో బ్రహ్మానందం తన సహజ స్వభావంగా ప్రతిష్ఠితమవుతుంది.

## 66. దుఃఖనివృత్తి

367. ఎన్నో మనో వికారాలతో దుఃఖించు జీవుడు, ఆ మనోవ్యాకులతలు పోయి శాంతిని పొందాలంటే, తనకు మూలమైన ఆ పరమాత్మే తన నిజ స్వరూపమని తెలుసుకోవాలి. ఏకైక మార్గం అదే.

368. దేనిని విస్మరిస్తే ఈ విశ్వమాయ మహాశక్తిమంతమై మోహంలో పడేస్తోందో దానిని (ఆత్మని) తెలుసుకొంటేనే తప్ప దుఃఖరాహిత్యం కలుగదు.

369. తన దారాపుత్రాదుల మరణంతో విలపించి మానవుడు తన నిజస్థితి ఏదని మొదటి తనను తాను పరిశీలించుకొని, అహంకార నాశమునకై మొరపెట్టుకొని ప్రయత్నిస్తేనే దుఃఖం పూర్తిగా నశిస్తుంది.

370. "ఆ శరీరమే అతడు" అని ఒకరిపై నీవు ప్రేమాభిమానాలు చూపిస్తే, తదనంతరం ఆ శరీరం మరణిస్తున్నప్పుడు నీకు చాలా దుఃఖం కలుగుతుంది. దుఃఖం కలగకుండా ఉండాలంటే ఆ మిథ్యా ప్రాణం యొక్క నిజస్వరూపం ఆత్మ కాబట్టి, దాని మీద నీ నిజమైన ప్రేమను చూపించు. అప్పుడు ఆ వియోగం నిన్ను బాధించదు.

వివరణ : ఆత్మ జనన మరణాలు లేనిది. కాబట్టి ఆత్మప్రేమలో వియోగ దుఃఖం లేదని భావం.

## 67. నిత్యతృప్తుడు / కామనారహితుడు

371. కోర్కె చిన్నదైనా తీరాలనుకొనేముందు, ఒక వస్తువును కొండంత దానినిగా చేస్తుంది. తీరా తీరిన తర్వాత దానిని మహా అల్పమైన దానినిగా చూపిస్తుంది. మనిషిని అసంతృప్తికి గురి చేస్తుంది. కనుక తృప్తి కలిగించలేని ఈ ఆశ పూడ్చలేని ఒక లోతైన గొయ్యి. ఇటువంటి గోతిని ఎక్కడా చూడలేదు.

372. తృప్తిని కాంక్షించే సత్త్వగుణ సంపన్నులారా! జీవితంలో వచ్చే అసంతృప్తి అనే లేమిని, వస్తుజాలసంపాదనతో తీర్చే ప్రయత్నం చేయకుండా చిత్తశాంతి రూపమయిన మనో నాశాన్ని పొందటమే ఉత్తమం.

373. భక్తి ప్రపత్తులతో భగవత్పాదాలను ఆశ్రయించిన మనస్సు, దాంపత్య జీవన మోహపూరితములైన పాతరోజుల పిచ్చి ఆటలు ఆడటానికి ఇష్టపడుతుందా? (ఇష్టపడదని తెలుసుకో!)

374.చిత్త వృత్తులు పూర్తిగా నాశమైన స్థితి అతి శ్రేష్ఠమైన మహానందమని జ్ఞానులంటారు. మనస్సులో యిష్టానిష్టాలు రెండూ నశించిన కామనారహిత స్థితే, అంటే, ఉదాసీనభావమే అవలంబించదగిన ధర్మమార్గం.

375.ఆశలు తీరాలనే వారికి మాత్రమే, అవరోధాలు కలిగినపుడు ఆగ్రహం కలుగుతుంది. ఈ పరిస్థితుల్లో ఆ కోపానికి కారణమైన ఆశలు కూడా దాంట్లో ఇమిడి ఉంటాయి కదా! అట్లాగే ఆ కోర్కెల్లోంచి పుట్టే క్రోధం మొదలైన ఆరు దుర్గుణాలు దగ్ధమయ్యే క్రమంలో చివరిగా నశించేది కామమేయని తెలుసుకో!

376. వాక్కుకి అతీతమైన మౌనమే బ్రహ్మీస్థితి. దానిని పొందాలనే కోర్కె కూడా సదాచార మార్గంలో (జ్ఞానాచార మార్గానికి) మినహాయింపు లేదని జ్ఞానులంటారు. అట్లాంటప్పుడు, అపవిత్రమైన ఈ శరీరం మీద, దానికి సంబంధించిన ఇతర వస్తువుల మీద ఆశలున్న వారిని ఎలాగ ఆచారవంతులని చెప్పగలం? (చెప్పలేమని భావం).

వివరణ : సత్ లో సంస్థితమై ఉండటమే సదాచారం. ఏకమైన ఆత్మస్థితి తొంది పొందబడే స్థితియని భావించరాదు. ఆ స్థితిలో ఇష్టానిష్టాలనే వృత్తి వ్యాపారాలే లేవు. అందువల్ల కోర్కెలక్ష్యం మహిమాన్వితమైన సదాచార సాధ్యమయిన బ్రహ్మీస్థితియని చెప్పడం తప్పు అని శ్రీభగవాన్ బోధిస్తున్నారు. దైహిక బహిశ విషయాలపై మోజున్నంత వరకు ఎవరూ ఆచార శీలురుకాలేరు. నిరపేక్షయే గొప్ప ఆచారమని భావం.

377. "ఈ వస్తువు నాకు కావాలి. ఇలాంటి వస్తువు నాదగ్గర లేదు" అనే ఆలోచనలు జ్ఞానికుండవు. అటువంటి చింతలే లేని జ్ఞాని తన ప్రారబ్ధవశాత్తు లభించే భోగాలను అనుభవిస్తాడే తప్ప, తనజ్ఞాన స్థితి నుండి జారి ఇష్టానిష్టాలనే అవిద్యకిలోబడి దుఃఖపడతాడా? (దుఃఖపడడని గ్రహించు)

378. కోర్కెల బంధాన్ని పూర్తిగా ఖండించిన వారికి తప్ప ఇతరులకు అజ్ఞాన దృష్టిపోదు. శ్రేష్ఠమైన పరమానందంపై గల కోర్కెను కూడా వెనకాడకుండా ఖండించడమే మన ధ్యేయమవ్వాలి.

వివరణ : 376 వ వచన భావాన్ని ఇక్కడ మరోసారి చెప్పడాన్ని గుర్తించాలి.

379. ఇహ పరాల్లో పొందే అల్పసుఖానుభవాలపై ఆశలు పెంచుకొని దుఃఖిస్తున్న ఓ మనసా! నీవు ఎటువంటి తలపులు లేకుండా నీ సహజ స్థితిలో ఉంటే ఇహపరాలని దాటిన బ్రహ్మానంద ముక్తిని నిశ్చయంగా పొందుతావు.

## 68. బంధవిముక్తి

380. దేహమే నేను అనే పృథక్త్వం నశించడమే నిజమైన శోకరహితమైన ఆత్మ స్వాతంత్ర్యం. అనేక శాఖలుగా విడిపోయిన మతాలన్నిటిలో సమరసంగా ఇమిడిన జ్ఞానం కూడా యిదే.

381. ఆత్మని తెలుసుకొనని దోషం వల్ల కలిగిన జనన మరణాలు వేరే విధంగానూ పోవు. “ఈ పంచకోశాలదేహమే నేను" అని ఎంచిన అహంకారాన్ని నాశం చేయగా కలిగిన జ్ఞానం ఒక్కటే జనన మరణ బంధం నుండి విముక్తి కలిగిస్తుంది.

వివరణ : శాస్త్రాలెన్ని చదివినా, పూజలెన్ని చేసినా, కర్మలు ఎన్ని అనుష్ఠించినా, ఎందరు దేవతలనుపాసించినా, ఇంకా ఎన్నెన్ని చేసినా జ్ఞానంతో తప్ప మరోవిధంగా ఎన్నికోట్ల కల్పాలకైనా ముక్తి సిద్ధించదని శ్రీ ఆదిశంకరులు పైన తెల్పిన ఉపదేశాన్నే వివేక చూడామణిలో రూఢిపరచారు.

382. నిత్యం విజృంభిస్తున్న చిత్తవృత్తులే "బంధం" అని జ్ఞానులకు తెలుసు. సకల వృతులూ నిశ్శేషంగా దగ్ధమైన చిత్తమునే ముక్తి అంటారు వారు. అంతే తప్ప, ముక్తి అని వేరొకటి లేదంటారు. ఇదే వారి నిశ్చయమైన అభిప్రాయం.

వివరణ : చిత్తం నుండే సకల వృత్తులు కలుగుతాయి. కనుక వృత్తులన్నీ నాశమైన స్థితే చిత్తం నశించిన స్థితి. చిత్తం నశించిన స్థితి చిత్ స్వరూపమే కాబట్టి అది చిన్మాత్ర ఆత్మస్థితి.

383. మధువుగ్రోలి మత్తెక్కినట్లు, బుద్ధిచెడి వూగిసలాడుతున్న ఈ కళంకిత మనస్సే, కర్మలచేత బంధింపబడినదని భావిస్తున్న జీవాత్మ. విషయాసక్తిని మాని తన నిజస్థితిలో నెలకొనియుండే ఆ విశుద్ధ మనస్సే పరమాత్మ.

వివరణ : పడిలేస్తే అది అల శాంతంగా ఉంటే అది సాగరం. అట్లాగే తలపులై తిరుగుతూంటే అది మనస్సు. శాంతంగా ఉంటే దానిని ఆత్మ అంటారు.

## 69. ఆత్మ విచారణ

384.“నీవెవరు? అతనెవరు?" అని బయట విషయాలను విచారిస్తున్న అలవాటు మారి, నిరంతరం ఆసక్తితో తన్ను గూర్చి “నెనెవరు?” అని విచారణ చేయటమే మనిషికి దృఢసంకల్పాన్నిస్తుంది.

385. లో దృష్టితో దేహాత్మ బుద్ధిపూర్తిగా నశించగా సద్వస్తువైన ఆత్మజ్ఞానం "నేను నేనే" అని గోచరిస్తుంది. అప్పుడు మిథ్యామాత్రమైన ఆకాశపు నీలి రంగువలె ఇంత వరకు జగత్తులో కన్పించే నానావస్తు జాలమంతా అంటే నిర్వికల్పకైవల్యమే అనుభవమవుతుంది. లేకుండాపోతుంది.

386. (సందేహాలను) ప్రశ్నించే తాను “ఎవరు?” అని తననే ప్రశ్నిస్తే, అడుగుతున్న ప్రశ్నలూ, సందేహాలూ అన్నీ పుట్టకుండా నశిస్తాయి. తనను "ఈ సందేహియైన నేను ఎవరు?" అనే ఈ ఆత్మవిచార ప్రశ్నే బ్రహ్మాస్త్రంగా దూసుకొని వెళ్లి అజ్ఞానాంధకారంలో తనకు అన్యంగా తోచే నానాత్వాన్ని పూర్తిగా దహించేస్తుంది.

387. వంచించే పంచేంద్రియాల ద్వారా బాహ్య ప్రపంచం ఉందనుకొంటున్న జీవుడైన “నేనెవరు?” అని విచారిస్తే, ఎగిసే అహంకార వృత్తులన్నీ నశిస్తాయి. జ్ఞాన నిష్ఠను పొందేందుకు జీవులు ముక్తినొందే సాధన ఇదొక్కటే.

388. “నేనెవరు” అని తన సత్యాన్ని అన్వేషణ చేస్తే అహంకార విజృంభణ అంతమవుతుంది. అంతట జీవుడు "సత్యాత్మ స్వరూపమైన “తాను" అవుతాడు.

389. మనస్సుని బాహ్య విషయాలపై పోనీయక “నేను ఈ దేహం” అనే క్షుద్ర వృత్తి లేవనీయకుండా ఆత్మలో నిరంతరం నెలకొల్పి ఉండటమే సరైన ఆత్మ విచారణ పద్ధతి.

390. “ఉన్నాను” అనే సత్తుస్ఫురణ రూపంతో హృదయంలో సదా ప్రకాశిస్తున్న పరమాత్మని పొందటానికి నిర్జన ప్రదేశంలో ఒంటరిగా అంతర్ముఖులై ఉండాలేగాని, ఆవేశంతో, ఆడుతూ పాడుతూ భగవంతుని వెదకుతూ అనేక ప్రదేశాలలో తిరిగితే ఎలా? అది నీళ్లలో మునిగిన వాడు దీపంతో వెదకే వ్యర్ధమైన పని. (నీళ్లలో దీపం పనికిరాదు. అట్లాగే లోనున్న పరమాత్మని వెదకి పట్టుకోడానికి బహిర్ముఖమైన మనస్సు ఉపయోగపడదని భావం.)

391. హృదయంలో మునిగి పంచకోశాలలోనున్న ఆత్మస్వరూపాన్ని తిన్నగా సాక్షాత్కరింపజేసుకోకుండా, లోకులు శాస్త్రవిద్యలతో చేసే పరిశోధనలు కేవలం శాస్త్ర విచారమే తప్ప ఆత్మవిచారణమవుతుందా? కాదని గ్రహించు.

వివరణ : "తాను” పంచకోశాలలోపలుంది. గ్రంథాలు దానికి బయటున్నాయి. కనుక పంచకోశాలను తీసేసి విచారించవలసిన "తాను"ను (ఆత్మని) గ్రంథాలలో వెదకటం వృధా"యని శ్రీ భగవాన్ తమ “నేనెవరు?” అనే గ్రంథంలో సెలవిచ్చినది ఇక్కడ గుర్తుంచుకోవాలి.

392. ప్రాణాన్ని బంధించటంవల్లా, మనస్సుని అంతర్ముఖం చేయడం వల్లా మనస్సణగి, మనోవృత్తులు నాశమవుతాయి. ఆ ప్రశాంత స్థితిలో “నేనెవరు?” అని హృదయంలో సూక్ష్మంగా విచారించి, అభిన్నమైన సచ్చిత్స్వ రూపాన్ని తెలుసుకో.

వివరణ : ఉపదేశసారం -14 వ పద్యభావం. మనోలయంతో ఆగిపోకుండా మనోనాశం పొందడానికి విచారణయే మార్గమని బోధించారు. శ్రీ భగవాన్.

393. ఉత్తమమైన జ్ఞానసాధన ఆత్మవిచారణ. దానిని అనుసరించే వారు ఎప్పటికీ మార్గం తప్పరు. ఆ ఆత్మ విచారణ, ఆ మార్గాన్ని అనుసరించే వారికి సక్రమంగా అనుష్ఠించే విధానాన్ని సూర్యుని వలె ముందుండి వెలుగునిచ్చి దారి చూపిస్తుంది.

394. స్వరూప నిష్ఠనుండి తప్పటమే మహాప్రమాదం. అదే మరణం కూడా. అమరత్వం కోసం ప్రయత్నించే వారు ఆ ప్రమాదంలో పడకుండా కాపాడే సాధనమైన ఆత్మవిచారణని చేయటానికి ఎటువంటి నియమాలు లేవు. (దేశ కాల నియమ నిషేధాలు లేవని భావం).

395. దేశ కాలాలు ఆపరబ్రహ్మానికి అన్యమైన ఒక సత్తా కలిగి ఉండటానికి వీలు లేదు. కాబట్టి దేశకాలాలు ఆత్మ విచారణకి నిషిద్ధం కాదు. మరొక రీతిగా చెప్పాలంటే, దేశకాలాలకు అతీతమైన ఆత్మస్వరూపం తప్ప, వాటిలో యిమిడి గోచరిస్తున్న నామ రూపాలను విచారణలో లక్ష్యంగా పెట్టుకోకూడదు.

396. పూర్వజన్మల వాసనాబలం చేత బహిర్ముఖమవుతున్న మనస్సును “నేనెవరు?” అని అలసట లేని ఆత్మవిచారణ చేత అంతర్ముఖము చేసే ప్రయత్నమే తాను చేసే దేవాసుర యుద్ధం.

వివరణ : పురాణాల్లో జరిగాయని మనం వింటున్న దేవాసుర యుద్ధాలన్నీ, ఆధ్యాత్మిక మార్గంలో పయనిస్తున్న సాధకుని అంతర్ముఖత్వసాధనకూ బాహ్యజగత్తు లోని ఆకర్షణలకూ జరిగే పోరాటాన్ని తెల్పుతున్నాయి.

397. శ్రీ భగవాన్ అనుగ్రహించిన భావమే ఈ క్రింది వచనం.

"ఇతర తలపులు లేవగానే వాటిని పూర్తి చేయటానికి ప్రయత్నించక, అవి ఎవరికి కలిగాయని తనను విచారించుటయే చేయదగినది” (నేనెవరు?" శ్రీభగవాన్)

398. ఈ క్రింది భావం కూడా శ్రీభగవాన్ రమణ మహర్షులు సెలవిచ్చినదే.

"ఆ తలపులన్నీ నాకే కదా కలుగుతున్నాయి! నేను ఎవరు? అని విచారణ చేస్తే మనస్సు తాను పుట్టిన స్థానానికే తిరిగి వెడుతుంది. ఎగసిన తలపులు కూడా అణగిపోతాయి" (నేనెవరు? శ్రీ భగవాన్)

399.ఇలా నిత్యం సాధన చేయగా చేయగా చిత్తశుద్ధి కలిగి, విచారణ భో ప్రారంభించగానే మనస్సు వెంటనే హృదయంలో నిల్చి ఉండటం అత్యంత న్న సులభమైపోతుంది.

400 కానన దహన సమయంలో, ఆ తీక్షణమైన వేడిని భరించలేక ప్రాణులు దగ్ధమైనట్లు ఉధృతంగా సాగే ఆత్మవిచారణ తాపాన్ని ప్రతిఘటించలేక,హృదయంలో దాగియున్న వాసనలు తలపుల రూపంలో బయటికి వచ్చి వెనువెంటనే విచారాగ్నికి అహుతి అయి చివరికి వాసనలన్నీ పూర్తిగా నశిస్తాయి.

( ఈ భావం “నేనెవరు?” గ్రంథంలో భగవాన్ అనుగ్రహించారు)

401. శ్రీ భగవాన్ ఉపదేశించినది: 'నేనెవరు' అనే తలపు ఇతర తలపులనన్నిటిని నాశనం చేసి చివరికి శవదహనం చేసిన కట్టెలాగున తానూ నశించి సంపూర్ణమౌనమైపోతుంది. (నేనెవరు? గ్రంథం)

402. జ్ఞానప్రకాశమైనటువంటి మనలను మరపించి మోసగిస్తున్న అహంకారం, “నేనెవరు?" అనే విచారణతో నశిస్తుంది. అపుడు మన స్వరూపం ఆత్మాకాశంగా ప్రకాశిస్తుంది.

403. అగ్నిలో కాలిన ఇనుప గుండు ఆ అగ్ని స్వభావం చేత అగ్నిగోళంగా కనబడినట్లుగా మలముతో నిండిన జీవుడు పరిశుద్ధాత్మ విచారాగ్నిలో మండిన తర్వాత, ఆత్మ స్వరూపంగానే ప్రకాశిస్తాడు.

404. దుఃఖించే (జీవుడు) నేనెవరు? అని తనలో విచారించి నిజస్వరూపమైన ఆత్మని చక్కగా గ్రహిస్తే అజ్ఞానమంతా తొలగి జ్ఞానముదయిస్తుంది. పరమమౌనం పొంగి సుఖం కలుగుతుంది.

405. జీవులు దుఃఖపడటానికి కారణం తమ సత్యమైన ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొనకపోవడమే. కనుక “దుఃఖిస్తున్న తానెవరు?" అని చేసే సత్యజ్ఞాన విచారణ సాధననే హృదయంలో ఎప్పుడూ కొనసాగించు.

406. నిత్యం క్రమమైన రీతిలో చేసే ఆత్మ విచారమనే స్పర్శవేది సహకారంతో భూతం వంటి జీవుడు తనకున్న భూతస్వభావమైన చిత్తమలం అనే చిలుము పోగొట్టుకొని పరిశుద్ధ శివస్వరూపంగా ప్రకాశిస్తాడు.

వివరణ : ఇనుములాంటి లోహాన్ని బంగారంగా మార్చేదే పరుసవేది (స్పర్శవేది). జీవుడు కంచు, శివుడు కనకమని భావించాలి.

407. దైవ పుత్రుడైన జీవుడు "ఆ పరమాత్మే తన నిజస్వరూప"మనే సత్యాన్ని మరచిన కారణం చేత "అయ్యో" అని వగచి దుఃఖిస్తున్నాడు "ఇట్లాగ దుఃఖిస్తున్న నేనెవరు?" అని ఆసక్తి, ఉత్సుకతతో విచారణ చేసి తనలో తాను మునిగినట్లైతే "ఆ పరమాత్మే నేను" అని గ్రహించి పరమపితతో ఏకమై పోతాడు.

వివరణ: ఈ భావాన్ని క్రైస్తవ సిద్ధాంతం ప్రకారం పరమాత్మతత్త్వాన్ని వివరించడానికి చెప్పారు. అంటే "నేను-నా తండ్రియు ఒక్కరే" అనే సిద్ధాంతం గురించి చెప్పిన మాట.

## 70. తపస్సు

408. ప్రతి ప్రాణిలో జ్ఞానం సహజంగా ఎప్పుడూ ప్రకాశిస్తూంటుంది. సంపూర్ణంగా ఆజ్ఞానానుభూతిని పొందటమే తపస్సు యొక్క ఉద్దేశ్యం. అంతేగాని, ఆత్మజ్ఞానాన్ని కొత్తగా సృష్టించటానికి కాదు.

వివరణ : ప్రతిబంధాలని తొలగించి ఆత్మానుభూతికై చేసే ప్రయత్నమే, తపస్సని భావం.

409. మదించిన మనస్సును వృత్తి వ్యాపారాలలో పడనీయకుండా హృదయంలో నిలపాలి. అక్కడ ప్రకాశిస్తున్న (ఉన్నాను అనే రూపం) ఆత్మస్వరూపంతో ఒకటిగా నుండుటయే ఉత్తమ తపస్సని ఉత్తమోత్తమ తపస్వులైన జ్ఞానులంటారు.

410. మాయా ప్రభావం చేత వేర్వేరుగా కనిపిస్తున్న ఈ జగదృశ్యాలన్నీ తనకు అనన్యమైనవని చూడటమే జ్ఞానం. అట్టి జ్ఞానంతో పొంగి పొరలే నిరంతర ధారగా ఆత్మాకార వృత్తి ఉండటమే తపస్సు. పరిశీలించి చూసి ఇదే అత్యుత్తమ తపస్సని గ్రహించు.

411. ఆనంద సాగరం సహజంగా పొంగుతున్నప్పుడు, పంచాగ్నులతో తనను దహించుకొనటం తపస్సని కొందరు అనుకుంటారు కదా! దీనికి కారణం, ఆత్మ నిష్టయైన తపస్సును సహజంగా అత్యంత ప్రీతితో చేయకపోవటమే. ఇది మూఢత్వమని తెలుసుకో!

వివరణ : తపస్సంటే తపించుట, కష్టాలని తెచ్చిపెట్టుకోవడం అని అర్థం. కాని

నిజమైన తపస్సంటే ఆత్మ నిష్ఠ. అది మహానంద సాగరం. అహంకారం నశించిన స్థితే తపస్స్వరూపం అనే సత్యాన్ని అర్థం చేసుకోకుండా, శరీరాన్ని పంచతాపాగ్ని వంటి బాధలలో కష్టపెట్టి ఘోర తపస్సు చేసే తపస్వులెందరో! వారు కొద్దిగొప్పో కామ్యాలను యీ లోకంలోనో పరలోకంలోనో, స్వలాభానికో లేక లోక రక్షణార్థానికో నెరవేరాలనే ఉద్దేశ్యంతో ఆ కఠోర నియమాలను అనుసరిస్తారు. ఇటువంటి ఉద్దేశ్యాలు అహంభావ స్థితిలో మాత్రమే సాధ్యం. ఇటువంటి వారు చేయు యజ్ఞయాగాదులు సకలం కష్టదాయకాలే తప్ప మోక్షదాయకాలు కావు, అందువల్ల యీ చర్యలే తపించుట అనే అర్థంతో తపస్సని భావించవచ్చు. అయితే నిజమైన ఉత్తమ పురుషార్థం మహానంద నిలయం కాబట్టి ఆ స్థితిని పొందటానికే జ్ఞానులు తపస్సు చేయాలి. వాటికి అనుసరించవలసిన నియమం అత్యంత ప్రీతితో తనను తాను తెలుసుకొనే విచారణ మార్గమే. "నేనే మార్గం. నేనే ధ్యేయం" అనే మహావాక్కు ప్రకారం విచారణ మార్గం, ధ్యేయమూ పరమానంద స్వరూపమైన ఆత్మయే కాబట్టి, విచారణ యొక్క ముగింపు అహంకార రహిత స్థితి. ఆ రుచిని అహంకారమణగిన నిద్రలో అందరూ "ఆనందం" అని అనుభవించుట చేత లోదృష్టి అయిన విచార ప్రక్రియ కొంచెమైనా కష్టంకాదని తెలుస్తుంది. ఈ విధంగా ఆనందమయమైన ఉనికిని పట్టుకొనటమే ప్రతియొక్కరి ధర్మం. ఇది అర్థం చేసుకొన్న తర్వాత అత్యంత ప్రీతితో చేసే అంతర్ముఖత్వసాధనను 'తపం- తపించుట' అని ఎందుకు అనాలి? కనుక దానిని తపం అనడం అజ్ఞానమే అని ఒక కొత్త భావాన్ని శ్రీ భగవాన్ యిక్కడ చెప్పారు.

412. సర్వోత్కృష్ట శివజ్ఞానానుభవమైన మౌనమే పరబ్రహ్మమగు నిజమైన తపస్సు.

413. విశాలమైన గగనంలో పక్షులు విహరించిన మార్గాన్ని, జలచరాలు నీళ్లలో ఈదుకెళ్లిన మార్గాన్ని మనం కనుక్కోలేము. అట్లాగే (నేనెవరని) అంతర్ముఖులై ఆత్మని పొందిన జ్ఞానుల మార్గంలోని అడుగుజాడలు మానవులకు బోధపడవు.

414. అహంకార చేష్టలు నాశమవ్వటానికి భగవంతుని పాదాలని భక్తితో ఆశ్రయించు సాధనమే సిద్ధాంతమార్గం. ఆ అహంకారం “నేనెవరను” అనే ఆత్మవిచారంతో పరమాత్మ జ్ఞాన స్వరూపానంద నిష్ఠలోనుండుటమే వేదాంత మార్గం.

415. ఆత్మ అనాత్మలను విచారణతో విభజించి, బ్రహ్మాన్ని (తనని) తెలుసుకొని, తద్వారా అనాత్మ విషయాలపై వైరాగ్యం చెంది, నేను, నాది అనే అహంకార మమకారాలు నాశనం చేయటమే జ్ఞానుల జీవిత ధర్మం.

వివరణ : జ్ఞాన ప్రపంచంలో జీవించాలని కోరే వారు అనుసరించవలసిన జీవిత విధానమని కూడా అర్థం చేసుకోవచ్చు.

416. దుఃఖంతో అల్లాడుచున్న జీవుడు శివునితో ఏకమై ఆనంద స్వరూపుడై ఉండ తగ్గ మార్గమేదని అడుగు. జగజ్జీవేశ్వర దృశ్యాలు ముత్యపు చిప్పలో వెండి వలె పరబ్రహ్మమైన తన స్వరూపంలో గోచరించు కల్పితాలేయని తెలుసుకొని వాటిని వదలిపెట్టు.

## 71. ఎఱుక

417. జ్ఞానమనే స్వర్ణాలయంలో శివుడు పరిశుద్ధ జ్ఞానంగా ప్రకాశిస్తున్నాడు. ఆయనను జ్ఞాన నేత్రాలతో తెలిసికొనే వారే నిజమైన శివారాధకులు, ఎందువల్లనంటే వారికి జ్ఞానమే పరమార్థం కాబట్టి.

418. జ్ఞానాన్ని జ్ఞానంతో తెలుసుకొనటమే శ్రేష్ఠమైన జ్ఞానము స్థిర జ్ఞానమైన ఆత్మచేత తనను తాను తెలిసికొనే వరకు, అస్థిర జ్ఞానమైన మనస్సుకు (మనిషికి) అణువంతైనా శాంతి కలుగదని గ్రహించు.

419. స్వర్ణంతో చేయబడిన ఆభరణాలు అనేక నామరూపాలుగా కనబడుతున్నట్లు, మనస్సుచే గ్రహింపబడుతున్న ప్రపంచం కూడా నామరూపాలతో అనేకమవుతున్నది. నగల నామరూపాలు వేరైనా బంగారం గురించిన జ్ఞానం మాత్రం ఏకముగానే వుంది కదా! అట్లాగే బ్రహ్మంకూడా యని గ్రహించు.

420. తాను తానుగా వుండటానికి బదులు, చూచే దృశ్యాలన్నీ నిజమనే అహంకారం అజ్ఞానమవుతుంది. విద్యలెన్ని నేర్చినా, తన ఆత్మస్వరూప దర్శనంతో అవి పూర్తిగా నశించడమే సత్యజ్ఞానము.

421. యథార్థంగా ఉన్నది (ఉన్నాను) సత్‌్చిత్ యొక్క ప్రకాశమొక్కటే. ఇతర జ్ఞానాలన్నీ 'నేను' అనే అహంకారం యొక్క అవిద్యయే. కనుక వాటిని నమ్మటం పెద్ద నేరం.

422. ఇతర జ్ఞానాలన్నీ అల్పమైనవి. మనస్సు నాశమొందిన పరమౌనానుభవమే పూర్ణజ్ఞానము (ఆత్మ). ఎఱుకయే స్వరూపమైన ఆత్మలో తోచు వివిధ భేదాలన్నీ కేవలం కల్పితాలే తప్ప నిజం కావని గ్రహించు.

423. పెద్దలు ఈ క్షుద్ర మనస్సుతో గ్రహించిన వాటిని జ్ఞానమని భావిస్తారా? భావించరు. శుద్ధజ్ఞానాన్ని తెలుసుకొనే జ్ఞానమే జ్ఞానం. ఇతరములను తెలుసుకొనే జ్ఞానము అజ్ఞానం.

వివరణ : శుద్ధజ్ఞానాన్ని తెలుసుకొనే జ్ఞానం 'ఉన్నాను' అని ప్రకాశించే ఎఱుక.

424. విద్యలెన్ని నేర్చినా, వాటిని నేర్చిన తనను తెలుసుకోనివాడు నిజంగా జ్ఞాని కాడని తెలుసుకో!

వివరణ : ఆత్మ విద్యాకీర్తనంలోని 3వ చరణాన్ని యిక్కడ గ్రహించవలెను.

425. పిచ్చివాడివలె బాహ్య ప్రపంచాన్ని వెదుకుతూ పరుగెత్తుతున్న మనసా! 'ఉన్నాను' అనే రూపంలో ప్రకాశిస్తున్న శుద్ధ జ్ఞానం తప్ప, చరాచరాలన్నీ గోచరించటానికి ఆధారవస్తువు మరొకటుంటుందా? (లేదని భావం)

426. జ్ఞానమే అన్నిటికీ ఆధారమని చెప్పడంలోని న్యాయమేమిటని ఆలోచిస్తే, కనిపించే సృష్టియంతటికీ అధిష్ఠానం ఆత్మే. ఆ ఆత్మకి కూడా ఆత్మే (తాను తప్ప వేరే వస్తువు ఎప్పుడూ ఎక్కడా లేదు కాబట్టి) ఆధారమై వుంది. అదే కారణమని తెలుస్తుంది కూడా.

427. అసత్తైన జడములకే పట్టు గొమ్మలా (ఆలంబముగా) ఒక సచ్చిత్ అవసరం. మనమే సచ్చిత్తైనపుడు, మనకు ఒకసచ్చిత్ పట్టుగొమ్మలా ఎందుకు అవసరం? అలా భావించడం, కావాలనుకోవడం, మనలను చిత్తమని (మనస్సు) భావించే మోహం చేతనే, అట్లాగ కలుగుతోంది.

428. అన్యవస్తువులవలె అసత్తుగా కాకుండా, "తాను" ఎల్లప్పుడూ ఉండి ప్రకాశించుటచేతనే, ఆత్మయైన మనమే మన ఎరుకకు (ఉన్నాననే జ్ఞానానికి) ఆధారమవుతున్నాము. (ఇదే పైన 426వ పద్యభావంలో చెప్పారు)

429. ఆ జ్ఞానమే నీవైయుండగా, ఆ జ్ఞానాన్ని ఎఱిగి ఉండానికి బదులు, అజ్ఞానంతో నీవే నీ వల్లనే గోచరమవుతున్న లోకాన్ని తెలుసుకొని నశిస్తున్నావే! ఏమని చెప్పను?

430. తమ ఆత్మ స్వరూపాన్ని విచారణ చేత తెలుసుకోలేని వారు, తమకు భిన్నమైన శరీరాన్ని తామే అనే మోహంతో నాశమొందుతారు. సచ్చిదైకరూపంగా ప్రకాశించు మనం తప్ప ఇతరములన్నీ మాయతో కూడిన భ్రమలే.

431. ఆత్మస్వరూపంపై దృష్టిని లగ్నం చేయకుండా బహిర్విషయాలపై మనస్సు లగ్నంచేసే అజ్ఞానులకు ఏ శాస్త్రాలు జ్ఞానాన్ని బోధించగలవు? (లేవని భావించాలి)

432. జ్ఞానమే నీ స్వరూపం కాబట్టి ఈ లోకాన్ని తెలుసుకుంటున్నావు. కదా? ప్రపంచాన్ని కాకుండా నీ దృష్టికి నీవు నిన్నే గురిగా చేసుకుంటే ఆ అంతర్ముఖతయే (ఆచిన్ముద్రే) నీకు జ్ఞాన గురువై పరమార్థ సత్యాన్ని బోధిస్తుందని తెలుసుకో!

433. తెలుసుకోవలసింది మన ఆత్మస్వరూప సత్యాన్నే. ఆ లక్ష్యంతో హృదయంలో సూక్ష్మంగా చూసి దానిని తెలుసుకోవాలి. అంకెలు వేస్తున్న చంచల మనస్సు దగ్ధమై, మౌనస్థితిలో నుండు నిశ్చల బుద్ధికే తన నిజస్థితి తేటతెల్లమవుతుంది.

434. పరిశుద్ధజ్ఞానమైన తన మౌన స్వరూపంలో ఇతర విద్యలన్నీ పూర్తిగా నశించిపోతాయి. అట్లాగే ఇతర స్థితులన్నీ తన సహజ స్థితిలో అణగియున్న ఎరుక యొక్క విలాసాలే.

435. “ఉన్నాను" అనే సహజ రూపమాత్రంగా తోచుజ్ఞానమే హృదయం. ఇతరములను తెలుసుకొనే వృత్తులు లేని ఈ హృదయానికే సత్యం తనంతట గోచరిస్తుంది. కనుక ఆ హృదయాన్ని (అంటేతనను) ఆశ్రయించియుండు ఆత్మనిష్ఠయే స్వయం ప్రకాశకమయిన ఆత్మజ్ఞానము.

436 తెలుసుకొనేవన్నీ ఆ జ్ఞాన రూపమే, అవి అన్నీ జ్ఞానమైన తనలో అణగిపోతాయి. అదే ఆత్మ నిష్ఠ. ఆ దశలో భేదాలన్ని పూర్తిగా తొలగిపోతాయి. సహజ స్థితి ఏకమై వెలుగుతుంది. అదే అద్వితీయ ముక్తదశ.

437. సద్వస్తువంటి ఒకే వస్తువు. కనుక సత్యజ్ఞానం అంటే మరొక దానిని తెలుసుకొనే జ్ఞానం లాగా ఉండదు. చిత్తం అచంచలమై శాంతంగా ఉండే నిష్ఠయే జ్ఞాన దశ.

వివరణ : అంటే 'ఉన్నాను' అనే స్వరూప జ్ఞానంలో నుండు ఆత్మనిష్ఠయే జ్ఞానమని భావం.

438. జ్ఞానం బంధరహితం. పరిశుద్ధం. అదే భగవత్ప్రాప్తి. అదే నిర్భయ స్థితి, అమృత స్థితి. ఇవన్నీ (ఆత్మ) జ్ఞానమేయని తెలుసుకో..

439. జ్ఞానం యొక్క లక్షణాలను తెలుసుకోవటం అంటే మనస్సు నశించి శాంతి పొందటమే. ఎందుకంటే జ్ఞానాన్ని వివరించడానికి బ్రహ్మాది దేవతలకి కూడా వీలు పడదు.

వివరణ : శ్రీ మురుగనార్ తెల్పినది : పొడవు, వెడల్పు వంటి ప్రమాణ పదాలన్నిటికీ అతీతమైనది జ్ఞానం. కనుక దానిని ప్రమాణీకరించలేరు. మనోనాశం ద్వారానే జ్ఞానాన్ని తెలుసుకోగలం.

440. లోకమంతా జ్ఞానమయం. ప్రాణులంతా జ్ఞానం తప్ప మరొకటి కాదు. అనుగ్రహమూర్తి పరమాత్మ కూడా జ్ఞానమే. కనుక జ్ఞానాన్ని తెలుసుకోవటమే పరమార్థం. పురుషార్థం.

## 72. నిర్వాణం

441. పాము కుబుసాన్ని వదలినట్లు. “నేనుయిది” అనే అభిమాన బంధం చేత దుఃఖాలను కలుగచేసే పంచకోశాలను వదలివేయడమే మనం నిర్వర్తించవలసిన ఉత్తమ ధర్మం.

442. ఆత్మనాథుని మౌనానందాన్ని పొందటానికి తాను కప్పుకొన్న పంచకోశముల రూపంగా ఉన్న దేహాభిమానాన్ని వదలి వేయాలి. ఇదే జీవుని నిర్వాణ స్థితి.

## 73. ఆత్మసాక్షాత్కారం

443. (జాగ్రత్స్వప్నాలలో) కనబడే ఈ దృశ్యమణగి, శరీరం లేకుండా నుండు నిద్రలో (శూన్య స్థితి) మనముండటం మనందరికీ అనుభవమే. కనుక పంచకోశరూప అహంకారం నశించి అణగియుండటమే ఆత్మ సాక్షాత్కారమని గ్రహించు.

వివరణ : అహంకారాన్ని శాశ్వతంగా పోగొట్టుకొనడమే మన ఆత్మస్వరూపాన్ని పొందడమని భావం.

444.(అసత్యమైన కల చెదరి ఒకడు మేల్కొన్నట్లు) ఈ అసత్యపు కలయైన జాగ్రత్తుపోయి, అహంకార రహిత తురీయస్థితి వంటి మెలకువను పొందితే, అప్పుడు ఆత్మ స్వరూపం సూర్యుని వలె ప్రకాశిస్తుంది. కనుక ఆత్మవిచారణ తో అహంకారాన్ని నాశమొనర్చడమే ఆత్మ సాక్షాత్కారము.

445. అసత్యమైన ఈ శరీరంలో జీవించినప్పటికీ జ్ఞానంతో అహంకార మమకారాలు రెండూ నశించడమే తాను బ్రహ్మంగా నుండటము.

446. సద్వస్తువు “నేను” అనే అహంకారానికి మూలమని (ఉత్పత్తి స్థానమని) అతి సూక్ష్మబుద్ధికి తెలుస్తుంది. స్థూలనామరూపాలను తెలుసుకొంటున్న లావైన రోకలి వంటి మందబుద్ధి కలవారికి ఆత్మని తెలుసుకొనడం అసాధ్యం.

వివరణ : శ్రీ రమణ మహర్షుల గ్రంధం "విచారసంగ్రహం” లోని 8వ అధ్యాయంలో "స్థూలమైన గడ్డపారతో సన్ననిపట్టు వస్త్రాన్ని కుట్టలేము; గాలిచే అతిచంచలమైన దీపంతో అతి సూక్ష్మమైన వస్తువుల లక్షణాలను నిర్ణయించలేము; రజస్తమోగుణ వశమైన మనస్సుతో వస్తువు యొక్క అనుభవం సాధ్యం కాదు...." అని ఉపదేశించిన విషయాన్ని ఇక్కడ గ్రహించాలి.

## 74. దృఢమైన ఎరుక

447. మౌన స్వరూపమైన ఆత్మలో తలపులుదయించవు. కాబట్టి ఉత్తమ. మధ్యమ, ప్రథమ పురుషలు కూడా కేవలం తలంపులే. కనుక మధ్యమ, ప్రథమ పురుషలు రెండూ ఉత్తమ పురుష ఉదయించిన తర్వాత ఉద్భవిస్తాయి. నేను ఈ దేహమనే అహంకారమే ఉత్తమ పురుష.

వివరణ : మాయా కల్పితాలలో దేశకాలములే ప్రథమాలు, దేశకాలములలో దేశం/ స్థానం గురించే పై వచనంలో ప్రస్తావించారు. కాలం గురించి 747, 748 వచనములలోను, ఉన్నది నలుబదిలోని 15, 16 పద్యాలోను ఉపదేశించారు.

దేశ కాలాలకు లోబడిన శరీరాన్ని "నేను" అని భావించే తలపే "అహంకారం" అంటారు. అందువల్ల “ఉత్తమ" పురుష తలపు అయిన ఈ అహంభావం నుండి పుట్టే ఒక్కొక్క తలపులోను దేశకాల పరిమాణాలు ఉంటాయి. దేశకాల కలయిక

లేకుండా ఎవరికీ తలపుపుట్టదు. ఇది కొంచెం కొత్త అనిపించవచ్చు. కొంచెం ఆలోచిస్తే ఇది అందరికీ గోచరించే సత్యమే. ఈ భావంతోనే ఈ వచన భావాన్ని అర్థం చేసుకోవాలి.

ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలనే మూడుస్థానాల్లో ఉత్తమ పురుష పుట్టిన తర్వాతే మిగిలిన రెండు ఉదయిస్తాయి. కనుక ఉత్తమ పురుష ప్రథమ స్థానమని భగవాన్ బోధించారు. ఇక స్థానం అంటే కేవలం తలపే కాబట్టి ఉత్తమ పురుష అనే ప్రథమ స్థానం కూడా ఒక తలపే యని బోధించారు. ఇక ఆది వస్తువైన ఆత్మస్థితి మౌన రూపం కాబట్టి అక్కడ ఎటువంటి తలపులుదయించలేవు. అందువలన ఉత్తమ పురుష అయిన అహంకారం పుట్టడం కూడా ఆత్మలో ఏమాత్రం లేదని వెలిబుచ్చారు. అట్లాగే, ఉత్తమ పురుషయే ప్రథమం కాబట్టి, భూత, వర్తమాన, భవిష్యత్ కాలాల్లో వర్తమానమే మొదటి కాలం. ఇది కూడా ఒక తలపే కనుక, ఉత్తమ పురుషలా వర్తమాన కాలం కూడా ఆత్మలో తోచదు ఉండదు. అంటే ఆత్మ దేశ కాలాలకతీతం కాబట్టి అజాతమే సత్యం అనే దృఢ జ్ఞానం అనుభవంలోకి రావాలి. ఇదే ఈ వచనం యొక్క ముఖ్యోద్దేశం.

448. ఈ శరీరంలో "నేను" అని పుట్టేది ఏదో అదే మనస్సు. ఆ తలపు ఎక్కడ నుండి ఉదయిస్తోందోఅని పరిశీలిస్తే (పరిశీలించే మనస్సు) హృదయంలో చేరుతుంది. కనుక మనస్సు అక్కడ నుండే జనిస్తోందని గ్రహించు.

వివరణ : శ్రీ భగవాన్ రచించిన "నేనెవరు?" గ్రంథంలోని వచన రూపమే ఈ భావం.

449. తలపులు తప్ప జగజ్జీవేశ్వరులంటూ ఏవీ లేవు. సమస్తమైన తలపులలోను “నేను” అన్న తలపే (పూలదండలోని నారవలె) వున్నది. అన్ని తలపులకి మొదటిదైన “నేను” తలపు ఉదయించు స్థానమే హృదయమనబడుతుంది.

450. హృదయంలో నిష్ఠగలవారైన జ్ఞానులు అన్నిటికీ అధిష్ఠానంగా తమను తెలుసుకొంటారు. చిత్ర పటాలచేత భాదింపబడని తెరలా సద్వస్తువుగానుంటూ తమలోనే జగజ్జీవేశ్వరులు గోచరిస్తున్నట్లుంటారు.

## 75. పరమానందానుభవము

451. ఇంద్రియ విషయాలలో అనేక రీతుల గోచరించి అనుభవింపబడే సుఖం, నిజానికి అవిచ్ఛిన్న అఖండ రూపమైనటువంటిది. మన స్వరూపానందసుఖాన్ని, తాను అంతర్ముఖుడై ఉన్నంత మేరకు చక్కగా అనుభవిస్తాడు.

452 నిన్ను హృదయంలో బాగా నెలకొని యుండేటట్లు చేస్తే జ్ఞానముదయిస్తుంది. తర్వాత నీవు సదాశివ శాంత్యనుభవంతో నిరంతరం ప్రకాశించే సత్యజ్ఞాన సూర్యునివలె జీవిస్తావు.

453.తాను ఆశించినది నెరవేరినపుడు మనస్సు తన స్వస్థానమైన హృదయాన్ని చేరి ఆత్మసుఖాన్ని అనుభవిస్తుంది. ఈ లోకంలో ద్వేషించిన వస్తువులుతొలిగిపోయినప్పుడు, యిష్టపడిన వస్తువులు లభించినపుడు కలిగే ఈ సుఖానుభవమే, సమాధి స్థితి, మూర్ఛ, సుఖనిద్రలో కూడా కలుగుతోంది.

454. అల్పమైన మనస్సు కల్పించిన అహంకార పూరితమైన ఈ ప్రాపంచిక జీవితంలో తలపుల నుండి విడివడినవారై ఎఱుకతో కూడిన నిజమైన ఆనందం అనుభవించేవారు ఎవరైనా వున్నారా? చెప్పుము. (ఎవ్వరు లేరని భావం)

## 76. నిద్ర (తురీయం)

455. గాఢ నిద్రలో పరమసుఖాన్ని అనుభవించిన వారు ఆ నిద్రకు ఆధారం సద్వస్తువని తెలుసుకొనడానికి బదులు (అట్లాగే నిద్రలోగల తన నిజస్వరూప స్థితిని మెలకువలో కూడా నిరంతరంపొందే మార్గాన్ని వెదకటానికి బదులు) తమ దుఃఖ నివృత్తికి అన్యవస్తువులను వెదకటం అవివేకం.

456. జాగ్రత్ స్వప్నాలలో (నిద్రమూర్ఛ దశలలో తప్ప) విక్షిప్తమై ఉన్న అహంకారంతో చూచే అన్యవస్తువుల గురించి కలిగేది అజ్ఞానం. అంతేగాని నిత్యం వెలిగే ఆత్మ ఆయిన తన ఉనికిని గురించి ఎప్పుడు అజ్ఞానం కలుగదు.

457. మెలకువని ఎఱుక అనుకోవటం ఆత్మని మరచిన అవిద్యవల్లనే. ఈ జాగ్రదవస్థ శ్రేష్ఠమైన ప్రజ్ఞాదశయనే భ్రమతొలగితే అప్పుడు నిద్రకేవలం అద్వైత స్థితిగా తోస్తుంది. (అంతవరకు శాస్త్రాలు నిద్రని ఒక కోశంగా అంటే ఆనందమయ కోశమంటాయి).

వివరణ : కలలోను మెలకువలోను శరీరాంహంకారాన్ని తన నిజమైన ఉనికి అని భావించడం వలన అహమణగిన నిద్రావస్థను ఉనికి లేని స్థితిగానెంచుచున్నాము. అయితే విచారణ ద్వారా తన నిజస్వరూపాన్ని ఉనికిగా తెలుసుకొంటే జాగ్రత్ స్వప్నాలలో గల అహంభావాన్ని భ్రమ అని తెలిసి నిద్ర తన నిజ ప్రజ్ఞయేయన్న భావ ముదయిస్తుంది. నిద్రలో పూర్ణజ్ఞానముంది. మెలకువలో పూర్ణ అజ్ఞానముందని భగవాన్ వాక్కు.

458. (మేల్కొన్న తర్వాత) "నిద్రలో ఏదీ గోచరించలేదు" అని తన ఉదాత్త స్థితిని మరచి బాధపడే వాడెవరంటే జాగ్రత్ స్వప్నావస్థలలో "చూచేవాడను నేనే" అనే కర్తృత్వభావంతో కలుషితమైన అహంకార రూపుడైన జీవుడే. (ఆత్మయైన నీవు కాదు).

459.అహంకార నాశంతో (చూచేవాడు, చూచుట, చూడబడే వస్తువు, తెలుసుకొనేవాడు, తెలివి, తెలుసుకొనే వస్తువు మొదలైన) త్రిపుటి నాశం చెంది, ఫలితంగా స్వప్న జాగ్రత్ అవస్థలు లేకుండాపోయి, తానైన ఆత్మరవి నిరంతరం వెలిగే పట్టపగలే (శుద్ధజ్ఞానస్థితే) శివరాత్రి.

460. జాగ్రత్ స్వప్నాలు కలగడానికి కారణం అనాదిగా ఉన్న వాసనలు. అవి నాశమైతే, తమస్సు, మూఢత్వం అని భావింపబడే ఆ నిద్ర ఒకటే తురీయాతీ తావస్థగా గోచరిస్తుంది.

461. జాగ్రత్తులో "మెలకువగానున్న వాడనే నేను" అని విజ్ఞాన మయకోశమైన అహంకారంపై తన కేర్పడిన మోహం చేతనే ఆనందమయాన్ని ఒక కోశంగా ఎంచుతున్నాం. ఈ విజ్ఞానమయకోశం (అహంకారం) నశిస్తే, ఇంతవరకు అజ్ఞానాంధకారమని చెబుతూవచ్చిన ఆ ఆనందమయమే "కోశ" మనే పొరపోయి, మన స్వరూపానంద స్థితిగా మిగిలిపోతుంది.

వివరణ : నిద్ర అయిన ఆనంద స్థితిని ఒక కోశంగా మనిషి నమ్ముతాడని శాస్త్రాలు చెబుతాయి. దానికి కారణం, దానిని తరచు వదలిపెట్టే ప్రవృత్తి రూపమైన విజ్ఞానమయం పై మనకు అభిమానం ఉండటమే విజ్ఞానమయ ప్రవృత్తియొక్కబంధం లేకపోతే ఆనందమయాన్ని వదలడం జరగదు. అప్పుడు నిరంతరముండే ఆనంద స్థితి కేవలం ఒక కోశంగా కాకుండా మన యధార్ధ ఆనంద స్థితిగానే గోచరిస్తుందని భావం.

462. నిద్ర ముంచుకొచ్చేవరకు "ఉన్నాను" అనే అహంస్ఫురణ యితర ఆలోచనల వలన బాధింపబడక, సుస్పష్టంగా ఉంటే "మరపు అనే నిద్ర నన్ను ఆవరించిందే (నిద్రపోయానే)" అని బాధపడవలసిన పనిలేదు. (అంటే నిద్రరాదని)

## 77. సద్వస్తువు

463. విచారణ చేయనంతవరకు అహంత ఉందని అనుకుంటాము. విచారణ చేయగానే ఈ అజ్ఞాన అహంకారమనే సర్పము లేకుండా పోతుంది. విచారణ ఫలితంగా సర్పము అదృశ్యమైనపుడు, అది ఏ మూల వస్తువులో కలిసిపోయిందో ఆ ఆత్మ అనే రజ్జువు ఒకటే నిజమైన వస్తువని తెలుస్తుంది.

464. ఎటువంటి ఇష్టానిష్టాలు లేక, "ఉన్నాను" అని సహజంగా ప్రకాశించు ఆత్మ నిష్ఠలో జ్ఞానం వికసించుటచేత, ఎటువంటి భేదాలు లేక గోచరించే మహానందమే సద్వస్తువు.

465. సర్వత్ర సర్వదా అనాదియై ఉన్న ఒకే ఒక ఆత్మవస్తువు అఖండంగా వెలుగుతోంది. కాబట్టి ఎచ్చట ఎప్పుడు అనే దేశకాలములు ఆత్మకిభిన్నములుగా కేవలం కల్పనలే కదా.

## 78. కర్తృత్వభావరాహిత్యం

466. నేను కర్మలు చేస్తున్నాను అనే కర్తృత్వ భావం పోయిన వారికే హృదయంలో సుఖం కలుగుతుంది. కర్తృత్వాహంకారం ఒక విష బీజం. అదే అన్ని దుఃఖాలకు కారణం.

467. సంకల్పాల ఫలితమే తీరని కష్టాలు. సంకల్పాల వలన ప్రేరేపింపబడి కర్మలు చేయడం కంటె భగవత్కృప మనలని ఎట్లాగ ఆడిస్తోందో ఆప్రకారమే దానికి మనస్ఫూర్తిగా లొంగిపోవటమే దైవపూజకి సరైన పద్ధతి.

468.ద్రౌపది తన వస్త్రాల పట్టువదలని తన చేతులను కూడా చివరికి వదలి, చేతుల రెంటిని శిరస్సుపై జోడించి “శరణు శరణు" అని వేడుకొంది. దాని ప్రభావమే ఆమె వస్త్రాలనపహరిస్తున్న దుశ్శాసనాధముడు అలసి పోయే వరకు కృష్ణుని అనుగ్రహంతో వస్త్రం పొడుగవుతూ ఆమె మానం కాపాడింది కదా!

వివరణ : ద్రౌపది వలె, మన కర్తృత్వాన్ని పూర్తిగా భగవంతునికి వదలి జీవించడమే శ్రేష్ఠమని ఉపదేశం.

469. శిశువు తన తల్లిదండ్రులపై విశ్వాసంతో కలతచెందక నిర్భయంగా వుంటుంది. అట్లాగే భక్తుడు తనకు విశ్వాసాన్నిచ్చేది ఏది అని తానే నిర్ణయించుకోలేని వాడై, దైవానుగ్రహంపై పూర్తి నమ్మకంతో, ఎటువంటి చింతలు లేక, భగవంతుని పాద పూజలోనుంటాడు.

470. నేడు నీకు జీవితంలో కావలసినది యిచ్చిన భక్తవత్సలుడు ఎప్పుడూ ఆ దేశకాలాల కనుగుణంగా నిశ్చయంగా ప్రసాదిస్తాడు. కనుక భవిష్యత్ కోసం వస్తు సేకరణ చింత వదలి నీ బ్రతుకు భారాన్ని భగవంతుని పాదాలపై మోపి జీవించు.

471. "నేను భగవంతుని చేతుల్లో ఒక పనిముట్టు నగుదునుగాక” అనే భావంతో తపస్సు చేయడం కూడా ఆత్మ సమర్పణ భావానికి మచ్చతెచ్చేచర్యేయని తెలుసుకో!

వివరణ : ఈ భావన అహంకార రూపం కాబట్టి ఆత్మ సమర్పణకి తగినది కాదు. ప్రపంచంలో ఏదో సాధించాలని, దానికి "భగవంతునికి ఒక పనిముట్టు నగుదును గాక" అని సాధన చేసే అతని నిష్ఠ కూడా ఆత్మ సమర్పణ భావానికి ఒక మచ్చ అని శ్రీ మురుగనార్ తెల్పారు.

472. భక్తుడు "భగవంతుని సేవకుడుగానున్నాను" అనే భావం లేకుండా, మౌనంగా, నిశ్చలంగా వూరక వుండటమే స్వరూప నిష్ఠ. ఆ స్వరూప జ్ఞానమే బ్రహ్మజ్ఞానము.

వివరణ :భక్తి మార్గంలో తనను భగవంతుని సేవకుడని అనుకోవడం కూడా అహంకారమే. అప్పుడు ఆత్మసమర్పణ సంపూర్ణం కాదు. ఈ అహంభావం లేకుండా ఊరక ఉండటమే స్వరూపనిష్ఠ. కాబట్టి యీ స్థితిలో అనుభవమయ్యే సచ్చిత్తే బ్రహ్మజ్ఞానం. అద్వైత బ్రహ్మజ్ఞానం. ప్రపత్తి మార్గంలో అవలింబించే ఉపాయం ఇదే

473.భగవంతుడు ఒక్కొక్కరి హృదయంలో తానైయుండి వారి వారి ప్రారబ్ధానుసారం నడిపిస్తాడు. కనుక, ఆ హృదయ స్థానంలో కదలక అనన్యభావంతో నిశ్చింతగా ఉంటే మనకు జరగవలసినవన్నీ ఏలోటు లేకుండా జరుగుతాయి.

474. “నారు పోసిహేడు నీరుపోయడా” అనే సామెత ప్రకారం తనను సృష్టించిన భగవంతునిపై దృఢమైన నమ్మకం కలవారు శోకించరు. తాను నాటిన చెట్టు నీరులేక ఎండిపోతే, ఆ దీనమైన దృశ్యాన్ని చూసే బాధ్యత చెట్టు నాటిన వాడిదే, ఆ భగవంతునిదే.

475. లోకాలు, ప్రాణులన్నీ ఒక మఱ్ఱి చెట్టు కొమ్మలు ఆకుల వంటివి. వాటికి ఈశ్వరుడే వేరు. కనుక ఈశ్వరుని కర్పించేవన్నీ ఈశ్వరుడైన వేరు నుండి మొలిచిన లోకాలు ప్రాణులయిన వృక్షానికంతటికీ చేరుతాయి.

వివరణ : ఆత్మ సమర్పణ మఱ్ఱి చెట్టు వేరుకి నీళ్లు పోయడానికి సమానం. ఇది మరచి, తాను ప్రాణులకు సేవకుడని భావించి అందు నిమగ్నుడైతే అది ఆకులకి, కొమ్మలకి నీరుపోయడానికి సమానమని ఇక్కడ ఉపదేశం. తనని ఈశ్వరునికి అర్పించుకుంటే లోకానికి, చెట్టు చేమలకి నిజమైన సేవ చేసిన వాడవుతాడు.

ఇక్కడ కొందరు శ్రీభగవాన్ రచించిన ఉపదేశసారం 5వ శ్లోకం - "అష్టమూర్తులు సర్వమాయీశ్వరుడను దృష్టితో కృతసేవ దేవతా పూజ" అనే ఉపదేశం దీనికి భిన్నంగా ఉందేయని ఆశ్చర్యపోవచ్చును. అయితే ఇది నిజంకాదు. భేదమేమీ లేదు. కనిపించే ఈ లోకాన్ని ఈశ్వరుని రూపమేయని సేవించడం తన చిత్త శుద్ధికి ఒక నిష్కామ పూజఅనే పై శ్లోకం బోధిస్తోంది. జగజ్జీవులను దైవంగా భావించటం తన మనఃకల్పితమే కాని ఆత్మని దర్శించటం వలన కాదు. ఇటువంటి సేవల చేత కలిగే చిత్త శుద్ధి తన మంచికేగాని ప్రపంచానికి కాదు. అయితే ఆత్మ సమర్పణమైన అహంకార త్యాగంతో "జీవేశ్వరజగత్" అనే మఱ్ఱి చెట్టు వేరుకి నీరుపోసిన వాడైతేనే లోకానికి నిజమైన మేలు చేసిన వాడవుతాడు. ఇట్లాగ వివేకంతో చూచినట్లయితే రెండు ఉపదేశాలు విరుద్ధం కావు అని తెలుస్తుంది.

## 79. అకర్మ

476. కర్మలు చేసినా చేయకపోయినా "కర్మలను చేసే కర్తని నేను" అనే బంధరూపమైన అహంకారం నశించటమే నైష్కర్మసిద్ధి పొందినట్లవుతుంది.

వివరణ : నైష్కర్మసిద్ధి అంటే సకల కర్మలని వదలి ఏమీ చేయకుండా ఉండే స్థితిని పొందటమని ప్రజల అభిప్రాయం. అయితే అదినిజం కాదు. కర్తృత్వ నాశమే నిజమైన కర్మనాశం. నిష్కామ్య కర్మ అనినా, నైష్కర్మ సిద్ధి అనినా ఇదేనని శ్రీ భగవాన్ ఈ ఉపదేశంలో వివరించారు.

## 80. ఆత్మ సమర్పణ

477. ఎవరైతే "నేను" అనే అహంకారాన్ని ఈశ్వరునికి సమర్పిస్తారో, అతనికి, ఇక్కడే ఇప్పుడే ఈశ్వరుడు తనను అర్పించుకుంటాడు. అట్లాగ అర్పించుకొన్న జ్ఞానులే శివానందానుభవ సాగరంలో మునిగిన వారవుతారు.

వివరణ : పరాభక్తి, జ్ఞానం అభిన్నములై ఉండే అపురూప సత్యాన్ని ఇక్కడ ప్రబోధించారు.

478. నిరంతర ఆత్మ ధ్యానంలో "శరీరమే నేను" అనే అహంభావం నశిస్తుంది. అందువలన మనోనాశం సిద్ధించటమే అనేక జన్మలలోని భక్తి యొక్క అభ్యాసాతిశయ ఫలితం.

479. దైవానికి అన్యంగా జీవుడొకడు ఉండటం అసంభవం. అందుచేత ఆ భావాన్ని (తాను వేరు అనే భావాన్ని) త్యజించు. సదాచంచలమైన అహంకారాన్ని పూర్తిగా సమర్పిస్తే పరమశాంతి కలుగుతుంది. అదే పరాభక్తి యొక్క లక్షణం.

480. "పరమాత్మ స్వరూపుడైన దైవానికి అహంకార రూపమైన జీవాత్మని అర్పించు" అని శాస్త్రాలు చెబుతున్నాయి కదా! కాని, నిజమేమిటంటే, జీవుడు ఇదివరకే భగవంతునికి చెందినవాడే తప్ప వేరెవరి సొంతం? కనుక దైవం నుండి ఆయన సొత్తును దొంగతనంగా "నేను, నాది" అనే భావాలతో లాక్కొన్న తప్పును తెలుసుకొని సిగ్గుతో మళ్లీ ఆయన సొత్తును ఆయనకు అప్పగించడమే మన కర్తవ్యం.

481. “ఈశ్వరా, నాయిష్టానుసారం ఏదీ జరగక్కర లేదు. అంతా నీ అనుగ్రహం ప్రకారమే జరగనీ" అని భగవంతుని ఇచ్చకి వదలిన భక్తుని హృదయం ఎన్నడూ భయపడటానికి కారణముండదు.

482. ఆత్మని ప్రేమతో అనుసంధానం చేసే తన హృదయంలో తలపులకు తావివ్వకుండా ఉండటమే తనని ఈశ్వరునికి అర్పించుకొనుట.

వివరణ : ఆత్మనిష్ఠాపరుడై ఉండటమే ఈశ్వరార్పణ అని “నేనెవరు” గ్రంథంలో శ్రీభగవాన్ ఉపదేశించారు.

483. “ఈశ్వరా నీయిచ్ఛయే నాయిచ్ఛ" అని తనయిష్టాన్నంతా వదలివేయటమే సరైన ఆత్మ సమర్పణయని గ్రహించు.

484. సర్వేశ్వరునికి చెందిన సమస్త వస్తువులను, (యీ ప్రాణం, దేహం, లోకాదులు) నేను, నాది అనే అభిమాన మోహంచే బంధం పెంచుకొన్న జీవుడు (చోరుడు) “నేనెవరు?” “ఎక్కడి నుండి వచ్చా”నని అంతర్ముఖుడై విచారణ చేస్తే అతడు అప్పుడు ఎక్కడుండగలడు? (ఉండలేడు)

వివరణ : మనస్సు, శరీరం, లోకాదులు ఆత్మ నుండే కల్పిత దృశ్యాలుగా గోచరించుటచేత అవి ఆత్మయైన ఈశ్వరునికే చెందినవి. విచారిస్తే ఈశ్వరునికి వేరుగా “నేను” అని ఒకడు లేడని గ్రహిస్తాడు కాబట్టి ఈ భావాన్ని వెలిబుచ్చారు.

485. అహంకారం ఆత్మనిష్ఠలో మునగగా, మనోవాక్కాయాలు మూడూ కాష్ఠ సదృశంగా నిశ్చేష్టములై శివశక్తికి బలియై నశించినపుడు అప్పుడే ఆత్మ సమర్పణం సంపూర్ణంగా చేసినట్లవుతుంది.

486.దైవానికి మనం భక్తితో ఆత్మని సమర్పించడమంటే, బెల్లంతో చేసిన వినాయకునికి ఆ బొమ్మ నుండి ఒక చిన్న ముక్కని త్రుంచి నైవేద్యం పెట్టటం లాంటిదే.

487. వామభాగాన అంబికగల ఈశ్వరుని చరణాలపై (అంటే ఆత్మలో) భేషరతుగా మీ మనస్సునుంచండి. అప్పుడు "నేను, నాది" అనే అహంకార మమకారాలవంచన అంతమై బ్రహ్మానంద స్వరూపం బాగా ప్రకాశిస్తుంది.

## 81. శత్రువుతో వ్యవహారం

488. ఇతరులు (శత్రువులు) ఎంతటి దుష్టులుగా కనబడినా, వారిని మంచి వారు (సాధకులు) ద్వేషింపరాదు. కోరికలు ఎట్లాగ వదిలిపెట్టాలో అట్లాగే సాధకులు ద్వేషాలనీ వదిలిపెట్టాలి.

వివరణ : శ్రీరమణుల “నేనెవరు?" అనే గ్రంథంలోని ఉపదేశమే ఈ భావం.

489. సాధకుడు దేనిని (దేహాన్ని, అహంకారాన్ని) “నేను కాదు” అని త్రోసి పుచ్చుచున్నాడో దానినే కదా అతని శత్రువులు కూడా ద్వేషిస్తున్నారు . కనుక సాధకుని అనేక విధాలుగా దూషించే శత్రువులు, దాగలి (స్వర్ణకారునికి ఉపయోగపడేది) వంటి సహాయకారులే.

490.పగబట్టిన వారిని కూడా ప్రేమతో జయించే శక్తి సామర్థ్యాలు, ధైర్యసాహసాలు గలవాడే నిజమైన మునీశ్వరుడు.

## 82. జీవితంలో సంయమనం

491. కొందరు ధనికులైనా తమ ఆడంబరాన్ని వదిలిపెడితే పేదరికంతో అల్లాడే కొన్ని కోట్ల ప్రజలు బాగా జీవించవచ్చు.

492. కరుణామూర్తి ఈశ్వరుడు లోకంలోని అన్ని ప్రాణులకీ కావలసిన ఆహారాన్ని అందించాడు. అందుచేత, ఒకడు తన ఆకలి తీర్చుకోడానికి సరిపడే దానికంటే పిడికెడు ఎక్కువగా తిన్నా, అది ఇతర ప్రాణుల ఆహారాన్ని బలవంతంగా దొంగిలించి భుజించినట్లే.

## 83. అమితం ఒక పాపం

493. మితిమీరితే అమృతం కూడా విషమవుతుంది. దానివల్ల కలిగే దుఃఖాలెన్నో. కనుక అతి అనే దోషం సాధకులు తమవల్ల కలుగకుండా చూసుకోవాలి.

వివరణ : శ్రీ మురుగనార్ చెప్పినది: జాగరణలు, ఉపవాసాలు ఆధ్యాత్మిక జీవితంలో సహాయకారులైనప్పటికీ, అతిగా అనుసరిస్తే అవి ప్రతిబంధకాలవుతాయి. భగవద్గీతలో ఈ భావాన్ని అంటే అతిగా ఆచరించే వాడు యోగసిద్ధి పొందడని శ్రీ కృష్ణ భగవానులు ఉపదేశించారు. శ్రీరమణ మహర్షులు కూడా ఉపవాసంలో మిత సాత్విక ఆహారమే సాధనకు సహాయ పడుతుందని చెప్పటం కద్దు.

## 84. వినయం

494. ఎంత వినయంగా ఉంటే అంత నిండుతనం కలుగుతుంది. పొరపాటునైనా ఏ మాత్రము అహంకారం తలెత్తని మహనీయత భగవంతునిలో ఉండబట్టే భక్తులు ఆయనకు నమస్కరించే స్థితి ఏర్పడిందని తెలుసుకో.

(వేరు ఎంత లోతుగా ఉంటే చెట్టు అంత పొడవుగా పెరుగుతుంది)

495. ఉన్నతి చెందగోరే వివేకి తనకు అహంకారం పూర్తిగా నశించేవరకు ఇతరులకి నమస్కరించటమే మంచిది. ఇతరుల నుండి వందనాలు స్వీకరించటం ఎంతో తప్పు!

496. ప్రతి ప్రాణికీ తాను సేవకుడనని ఎంతో ప్రేమతో వినయంగా నుండటం వలనే కదా భగవంతుడు లోకపూజ్యుడైనాడు!

497. ప్రాణులలో తనను దర్శించి, వినయంతో తన దాసులకు దాసుడై, తనకంటే తక్కువ వారు లేరనటంవలనే కదా వినయానికి శిఖరమైన భగవంతునికి దైవత్వం లభించింది!

వివరణ : పై 494, 496, 497 భావాల్లో ఒక అపూర్వ సత్యాన్ని భగవాన్ సెలవిచ్చారు. ఈశ్వరుడు తన సకలసృష్టి యెడల వినయంతో ప్రేమగలవాడై యుండుటం చేతనే ఆయనకు దివ్యత్వం లభించిందని భగవాన్ అన్నారు. ఆదివ్య స్వరూపమే శ్రీరమణ మహర్షి యని తెలిపే ఒక సంఘటన ఏమంటే:

భక్తుడొకరు శ్రీభగవానుని "వేల కొలది భక్తులు మీకు నిత్యం నమస్కరిస్తున్నపుడు మీకు కలిగే అనుభూతి ఎటువంటిది"? అని ప్రశ్నించినపుడు శ్రీభగవాన్ ఇలా సమాధానం యిచ్చారు.

"వారొక్కక్కరూ ఈ గదిలోకి ప్రవేశించేటప్పుడే నేను వారికి మొదట నమస్కరిస్తున్నాను. తర్వాతే వారు నాకు నమస్కరిస్తున్నారు. అహంకారమణగిన స్థితే నమస్కరించే విధానమవుతుంది. అటువంటి వందనాలు చేసే సందర్భాలనేకం ఇక్కడ కలుగుతుంటాయి. అందుచేత ప్రతి ఒక్కరికంటే నాకే నిత్యం ఎక్కువ అవకాశాలు లభిస్తున్నాయి కదా!" అని అన్నారు. అహంకారం అణగివుండటమే దైవ పదాన్ని పొందటానికి సరైన మార్గమని వారి ఉపదేశం.

498. ఆత్మయే అణువుగా, మహత్తుగా మనస్సుకతీతంగా ఉండటం చేత, ఆత్మయైన సద్వస్తువు సర్వాతీతం అనబడుతుంది. కనుక సచ్చిత్స్వ రూపమైన ఆ ఆత్మలో మహత్తుకంటే మహత్తు ఐనదైనా అణువు కంటే సూక్ష్మమయినదైనా ఇమిడి ఉంటాయి.

499. గడ్డి పరక సముద్రంపై తేలడం, బరువైన ముత్యం సముద్రపు అట్టడుగున మునిగి ఉండటం సహజం. అట్లాగే ఈ లోకంలో ఉన్నత స్థితిలో నుండటం వలన వారికి ఔన్నత్యం రాదు. సత్పురుషులు సముద్రపు అట్టడుగునవున్నా వారు హీనమైన వారు మాత్రం కాదు.

వివరణ :

ఒకసారి భగవానుల సోఫా కంటే ఎత్తుగా ఏర్పరుచుకొన్న ఒకరి పీఠాన్ని భక్తులు కొందరు తీసేసారు. ఇది గ్రహించిన శ్రీభగవాన్ “ఆయనని పక్కకి తోసేసామని సంతోషిస్తున్నారే! మరి ఈయనని ఏం చేస్తారు మీరు?" అని తమ శిరస్సు పైన తోక పేళ్లాడుతూ చెట్టు కొమ్మపై కూర్చున్న కోతిని చూపించారు. భక్తులు తమ తప్పిదాన్ని తెలుసుకొని ఊరక ఉండి పోయారు.

## 85. చేయదగిన పని

500. చేయ తగ్గది ఆత్మ విచారం. పొందవలసినది స్వస్వరూపజ్ఞానం. వదలి పెట్టవలసినది అహంకారం. దుఃఖాలన్నీ నశించడానికి తానుండవలసిన మూల స్థానం ఆత్మ.

501. పొందవలసినది సత్య జ్ఞానం. ధ్యానించవలసినవి ఈశ్వరుని పాదాలు. సత్వరం అలవరచుకోవలసింది సజ్జన సాంగత్యం. హృదయంలో ఉప్పొంగవలసింది పరమశాంతి.

ఆత్మ విచారణ, అభ్యాసం మొదటి భాగం సంపూర్ణం.

## రెండవ భాగం

## తత్త్వానుసంధానం

## 1. ఉపదేశం - జ్ఞానార్జన

502. విక్షిప్తచిత్తులైన భక్తుల మనస్సు బహిర్ముఖం కాకుండా అంతర్ముఖమై యుండటానికి, ఆత్మలో సదా నెలకొన్న సద్గురుని ఉపదేశ వాక్యాలే అత్యంత ఉత్తమమైన మార్గమని స్తుతించు.

503. శివుడే సద్గురు రూపం దాల్చి భక్తులకు అనుగ్రహ వీక్షణాలనే వచనాలతో చెప్పకచెప్పిన "అది నీవే" (తత్త్వమసి) అనే ఉపదేశ వాక్యాన్ని గూర్చి హృదయంలో విచారిస్తేనే గాని జ్ఞానం కలగదు.

504 ప్రాణానికి ప్రాణమై హృదయంలో సదా "నేను-నేను" అనే సహజ స్ఫురణ ఉంది. పరిపక్వచిత్తులయిన శిష్యులకు ఈశ్వరుడు ఏకాంతంగా జ్ఞానోపదేశం చేస్తాడని చెప్పటంలోని భావం ఇదే.

వివరణ : శ్రీభగవాన్ రచించిన గ్రంథం "శ్రీ రమణోపదేశ మంజరి" లోని ఉపదేశ ప్రకరణంలో "కొందరు మహానుభావులు గురువు నాశ్రయించకుండానే ఆత్మ సిద్ధిని పొందారే! అది ఎట్లాగ? దానికి కారణమేమిటి?" అన్న ప్రశ్నకి "వారు పరిపక్వ జీవులు. వారిలో నున్న ఈశ్వరుడే వెలుగునకు వెలుగై ఆత్మ జ్ఞానాన్నిస్తాడు. అది నిజమే" అని సమాధానం ఇచ్చారు. ఆ భావాన్ని విశదీకరిస్తునట్లు ఈ వచనం అమరింది.

## 2. మహా వాక్యాలు

505. అనేక శ్లోకాలు నిండిన వేదాల సారమైన పరమార్థ భావమేమంటే, జీవబ్రహ్మైక్యస్థితని సూచించే (పర-జీవ-ఐక్యం తత్-త్వమ్-అసి) మౌనమని గ్రహించు.

506 జన్మ అనే అగ్ని నుండి తప్పించుకోవాలనే కోరికతో సచ్చిదానంద వస్తువుని ఆశ్రయిస్తున్న తీవ్రసాధకులకు (తత్-త్వమ్-అసి అనే మూడు పదాల్లో) "త్వమ్(నీవు)" అనే జీవ స్వరూప (నేను నాగురించిన) విచారణ ఒక్కటే ఉత్తమమైన మోక్షానిస్తుంది.

వివరణ : "తత్త్వమసి" అనే మహా వాక్యాన్ని సద్గురువు ద్వారా విన్న వెంటనే ఒక ఉత్తమ శిష్యుడేం చేయాలి? దానికి సమాధానం శ్రీరమణుల గ్రంథం "ఉన్నది. నలుబది"లోని 32వ పద్యభావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

'అదినీవు' అని వినగానే “ఏదినేను” అంటే “నేనెవరు?” అనే ప్రశ్న ఉదయించాలి. అదే శిష్యుని వృత్తి అవ్వాలి. ఈ ప్రకారం ఉత్తమ శిష్యుని ఆత్మాన్వేషణకు పురికొల్పటమే ఆ మహావాక్య ఉద్దేశం.

507. మందబుద్ధులు, మనోబలం లేని వారు, తమ మనస్సును ఆత్మ విచారణలో మగ్నం చేసేందుకు సహాయకారిగా "తత్” అనే పదం (అది), "అసి (ఉన్నావు) అనే పదంతో కలిపి “తత్-త్వం-అసి” (అది నీవే అయివున్నావు) అని వేదాలు మహావాక్యాన్ని చెప్పాయి.

508. తత్ - అసి అనే రెండు పదాలలోని భావాన్ని నిజంగా తెలుసుకోవాలంటే, 'త్వం' అనే పదం యొక్క అర్థాన్ని 'అది ఏది?' అని తనలో తాను విచారించటం ఒక్కటే మార్గం.

## 3. ఉపనిషత్తులు

509. అజ్ఞానమంటూ ఒకటుందనే భావమే లేని అనుగ్రహ రూపుడే భగవంతుడు. బ్రహ్మజ్ఞానమే ఆయన రెండు పాదాలు ఉంచిన పీఠం. ఆ పాదాల స్వర్ణ పాదుకలే ఉపనిషత్తులు. విజ్ఞాన విద్యకై వెర్రి ఆవేశంతో తిరిగే అహంకారి, ఉపనిషత్తులనే పాదుకలను శిరస్సున ధరించి స్తుతించడమే చేయతగ్గపని.

## 4. ఉపాసన

510. హృదయంలో ఈశ్వరుని దర్శించిన భాగ్యవంతులు అశుభవాసనలు నశించి జ్ఞాన కాంతితో ప్రకాశిస్తారు.

511. దైవీ సంపద నిండిన హృదయంలోనే ఆత్మ విచారణ పరిణతి చెందుతుంది. ఆత్మ విచారణమనే ఉపాసన ప్రాణానికి (జీవునికి) శుభాన్నిస్తుంది. ఆసురీ సంపద వల్ల ప్రాణానికి పెద్ద ముప్పు ఏర్పడుతుంది. దీనిని నీవు గ్రహించి ఆత్మ విచారణ అనే ఉపాసనతో దైవీసంపదను వృద్ధిచేసుకో.

వివరణ : బాహ్య సంపాదన వలన దొరికిన సంపదలన్ని ఆసురీలక్షణాలు కల్గినవే. అందుచేత అవి అనర్థాలనే కలుగచేస్తాయి. విచారణ ఒక్కటే మోక్షాన్ని కలుగచేసే దైవీ సంపదనిస్తుంది.

512. అద్వైత జ్ఞానాన్ని పొందటం చాలా అరుదు. అయినప్పటికీ భగవంతునిపై నిజమైన భక్తి కలిగితే, అవిద్య నాశమై భగవదనుగ్రహం కలుగుతుంది. దాని వల్ల అద్వైత జ్ఞానం సులభ సాధ్యమవుతుంది.

513. భగవంతుని పాదాలను భక్తితో హృదయంలో స్థిరంగా ఉంచుకొనట్లయితే, భ్రాంతి అనే బంధాన్ని త్రెంపవచ్చు. బంధం తెగినట్లయితే హృదయం వికసించి బ్రహ్మజ్ఞానాన్ని పొందవచ్చును.

వివరణ : భగవంతుడు, అనుగ్రహం అంటే ఆత్మ స్వరూపమేయని ఇదివరలో ఉపదేశించింది ఇక్కడ గుర్తుంచుకోవాలి.

514. జీవుడు తన శిరస్సును ఈశ్వరుని పాదాలపై మోపినట్లయితే శివస్వరూపంతో కలిసి శివమయమవుతాడు. అస్థిరరూపుడైన జీవుడు (అహంకారం) తన అచల స్వరూపాన్ని ఆశ్రయించి తన చాంచల్యాన్ని కోల్పోతే ఆత్మస్వరూపంగానే గోచరించినట్లు.

వివరణ : చలనం కెరటాల స్వభావం, కడలి స్వభావం నిశ్చలమైన శాంతి. పడిలేచే తరంగాలు శాంతించాలంటే తరంగాల స్వభావం నశించి కడలిగా రూపొందాలి. జీవుడు కూడా, శివభక్తితో జీవ స్వభావం కోల్పోయి శివమయుడువుతాడని ఉపదేశం.

515. బలమైన ఆశాపాశాలను చటుక్కున త్రుంచి పారవేసి, తీవ్రమైన భక్తితో మనస్సుని ఈశ్వరుని పాదాలపై లగ్నంచేసి, క్షణం వృధాకాకుండా ధ్యానించు.

వివరణ : మహర్షుల "విచార సంగ్రహంలో" చివరగా చెప్పినదే ఈ వచనభావం.

516. నిష్ఠలో నుండే మనస్సులో తప్ప, వేరేవిధంగా భగవంతుని స్వరూపం గోచిరంచదు. అనేక తలపులతో అలసిపోవటం (జాగ్రత్స్వప్నములు), లయించటం (నిద్ర) వీనిని అధిగమించి మనస్సు ఆత్మఅయిన భగవంతుణ్ణి ఒకణ్ణి ఆశ్రయించునట్లు చేయి.

517. రక్తమాంసాలతో కూడిన ఈ శరీరమే నేననే భ్రాంతి ఆవరించిన బుద్ధితో అన్యవస్తువులపై కలిగిన మోజును వదిలేయండి. అలాగే వదలి మౌనం వహిస్తే మనస్సే పరిశుద్ధమైన స్పటికలింగం అవుతుంది. దాన్ని స్తుతిస్తే అంతులేని బ్రహ్మానందం లభిస్తుంది.

518. అకుంఠిత భక్తితో ఈశ్వరారాధన చేసేందుకు ప్రతి రోజూ మంచిదే. ప్రతి గ్రహ వీక్షణము మంచిదే. ప్రతి యోగం మంచిదే. ప్రతి ముహూర్తము మంచిదే.

వివరణ : దినబలం, గ్రహబలం అని చెప్పే కాల భేదాలన్నీ మనస్సుకి సంబంధించిన లౌకిక కార్యాలకి అడ్డంకులు కల్గించవచ్చునేమో గాని, మనోతీతమైన ఆత్మ ధ్యానానికి ఆటంకాలు కావని శ్రీ మురుగనార్ భావం.

519. దైవం మీదగాని, గురువు మీదకాని లేక మరిదేని మీదనైనాగాని, విశ్వాసం అనేది కలగటమే అరుదైన మహాభాగ్యం. అట్టి విశ్వాసాన్ని అప్పుడే పుట్టిన బిడ్డనువలె కాపాడుకోవాలి. కామధేనువును వలె జాగ్రత్తగా చూసుకోవాలి. సంశయరహితమైన శ్రద్ధాభావంతో పెంచి పోషించుకోవాలి.

## 5. మౌనోపాసన

520 హృదయాసనంపై ఈశ్వరుని ప్రతిష్టించి, ఆయనలో లీనమై కరగి * పోయేటట్లు, నిరంతరం తన సహజ స్థితిలో నుండుటయే అతి శ్రేష్ఠమైన మౌనోపాసనమవుతుంది.

521. తన కన్యమైన విషయాలపై ఆసక్తి లేకుండా, ఆత్మ స్వరూపంపై అత్యంత '* ఆసక్తితో నుండే స్థితే అద్వైత స్థితి. ఈ మౌనానుభవంతో, ఆ పరమౌనమే తానై ఉండటమే మానసిక పూజ.

వివరణ : అన్ని విధాలైన పూజాద్రవ్యాలని మానసికంగా సేకరించి అర్చనాది షోడశోపచారాలతో భగవంతునికి మనస్సుతో చేసే పూజ మానసిక పూజ అని చాల మంది భావిస్తారు. ఆత్మనిష్టే నిజమైన మానసిక పూజ అని ఇక్కడ ఉపదేశ భావం.

## 6. అహంకార వాదన

522. ప్రారబ్ధం, స్వప్రయత్నం అనే రెంటిలో ప్రారబ్ధం చాలా బలీయమైందని, కాదు స్వప్రయత్నమే (బుద్ధి) గొప్పదని వాదిస్తారు. అట్టివారు తమ అహంత పుట్టుట, గిట్టుటను గురించి కొంచమైనా ఎఱుగని పామరులు.

వివరణ : ఉన్నది నలుబదిలోని 19వ శ్లోకభావాన్నే ఇక్కడ చెప్పారు.

523 "నేను నేను" అని ప్రతి ఒక్కరి హృదయంలో స్ఫురిస్తున్న పరవస్తువును విచారించి, తెలుసుకొని మౌనస్థితిని పొందాలి. దానికి విరుద్ధంగా అహంకారం చేత కొందరు గంతులేసి గొంతు చించుకొని మత పరమైన సిద్ధాంతరాద్ధాంతాలతో అనవసరంగా డాబు ప్రదర్శిస్తారు.

524. నిజాన్ని కప్పి పుచ్చటమే తర్కవాదాల గుణం. అసలు తర్కమే కల్పితం కాబట్టి, బుద్ధిని అదికలచి వేస్తుంది. అటువంటి తర్క బుద్ధి అనే గోతిలో పడ్డవారు ఆత్మ జ్ఞాన సూర్యుని కనలేరు.

525. మాటలు సద్వస్తువుని వివరించటానికి బదులు దానిని కనబడకుండా కప్పేస్తాయి. అందుచేత, ఆత్మ తానుగా ప్రకాశించేట్టు వాక్కును, మనస్సును హృదయంలో విలీనం చేయి.

526. శబ్దజాలాలకి, తర్కవితర్కాలకు నీ బుద్ధిని బానిసను చేయకు. సాత్విక మనస్సుతో అంతర్ముఖుడవై, భేదదృష్టినివీడి, నీ నిజ స్వరూపాన్ని తెలుసుకొని ప్రకాశించు.

## 7. కొలతల మాయ

527. ప్రమాణము, ప్రమేయము, ప్రమాత - ఇవి హృదయంలో వెలిగే సద్వస్తువు యొక్క అస్తిత్వం కారణంగా గోచరిస్తున్నాయి. సద్వస్తువైన ఆ ఆత్మకు ప్రమాణం ఏదైనా ఉందా? (ఆత్మను ఎఱుగగల ప్రమాణం ఏముంటుంది?)

528. ప్రమాత ఉన్నంత వరకే ప్రమాణ ప్రమేయాములు ఉన్నట్లు తోస్తాయి. ప్రమాత అయిన అహంకారం తనకు మూలమైన ఆత్మను దర్శించి, అందులోమునిగి, నశించిపోతే అప్పుడు ప్రమాత్రుమాణప్రమేయములు మూడు నశిస్తాయి.

## 8. పరోక్ష జ్ఞానం

529.మనోవాసనలు నశిస్తే అపరోక్షమయిన విశుద్ధ అనుభవ జ్ఞానం కలుగుతుంది. దానివల్లనే జీవుని వేదన (మోక్షానికి) తీరుతుందే తప్ప, ఆత్మని గురించిన గ్రంథ విద్య చేత ఎన్నడూ తీరదు. శరీరతాపం ఎండమావి (మృగతృష్ణ)తో చల్లబడేటట్లయితే, ప్రాణుల మోక్షేచ్ఛ కూడా పరోక్ష (గ్రంథ) జ్ఞానంతో తీరవచ్చు.

530. శుద్ధ పరమాత్మ స్వరూపానుభవమే అద్వైత అపరోక్ష జ్ఞానము. అనుభవం కానిది, శాస్త్ర పఠనంతో గ్రహించినది అయిన పరోక్షాన్ని 'జ్ఞానం' అనటం (పరోక్ష జ్ఞానం అని) పాపాత్ముడైన రాక్షసుని "పుణ్యజను" డని పిలవడం వంటిది. (పరోక్షజ్ఞానం అజ్ఞానమే).

531. క్షుద్రమైన బుద్ధిని నశింపచేసే ఉత్తమ ఆత్మజ్ఞానం, హృదయంలో లో దృష్టితో అన్వేషించి చేసే విచారణతోనే ఉదయిస్తుంది. శాస్త్రాలు చదివి అనుష్ఠించని ఆత్మ విచారణ, వంటకి ఉపయోగ పడని కాగితం పై గీచిన సొరకాయ బొమ్మ వంటిది.

532. చిత్రంలో గీచిన ఒక మండే జ్వాలతో వంటచేసి భుజిస్తే ఆకలి తీరుతుందా? అట్లాగే అహంకారం నశింపగా కలిగిన అపరోక్ష జ్ఞానం చేతనే తప్ప, ఆత్మసుఖం వాసనాజ్ఞానంతో అంటే శాస్త్ర జ్ఞానంతో మాత్రం లభించదు.

533. బుద్ధిని ప్రకాశింపచేస్తూ, హృదయంలో మూలము, దివ్యస్వరూపమైన జ్ఞానం కలిగితే తప్ప, శాస్త్రజ్ఞానంతో చేసే వాద ప్రతివాదాలతో పరమసుఖం ఎన్నడూ కలుగదు.

## 9. జీవుడు ఒక్కడే

534. ముముక్షువులు "జీవుడు ఒక్కడే" అని విచారణతో తమ హృదయస్థితులై ఉంటారు. అట్లాగ ఉండలేని అవివేకుల మనస్సులను నెమ్మదిగా ఒప్పించేందుకు "ప్రాణులు అనేకం జీవులు అనేకం" అనే మిథ్య అర్థవాదముగా వ్యవహరింపబడుతోంది.

535. జన్మించినదెవరు? ముక్తినొందినదెవరు? "నేను" అనే అహంభావం మీకు ఉదయించని నిద్రలో, దేహంలో బంధింప బడిన అజ్ఞానులున్నట్లూ, బంధాలు నశించిన జీవన్ముక్తులున్నట్లూ మీకు తెలుస్తోందా? కొంచెం ఆలోచించి సమాధానం ఇవ్వండి!

## 10. విద్య - అవిద్య

536. ఒకదాని కంటే మరొకటి శ్రేష్ఠమైనదని విశ్లేషించే జనులారా! దేనిని అన్వేషిస్తే, ఫలితంగా ఇక అన్వేషించటానికి, పొందటానికి ఏ వస్తువూ లేకుండా పోతుందో, ఆ వస్తువుని (తనని - ఆత్మని) అన్వేషించడమే (పరిశోధించడమే) నిజమైన విద్య.

537. ఆత్మని ఉత్సుకతతో విచారించి తెలుసుకొనే శక్తి గల ముముక్షువులకి జగత్తులోని వస్తువుల గురించిన విద్యతో ఏం ప్రయోజనం? ఈ విద్య కంటే, అంతర్ముఖమై విచారించి పొందే ఆత్మ జ్ఞానమే అతి శ్రేష్ఠమైన విద్య,

538. ఆత్మ స్వరూపాన్ని బాగా ఎరిగి, దాని కన్యమైన యీ జగత్తంతా మిథ్యయని త్రోసిపుచ్చే జ్ఞానమే దేశ కాలాలకి అతీతమైన జ్ఞానము. అంతే తప్ప వేరే ఏ విద్య ఐనా శ్రేష్ఠమైన జ్ఞానం కాలేదు.

539. శక్తి యొక్క లీలలుగా కనబడుచున్న ఈ ప్రపంచమంతా ఈశ్వరునికంటే (ఆత్మ స్వరూపుని) వేరుకాదు. ఇలాగున్నప్పుడు, ఆత్మచిద్రూపమైన ఈ లోకాన్ని తన కన్యమైన వస్తువుగా నెంచి దానిపై రాగవిరాగాలతో కలత చెందే మనస్తత్వమే మనకి అవరోధం కలుగచేస్తుంది. అదే మాయ.

540. శరీరమే నేను అనుకొనే అహంకారమే శత్రువు. అదే అవిద్యా మోహం కూడా. ఈ అవిద్యకి ప్రత్యేకమైన ఉనికి లేదని తెలుసుకొనే జ్ఞానమే పొందవలసినటువంటి సహజాత్మ సిద్ధి.

వివరణ : ఉన్నది నలుబది గ్రంథంలోని 13వ శ్లోక భావాన్ని ఇక్కడ గమనించాలి.

541. అవిభాజ్యమైన (ఏకమైన) ఆకాశాన్ని కేవలం మనఃకల్పనలచేత పలురకాలైన ఆకాశాలుగా (ఘటాకాశం, మహాకాశం అని) చెబుతాం. అట్లాగే ఏక వస్తువైన ఆత్మని మందబుద్ధులు అనేక జీవాత్మలుగా నెంచటం మాయ చేసే అద్భుతమైన పని.

542. సత్యాత్మ స్వరూపాన్ని (ఏకవస్తువుగా చూడక) అనేకంగా చూడటమే అవిద్య. కనుక చూసే వస్తువు ఎటువంటి నామరూపాలు గల దైనప్పటికీ, దానికి అధిష్ఠానమైన ఆత్మను చూడటమే విద్య లేదా జ్ఞానం.

543. బాహ్య ప్రపంచం అనేక నామరూపాలుగా కన్పించినా దానికి అదిష్ఠానమైన సద్వస్తువు (ఆత్మ) ఒకటే. గానుగలో నువ్వులెన్ని ఉన్నా వాటిలోని నూనె ఒకే రకంగా నుండటం వంటిదే ఇది.

544. అద్వితీయమైన సచ్చిదానంద స్థితిలో ఒకదానిని తెలుసుకోవటం, తెలుసుకోకుండా ఉండటమనే రెండు వేర్వేరు స్థితులు లేవు. ఇది తెలుసుకోవటమే నిజమైన జ్ఞానం.

545. మనకి తెలిసిన "జ్ఞానం అజ్ఞానం" అనే ద్వంద్వాలు బాహ్యవస్తు జాలాన్ని తెలుసుకొనే తెలివి రూపంలోనే ఉంటాయి. కాని తన ఉనికే స్వభావంగా గల ఎఱుకలో ఆ ద్వంద్వాలు లేక పోవడం వలన ఆ రెండూ లేని జ్ఞానమే, నిజమైన జ్ఞానము.

వివరణ : ఉన్నది నలుబదిలోని 12వ శ్లోకాన్ని, ఉపదేశసారంలోని 27వ శ్లోకాన్ని ఇక్కడ సమన్వయించుకోవాలి.

546. "నిన్ను తెలుసుకో" అని కొందరంటారు. తన్ను తెలుసుకోలేనివారు ఎవరైనా ఉంటారా? "నన్ను నేను ఎఱుగను" అని చెప్పడం అజ్ఞానం. అట్లాగే "నన్ను తెలుసుకున్నాను" అని చెప్పడం కూడా అజ్ఞానమే కదా!

వివరణ : ఉన్నది నలుబది గ్రంధంలోని 33వ శ్లోకాన్ని యిక్కడ జ్ఞాపకం చేసుకోవాలి. ఆత్మ జ్ఞానం సిద్ధించిన జ్ఞానులు 'మమ్ము తెలుసుకున్నా"మనో "తెలుసుకోలే" దనో చెప్పరు.

"కనితిని ననుటకు మనము రాదయ్యె కననైతి ననుటకు మనమెట్లా వచ్చు?" అని అరుణాచలాష్టకంలోని రెండవ పద్యభావాన్ని శ్రీ భగవాన్ తెలిపినది గ్రహించాలి.

అమనస్సు లేని స్థితే జ్ఞానాజ్ఞాన మనే ద్వంద్వాలు లేని స్థితి.

547. ఉన్నాననే జ్ఞాన రూపంగా నెలకొనే ఆత్మనిష్టలో జ్ఞానాజ్ఞానాలనే ద్వంద్వాలుండవు. అజ్ఞానం అంటే అది ఒక ఉనికి అంటూ లేని అసత్యం. ఉనికి ఒక్కటే సత్యం. ఆత్మ జ్ఞానం పొందితే "అజ్ఞానమే ఒక తెలివి తక్కువ తనం. ఉన్నాను, అనే శుద్ధ జ్ఞానమే మన ఆత్మ స్వరూపం" అని బోధపడుతుంది.

## 11. భ్రమ

548. "నేను నన్ను తెలుసుకోలేదు" అనే భ్రాంతి తాను బాహ్య విషయాలని తెలుసుకుంటున్నాననుకొనే వరకే వుంటుంది. దానికి మారుగా, "తాను ఎప్పుడూ తెలుసుకొనబడినవాడనే" అనే సహజ జ్ఞానం కలిగితే "నన్ను ఎఱుగుదును" అనే భ్రాంతి కూడా (బాహ్యవిషయాలోచనలు లేని కారణంగా) తిరిగి కలుగదు.

549. అన్యవస్తువంటూ ఏదీ లేకుండా అంతా తానే అయిన పరిపూర్ణ ఏకత్వమే మన సహజస్థితి. అటువంటి నాస్థితి యేది? నేనెవరు? అని విచారించి ఆత్మనిష్ఠలో ఉండాలి. దానికి బదులు తన కన్యమైన వాటిని తెలుసుకొనేతెలివంతా అజ్ఞానమే.

550. మనః కల్పితాలే మనోకాశంలో కలలుగా కనబడతాయి. అట్లాగే మెలకువ అనే ఈ జగద్దృశ్యం మన తెలివికి తెలుస్తోంది. ఈ భావాన్ని దృఢపరచుకొని, మెలకువలో కనిపించే మధ్యమ, ప్రథమ పురుషల జ్ఞానాన్ని, వానిపై వ్యామోహాన్ని నశింప చేసుకొని తానుతానుగా ఉండటమే శ్రేష్ఠం.

551. ఆత్మని ఎరుగ లేని మందబుద్ధులు మాయకులోనై భయంతో శోకిస్తారు. సర్వవ్యాప్తమై, ఆనందసాగరమైన ఆత్మని తెలుసుకొన్న జ్ఞానులు ఆ మాయకి భయపడరు.

552. సద్వస్తువు యొక్క అద్వైత తత్త్వాన్ని ఎరుగక తిరిగే పిచ్చివారూ, వాసనలనే కామెర్ల కళ్లతో (ఆత్మని) అనేక వస్తువులుగా చూసి భ్రమించే వారూ ఎడారిలో ఎండమావిని చూసేటువంటి వారే.

వివరణ : ద్వైత భావం గలవారు త్రిపుటిచేత ఎన్నో దుఃఖాలు పొందటం ఖాయమంటున్నారు.

12. జాగ్రత్ స్వప్నం
553. జాగ్రత్, స్వప్నాల రెండిటిలోనూ ఒకే రకమైన దోషం ఉన్నదని జ్ఞానులంటారు. స్వప్నలోకం లాగా దేహాభిమానంతో కూడిన జాగ్రత్ లోకం కూడా మాయమైపోయేదేకదా!

554. తాను స్వప్నంలో చేసిన కర్మల ఫలాలు మెలకువలో అనుభవించటానికి వీలులేక అసత్యమై జారిపోతాయి. అట్లాగే మెలకువ అనే యీ హీనమైన అహంకార మయ జీవితంలో చేసిన కర్మత్రయ ఫలాలు కూడా, ఆత్మ స్వరూపానుభవమనే మెలకువ కలిగిన తర్వాత ఏమీ మిగలక నశించిపోతాయి.

వివరణ : జ్ఞానికి కర్మత్రయాల ఫలాలు లేవని భావం.

555. జాగ్రత్ స్వప్నాలు, తలపులు, నామరూపాలు అన్నీ ఒకే తరగతికి చెందినవి. కనుక జ్ఞానులు జాగ్రత్స్వప్నాలు చిత్తభ్రమ చేత కలిగాయంటారు.

556. అహంకారం అల్పంగా వ్యాపించి వ్యవహరించడం వల్ల స్వప్నాలు కలుగుతున్నాయి. అది పూర్తిగా వ్యాపించి వ్యవహరించినపుడు జాగ్రత్ జగద్దృశ్యాలు కలిగి కనబడుతున్నాయి.

557. జాగ్రదవస్థకు కారణమైన కర్మానుభవాలు పూర్తి అయిన తర్వాత, స్వప్నానికి అనుగుణమైన కర్మలు ఆరంభమవుతున్నప్పుడు మెలకువలో ఒక దేహాన్ని "నేను" అని అభిమానించి పట్టుకొన్నట్లే, కలలో గూడా మనస్సు మరొక శరీరాన్ని (స్వప్న శరీరాన్ని) 'నేను' అని అభిమానించి పట్టుకుంటుంది.

558. "పైన చెప్పినట్లు స్వప్న శరీరం, జాగ్రత్ శరీరం వేర్వేరుగా ఉండగా, స్వప్నంలో ఒక స్త్రీ యొక్క స్వప్న శరీరంతో సంభోగిస్తున్నట్లు చూసే వాని జాగ్రత్ శరీరం స్ఖలించటమెందు?" కని ప్రశ్నిస్తే మనస్సు స్వప్న శరీరం నుండి జాగ్రత్ శరీరంలోకి ప్రవహించే వేగమే దానికి కారణమని చెప్పాలి.

559. మనం చూసే స్వప్నం కలతచెందిన మనస్సు యొక్క తరంగమే. అయితే మనం చూసే ఈ మెలకువ కూడా అటువంటిదే. మెలకువలో జరిగేవి ఎంత నిజమో, స్వప్నంలో జరిగేవి కూడా ఆ స్వప్నకాలంలో అంతే నిజమైనవి.

560. “స్వప్నం క్షణికంగా కనబడి మాయమవుతుంది. జాగ్రత్ మాత్రం దీర్ఘంగా ఉంటుంది" అని చెప్పే జవాబు కూడా ప్రశ్నించేవారిని తృప్తి పరచటానికే. (అదినిజంకాదు. యదార్థానికి అవి రెండూ ఒకే రకమైనవి. కాలం మనఃకల్పితం కాబట్టి దీర్ఘకాలం, క్షణకాలం అనే) కాలభేద కల్పితాలన్నీ మనస్సు చేసే మాయ యొక్క పన్నాగం.

561. యుగాన్ని ఒక్క క్షణం గాను, క్షణాన్ని ఒక యుగంగాను తోచేట్లు చేసి కల్లోలపరచడమే మనస్సు యొక్క మాయాజాలం.

వివరణ : మనోమాయ చేత దేశకాల భేద కల్పితాలు జరుగుతున్నాయని భావం.

562. అజ్ఞానాంధకారంలోనే ద్వంద్వాలని కల్పిస్తోంది అహంకారం. ఈ అహంకారమే వ్యవహార స్థితులైన రెండు స్వప్నములకు మూలం. సదా అంతర్ముఖుడై పూర్ణమైన తన ఆత్మ స్వరూపంలోనే ఈ అహంకారం యొక్క రెండు స్వప్న జగత్తులను నశింప చేయాలి.

563. స్వప్నము, జాగ్రత్తు అనే రెండు రకాలైన స్వప్నాలనుచూసేది. తన నిజస్థితియేమిటో తెలుసుకోలేనిది ఈ అజ్ఞాన భ్రాంతితో కూడిన మనస్సు. ఈ మనస్సు తాను ఎవరని విచారించి భేద దృష్టిని వీడి నశిస్తే ఆత్మ అయిన ఈశ్వరుని పాద పద్మాలవద్ద జ్ఞాన సూర్యుని వలె వెలుగుతుంది.

564. నిద్రపోతున్న వాడు స్వప్నంలో తాను తిరిగి తిరిగి అలసి సొలసి పోయినట్లు చూసి, మేలుకొన్న తర్వాత, ఆ స్వప్న దృశ్యమంతా కేవలం అబద్ధమని తెలుసుకుంటాడు. తన మెత్తని పడక మీద, ఎటువంటి దుఃఖాలు లేకుండా అసంగుడుగా నిద్రపోతున్న తానొక్కడే నిజమని గ్రహించడమే జ్ఞానం.

వివరణ : తాను లేకపోతే త్రిపుటి లేవు. ఇది తెలుసుకుంటే అవన్నీ తన కన్యంగా, కేవలం మిధ్యగా వీడిపోయి నిరాధారమైపోతాయి. ఆ త్రిపుటుల సంగం లేకుండా సత్యజ్ఞానంలో శయనించే సుఖరూపుడే జ్ఞాని.

565. తాను ఒక మండుటెడారిలో దోవ తప్పి అల్లాడి, తర్వాత వెదుక్కుంటూ తన ఊరుచేరినట్లు కలగంటాడు. అలాగే జననమరణ రూప సంసారంలో తాను అనేక జన్మలెత్తి తుదకు ముక్తి పొందినట్లు (ఆత్మవిచారణ ద్వారా) భావిస్తాడు. రెండు సమానమే.

వివరణ : ముక్తి కూడా ఊహే. ఆత్మ స్వరూపమొక్కటే ఎప్పుడూ ఉన్నది అని సూచించారు.

## భగవాన్ - 9

తాను ఆత్మ స్వరూపమేనన్న విషయం మరచి, ఈ శరీరమే తన నిజ స్వరూపమని యెంచి, లెక్కలేని శరీర జన్మలని పొంది, చివరికి జన్మరాహిత్యమైన బ్రహ్మ స్వరూప స్థితిని తెలుసుకొని, ఎప్పటివలె బ్రహ్మంగా ప్రకాశించే సహజ స్థితిని పొందటమంటే; నిద్రలో లోకమంతా తిరిగినట్లు చూసిన స్వప్నం నుండి మేల్కొనడానికి సమానం.

## 13. అవస్థలు

566. విశాలమైన ఆకాశాన్ని వదలి యితర నాలుగు భూతాలు (పృథివి, నీరు, అగ్ని, వాయువు) ఉండగలవా? (ఉండలేవు). ఉండగలిగినవైనట్లయితే, నిష్కళంకమైన తురీయావస్థకి వేరుగా మెలకువ, కల, నిద్ర అనే మూడు అవస్థలు కూడా ఉండగలవు, (అంటే మెలకువ, కల, నిద్ర నిజం కావని భావం).

567. నిద్రా తమస్సును చీల్చుకొని ప్రకాశించే సహజతురీయావస్థలో దృఢంగా నిలబడలేని మందబుద్ధులకే మెలకువ, కల, నిద్ర అనే మూడవస్థలు గోచరిస్తాయి. వాటి మూడింటితో పాటు తురీయం, తురీయాతీతం అనే నాలుగు, అయిదవ అవస్థలు కలసి అవస్థాభేదాలని గ్రంథాలు చెబుతున్నాయి.

వివరణ : గ్రంథాలు తెలిపిన తురీయం తప్ప (అదే నిజ జ్ఞాన స్వరూప స్థితి) ఇతర జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయాతీతం ఏవీ నిజంకాదని భావం. ఈ భావాన్ని ఇంకా వివరంగా తెలుసుకోడానికి ఉన్నది నలుబది అనుబంధంలోని 32వ పద్యాన్ని చూడాలి.

568. అహంకార రూప జీవుడున్నంత వరకే జాగ్రత్ స్వప్నావస్థలు, వాటి భేదాలు తెలుస్తాయని గ్రహించు. ఎగసే యీ అవస్థలకభిమాని (జీవుడు) తాను యెవరని విచారించి నశించినట్లయితే, వానితో పాటు అవస్థాభేదాలూ నశిస్తాయి.

569. ఉత్తమమైన స్వాత్మ భక్తితో ఆత్మ స్వరూప ప్రాప్తిని పొందిన జ్ఞాని ఎటువంటి వికల్పాలు లేని సహజ కైవల్య స్థితికి మారుగా వేరొక అవస్థ ఉండటాన్ని చూడడు.

వివరణ : ఒక బట్ట బయలు ప్రదేశంలో రెండు గోడలు కడితే ఆ బయలు మూడు భాగాలవుతుంది. అట్లాగే అవిద్యచేత తోచే జాగ్రత్ స్వప్నాలనబడే రెండు రకాల దేహాత్మ బుద్ధి కల్పనలతో మన సత్యస్థితి మూడవస్థలు పొందినట్లు తోస్తుంది. మన సహజ స్థితిలో జాగ్రత్ శరీరంలో కలిసిన దేహాత్మ బుద్ధి స్థితిని జాగ్రదవస్థంటున్నాము. స్వప్న శరీరంతో కలిసిన దేహాత్మ బుద్ధి స్థితిని స్వప్నావస్థయని అంటున్నాం. ఇట్లాగ అనుకొంటున్న మనం మూడవ భాగం అంటే యీ రెండు శరీర ఉపాధులు కాని మన యదార్థ స్థితిని నిద్రావస్థ అని అనుభవిస్తున్నాము. జాగ్రత్ స్వప్నాలనబడే రెండు గోడలు ఆత్మ విచారణతో నశిస్తే ఎటువంటి ఎల్లలూ లేని ఒకే ఎటుకగా ఉండటాన్ని గ్రహిస్తాము. ఇట్లాగ గ్రహించే తరుణంలో దీనిని

ఆ మూడు కాని నాల్గవ అవస్థగా భావించి దానికి "తురీయం-నాల్గవది" అని నామకరణం చేశాం. అయితే, తర్వాత (ఈ తురీయం యొక్క కొత్తదనం నిజం కాదని, ఆ మూడవస్థలు నిజమైతేనే కదా యిది నాల్గవ అవస్థ అని అనటానికి! అయితే ఆ మూడు అసత్యమని తెలిసిన క్షణం దానిని తురీయ మనడం ఎందుకు? అని తెలుసుకొనడం చేత) యిది తురీయం కాదు. మన స్వభావ స్థితేయని తెలుస్తుంది. కాని శాస్త్రాలు యీ స్థితికి మళ్లీ "తురీయాతీత"మని ఒక పేరు పెట్టాయి!! ఇవన్నీ జీవుడికి అజ్ఞాన దశలో ఆత్మజ్ఞానాన్ని గురించి చెప్పినటువంటి పదజాలాలే. తన ఉనికిని గురించిన ఎఱుక ఒకటితప్ప యిక వేరే అవస్థలంటూ ఏవీ లేవు అని గ్రహించిన జ్ఞాని అనుభవం అవస్థాతీతమే.

## 14. సత్కర్మలు దుష్కర్మలు

570. ఈశ్వరుడు వేరు తాను వేరు అని భావిస్తున్నంత వరకు, కర్తృత్వభావంతో మంచి చెడు కర్మలను చేసిన ఫలితంగా సుఖదుఃఖాలు అనుభవించే తీరుతాడని అభిప్రాయపడటం సబబే.

వివరణ : కర్తృత్వమున్నంత వరకు కర్మలు, కర్మఫలాలను ఎవరు కాదనలేరని ఉపదేశం.

571. ప్రాణం తన ప్రారబ్ధ కర్మ ఫలాలను నిశ్శేషంగా అనుభవించేవరకు, ఆయుస్సు తీరకుండా శరీరం జీవించివుంటుంది. అలా ఉండటానికి అహంభావమనే భూతాన్ని ఆ శరీరాన్ని కాపాడే రక్షకుడుగా నియమించాడు. ప్రాణనాథుడైన ఈశ్వరుడు.

572. మనం గత జన్మలలో చేసిన మంచి,చెడు కర్మలే ఈ జన్మలో సుఖదుఃఖాలుగా, వానికి నిమిత్తకారణమైన మిత్రులుగా శత్రువులుగా పరిణమిస్తాయి.

573. తాను చేసే కర్మల వలన కలిగే లాభం మాత్రం బాగుంటే చాలని యెంచేవాడు, ఏ విధంగానైనా ఆ సత్కర్మని చేయకుండా ఉండుగాక! కాని సత్కర్మలను చేయడానికి అనుసరించే మార్గం చెడ్డదయితే ఆ సత్కర్మ దుష్కర్మే అవుతుంది. కాబట్టి అనుసరించే మార్గం కూడా చాలా పరిశుద్ధంగానే ఉండాలని గ్రహించు.

574. స్వచ్ఛము, శాంతము అయిన మనస్సుతో ఆనందంగా చేసే కర్మలే సత్కర్మలు. కల్లోలితము, కామ భూయిష్టము అయిన మనస్సుతో చేసేవన్నీ దుష్కర్మలే.

## 15. ద్వంద్వములు, త్రిపుటులు

575. ఈ దృశ్యమాన జగత్తు - అనాత్మ. ఇది స్వస్వరూపం నుండి జారిన మనస్సు కల్పించినట్టిది. ఇంద్రియ గోచర మాత్రములై భ్రాంతిజన్యములైన ద్వంద్వములు, త్రిపుటులకు ఇది నిలయము. జగత్తు యొక్క లక్షణం ఇదే.

576. “ఇది ఒక వస్తువు” అని గ్రహించటం వలనే దానికి ఒక స్వరూపం ఏర్పడుతోంది. ఆ గుర్తుతోనే ఆ వస్తువుని స్పష్టం చేయగలుగుతున్నాము. అలాగే కొలతలు నిర్ణయిస్తున్నాము. ప్రమాణమునకు పరిమితమవుతుంది. కాని సకలములకు అతీతమైన ఆత్మమాత్రం ప్రమేయము కాదు, జ్ఞాతము కాదు.

వివరణ : ఆత్మ ద్వంద్వాలు. త్రిపుటులు లాగ తెలుసుకొనబడే వస్తువు కాదు. కనుక దానికి ఒక గుర్తు. లక్షణము ఆపాదించి కొలమానానికి పరిమితం చేయడానికి వీలు లేదు.

577. ఆత్మ అద్వితీయం కాబట్టి అన్యమును చూడటమనే భేదదృష్టి దానికి పొసగదు. కనుక అన్యవస్తువుని చూసే జీవుడు "తానెవరు?" అని దృష్టిని తనలోకి సారిస్తే హృదయ గ్రంధి ఛేదించబడి, చూడబడే త్రిపుటి దృశ్యాలన్నీ అదృశ్యమై నాశమైపోతాయి.

578. ఆత్మ స్వరూపజ్ఞానమొక్కటే మనం హృదయస్థం చేసుకోవలసిన ఏకైక సత్యం. కనబడే ఈ త్రిపుటులన్నీ మాయమనస్సు సృష్టించిన స్వప్న దృశ్యాలే. ధైర్యంతో వాటిని తిరస్కరించు.

579. ఆత్మ స్వరూపం అద్వితీయమైనదనే విశేషం చేత, దానిని పొందాలంటే దానిని ఆశ్రయించటమే తప్ప మరో మార్గం లేదు. కాబట్టి సాధన, సాధ్యము రెండూ ఒకటే. రెంటినీ ఆత్మగానే చూడు.

580. మనస్సు భేదాలని సృష్టిస్తుంది. ఆ మనస్సు సచ్చిత్ స్వరూపమైన బ్రహ్మీస్థితిలో మునిగి నశిస్తే, గోచరించిన సమస్త దృశ్యాలూ బ్రహ్మ స్వరూపమే అవుతాయి.

581. అన్యమును గ్రహించే అజ్ఞానుల బుద్ధులు పలు రకాలంటారు. ఆ భ్రాంతి నుండి తేరుకోలేని వారే వారు. ఆశాభయాల వంటి ఉద్వేగాలను కలుగచేసే పంచేంద్రియాల ద్వారా బహిర్ముఖమయ్యే మనస్సును ఉపసంహరిస్తే జ్ఞానం కలుగుతుంది. అప్పుడు అన్యమంటూ ఏదీ లేకుండా పోతుంది.

## 16. విషయ భోగాలు

582, "తీరని కామవాంఛతో మగ కుక్క ఆడకుక్కతో పొందే సుఖమేదో ఆ సుఖాన్నే. ఇంద్రుడు ఇంద్రాణితో భోగించి అనుభవిస్తున్నాడు" అని పూర్వం బ్రహ్మజ్ఞానానందం పొందిన దధ్యాంగ అధర్వణుడనే మునీశ్వరుడు చెప్పారు.

వివరణ : శ్రీ మురుగనార్ చెప్పింది.: ఇంద్రుడు ఇంద్రాణితో కూడి అనుభవించే సుఖమే గొప్ప సుఖమనీ, అది ఏ జీవులకు దక్కని సుఖమని అనుకొనేవాడు. ఆ అజ్ఞానాన్ని పోగొట్టటానికి "శునకం ఒక ఆడ కుక్కతో సాధారణంగా పొందే క్షణిక సుఖమే నీవు పొందేసుఖమూనూ" అని ఇంద్రునితో దధ్యాంగ అధర్వణుడనే మహాత్ముడు నిజాన్ని ఉన్నదున్నట్లు చెప్పాడు.

583. కడుపుకాలే ఆకలితో నున్నప్పుడు సాధారణ ఆహారమైన గంజి గాని అంబలిగాని చక్కటి విందుభోజనంలా ఆనందాన్నీ సంతృప్తినీ ఇస్తాయి. కనుక ఈపాడు ప్రపంచంలో విషయములిచ్చే సుఖం మనం కోరే విషయ వస్తువుల నుండి దొరకటం లేదు. వాటిపై మనకుగల ఆశలే మనకి సుఖాన్నిస్తున్నాయని అనిపిస్తుంది.

584. సత్తే చిత్తు; ఆ చిత్తే ఆనందం. కనుక సచ్చిదానందమైన మన ఆత్మస్వరూపమే ఆనందం. బాహ్య వస్తుజాలంవల్ల మనం సుఖాన్ని పొందుతామని అనుకోవటం కేవలం భ్రాంతి. ఆత్మ తప్ప విషయవస్తువుల నుండి నిజమైన సుఖం లభిస్తుందా? (లభించదని భావం)

585. మూర్ఖపు కుక్క బాగా కాలిన ఎముకనొకటిని తన నోరు పుండయ్యేవరకు కటకటయని దంతాలతో కరచి, ఆ పుండులో నుండి స్రవించే రక్తాన్నే పీల్చి "ఈ ఎముకలాంటి రుచినిచ్చే వస్తువు ఈ లోకంలో లేనేలేదు" అని అనుకుంటుంది కదా!

(అట్లాగే పామరులు విషయవస్తువుల నుండే సుఖం కలుగుతోందని వాటికై తపిస్తారు)

586 ఆత్మజ్ఞాన సుఖాన్ని అనుభవించడం తెలియని వారు, పాండిత్యంతో తర్కించే వారు, స్త్రీ సుఖం మొదలైన సుఖాలు నిజమని భావించి, మతి భ్రమించి, అయ్యో! ఆఖరి క్షణాలలో కూడా వాటిని పొందాలనే తపనతోనే మరణిస్తారు.

587. మూర్ఖులు ఆత్మానందం ఒకటుందని మరచి, విరిగిన బియ్యపు గింజకు కూడా కొరగాని చిన్న తేనె బొట్టులాంటి విషయ సుఖాలకై అర్రులు జాచి తపించి కష్టపడతారు.

588. వ్యర్థులూ అల్ప మనస్కులూ అయిన జనులు సజ్జనుల హేళనకు పాత్రులై క్షుద్ర సుఖముల బురద గుంటలో పడి దొర్లుతూంటారే తప్ప అందులో నుండి బయటపడి, శివభోగమైన ఆత్మానందం పొంది సుఖించరు.

589.పతనం నుండి తమ్ము కాపాడుకోలేని జీవులు, కోరి పొంది అనుభవించే ఇంద్రియ సుఖాలను, జ్ఞాననిష్ఠతో నుండే ముముక్షువులు హీనమైనవని తిరస్కరిస్తారు.

590. సంతుష్టి మన స్వరూపం. ఇది తెలియక తృప్తి కొరకే తాను భుజిస్తున్నానని భావించి దానిపై అనురక్తుడైతే, ఆ అన్నమే అతనిని కబళించి, తీరని అసంతృప్తికి వశుని చేస్తుంది.

వివరణ : అన్నం అంటే కేవలం పోషకాహారమేగాకుండా, అనుభవించడానికి దొరకే పంచేంద్రియాహారాలనబడే భోగాలను కూడా సూచిస్తుంది. మనక్ అన్యమైన విషయభోగాలని (ఆహారాన్ని) ఆశిస్తే, అదే మనలని అసంతృప్తులను చేసి, కబళించి తీరని వేదనలకు గురి చేస్తుందని ఇక్కడ చెప్పిన భావం.

591. ఆహారమే తమ ప్రాణాలను తినేస్తోందనే సత్యాన్ని గ్రహించని అజ్ఞానులే లోకంలో తాము భోగాలను ఆరగిస్తున్నట్లు భావించి కామాతురులై వాటి కోసం తిరిగి అల్లాడుతున్నారు.

వివరణ : భోగవస్తువులు జీవునికి ఆశలు కల్పించి తమవైపు తిప్పుకొనడం చేత ఆత్మ స్వరూపంపైగల మక్కువ నుండి దూరం చేస్తాయి. ఆత్మ స్వరూపమే ప్రాణానికీ ప్రాణం కాబట్టి దాని నుండి విడిపడటమే మనకి కలిగే పెద్ద మరణం. కాబట్టి దానికి కారణమైన ఆహారాదిభోగాలు మనలని ఆరగించి నాశనం చేస్తాయని తెల్పారు.

592. ఆజ్యం పోస్తే అగ్ని ప్రజ్వలిస్తుందే తప్ప ఆరదు. అట్లాగే మన ఆశలన్నీ ఫలించినపుడు కలిగే ఆనందంతో కోర్కెలనే మంట తృప్తి చెంది చల్లారక ఇంకా కోర్కెలమంట ఎక్కువవుతూంటుంది.

593. పంచేంద్రియ వాంఛల రూపమైన విషసర్పం మన ప్రాణం తీయటానికి కాటు వేయనేక్కరలేదు. విషయాలను ఒకసారి చూసినా, తలచినా చాలు. మరణాంతకమే. కనుక విషయ వాంఛనలనే విషపు కోరలు కల్గిన సర్పము కంటే భయంకరమైనదానిని ఎక్కడా మనం చూడలేము.

## 17. మాయమనస్సు

594. మాయ, “నేను” అనే జీవుడు నిజంగా ఉన్నట్లు చూపించి, తన మాయాశక్తిచేత మనుషులను భ్రమింపచేస్తుంది. తన విజయాన్ని చూసి తనలో తానే మురిసిపోతుంది, తనకంటూ ఒక ఉనికి లేని మాయ!

595. “ఉన్నాను” అనే సద్రూప ఆత్మజ్ఞానాన్ని అనుభవించునపుడు, అజ్ఞాన రూపమైన బాహ్య వస్తువు లెన్నివున్నా నష్టమేమి? ఏమీలేదు. కారణం, ఆ అనాత్మ గురించిన అజ్ఞానాంధకారం, హృదయంలో ప్రకాశిస్తున్న ఆత్మజ్యోతిని కొంచమైనా మరుగుపర్చలేదు.

వివరణ : ఒకని నీడ ఎంత పొడవుగా ఎంత వెడల్పుగా ఎంత నల్లగా ఉన్నా సూర్యుని మరుగు పర్చలేదు. కాని, నీడ, సూర్యుని ప్రకాశాన్ని ప్రస్ఫుటం చేస్తుంది. అట్లాగే ఈ ప్రపంచ దృశ్యం ఆత్మ ప్రకాశమును ఋజువు పరుస్తున్నదని భావం.

596. మాయ నశించేది, ఉనికి లేనిది, జడమైనది. అది ఆత్మని తన వశపరచుకొని కట్టిపడేసి తర్వాత వదలేస్తోందనటం (ముక్తి పొందిస్తోందనటం) ఎంతో అల్పమైన మాట. "ఒక దోమ నోటిని తెరచి, ఈ విశాలాకాశాన్నంతా మింగి తర్వాత వాంతి చేసి ఉమ్మేసింది!" అని అనడం కంటే కూడా ఎంతో మూర్ఖమైన మాట.

597. జ్ఞాన రూపమైన హృదయమే సద్వస్తువు అని అన్నప్పుడు, ఈ మాయ కేవలం అసత్యమే కదా! అసత్యమైన మాయ అనే పాము వలన కాటు వేయబడి ఆత్మ మూర్చిల్లుతోందని చెప్పడం ఎంతో వింత. అబద్ధం!

# 18. అజ్ఞానం

598. దేహమే నేననుకొనే బుద్ధిహీనులు, జ్ఞానిని చూసి "వీరు పనిచేస్తున్నారే, భోజనం చేస్తున్నారే! అద్వైత జ్ఞానికి ఇవన్నీ ఎట్లాగ? ఎట్లాగ పొత్తుకుదురుతుంది అని ప్రశ్నించి జ్ఞాని జ్ఞానానికి లక్షణాలు ఆరోపించి తమ మూర్ఖత్వాన్ని వెల్లడిస్తారు.

599.తన పెళ్ళి వైభవాలను మాత్రమే చూసిన ఒక కన్నెపిల్ల "ఇదే దాంపత్యసుఖానుభవ"మనుకొని ఆనందిస్తుంది. అట్లాగే ఆత్మానుభవశూన్యులయిన కేవల శాస్త్ర పండితులు తాము వదరుతున్న శుష్క వేదాంతమైన పుస్తక జ్ఞానాన్ని "అద్వైత జ్ఞాన"మని తలచి పొంగిపోతారు.

600. పరమాత్మ తత్త్వాన్ని గ్రంథాల ద్వారా నేర్చుకొన్న అనేకులు, నేర్చిన "తాను ఎవరు?" అని విచారించి, అహం నాశమై ఆనందంలో మునిగి యుండలేక, ఆ శాస్త్ర పాండిత్యంతో గర్వించి, జ్ఞానులను పరీక్షిస్తారు. వీరి అజ్ఞానాన్ని ఏమని చెప్పటం?

601. వర్తమానంలో నున్న యీ "నేనెవరు?" అని తెలిసికోలేని అసమర్థులు రాబోవు జన్మలో, గత జన్మలో తాము ఎట్లున్నాం, ఎట్లాగుంటామని శ్రమతో ధ్యానించి తెలుసుకోటానికి ప్రయత్నిస్తారు. అది చంటి బిడ్డ తన నీడని పట్టుకోటానికి ప్రయత్నించటం వంటిది.

602. వర్తమానమైన యిప్పుడు తాము ఎట్టి స్థితిలో నున్నాము? అని తెలుసుకోలేని పామరులు, తమ స్థితి భూతకాలంలో ఎట్లా ఉన్నది అని భవిష్యత్లో ఎట్లా ఉంటుంది అనీ తెలుసుకోడానికి తీవ్రమైన తపస్సు చేస్తారు.

603. మనం ఈ జన్మలో ఇప్పుడు ఎట్లాగున్నామన్న విషయాన్ని వదిలేసి, తమ మరణం తర్వాత, జననానికి పూర్వము ఉండే స్థితి గురించి తెలుసుకోవాలనుకొనే ఈ లోకుల బుద్ధిని ఏం చెప్పటం?

604. ఈశ్వరానుగ్రహంతో చిత్తం పవిత్రమైనదా? లేక చిత్తం పవిత్రం చెందాక ఈశ్వరానుగ్రహం కల్గిందా? అని అనుకొనేవారు మూఢులు. అద్వయమైన ఒక క్రియను రెండు అని అనుకొంటారు వారు. వీరికి చెప్పడానికి సమాధానమంటూ ఒకటి మన దగ్గర లేదు.

వివరణ : ఈ గ్రంథంలోని 70,244 వచన భావాలని ఇక్కడ మరొకసారి గ్రహించాలి.

# 19. అపరిపక్వత

605. అల్పమైన యింద్రియ సుఖాలని సులభంగా పొందాలని కాశీక్షించే కామ్యార్థులు, పంచేంద్రియ ప్రవృత్తులను పూర్తిగా నాశమొందించి జీవించే తపోధనులతో ఎందుకు చేరతారు? (ఈసాంగత్యం వారికోర్కెలను నెరవేర్చదు కాబట్టి.)

వివరణ : లోకులు ఇంద్రియ సుఖాలకై ప్రాకులాడేవారు. సాధువులు ఇంద్రియాలను జయించే దివ్యశక్తి గలిగిన వారు. సాధువులతోసాంగత్యం లోకుల కోర్కె తీర్చదు.

# 20. ప్రమాదం (ఆత్మవిస్మృతి)

606.తన శుభాశుభకర్మల వలయంలో పడి కొట్టుకుంటున్న ఈ జీవుడు, అద్భుతమైన చిదాకాశంలో ఒక ఊహగా రూపొంది, నిలిచి, మాయమయ్యే స్వప్నాకారుడే!

వివరణ కూటస్థుడు, వ్యావహారికుడు, స్వప్నాకారుడు అని శాస్త్రాలు మూడు రకాల జీవ భేదాలని తెలుపుతున్నాయి. స్వప్నాకారుడు వలె వ్యావహారికుడు కూడా అసత్యమేయని ఉపదేశం.

607. అందంగా అలంకరించబడే శిరోజాలు రాలిపోయిన క్షణమే అవి అశుభ్రమైనవని తలచి పారవేయబడతాయి. అట్లాగే లోకులు ఉచ్ఛస్థితి నుండి దిగజారితే అధఃస్థితి కలుగుతుందని పూర్వుల వాక్కు. ఆ ఉచ్ఛస్థితి నిర్భయమైన స్థితి. దానిని మఱచి అల్పజీవులుగా తమని భావించడం చేతనే కదా జననమరణ బాధలను లోకులనుభవిస్తున్నారు?

608. వెండికొండలా, నిత్య ప్రత్యక్షంగా వెలుగుతున్న ఆత్మని ఎఱిగి, ఆత్మ నిష్ఠలోనుండకుండా, ఆ స్థితిని మరచి మనస్సు చలించటం ఆత్మవిస్మృతి. అది తనను వదలి మిగతా తొమ్మండుగురినే లెక్క పెట్టి కళవళపడే దశముని (పదవవాడు) తప్పిదం వంటిది.

609. తలపుల మూలస్థానమైన హృదయంలో "నేనునేనే" అని నిత్యం ప్రకాశిస్తున్న ఆత్మని "నేనెవరు?" అని విచారించి ఎఱిగి, మనో వృత్తులు నాశనం చేసి తానూ బ్రహ్మంగా ఏకమై యుండాలి. అలాకాక జీవునిలా విడిపోయి చెడిపోవటం అవివేకం.

610. పూర్ణ వస్తువుగా మనం నిల్చిఉంటే ఇతరులు మనలని ఎట్లాగ అగౌరపరచగలరు? ఆస్థితిలో అగౌరపరచే వాళ్లూ, గౌరవ పరచే వాళ్లు ఉంటారా? పూర్ణ స్థితి నుండి చ్యుతుడైనప్పుడే తల నుండి రాలిన జుట్టులాగే జీవుడు అల్పుడవుతున్నాడు.

611. భ్రాంతి కారణంగా గోచరిస్తున్న మాయ మనస్సు యొక్క కల్పనలను యధార్థాలని నమ్మి, రూపరహితమైన, జ్ఞాన స్వరూప స్థితి నుండి విచలితుడైన వాడు పిచ్చివాడే.

612. అన్యములు కనబడినా కనబడకపోయినా వాటి మీద భ్రాంతితో ఆత్మ స్ఫురణని వదలకుండా నిరంతరం ఆత్మలోనే నిల్చి ఉండాలి. జ్ఞాన స్వరూపుడైన తనని మరచిన కాలవ్యవధి కొంచమైనా, దాని పరిణామాలు చాలా తీవ్రమైనవి.

వివరణ : శ్రీ మురుగనార్ తెల్పినది గోచరించే త్రిపుటులను పట్టుకొని కలత చెందక నిరంతరం ఆత్మావలోకనంలో ఉండటమే జ్ఞానసమాధి . అదే ముక్తి.

## 21. సంసారం

613. అల్పమైన మనస్సు జ్ఞప్తి, విస్మృతి లాగ వికారం చెందటమే, జనన మరణమనే సంసారం. జ్ఞప్తి విస్మృతిలనే చేష్టలుడిగితే ఆ హృదయమే జన్మరాహిత్యం. శుద్ధముక్తి ఆత్మస్వరూపం అవుతుంది.

వివరణ : తలపే జన్మం, మరపే మరణం, మనో వ్యాపారాలే సంసారబంధం అంటే. ఈ జ్ఞప్తి, మరపు రూపమైన దాని మాలిన్య స్థితి పోయి, స్వరూపాన్నే ప్రతిఫలించి యుండటమే మనోనాశనం. అదే ముక్తి అని తెలుస్తుంది.

614. సత్తుగా ప్రకాశిస్తున్న తన ఆత్మను వదలి, ఆకాశంలోని నీలిరంగులాగ లేని అసత్య విషయ వస్తువులను దోష దృష్టితో చూసి మనస్సు భ్రాంతి చెందుతుంది. ఆ మనస్సే భ్రాంతితో కూడిన మహాసంసారం.

615. నిజానికి ఆత్మయైన తాను తప్ప వేరేది లేదు. అయినా "శరీరమే నేను" అని భ్రాంతితో ఎంచే చిజ్జడ గ్రంధి రూపమే అమరత్వాన్ని వదలి జననమరణాన్ని పొందటమవుతుంది.

616. సంసారం అంటే మన చిత్తమే (వాసనలే). ఆ వాసనా రూపమైన చిత్తం నశించి జీవించేవారు (జీవన్ముక్తులు), దేహప్రారబ్ధాన్ని బట్టి లోక వ్యవహారాల్లో ఉన్నట్లు కనిపించినా, నిజానికి వారు సత్యజ్ఞానాకాశంలో విహరిస్తూండేవారే.

## 22. ప్రతిబంధం

617. శ్రేష్ఠమైన భక్తుల జీవితాల్లో అనేక కష్టాలు అప్పుడప్పుడు కలిగి వారిని చాలా బాధిస్తాయి. కారణం వారి హృదయాలను దహించడానికి కాదు. ఆ కష్టాల్లోనూ, మనస్సు చెదరక బెదరక తపస్సులో లీనమైయుండటానికే యని తెలుసుకో.

618. పరిపక్వ బుద్ధి గల సాధకుడు కష్టాలు తనకు లభించిన దైవానుగ్రహమని గ్రహిస్తాడు. మోక్షప్రాప్తికి అవసరమైన మనోబలాన్ని చేకూర్చే నిమిత్తం తనకు అవి కల్పింపబడ్డాయని తెలుసుకుంటాడు. మనస్సు కలత చెందక ఓర్పుతో వాటిని తపస్సుగా భావించి సహిస్తాడు.

619. గని నుండి త్రవ్వి తీసిన వజ్రాన్ని సానబెడితేనే అది ప్రకాశిస్తుంది. అట్లాగే సాధకుడు కూడా తపస్సుకి పరీక్షలు లేకపోతే అది ప్రకాశించదు.

620. పెద్ద రథం ఒకటి వీధిలో పెడుతూ తన యధాస్థానానికి చేరటానికి కావలసిన చక్రం, చక్రపుచీలతోపాటు, రెండు వైపులా యిటునటు వూగకుండా ఆపగలిగే అవరోధాలు కూడా అవశ్యమే కదా!

వివరణ : తపస్సు చేసుకుంటూ అనుష్ఠించే నియమాలే కాకుండా, అతనికి కలిగే అవరోధాలు కూడా దైవానుగ్రహమే, కాబట్టి అవి అవసరం.

" ఇట్లాగ ఉండేవానికి ఇక్కడేం పని?" అని తమ్ముడు వెంకట్రామనిక్కి ఇచ్చిన అన్నగారి మందలింపే తమ్ముణ్ణి భవిష్యత్లో లోక గురువైన "భగవాన్ శ్రీ రమణ మహర్షి" గా చేసింది కదా! సద్బుద్ధేకాకుండా దుర్బుద్ధితో తపస్సుకి అవరోధం కల్గించే వారివల్ల కూడా చివరికి మంచే జరుగుతుంది. కనుక అవరోధాలు దైవం అందించిన సహాయమే.

## 23. మాయా విచిత్రం

621. నిజానికి ఉన్న వస్తువు ఏకమైనప్పటికీ, సృష్టి అన్నదే లేని ఆ వస్తువు కొన్ని జీవులుగా రూపొంది, మంచి చెడులను చేస్తున్నట్లూ, ప్రారంభం నుండి ఇంతవరకు జీవులు నాలుగు, ఏడు రూపాలుగా పొంది దుఃఖిస్తున్నట్లూ, తర్వాత జనన మరణాలను జయించి ముక్తి పొందుతున్నట్లు కనబడటం ఎంతో విచిత్రంగా వుంది.

వివరణ : నాలుగు ఏడు రూపాలు విత్తనం, చెమట, గర్భం, గ్రుడ్డు, దేవతలు, మానవులు, జంతువులు, పక్షులు, ప్రాకేవి, జలచరాలు, చెట్లు (స్థావరాలు) అని ఏడు రూపాలుగా పుట్టడం.

622. తాను ఆత్మ స్వరూపునిగా యుండి కూడా, ఆత్మని ఒక అన్యమైనదిగా ఎంచటం దానిని పొందటానికి సాధనలు చేయటం, తపస్సు చేసి కష్టపడటం ఇదంతా ఒక విచిత్రం. దాన్ని చూస్తే తీరా ఏమీ లేదని చెప్పొచ్చు.

## 24. పొగడ్తల హాని

623. బ్రహ్మమైన తనను శరీరమనటమే పెద్ద దోషం. అందువలన పేరు ప్రతిష్ఠలను కూడా జ్ఞానులు నిర్ద్వంద్వంగా త్రోసి పుచ్చవలసినవే. స్తోత్రాలతో ఇక పనేముంది?

వివరణ : ముముక్షువులు కీర్తి ప్రతిష్ఠలను ద్వేషించాలని ఇక్కడ ఉపదేశం.

624, ఇతరులు పొగడాలనే కోరికను లక్ష్యంగా పెట్టుకొన్ననాడు తాను ఎంచుకున్న ఆత్మసాధనకి అవరోధం కల్పించుకుంటున్నాడు.

వివరణ : ఆత్మసాధనంటే అహంకారనాశం. కీర్తి ప్రతిష్ఠలు ఈ అహంకారానికే. కీర్తి ప్రతిష్ఠలు కావాలనుకొనేవాడు అహంకారనాశమునకు బదులు అది ఉండాలని భావిస్తున్నట్లే కదా! కనుక సాధనలో పురోగమించాలంటే అజ్ఞాత జీవితాన్నే కోరాలని భావం.

## 25. అహంకారం యొక్క పాపం

625. గర్వం అత్యంత దుష్టమైన నరకవాసం. అది మనం పొందకూడని పెద్దకీడు. అహంకారమనే కలిపురుషుని ముఖాన్ని మంచి వారెవరు చూడకూడదు. అటువంటి గర్వాన్ని మూర్ఖులు తప్ప వేరెవరైనా ద్వేషించకుండా ఉంటారా?

626. మహాత్ముల సన్నిధిలో, సామాన్యులు యోగులలాగ ఆసనం వేసుకొని, నిటారుగా కూర్చొని, ఆత్మ నిష్ఠ అంటే ఏమిటో తెలియకపోవటం చేత ఆవలింతలతో, గురకపెడుతూ నిద్రపోతారు. అది వారి చెడ్డ అలవాటు. వారి అహంకారదోషమే.

వివరణ : ఇలాంటి సంఘటనలు శ్రీ రమణుల సన్నిధిలో జరిగాయి. జీవన్ముక్తుల సన్నిధికి వచ్చేభక్తుల దోషాలను ఈ పద్యభావంలో చెప్పారు. ముక్తుల సాన్నిధ్యం అతి దుర్లభం. ఎంతో అరుదు. అందుచేత అజ్ఞానమనే నిద్రనిపోగొట్టుకొనే ఆ సన్నిధిలో ఆవలింతలు, గురకతో కూడిన నిద్ర చేయతగని పనులని ఉపదేశం.

## 26. దుఃఖ మూలం

627. మన ఆత్మస్వభావం మహానందభరితం. అట్లుండగా, దానికి భిన్నంగా మనం ఈ జన్మ దుఃఖమనే తీవ్రమైన ఎండలోపడి కొట్టుకుంటున్నట్లు భావిస్తున్నాం. ఇది అహంకారం యొక్క దుశ్చేష్టయే.

628. శరీరం “నేను”ని అభిమానించే అసద్భావనయే ఆసురీ సంపదల (దుర్గుణాలకి)కి మూలం. మాయా అహంకార వృత్తితో కూడిన "మమకారం" బాగా బలపడిన మానవులు శాంతిని పొందటం ఎంతో దుర్లభం.

## 27. జీవుడు

629.తీక్షణమైన ఎండలో తిరిగి కష్టపడటం, చల్లని నీడలో సుఖాన్ని పొందటం. వంటిదే. జీవులు ఈ లోకాన్ని కోరి, తిరిగి తిరిగి అలసిపోయి, చివరికి భరించలేక అంతర్ముఖులై హృదయంలో కొంత విశ్రాంతి తీసుకోవడం అంటే.

630. వివేకి ఎండ వేడిమిని తెలుసుకొని, చల్లని నీడని వదలి మళ్ళీ ఎండలోకి వెళ్లడు. అట్లాగే లోకాన్ని పట్టి పీడించే మూడు కోర్కెలు (కామిని, కాంచనం, కీర్తి) అనే వేసవి తాపాన్ని అర్థం చేసుకొన్న వివేకులు హృదయంలో నిల్చి ఉండాలి. అది కాదని బహిర్ముఖులుకాకూడదు.

631. విశాలమైన గగనంలో ఎగిరే పక్షి తిరిగి భూమి మీదికి వచ్చి వాలాలే తప్ప ఎక్కడా ఉండలేదు. అట్లాగే సద్వస్తువైన ఆత్మ నుండి పుట్టిన దేహాత్మలు మళ్లీ ఆ సద్వస్తువుతో విలీనమైయ్యే వరకు అడ్డంకులు (ఎన్ని జన్మలు) ఎన్ని కలిగినా అవి అక్కడే (బహిర్ముఖ ప్రవృత్తిలో సంతృప్తులై) ఉండిపోలేవు. ఇది నిశ్చయం.

632. జీవుడు ఆత్మ నుండి ఏ మార్గంలో ఉదయించి వచ్చాడో ఆ మార్గంలోనే (అంతర్ముఖుడై నేనెవరని) మళ్ళీ తన మూలాన్ని అన్వేషిస్తే తన స్వాత్మరూపాన్ని పొందుచున్నాడు. అప్పుడు స్వాత్మరూపానందం అనుభవించడం చేత అక్కడే నిశ్చలంగా ఉండిపోతాడు.

వివరణ : శ్రీ భగవానుల శ్రీ అరుణాచల అష్టకంలోని 8వ పద్యభావమే పై 631, 632 వచనములలో ఉపదేశించారు.

633. "ఉన్నాను" అనే స్ఫురణ మాత్రంగా ఊరక ఉన్నట్లుండి దైవానుగ్రహంతో ముక్తి పొందాలే తప్ప. 'నేను' అని అహంకార రూపంతో విజృంభించి ఎవరు ఏ సాధన చేయగలరు? కనుక 'నేను' అనే బుద్ధి నశించేటట్టు తనను తాను విచారించి, "తాను ఆ ఆత్మయే" యని గోచరించే ఆత్మానుభవంచేత పరమమౌనంలో నిలకడ చెందుదుపుగాక!

## 28. జీవుని "అవాస్తవికత"

634. అజ్ఞానాంధకారంలో గోచరిస్తున్న ఈ ప్రపంచంలో జీవిస్తున్న ఏ ప్రాణి కూడా, చీకటిలో కూడా ఈ చీకటిని ప్రకాశింపచేసే సద్వస్తువు (అంటే అవిద్యను కూడా తెలుసుకొనే జ్ఞానాన్ని) స్వప్రయత్నంతో పొందటం చాలా అసాధ్యం. అది దైవానుగ్రహం చేతనే లభిస్తుంది.

## 29. ప్రపంచపు "వాస్తవికత"

635.ఈ లోకాన్ని చూడటానికి అవసరమైన (చూచేవాడైన) తన ఉనికిని తెలుసుకోలేని వాడు "జగత్ సత్యం" అని ఎంచి లోకాన్ని చూస్తున్నప్పుడు, ఆ జగత్తు తనని సత్యమని ఎంచే ఆ మానవుని చూసి అతను సిగ్గుపడేటట్టు నవ్వి పరిహాసం చేస్తోంది.

వివరణ : లోకం నవ్వుతుందా? అని మనం ఆశ్చర్యపోతాం! ఈ గ్రంథంలో 74వ వచనభావాన్ని మనసులో నుంచుకొని చూద్దాం. వేశ్యపై మోహాన్ని పెంచుకొన్న ఒకడు తన స్నేహితునితో, ఆమె ఎదుటే "ఈమె మహాపతివ్రత, పతివ్రతలకే రాణి" అని పొగడటం చూసి, ఆమె తనలో తానే నవ్వుకుంటుంది కదా! అట్లాగే అసత్యమైన తనని సత్యమని మాట్లాడే వారిని చూసి ఈ లోకం నవ్వుకుంటోందని చాలా నాజూకుగా ఈ పద్యభావం తెలుపుతోంది. దృశ్యమానమైన ప్రపంచం మిథ్యయని ఇతరులు ఋజువు చూపించక్కర్లేదు. ఆలోకానికే తన నిజమేమిటో తెలుసు అనే తత్వాన్ని శ్రీ భగవాన్ నొక్కి చెప్పారు.

636. వెలుగు ప్రసరించిన చోటనే వస్తువులున్నట్లు కనబడతాయి తప్ప, వెలుగుకతీతంగా ఏవీ కనిపించవు. అట్లాగే హృదయంలో ఆత్మ ప్రతిబింబంగా ఉదయించి, స్మృతి విస్మృతుల రూపంలో చలించే మనస్సుతో తెలిసేవే యీ దృశ్యమానజగత్ బింబాలు.

వివరణ : మనస్సు లేక యీ ప్రాపంచిక దృశ్యాలు లేవు. ఆత్మజ్ఞానంలో సృష్ట్యాది అన్య దృశ్య ప్రపంచం లేదని భావం.

637. మనముందు తోచుట చేత “ఒకటున్నది” అనేది (సన్మాత్రమని) ఋజువు అవుతుంటే తప్ప, ఆ వస్తువుపై ఇంద్రియాల ద్వారా తెలియబడే దృశ్యమే అక్కడున్న వస్తువు యొక్క యథార్థరూపమని నిర్ధారణ చేయలేము. (దృశ్యమే ఆ వస్తువు యొక్క నిజస్వరూపంగాదని భావం)

638. దృక్కుతో నీవు దేనిని చూడకుండా, ద్రష్టనే ఆ దృక్కుచేత గమనిస్తే, అప్పుడు చూచే తన స్వరూపంగానే సకలమూ గోచరిస్తుంది. అప్పుడు అంతవరకు తెలుసుకొన్న విషయజ్ఞానమంతా ఆ తర్వాత కేవలం భ్రమ అని తేలుతుంది.

639. చూచేవాడైన తాను, చూడబడే (దృశ్యం) జగత్తు వేర్వేరు ఉనికిగల రెండు (సత్) వస్తువులుగా వున్నట్లయితే, చూడటం (దృక్కు) అనేది అసంభవం. అట్లాగ కాకుండా, చూడటం (దృక్కు) జరుగుతున్నప్పుడు, చూచేవాడూ (ద్రష్ట) చూడబడు వస్తువూ ఒక సత్పదార్థమని గ్రహించు.

## 30. సత్యజ్ఞానం (Denotative knowledge).

640. (ఉనికి మాత్రంగా) ఊరక ఉన్నట్లయితే అప్పుడు మహానందం గోచరిస్తుంది, మహత్తు అయినది రాకపోకలు లేని పరతత్త్వమని తనను ఉత్సుకతతో విచారించి తెలుసుకొని ఆ మహానందాన్ని పొందాలి. దానికి బదులు (బాహ్య కర్మలైన పూజా జపధ్యానాదుల జ్ఞానంతో) తిరిగి పడే కష్టాలన్నీ ఎందుకో!

641. తానే తానుగా (ఆత్మగా) నిత్యమూ ఉంటూనే, ఆ ఆత్మని తనకు అన్యమని ఎంచి సాధనలతో దానిని వెదుకుతాడు. అన్ని వస్తువులలో "నేను" అని ప్రకాశించే జీవులూ తనకు (అజ్ఞానదృష్టికి) అన్యమైన వస్తువు వలె గోచరించినా, చివరకు ఆ “నేను” తనకంటె వేరుకాదు అనే భావన (సుజ్ఞానంలో) అంతమై, ఆ భేదభావం నుండి పూర్తిగా విడిపడటానికే ఆ సాధనలన్నీ.

642. తనకంటే వేరుకాని ఆత్మని తనకు అన్యంగా నెంచి, దానిని పొందటానికి పలు విధాలుగా తపస్సు చేయటం, తన నీడని పట్టుకొనటానికి పరుగెత్తటం వంటిది.

543. ఉన్న వస్తువైన ఆత్మయే "ఉన్నాను" అనే ప్రజ్ఞా రూపంలో హృదయంలో స్పష్టంగా "నేను" అని అందరికి తెలుస్తోంది. కాబట్టి సత్యజ్ఞాన స్వరూపమైన ఆ పరవస్తువే ప్రత్యక్షమైనదికాని పంచేంద్రియాలకు గోచరించే విషయ వస్తువులు (నిజంకావని తెలుసుకో) ప్రత్యక్షం కానివని తెలుసుకో.

644. హృదయంలో నిత్యం ప్రకాశించే సచ్చిత్ స్వరూపమైన ఆత్మని సూక్ష్మ దృష్టితో గమనించి అదే తాము అని తెలుసుకోలేని లోకులు సదా విజృంభిస్తున్న అహంకార రూపమైన ప్రకటిత జ్ఞానం వలన మాయలో పడి కొట్టుకుంటున్నారు.

## 31. అంతర్దృష్టి వల్ల కలిగే జ్ఞానం

645. "నిన్ను నీవు తెలుసుకో"యని శాస్త్రాలు చెబుతున్నాయి. అంటే "అన్యాన్ని తెలుసుకొనే బాహ్య విషయ గ్రహణాన్ని వదలవేయ" మనే దాని భావం. అందరికి "నేనున్నాను" అనే సువిదితమై చైతన్యం సూర్యునివలె స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నది కదా!

646. మధ్యమ ప్రథమ పురుషలకి సంబంధించిన వస్తువులను గ్రహించే మనస్సుతో వెదకుతున్నప్పుడు గోచరించని ఆత్మ, ఆ విషయజ్ఞానం అంతమైనప్పుడు తనంతటతానుగా ప్రకాశిస్తుంది. నాయకుడు నాయికను చూస్తే ఆమె తలవంచుకొని నేలను చూస్తూ నిలబడుతుంది. నాయకుడు ఆమెను చూడనపుడు ఆ వనిత తానే అతనిని చూస్తూ చిరునవ్వుతో ఆనందిస్తుంది.

వివరణ : ఆత్మని నాయికగాను, అహంకారాన్ని నాయకునిగాను ఉపమానంతో విశదీకరించే విధానం ఆశ్చర్యపరుస్తుంది. బహిర్ముఖ దృష్టితో ఆత్మని వెదకుతున్నప్పుడు. అది మనకు కనబడదు. బహిర్ముఖ దృష్టి నశిస్తే అది అంతర్ముఖ దృష్టి అవుతుంది. కాబట్టి ఆత్మ స్వయం ప్రకాశక మవుతుందని ఈ ఉపదేశం.

647. నీవు 'ఇది అది' అని మధ్యమ, ప్రథమ పురుషలనే ఏ వస్తువునూ చూడనట్లయితే, ఉన్నాను అనే స్ఫురణతో అనంతమైన పరమాత్మాకాశంలా నీ దృష్టి వ్యాపించి ఆ పరబ్రహ్మమే నీవవుతావు.

648. భక్తి శ్రద్ధలతో తనని ఈశ్వరునికి అర్పించుకుంటే దైవానుగ్రహం గలిగి సద్వస్తువైన ఆత్మ అనుభవమవుతుంది. ఆత్మ అత్యంత సూక్ష్మమైనది. బుద్ధిగ్రాహ్యమైనది కాదు కనుక.

649. లోకుల్లారా! అధ్యయన శ్రవణాదుల ద్వారా విద్యలన్నీ నేర్చి తద్వారా మనస్సు నిశ్చలంకాక వృధాగా వెదకి తిరగవద్దు. ప్రేమ స్వరూపుడైన ఈశ్వరునికి భక్తితో శరణాగతి చెందటమే ఉత్తమం.

## 32. ప్రేమ

650. ప్రేమరసం తదన్యములైన షడ్రుచుల కంటె గొప్పదేగాని తక్కువది కాదు. దీనిని గ్రహించలేని వారే ప్రేమని ఏడవ రుచిగా వర్ణిస్తారు. షడ్రుచులనబడే వాటికి "రుచి" అనే గుణాన్ని యిచ్చేది ఆది రుచియైన ప్రేమ ఒక్కటే.

651. మాటలకి అందని ప్రేమరసాన్ని అనుభవించని అభాగ్యులే రుచులు ఏడు (షడ్రుచులతో ప్రేమను కూడా ఒక రుచిగా కలిపి) అని అంటారు. పరమోత్కృష్టమైన ప్రేమరుచిని మేము బాగా తెలుసుకున్నాం. కనుక "ప్రేమ ఒక్కటే పరమానందదాయకమైన రుచి" అని కచ్చితంగా చెబుతున్నాం.

652. ప్రేమయే ఆత్మస్వరూపమని తెలుసుకున్నప్పుడే జీవితంలో ఏర్పడే అనేక చిక్కుముడులు విడిపోతాయి. ఉత్కృష్టమైన ప్రేమ (పరాభక్తి) లభిస్తేనే మోక్షం కూడా లభించినట్లవుతుంది. అన్ని మతాల బోధనలలోని అంతరార్థం కూడా ఇదే (ప్రేమ)

వివరణ : ప్రేమతత్వాన్ని గ్రహిస్తే అది కోర్కెలు అనే వృత్తి రూపం చెందకుండా ఉంటుంది. కోర్కెలు ఈవిధంగా అంతంకాగా దాని పర్యవసానాలైన క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలు కూడా తెగిపోతాయి. జీవిత సమస్యలకి ఈ ఆరే కూకటివేళ్లు కాబట్టి అన్ని చిక్కులు తీరుతాయి. తాను ప్రేమే అని తెలుసుకోవడమే ఈ వచన భావం.

653. "జ్ఞానులను దర్శించటానికి వెళ్ళే వారు వట్టి చేతులతో వెళ్ళరాదు. ఏదో కానుక తీసుకొని వెళ్ళాలి" అని పెద్దలంటారు. హృదయంలో నిజమైన భక్తిప్రేమలతో వారి యొద్దకు వెళ్ళాలనేదే దాని భావం. అంటే వారిని పరీక్షించాలనో, లేక సరదాగా చూడటానికో వెళ్ళకూడదని భావం.

వివరణ : శ్రీ మురుగనార్ ఇచ్చిన భావం. ఇతర కానుకలు ఎప్పుడూ ఎవ్వరికీ వీలయినా వీలుకాకపోయినా భక్తి ప్రేమలు లేకపోతే అవి నిష్ప్రయోజనాలు. ఇతరములు లేకపోయినా ప్రేమ మాత్రం ఉంటే అదే ఇతర కానుకలు లేమిని తీర్చేస్తుంది.

654. ప్రేమని నిరోధించటం, ప్రేమను వక్రమార్గంలో బలవంతంగా రుద్దటం వలన జీవులు ఎన్నో రకాలైన కష్టాలతో హరించుకుపోతున్నారే!

వివరణ :ఇష్టమైన వస్తువులకు కీడు కలిగించడం: అయిష్టమైన వస్తువులను సేకరించటం, ఇలా ఆశ అనే వృత్తి రూపంలో ప్రేమ వ్యవహరించటంవలన జీవులకు ఎన్నో కష్టాలు కలుగుతున్నాయి. కనుక ఇష్టానిష్టాలనే వృత్తులు లేవకుండటయే ప్రేమను అణచకుండటం, విపరీత ధోరణిలో రుద్దకుండటం అవుతుందని గ్రహించు. దీనినుద్దేశించే శ్రీ భగవాన్ ఇష్టానిష్టాల రెంటిని త్రోసిపుచ్చాలని "నేనెవరు?" గ్రంథంలో బోధించారు.

655. ప్రేమ స్వరూపమైన ఆత్మానుభవం అంటే ఆనందమయమైన ప్రేమనే చూడటం, వినటం, స్పృశించటం, భుజించటం, ఆఘ్రాణించటమే.

వివరణ : ఈ గ్రంథంలో 62వ వచన భావాన్ని మరొకసారి జ్ఞాపకం చేసుకోవాలి.

## 33. సకల రూపాలు

656. సత్పదార్థాన్ని గురించి తెలియని వారే దానికి ఒక రూపము లేదంటారు. ఆకాశం వంటి ఆత్మతత్వాన్ని యథార్థంగా తెలుసుకొని అనుభవించే ఆత్మనిష్టుడైన జ్ఞాని యొక్క రూపమే ఆ సత్పదార్థరూపమని తెలుసుకో.

657. రూపమైన తనశరీరమే తాను అనే బుద్ధి నశించిన వారికే నిరాకారోపాసన సాధ్యమవుతుంది. అట్లు కాకుండా, తన శరీర రూపంపై "నేను" అనే అభిమానం కలవారు చేసే సాధనలన్నీ (నిరాకార ధ్యానం చేస్తున్నామనుకొని చేసే ప్రయత్నాలన్నీ) సాకారోపాసనలేయని గ్రహించు.

వివరణ : ఈ గ్రంథంలోని 208వ వచన భావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

658. తలపులు లేని ప్రజ్ఞతో కూడిన ఆత్మనిష్టతో నిరాకారోపాసన చేయడమే చాలా శ్రేష్ఠము. ఈశ్వరుని ఈ విధంగా నిరాకారోపాసన చేయటానికి అర్హత లేనివారు ఆయనని సాకారంగా ఉపాసించుట మంచిది.

650. సహజ సిద్ధమైన 'ఉన్నాను' అనే స్ఫురణలో వుండలేక మోహంతో కర్మవశులై భ్రమిస్తున్న మనుషులు, ఈశ్వరునికి భక్తి ప్రేమలతో చేసే సాకారారాధన వలన క్రమంగా చిత్తశుద్ధి కలిగి, తద్వారా రూపంపై మోహం నశించి చివరకు పరమాత్మ స్థితిని పొందుతారని తెలుసుకో.

వివరణ : స్వరూప ధ్యానం చేయలేనివారు మూర్త్యుపాసననైనా ఆచరిస్తే చివరికి అదేగతి నిస్తుంది శ్రీ మురుగనార్ అంటున్నారు.

660. బాహ్యంలో అంతరంగంలో శివరూపారాధన చేసే శివభక్తిగల మనసా! సర్వత్రా ఈశ్వరుడు జ్ఞానరూపంగా నిండివున్నాడని మరవకుండా శివారాధన చేయి.

661. శివయోగ సిద్ధి పొందిన జ్ఞానులను సదా సేవించడం వలన మనస్సు నిశ్చలమై, హృదయంలో ఆత్మవిచారం ఉదయించి, బాహ్య విషయజ్ఞానం నశించి, “ఉన్నాను” అనే అహం స్ఫురణతో ఆత్మ నిష్ఠలో నిలకడగా ఉంటే పుట్టుకతో వచ్చిన రోగమనే మోహం నశిస్తుంది.

662. వేదాలలో చెప్పబడినట్లు క్రమం తప్పకుండా చేసే అనుష్ఠానాలు నీకు ఈశ్వరునిపై నిజమైన నిశ్చలమైన భక్తి శ్రద్ధలు కలిగించకపోతే, ఆ అనుష్ఠానాలతో నీవు పడిన పాట్లన్నీ వ్యర్థములని తెలుసుకో.

663.నిత్యమూ అల్లా (భగవంతుని పాదాలకు మ్రొక్కే వారికి పాపకర్మల ఫలితంగా పొందే బాధలు, మంటలూ చల్లారి, సుఖాన్నిచ్చే శుభములు కలుగుతాయి.

వివరణ : కొందరి మహమ్మదీయుల నుద్దేశించి చెప్పిన ఉపదేశం కాబట్టి, ఈశ్వరుడు అనే పదానికి 'అల్లా' అనే మాటని ఉపయోగించారు.

664. ఈ జన్మలో మరుజన్మలో పొందవలసిన వాటిని గురించి చింతించక, ప్రారబ్ధాను సారం కలిగే కష్టాలన్నీటినీ ఎంతో ఓర్పుతో సహించి ఎటువంటి పేదరికంలోనైనా మనస్సు కొంచెమైనా చెదరక ఈశ్వరుని అజ్ఞానుసారం నడచుకో.

665. ఈశ్వరుని పాదాలని చేరటమే తమ జీవిత లక్ష్యమని జీవించే శ్రేష్ఠులైన సాధువులు, ఇతరుల అసూయలకు అవకాశమిచ్చే ఆడంబరాలకి చోటివ్వక తమను చూసి జాలిపడే రీతిని నిరాడంబరంగా జీవించడమే ఉత్తమం.

## 34. పంచకృత్యాలు

666. ఈశ్వరుని నియమానుసారం జరిగే సృష్టి, స్థితి, లయ, ఆవరణ విక్షేపరూప పంచకృత్యాలు ప్రతిక్షణం, ప్రతిదినం, క్రమం తప్పకుండా చక్కగా జరుగుతున్నాయని గ్రహించి ప్రశాంతంగా ఉండు.

667. భగవంతుని కారణంగా అణువులన్నీ నశించి, అప్పటి కప్పుడే మళ్లీ కొత్తగా పుడుతున్నాయి. ఇట్లాగ నిరంతరం జరగడం వలన సృష్ట్యాది పంచకృత్యాలన్నీ తమంతట తామే జరుగుతున్నట్లు కనబడతాయని తెలుసుకో.

## 35. జీవేశ్వర కర్తృత్వం

668. జీవుని కార్యాలన్నీ ఈశ్వరుని కార్యాలే అని అంగీకరిస్తే జీవునికి ఉనికి ఉండదు. స్వాతంత్ర్యము ఉండదు. అంతా భగవంతునికి అర్పించినందువల్ల తాను భగవంతునికి వేరుగా ఉండడు. అట్లా ఆత్మసమర్పణం కాలేకపోతే జీవులు చేసే పాపపుణ్యాలన్నిటికీ కర్తృత్వం జీవుడిదే తప్ప ఈశ్వరునిది కాదు. జీవుడు, శివుడు వేరనీ, జీవుడు స్వతంత్రుడనీ తలచిచేసే పాపపుణ్యఫలాలని జీవుడే అనుభవించవలసిన వాడు.

వివరణ : కర్తృత్వ భావమున్నంతవరకు కర్మలు బంధిస్తాయి. ఫలితాలు మంచైనా చెడైనా అనుభవించవలసినదే. "అంతాభగవదేచ్ఛ", శివుని ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదు' 'అనే పెద్దల మాటల్లోని సత్యాన్ని గ్రహించకుండా, లోకులు కష్టం కలిగితే "ఇదంతా భగవంతుని చర్య' అని భగవంతుని దూషించినట్లు మంచి జరిగితే మాత్రం తాము భగవంతుని అనుగ్రహానికి పాత్రులైనట్లు ఆ వాక్యాలని ఉపయోగిస్తారు. ఈదురభిప్రాయాన్ని నివృత్తి చేయడానికే ఈ ఉపదేశం.

## 36. జీవేశ్వరుల సృష్టి

669. భగవంతుణ్ణి కర్మలు బంధించవు. జీవుడు కర్తృత్వభావంతో చేసిన కర్మలు సుఖదుఃఖాలైన బంధాలని కలిగిస్తాయి. అయ్యో! నిజంగా మృతి చెందిన ఒకని తండ్రి సంతోషంగానూ, బ్రతికి వున్న ఒకని తండ్రి దుఃఖంలోనూ ఉన్న కథ దీనికి చక్కటి ఉదాహరణ.

వివరణ : ఒక గ్రామం నుండి రాముడు కృష్ణుడు కాశీ యాత్రకి వెళ్లారు. దారిలో రాముడు వ్యాధితో మరణించాడు. కృష్ణుడు మాత్రం యాత్రని సాగించాడు. ఈ సమాచారాన్ని వారిద్దరి తల్లిదండ్రులకి చేరవేసిన మూడో వ్యక్తి "కృష్ణుడు వ్యాధితో మరణించాడు: రాముడు యాత్ర సాగించాడ"ని మరచిపోయి చెప్పాడు. రాముని తండ్రి యీ తప్పుడు సంగతితో సంతోషించాడు. బ్రతికి వున్న కృష్ణుని తండ్రి రోదించాడు. ఇప్పుడు వీరిద్దరి శోక సంతోషాలకి కారణం వారిరువురి కుమారుల గురించిన తప్పుడు సమాచారమే కాని, నిజమైన ఆధారాలేవీ కావుకదా! ఇట్లాగే జీవుడనుభవించే జననమరణరూప దుఃఖానికి తనను గురించి ఒక తప్పుడు భావం కారణమవుతుందే తప్ప, నిజమైన ఆధారం ఏమీ లేదు. అందువల్ల జీవుల మనోభావమనే సృష్టే బంధమని చెప్పారు.

ఈశ్వరుడే జీవునికి మంచి చెడు అని ప్రారబ్ధరూపంలో కర్మఫలాన్నిస్తాడు. దాని ప్రకారమే అన్నీ జరుగుతాయి. అందువల్లే యీ లోకమంతా భగవంతుని సృష్టియని అంటారు. ఈ లోకం మనకు జ్ఞానాన్నిచ్చే మంచి పాఠశాల. సుఖదుఃఖాల ద్వారా వైరాగ్యాన్నిచ్చి మనస్సుని ఆత్మాభిముఖం చేయడమే సృష్టి ఉద్దేశం. అదే మోక్షం అంటే. కనుక భగవంతుని సృష్టి మనకి జ్ఞానం బోధించడమే కాని బంధాన్ని కలిగించడం కాదు.

670. భగవంతుని విశాల సృష్టి జ్ఞానగురువుని చూపించి, వాసనలు దహించే జ్ఞాననిష్ఠ పొందటానికి సహకరిస్తుంది. ఆ కారణం చేత, అది ముక్తి నొందటానికి సహాయకారి అని తెలుసుకో.

వివరణ : జీవులు ముక్తి చెందాలన్నదే సృష్టికి కారణం. ఆగామికర్మల ద్వారా మళ్ళీ మళ్ళీ ఆ వలయంలో పడి భ్రమించే జీవునికి ప్రారబ్ధనియతి ప్రకారం గొప్ప సహాయం చేసి ముక్తి నివ్వటానికే ఈశ్వరానుగ్రహం

## 37. నేతి నేతి

671. ఈ మృణ్మయ శరీరం, ప్రాణం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అహంకారం: నేను కాను. సకల వృత్తులు, విషయాలు నశించగా వాసనలతో మాత్రం. నిండిన (నిద్రలో) అజ్ఞానాన్ని కూడా (అంధకారం) నేను కాను.

వివరణ : శ్రీ భగవాన్ గ్రంథం “నేనెవరు?”లో ఈ భావం వచన రూపంలో ఉన్నదని గ్రహించాలి.

672. సత్పదార్థమైన నా (ఆత్మ) సన్నిహిత సంబంధాన్ని పొందకపోతే ఇవన్నీ (అంటే పైన చెప్పినవన్ని) ఉనికి లేక నశిస్తాయి. అందుచేత సత్పదార్థనికి అన్యంగా ఏ వస్తువు ఉనికి, జ్ఞానం కలిగినవిగా ఉండలేవు. కనుక అనాత్మ పదార్థాలు నేను కాను.

673. పైన తెల్పిన అనాత్మ దేహాదులను "నేను" అని అభిమానించే మొట్టమొదటి తప్పిదాన్ని వివేకంతో త్రోసిపుచ్చి, వంచనారూపమైన ఈ ప్రపంచ శరీరాదులు ఎండమావులని గ్రహిస్తే అసంగుడుగా, ఏకాత్మునిగా ప్రకాశించే సత్యజ్ఞాన స్వరూపమే నేను.

674. పైన చెప్పిన అనాత్మవస్తువులు ఏవి ఎట్లాగ వ్యవహరించినా (వాటిని "నేను" అని అభిమానించుటచేత, నేనే వ్యవహరిస్తున్నాను అనే కర్తృత్వ భావాన్నుండి) విడిపడినవాడనై, నీవు వాటిని చూస్తున్న సాక్షీమాత్రంగా ఉండు.

## 38. వాసనా క్షయం

675. కొన్ని సమయాలలోనే సాధన చేయాలన్న నియమాన్ని దాటి నిరంతరం జరిగే సహజాత్మ నిష్ఠతో వాసనలనబడే కేశాలు శిరస్సున ఆలోచనల రూపంలో మొలవటానికి ఎటువంటి అవకాశమివ్వక నాశనం చేయటమే సన్యాసులు చేసుకొనే నిజమైన శిరోముండనం.

వివరణ : సాధువులు నెలకొకసారి తలబోడి చేసుకోవటాన్ని శిరోముండన మంటారు. దీని భావమే మంటే : అప్పుడప్పుడు ఆలోచనల రూపంలో ఎగసే వాసనలను నాశనం చేయటమే. ప్రతి దినం ఉదయం సాయంకాలం అని ఒక నియమిత కాలాల్లో మాత్రమే సాధన చేసి అప్పుడు ఎగసే తలపులనే నాశనం చేయడానికి పోల్చి చూపారు. అయినప్పటికీ ఎడతెరిపి లేకుండా సహజంగా జరిగే సహజాత్మనిష్ఠగల జ్ఞానిస్థితే సంపూర్ణ వాసనాక్షయం (మళ్లీ మళ్లీ వాసనలు ఎగయని స్థితి) కాబట్టి, అదే ఉత్కృష్టమైన శిరోముండనమని ఇందు బోధించారు.

676. ముల్లుని ముల్లుతోనే తీయాలి. అట్లాగే చిత్తంలో లోతుగా పాతుకుపోయిన అశుభవాసనలను శుభవాసనలిచ్చే అభ్యాసంతో తీసేసి తర్వాత ఆ శుభవాసనలను కూడా అనవసరమైనవని నిర్మూలించాలి.

వివరణ : నిర్మూలించవలసినవి అశుభవాసనలు. సద్వాసనలు కావు. సద్వాసన అంటే బ్రహ్మనిష్ఠలో స్థిరంగా ఉండటానికి అవశ్యకమైనది. శ్రీ భగవాన్ రచించిన "శ్రీ అరుణాచల అక్షర మణమాల"లోని 69వ పద్యభావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

677. అశుభవాసనలు నశించే వరకే శుభవాసనలు అనుకూలిస్తాయి. అట్లాగ పెరిగిన శుభాశుభ వాసనలు నశించగా కలిగిన వాసనా క్షయమే మన ధ్యేయమైనటువంటి మోక్షస్థితి.

## 39. ఉపవాసం

678. తన మనస్సుతో భోగలాలసలను ఆశించకుండా ఉండటమే నిరాహార దీక్ష. ఆత్మనిష్ఠని వదలకుండా ఉండటమే ఉపవాస దీక్షయని వివేకులు తెలుసుకొని శ్రద్ధతో అనుసరిస్తారు.

వివరణ : నిరాహార దీక్ష అంటే భోజనం చేయక పొట్టను మలమల మాడ్చటం. కాదు. ఇంద్రియాలకి ఎటువంటి ఆహారం ఇవ్వకుండా మాడ్చటమే నిజమైన నిరాహారదీక్ష. ఉపవాసం అంటే దగ్గర వసించుట అని భావం. అంటే మనస్సు ఆత్మకి సమీపంగా నుండి ఆత్మతో వదలకుండా ఆత్మతో మమేకమైయుండటమే నిజమైన ఉపవాసం.

## 40. ఆహార నియమాలు

679. ఆత్మవిచార సాధనకి సాత్విక గుణం సహాయపడుతుంది. ఇది మిత సాత్వికాహార నియమంతో కలుగుతుంది. సాధన పురోగతికి సాత్విక గుణమే సహాయ పడుతుంది. కనుక సాత్త్వికాహార నియమ మొక్కటే సాధకులకు చాలు. అనేక రకాలైన యితర నియమాలు పాటించి కష్టపడటం ఎందుకు?

## 41. శౌచము

680. మలమయమైన మాంసమయమైన ఈ దేహాన్ని పరిశుభ్రంగా ఉంచడానికి ఇంకా ఎంత ప్రయత్నాలు చేసినా, శరీరం మాత్రం నవద్వారాల ద్వారా మలములను పెంచి దుర్వాసనలను కలగచేస్తుంది. ఇది తెలుసుకొని అసహ్యించుకొని, శరీరంపై ఆశని పూర్తిగా వదలేయడానికే శాస్త్రాలు శరీరానికి శుభ్రత కలుగచేసే ఆచార వ్యవహారాలని బలపరుస్తున్నాయి.

681. "ఒక కన్యని వివాహం చేసుకో" అని వేదం గృహస్థాశ్రమ జీవితాన్ని విధించింది. ఎందుకంటే, అల్పమైన స్త్రీభోగంపై వ్యామోహాన్ని త్యజించాలనే ఉద్దేశ్యంతోనే కదా! అంతే కాకుండా వేదం అనేక యాగాలను చేయమనటం, వాటికి తగిన విధులను సూచించడం కూడా వాటి ఫలాలైన స్వర్గాది భోగాలపై వైరాగ్యం ఏర్పడటానికే.

వివరణ : శ్రీ మురుగనార్ ఇక్కడ ఈ భావాన్ని అంటే దేహపరిశుభ్రత, గృహస్థధర్మం, యజ్ఞయాగాదులు గురించి చెప్పినదంతా "గుడ జిహ్వాన్యాయా"న్ని బట్టి చెప్పినట్లు గ్రహించాలి.

తల్లి రోగంతో బాధపడుతున్న బిడ్డకి మందు ఇవ్వడానికి ముందు దానిని దాచి పెడుతుంది. అయితే చూపిస్తున్నది బెల్లం ముక్క. అట్లాగే వేదాలు కర్మకాండలో చూపిస్తున్న భోగహేతువులన్నీ జ్ఞానకాండలో వైరాగ్యానికి సాధకుని తయారు చేయడానికే అని వివేకులు గ్రహించాలి.

682. స్వచ్ఛమైన ఆహారమంతా తన కడుపులో చేరిన కొద్ది సమయంలోనే దుర్గంధంతో కూడిన మలంగా మార్చే ఈ దేహమనే మలభాండాన్ని "నేను" అని ప్రేమతో అభిమానించే వారు మలాన్ని తినే జంతువు (పంది) కంటే హీనమైనవారు. స్వచ్ఛమైన ఆహారం తిని మలంగా మార్చే శరీరాన్ని "నేను" అని భావించే మానవుడు, మలాన్నే భుజించి మలంగా మార్చే పంది కంటే హీనులని చెప్పవచ్చు.

## భగవాన్ - 10

వివరణ : దేహాన్ని అభిమానించడంలో పంది మనిషి సమానమే. అయితే మనిషి కంటే పంది శరీరం కొంత మెరుగు అని అంటున్నారు శ్రీ భగవాన్. పంది శరీరం చెడు పదార్థాన్ని తిని చెడు పదార్థంగా మారుస్తుంది. కాని మానవ శరీరం శుద్ధాహారం తిన్నా కూడా దానిని అశుభ్ర మలంగా మారుస్తోంది. కనుక పంది శరీరంకంటే నీచమైన పని చేసే మానవ శరీరాన్ని "నేను" అని అభిమానించే వాడు పంది కంటే హీనుడని వారి తీర్పు.

## 42. నిష్కామ్యం

683. ఒక కోరిక నెరవేరడానికి దైవాన్ని ప్రార్థించడం ఆ కోర్కెనే ప్రార్థించడమన మాట (దైవాన్ని ప్రార్థించలేము). కనుక శివసాయుజ్యమైన మోక్షాన్ని పొందాలని కాంక్షించే ముముక్షువుల హృదయంలో కోరికల తలుపులు పూర్తిగా నశించటం తప్పనిసరి.

684. ముక్తినిచ్చే శ్రేష్ఠమైన తపస్సు నాచరించే సత్పురుషులు, మోహాన్ని కలిగించే ఇహపరసౌఖ్యాలను భోగాలను కాంక్షించరు. అటువంటి భోగాలను ఆశించి చేసే తపస్సు, కేవలం గంజికోసం విలువైన వజ్రాన్నియిచ్చి వేసే తెలివి తక్కువ పని వంటిది.

వివరణ : తపస్సు లక్ష్యం ఆత్మసాక్షాత్కారం. అంతే తప్ప, ఇతర విషయాల గురించి కాకూడదు. స్వర్గాది భోగాలకై చేసిన అసురుల తపస్సంతా వృధా అయినట్లు, ఆత్మసిద్ధికి తప్ప, ఇతరములకై చేసే తపస్సు వృధాయని భావం.

## 43. ఇంద్రియ నిగ్రహం

685. అంతఃకరణాలైన మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారాలనే నాలుగూ, బాహ్యకరణాలైన చర్మం, నోరు, కన్ను, ముక్కు, చెవి, అనే ఐదూ యివి రాత్రింబవళ్లు నిరంతరం అణగియుంటే, వివరించలేని ఆ తురీయ స్థితిలో ప్రకాశించే పరావస్తువు తానే వెలుగును.

వివరణ : కరణేంద్రియాలను ప్రత్యేకంగా అణచటం సూటియైన మార్గం కాదు. అహమణగితే అన్నీ అణగుతాయి. కనుక అహంతా నాశనానికే ప్రయత్నించాలి.

686. మనో వేగాన్ని అడ్డుకొని, ఆత్మలో సంస్థితమయ్యేటట్టు చేయక, మనస్సుకి ఏర్పరచిన విధి నిషేధాలను మీరి, పంచేంద్రియాల ద్వారా మనస్సుని పరుగెత్తనీయటం, ఒక ఊరి కోటను పగులగొట్టి, సాగునీరూ, మంచినీరూ చెఱువుల గట్టులను తెగకొట్టి ఆ ఊరినాశనానికి పాల్పడిన దోషానికి సమానము.

687. ఏకమైన స్వరూపంలో నుండక, వేర్వేరు వ్యక్తులుగా విష్ణువు బ్రహ్మ (తమలో ఎవరు గొప్పయని) తగవు లాడుకొని వాదోపవాదాలతో బుద్ధిని కోల్పోయారు. అప్పుడు అరుణాచలేశ్వరుడు జ్యోతిస్తంభరూపంలో మధ్యలేవగా, బ్రహ్మవిష్ణువులు ఆద్యంతములు పరీక్షించి కనుగొనలేక నిస్పృహ చెందారని పురాణం చెబుతోంది. కరణములను బహిర్ముఖంగా పోకుండా అడ్డుకొనకపోతే కలిగే కీడుని మనకి తెలియజేయటం ఈ కథ చెప్పడానికి కారణం.

## 44. ఇంద్రియ జయం

688. అహంకారమనేది శరీరమును ఆధారం చేసుకొన్న పంచభూత గుణాగుణాల సంబంధం కలిగినట్టి, "పాంచభౌతిక దేహమే నేను" అనే భావన. అది నశించాలి పిదప, పంచభూత గుణా గుణాల సంబంధిత దోషాలను సద్వస్తువైన తనపై ఆరోపించుకోరాదు. వానిని త్రోసి పుచ్చి ఉదాసీనంగా ఉండాలి. దీనినే "భూతజయం" అని అంటారు.

వివరణ : సామాన్యంగా భూత జయం అంటే పృధివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం మొదలైన పంచభూతాలను వశపరచుకొని, అందు సంచరించే సిద్ధులను గలిగిన వాడేయని అంటారు. ఆ భావం తప్పు అనీ, ఈ పాంచభౌతిక శరీరాన్ని నేను అని ఎంచకుండా ఉండటమే భూత జయమని తెలుపుతోంది ఈ వచన భావం.

689.చిదాభాస రూపమైన “చిత్తం-మనస్సే-నేను" అని చలించే అహంకారం పోయి, దాని వలన కలిగిన చిత్త భ్రమలన్నీ నాశనమై, బంధం ముక్తి అనే ద్వంద్వాలని దాటి, దృఢమైన ఆత్మజ్ఞాన సిద్ధిని పొందటమే నిజమైన సిద్ధజయం.

వివరణ : తాను అనుకొన్నది సాధించే సంకల్ప సిద్ధి, పరుల మనస్సును వశపరచుకోవటం, తన ఇష్ట ప్రకారమే ఇతరులను ఆలోచింపచేయడం “సిద్ధజయం” అని లోకులు అనుకోవడం తప్పు చిత్తం నశించి శివమయమగుటయే ఆత్మసిద్ధి. అదే సిద్ధజయం అని బోధిస్తోంది ఈ వచన భావం.

## 45. ఆసనాలు

690. సత్యజ్ఞానాకాశమైన తననే (ఆత్మనే) ఈ ప్రపంచమంతా ఆధారంగా చేసుకొన్నదనే దైవచింతన నుండి విడిపడక దృఢమవటమే సహజ సమాధికి తగిన ఆసనం.

వివరణ : కాళ్లు ముడుచుకొని, కాయాన్ని నిటారుగా పెట్టి, కళ్లు మూసుకని కట్టెలాగ కూర్చోవటమే యోగాసనమని అర్థం చేసుకొన్న ఈ కాలపు ప్రజలకు అసలైన జ్ఞాన యోగాసనం ఏమిటని చెప్పటమే ఈ ఉపదేశం.

## 46. యోగశక్తి

691. ఇంద్రియాల ద్వారా గ్రహించిన జ్ఞానాన్ని అంతంచేసి సదా విజృంభిస్తున్న మనోవ్యాపారాలను అణచి, నేత్రాలకి కనబడని హృదయంలో ప్రజ్ఞా రూపమైన ప్రకాశాన్ని, చెవులు వినలేని నిశ్శబ్ద రూపమైన “ఉన్నాను” అనే ఆత్మ స్ఫురణను చక్కగా గ్రహించటమే నిజమైన యోగశక్తి.

692. పూర్వ జన్మలలో చేసిన ప్రయత్నమే తర్వాత పక్వమై ఇప్పుడున్న ప్రారబ్ద రూపంగా మారుట చేత, ఆ ప్రారబ్ధ కర్తయైన తానే (యోగంతో దానికి విరుద్ధంగా లో దృష్టి కలిగి) మిక్కిలి ప్రయత్నంతో ప్రారబ్ధాన్ని మార్చవచ్చునని తెలుసుకో.

693. ఏయే సత్కర్మలు, దుష్కర్మలు వరుసగా సుఖదుఃఖాలనే ఏయే ఫలితాలనిచ్చినా సరే, నీవు నీ స్వరూపాత్మలో లీనమైన మనస్సుతో ఆ రెండు కర్మలను జయించగలవు.

వివరణ : ఆత్మలో సంస్థితమై యుండటం చేత కర్తృత్వభోక్తృత్వాలు నశించి, ప్రారబ్ధాన్ని అనుభవించే భోక్త లేకుండా పోవటమే విధిని జయించుట అంటారు.

694. ప్రాపంచిక వ్యవహారాల్లో కూడా అత్యంత శ్రద్ధ లేకపోతే ప్రయత్నం ఫలించదు కదా! అట్లాగే అనంతమైన ఆ పరబ్రహ్మాన్ని పొందే వరకు సాధనలో కావలసిన శ్రద్ధకి ఎటువంటి లోపం కలగరాదు,

695. తాను పూర్వజన్మలో చేసిన పాపాలెన్నైనాసరే, నేను పాపినని బాధపడక, అట్లాగ బాధపడే తాను ఎవరనే విచారణతో లోదృష్టికలిగిన తీవ్రసాధకులు నిశ్చయంగా స్వరూప ఆత్మయందు మునిగి అతి త్వరలో ఆనంద సాగరంలో తేలి యాడుదురు.

వివరణ : శ్రీ భగవాన్ రచించిన "నేనెవరు?" గ్రంథంలోని ఉపదేశ వాక్యాలే ఇవి అని గ్రహించాలి.

696. మార్జాల న్యాయ ప్రకారం తన వంతు ఎటువంటి సాధన లేకుండానే దైవానుగ్రహబలంతో ఈ జన్మలోనే జ్ఞానసిద్ధి పొందిన ప్రాజ్ఞులు, గత జన్మలో మర్కట న్యాయ ప్రకారం తమ ప్రయత్నంతో సడలని భక్తితో భగవంతుని ఆరాధించిన వారే.

697. సర్వవ్యాప్తము, అనంతము, అవిభాజ్యమైన చిదాకాశ ఆత్మ స్వరూపాన్ని నిరంతరం ధ్యానించే ఆత్మనిష్ఠులకు రవ్వంతైనా ప్రారబ్ధం లేదు.

వివరణ : "విణ్ ఉరువార్క్కిల్లై విది" అని తమిళంలో పెద్దల వాక్కు. అంటే ఆత్మాకాశ స్వరూప జ్ఞానాన్ని పొందిన వారికే ప్రారబ్ధం లేదని భావం. అంతేగాని, స్వర్గం, దేవలోకాలని పొందిన వారని అర్థం చేసుకోకూడదని ఇక్కడ చెప్పిన భావం.

698. “దేహమేనేన” నే అభిమాన రూపమైన మనస్సు బలహీనమైనది. ఆ మనస్సును ప్రారబ్ధం అనే ఒక గాలివాన గిరగిర తిప్పి కొట్టుకుపోయేలా చేస్తుంది. కాని నిశ్చలమైన పరిశద్ధమైన ఆత్మాకాశంలా శాంతితో నుండే మనస్సును (జ్ఞానయోగిని) ఆ ప్రారబ్ధం కొంచమైనా కదలించలేదు.

వివరణ : జ్ఞానికి ప్రారబ్ధం లేదని భావం.

699. జీవుని కర్మసముద్రంలో ముంచే కర్తృత్వమనే దుర్బుద్ధిని నాశనం చేయాలంటే దానికి ఒకే ఒక తంత్రం ఉపయోగించాలి. అదే, తన్మయంగా ప్రకాశించే అఖండాకార ఆత్మస్వరూప దృష్టి. అది తప్ప వేరేమున్నదని నీవు చూశావు? మనసా నీవే చెప్పు.

## 47. ప్రాణాయామం

700. సత్, చిత్, ఆనందం, నామం, రూపాలైన అంశాలతో నిండి గోచరించే యీ జగత్తులో, మిధ్యాంశాలైన నామరూపాల రెంటిని బుద్ధితో పూర్తిగా త్రోసిపుచ్చటమే రేచకం. సత్యాంశాలైన సత్ చిత్ ఆనందాలు మూడింటిని గ్రహించటమే పూరకం. ఆ సచ్చిదానందమే తానై సదా నిలకడగా ఉండటమే కుంభకం. ఇటువంటి జ్ఞాన యోగం యొక్క రేచక, పూరక కుంభకాలని పొందుము.

వివరణ : శ్రీ భగవాన్ రచించిన విచార సంగ్రహంలో జ్ఞానాష్టాంగం అనే అధ్యాయంలో ఈ భావాన్ని ఉపదేశించారు. అట్లాగే రాబోవు 979వ వచన భావాన్ని కూడా ఇక్కడ అన్వయించి చూసుకోవాలి.

701. శరీరం నేను కాదని ఆ అభిమానాన్ని పూర్తిగా త్యజించటమే రేచకం. సూక్ష్మబుద్ధితో 'నేనెవరు'? అని అంతర్ముఖమవటమే పూరకం. "నేను బ్రహ్మమునే"యని ఎఱిగి స్థిరంగా ఉండటమే కుంభకం. ఇదే జ్ఞాన ప్రాణాయామమవుతున్నది.

702. మనస్సే తాననే మోహంతో తిరిగి జీవుడు స్వప్నం వంటి బాహ్య ప్రపంచ దృశ్యాన్ని చూడటానికి బదులు, తన ఆత్మస్థానమైన హృదయంలో మునిగి ఉండటమే ప్రాణాయామం యొక్క నిజమైన తత్త్వమని తెలుసుకో.

## 48. కర్మరహస్యం

### భగవాన్ - 11

కర్మం ప్రవర్తింప చేసే కర్తృత్వం, దైవాన్ని ప్రేమించని భక్తిలేమి, భగవంతుని నుండి విడిపడిన వియోగం, దైవాన్ని తెలుసుకోలేని అజ్ఞానం మొదలైన యీ నాలుగు దోషాలు (అంటే కర్మ, భక్తి, యోగ, జ్ఞానాలనే నాలుగు ధర్మాల ద్వారా పోగొట్టుకోవలసిన నాలుగు దోషాలు) ఎవరికి చెందినవి లేదా ఎవరికి కల్గినాయని విచారించటమే సరైన కర్మ, భక్తి, యోగ, జ్ఞాన మార్గాలు! ఎట్లాగంటే "ఈ నిందితుడైన నేనెవరు?" అని విచారిస్తే 'నేను' అనే అహంకారం ఉనికి లేనిదిగా బోధపడుట చేత నాశనమై, పైన తెల్పిన నాలుగు దోషాలు ఎప్పుడూ లేనివిగా మాయమై పోతాయి. కనుక ఈ దోషాలు లేని ఆత్మగానే తాను ఎప్పుడూ ప్రకాశించుటయే పరమార్థ సత్యమవుతుంది.

వివరణ : ఆ నాలుగు రకాల దోషాలు నివృత్తి కోసం ఏర్పడిన నాలుగు రకాల యోగాల సత్ఫలితమూ 'నేనెవరు?" అనే విచార మార్గమొక్కటితో నెరవేరుచున్నది. కనుక, ఆ నాలుగు యోగ మార్గాలు ఇక నిరుపయోగములై పోతున్నాయని గుర్తించుకో వలసినది.

703. "కర్మ చేసే కర్తనైన నేనెవరు?" అని తన సత్యాన్ని పరిశోధించి తెలుసుకోవటమే కర్మయోగ తత్త్వం. కర్మకి మూలమైన తనని (అహంకారాన్ని) ఎవరని విచారించి ఎఱిగి అహంకారం నాశనం కాకపోతే కర్మయోగ ఫలమైన శాంతిని పొందుట కుదరదు.

704. కర్మల నాచరించే కర్త అయిన తన (అహంకారం) సత్యం ఏమిటని (అహంకారం ఉనికి లేని అసత్యమని) తెలుసుకొన్నవాడే సకల కర్మ విధులన్నిటినీ నెరవేర్చే కర్మానుష్టాన పరుడవుతాడు. ఎందువల్లనంటే, ఆత్మవిచారణతో అహంకారం నశించగా మహానందం కలుగుతుందే తప్ప, ప్రతిదిన మాచరించే కర్మానుష్ఠాన మనే తపస్సుతో పొందగలిగేది వేరేముంటుంది?

705. అన్ని ధర్మాచరణాలకి అద్వైత సత్యజ్ఞాన మొక్కటే ఆధార స్థానమగుట వలన, ఆత్మజ్ఞాని ఒకడే కర్మ, భక్తి, యోగ, జ్ఞానం అనబడే సకల ధర్మాలను సక్రమంగా అనుష్ఠించువాడవుచున్నాడు.

వివరణ : భగవద్గీతలో కర్మధర్మాలని గురించి చెబుతూ "స్వధర్మానుష్ఠానమే కర్మయోగము"ని తెల్పిన దానికి శ్రీ భగవాన్ రమణులు ఇక్కడ చక్కటి వివరణనిచ్చారు. "స్వ" అంటే ఆత్మ "ధర్మం" అంటే అందు సంస్థితమైయుండటయేయని వివరించారు. కనుక ఆత్మనిష్ఠయే స్వధర్మం అని భావం.

## 49. జపం

### భగవాన్-12

'నేను' అన్నది ఎక్కడుదయించి లయమవుతోందో, ఆ చోటుని జ్ఞాన విచారణతో పొంది స్థిరంగా నుండలేనివారు. జపం యొక్క మంత్ర ధ్వని ఎక్కడ నుండి పుడుతోందో ఆ చోటును వెదకి తెలుసుకొని పొందుట మంచిది.

706. తన సూక్ష్మమైన లోదృష్టి యైనటువంటి మనో మౌనంతో "నేను అని ఉదయించే స్థలమేది?" అని వెదకి హృదయంలో మునుగలేని వారు, మనస్సుతో ఒక మంత్రాన్ని జపిస్తున్నప్పుడు, ఆ మంత్ర ధ్వని అనే పరావాక్కు ఎచ్చటి నుండి పుడుతున్నదని పరిశీలించటమే చక్కటి తపస్సు.

వివరణ : శ్రీ కావ్య కంఠ గణపతి మునిగారు 'జపంతో కూడా ఆ స్థితిని పొందవచ్చా?' అని అడిగిన ప్రశ్నకు సమాధానమే భగవాన్ యిచ్చిన ఈ ఉపదేశం. దీని సత్యాన్ని, న్యాయాన్ని రాబోయే 715వ వచన భావంతో శ్రీ భగవాన్ ధృవీకరిస్తున్నారు. "పరావాక్కు" అని పైన చెప్పినది "నేను నేను" అనే స్ఫురణఅనే అని కూడా ధృవీకరిస్తున్నారు.

707. జపం యొక్క నిజస్వరూపానివి నీవే. కనుక నీవు “నేనెవరు?” అని నీ సహజ స్థితిని విచారించి గ్రహిస్తే ఆహా! ఏమిటీ వింత! నీవు ఎంతో ప్రయత్నంతో చేస్తున్న జపం, ఇప్పుడు ఎటువంటి ప్రయత్నం లేకుండానే జరిగిపోతోందేయని తెలుసుకుంటావు.

వివరణ : భగవంతుని అన్ని నామాలలో "నేను" అన్న స్ఫురణ శబ్ద రూపంలేని మొట్టమొదటి నామం. అన్ని ప్రాణులలో ఏకమై యుండువాడు భగవంతుడే, అందరు తమని "నేను" అని అంటారు కాబట్టి, అదే భగవంతుని నిజమైన నామం. అందువల్ల నీవే ఆ జపం యొక్క నిజస్వరూపమని అన్నారు. తన సహజ స్థితిని విచారిస్తే ప్రయత్న రూప కర్తృత్వం నశించుటచేత "సహజ జపం"గా అప్రయత్నంగా జరుగుతూనే ఉంటుందని భగవాన్ ఉపదేశం.

708. విషయ జ్ఞానమంతా, వాటిని తెలుసుకొంటున్న కర్తయైన తనలో అనన్యంగా ఏకమై మాయమయ్యే వరకూ (అంటే స్వరూప జ్ఞానం పొంది, అన్యంమాయమయ్యే ముందు,) "ఆ బ్రహ్మమే నేను పరబ్రహ్మమే నేను (అహం బ్రహ్మాస్మి, సోహం, శివోహం) అని వృధాగా నోటి మాటలతో చెప్పడం వలన ప్రయోజనం ఏమిటి? (ఏమీ లేదని భావం)

709. "నేనే బ్రహ్మం" (అహం బ్రహ్మాస్మి) అని నోటితో జపిస్తూ తిరుగక ఆత్మనిష్టతోనే బ్రహ్మమయంగా ఉండిపో. అట్లాగ కాకుండా విశ్రాంతి విరామం లేకుండా కోటి సంఖ్యతో జపం చేస్తే మాత్రం (జననమరణమనే) దుఃఖం పోతుందా? (పోదని భావం)

710. మందు తినాలి తప్ప మందు పేరు జపిస్తే దీర్ఘ వ్యాధులు నయం కావు. అట్లాగే మహావాక్యాలైన “శివోహం” మొదలైన అనేక శబ్దపద విన్యాసాలను జపిస్తేనే జన్మబంధం విడిపోదు. అవి చెప్పే వస్తువైన బ్రహ్మంగా తాను నిష్ఠలో ఉండాలని భావం.

## 50. నిజమైన దేవాలయం

711. జగజ్జీవులకు దేవాలయం ఈశ్వరుడన్న సత్యాన్ని తెలుసుకోలేని పామరజనులు (గోపురం, ప్రాకారం గర్భ గృహం మొదలైన) ఒక చిన్నగుడిని ఈశ్వరునికి నిర్మించి, సర్వవ్యాప్తియైన ఆయనని ఒక చిన్న విగ్రహ రూపంలో మలచి, ఆ గుడిలో ప్రతిష్ఠించి, పూజలు, తిరునాళ్ళు వంటి సేవలు చేస్తారు.

## 51. దివ్యనామం

12. హృదయం అనే సద్వస్తువు' ఉన్నాను' అనే స్ఫురణ రూపంగా హృదయం నుండి నానా విధరూపాలుగా వ్యాప్తిచెంది గోచరిస్తున్నప్పుడు, ఆ సద్వస్తువుకి యిచ్చే అనేక సహస్రనామాలన్నిటినీ పరిశోధిస్తే “నేను” అనే నామమే దివ్య నామమవుతుందని గ్రహించు.

వివరణ : భగవాన్ రచించిన అరుణాచల పంచరత్న గ్రంథంలోని 2వ పద్యంలోని భావాన్ని ఇక్కడ గ్రహించాలి. "నేననునాత్మపై హృదిని నర్తన మాడుటను వెలసితి హృదయమను పేరన్"

713. పైన తెల్పిన విధంగా ఈశ్వరుని ప్రథమనామమైనటువంటి "నేను" అనే నామంతో, ఆ సద్వస్తువు యొక్క భావరూపమే "ఉన్నాను" అని ఎప్పుడూ అనవరతం వెలుగుటచేత ఆ "ఉన్నాను" కూడా ఈశ్వరుని ప్రథమ నామమే.

714. తలపులు లేని హృదయంలో వెలుగుతున్న భగవంతుని సహస్రనామాల్లో, భగవంతుని నిజస్థితికి సహజంగా అమరిన ఈ "నేను" అనే దివ్య నామంలాగ ఏ నామం అంత చక్కగా అమరలేదు.

వివరణ : హిబ్రూ భాషలో భగవంతుని నామమైన 'జెహోవా' అనే పేరు కూడా ఈ భావాన్నే సూచిస్తుందిట.

715. భగవంతుని దివ్యనామాలన్నిటిలో "నేను నేను" అన్నదే అంతర్ముఖులైన వారికి అహంకారం నశించిన హృదయాకాశంలో నిండిన మౌనపరావాక్కుగా స్ఫురించి ఘోషిస్తున్నది.

వివరణ : 'నేనే నేను' అనే అహం స్ఫురణనే పరావాక్కు అని శ్రీ భగవాన్ ఈ వచనంలో తెల్పారు. భగవాన్ రచించిన 12వ వచనమును (706వ వచనం ముందు) ఇక్కడ సమన్వయించుకోవాలి.

716. అంతర్ముఖమైన మనస్సుతో "నేను నేను" అని ఆ దివ్యనామాన్నే విడవక భావించినా కూడా, అహంకారం సమూలంగా నశించేట్టు దాని ఉత్పత్తి స్థానంలో సాధకుని చేర్చి తరింప చేస్తుంది.

వివరణ :"నేను నేను అని భావిస్తున్నా కూడా అక్కడికి చేరుస్తుంద"ని "నేను ఎవరు?' గ్రంథంలోని బోధయే ఈ వచనం.

717. దేహాత్మబుద్ధియైన అహంకారం గుణరూపాలు కలిగినదిగా ఉండుట చేత, బాగా పరిశీలిస్తే, "నేను" అని ప్రతి యొక్కరు చెప్పే మాటకి, ఆ దేహాత్మ బుద్ధికి అధిష్టానమైన ఆత్మయే సరైన అర్థం, వస్తువు అవుతుందని తెలుసుకో.

వివరణ : ఉపదేశసారం 21వ శ్లోకార్థాన్ని యిక్కడ అన్వయించి పఠించాలి.

## 52. భక్తి

718. "నీవు" అనబడు "త్వం" పదానికి అర్థమైన అహంకార రూప (నిజానికి లేని) శూన్యుడైన తనను "తత్" పదమై ప్రకాశించు సదాశివమైన జ్ఞాన స్వరూపంలో, శాంత రూపమైన "ఉన్నాను" అనే "అసి" పదంయొక్క అనుభవంతో ఎవడు నాశనమవుచున్నాడో ఆ ధీరపురుషుడే శ్రేష్ఠమైన భక్తుడు.

719. బుద్ధితో పొందలేని శాంతి అనబడే సాగరంలో నీటి బుడగలాగ కనబడే తలపుల మయమైన అహంకారాన్ని దాని అసత్య రూపాన్ని చంపే ధీరుడే గొప్పభక్తుడు.

720 భక్తి మార్గంలో పరిపక్వమనస్సుతో భక్తి రసాన్ని పరిపూర్ణంగా గ్రోలినవారు, ఆ భక్తికి ప్రతిఫలంగా అమృతమయమైన ఆ భక్తినే ఇంకా ఆశిస్తారు.

వివరణ : ఉత్తమ భక్తులు తమ భక్తికి ప్రతిఫలంగా సిద్ధులనుగాని, ఇహపరసుఖాలను గాని కోరకుండా, భక్తి యొక్క భాగ్యాన్నే కోరతారు. దానికై భగవంతుని ప్రార్థిస్తారు. శ్రీ భగవాన్ రచించిన "అరుణాచల నవమణిమాల 7వ పద్యభావాన్నే ఇక్కడ ఉపదేశించారు.

721. అహంకారం యొక్క దురుసు తనం (చొఱవ) నశించి ఊరకయుండే మౌనమే ముక్తి. ఆ మౌనం నుండి జారితే కలిగేది పెద్దకీడు అనే విభక్తి. తాను మనస్తరంగాల రూపంలో ఎగయక స్థిరమై ఆ మౌనంలో లీనమవుటయే శివభక్తి, సత్యమని తెలుసుకో,

## 53. భక్తి - జ్ఞానం

722. పరాభక్తి, జ్ఞానం రెండూ కూడా స్వరూపాన్ని ఎరుకపరచే ఒకే తత్త్వం గలవి. అవి వేర్వేరు కావు. కాని కొందరు యీ రెంటిలో ఒకదానికి మరొకటి సహాయకారిగా ఉంటాయని చెప్పటం సరికాదు. వాటి గురించి సరైన అవగాహన లేకపోవడంవలనే వారు ఆ అభిప్రాయానికి వచ్చారు.

వివరణ : పరాభక్తి స్థితి తనను పోగొట్టుకొన్న స్థితి (అహంకార రహిత స్థితి) కాబట్టి అది జ్ఞాన స్వరూపమేయవుతుంది.

723. పరాభక్తి, జ్ఞానం యీ రెంటిలో ఏదో ఒక మార్గాన్ని చివరి వరకు ఆచరించి, సత్యాన్ని ఎఱిగిన ప్రాజ్ఞులు కూడా అప్పుడప్పుడు ఈ రెండు ఒకదానికొకటి ఉపాయమనే భావాన్ని ఆమోదిస్తున్నట్లూ, తాము కూడా వాటిలో ఒకదానిని శ్రేష్ఠమని ఆచరించినట్లూ కనబడుతుంది. ఇట్లాగ ఆచరించిన సాధకులు మధ్యలో మరోదాన్ని ఇష్టపడి, ముందు ఆచరించిన దాని నుండి జారిపోకుండా ఉండటానికే యని తెలుసుకో.

## 54. భక్తి - విచారణ

724. సాధకుడు ఆచరించే జ్ఞాన విచారణ ద్వారా పొందే సమాధి స్థితి, ఆ సాధకుని ఆత్మగా, నిజస్వరూపంగా ప్రకాశించే దైవం అతనిపై కురిపించే అనుగ్రహ వర్షంవలనే కలుగుచున్నది.

వివరణ : అత్యంత ప్రీతిలో ఆత్మని ఆశ్రయించే ఆత్మావలోకనమనే సాధన ఒకటే నిజమైనటువంటి ఈశ్వరోపాసన, అందువల్ల, ఆత్మయగు ఈశ్వరానుగ్రహం చేతనే జ్ఞాన విచారి కూడా సమాధిలో నిలుకడ చెందుతాడు.

725. హృదయంలో ఆత్మగా నుండే గురువూదైవమూ అయిన ఈశ్వరుడు తన అనుగ్రహంతో మనస్సును లోపలికి ఆకర్షించి తన వద్ద నిలబడితే తప్ప, ఎవరైనా తన మాయ మనస్సుతో ప్రయత్నించి, బహిర్ముఖముకాని లోదృష్టితో శాంతి స్థితిని పొందగలరా? (పొందలేరని భావం)

726. అష్టమూర్తిగా ప్రకాశించు భగవంతుని అనుగ్రహాన్ని సద్గురువు అనుగ్రహం లేనిదే పొందలేము. అది శ్రవణ మననాల ద్వారా కూడా లభ్యమవదు. గురుభక్తితోనే ఆ దివ్యానుగ్రహం లభిస్తుంది.

వివరణ : భగవంతుడే సద్గురువు కాబట్టి గుర్వనుగ్రహం లేనిదే భగవదను గ్రహం లేదు. గురుభక్తే భగవద్భక్తి. అదొక్కటే దైవానుగ్రహాన్ని లభింపజేస్తుంది.

727. సాధకుడు తనకి దైవానుగ్రహం పట్టుగొమ్మగా సహాయపడుతోందా లేదా యని సందేహించనవసరం లేదు. బంధ విముక్తి పొందటానికి, విచారణతో మనస్సు అత్యంత ఉత్సుకతకలిగి నుండటమే ఆదైవానుగ్రహం తనకు లభ్యమైందనటానికి తార్కాణం.

728. నిజానికి, దైవానుగ్రహమూ, నేనెవరనే విచారణ సాధనా ఒకదానికి మరొకటి సహాయకారులుగా, జంటగా చేరి సాధకుని పరమాత్మలో నిల్పి కైవల్యస్థితికి చేర్చును.

729. సత్పదార్థమైన ఈశ్వరుడు (ఆత్మయే) హృదయంలో నుండి మనలను మేల్కొలిపితేనే తప్ప, ఈ జగత్తు అనే స్వప్నం ఈ మాయా దృశ్యం చెరిగిపోదు. ఈ ప్రాపంచిక స్వప్నదృశ్యాన్ని చూచే తాను (జీవుడు) ఎవరనే విచారణయే, భగవంతుడైన ఆత్మమనలను మేల్కొలపడానికి మనం చేసే ఉపాసన అవుతుంది.

730.తన నిజస్వరూపమైన ఆత్మని తాను ఆశ్రయించటమే, మనో వాక్కాయాలకతీతమైన మహేశ్వరునికి మనం చేసే పరభక్తి అని అంటారు. భక్తుడు ఆశ్రయించే మహేశ్వరుడూ విచారణ చేసే సాధకుడూ ఆశ్రయించే ఆత్మ ఒకే వస్తువవుతుంది.

వివరణ : స్వరూపం, ఆత్మ, గురువు, ఈశ్వరుడూ అనుగ్రహం ఇవన్నీ ఒకే వస్తువు యొక్క పర్యాయపదాలు.

731. జ్ఞానమార్గం, భక్తి మార్గం రెండూ అవినాభావసంబంధము కలవని ఎఱుగుము. అన్యంగాని యీ రెంటిలో ఒకదాని నుండి మరొక దానిని వేరుపరచి చూడకుండా ఒకటిగాను, సమంగాను హృదయంలో నిల్చి అనుష్ఠించు.

## భగవాన్ - 13

దైవం ఆత్మగా ఉంటుందన్నారు కాబట్టి ఆత్మని ఆశ్రయించి చేసే క్రియ ఏదో అదే (లో దృష్టిలోనుండటం) పరమేశ్వర భక్తి అవుతుంది.

732. భక్తితో భగవదనుగ్రహం పొందాలని కాంక్షించే తాను ఎవరు? అని విచారిస్తే, "తాను ఒక జీవుడు" అనే అహంకారం నశించి, భగవదనుగ్రహం అనుభావానికి వస్తుంది. నిశ్చలమై ఆ అనుగ్రహాగ్నిలో అహంకారం దగ్ధమైన తర్వాత, కర్మ మాయ అనే ఇతర మాలిన్య దోషాలు అంటుకోవు.

733. శైవసిద్ధాంతమార్గంలో చెప్పబడుతున్న అహంకారం, కర్మ, మాయ అనే దోష త్రయాలలో కర్మ, మాయ దోషాలు ప్రధమదోషమైన అహంకారంమీద ఆధారపడి పెరుగుతాయి. మూలమలమైన అహంకారం నశిస్తే మిగతా రెండు మలములు నిశ్శేషమైపోతాయి.

## 55. ఏకాగ్రభక్తి

734. దిక్సూచి ముల్లు ఎప్పుడూ ఉత్తర దిశవైపే చూపిస్తుంటుంది. అట్లాగే భగవంతుని పాదాలనే ఆశ్రయించిన మనస్సుగల మానవులు ప్రాపంచిక జీవితమనే ఈ భవసాగరంలో పడి మునిగిపోరు.

735. భగవంతుని తమ హృదయంలో ప్రతిష్ఠించుకొని జీవించే ఉత్తమ భక్తులు ఒక స్తంభాన్ని పట్టుకొని చుట్టూ తిరిగి పరుగెత్తే చిన్న పిల్లల వంటి వారు. (అంటే క్రింద పడతారేమో నన్న భయం లేనివారు). అచంచలమైన భక్తి గలవారు నిరంహకారులు కాబట్టి వారు జగన్మాయలో పడరు.

736. లోకవ్యవహారాలన్నింటికీ ఆధారమై ఉండే ఆ సూక్ష్మమైన మహద్వస్తువునందు మనస్సు లీనమైయుంటే, చేసేటువంటి అనేక వేల వ్యవహారాలవల్ల మనఃక్లేశము కలుగదు.

737. తిరుగలిలో పోసిన పిడికెడు బియ్యంలో పిడికి (ఇరుసుకర్ర) అవతలుండే గింజలే రవ్వగా పిండిగా అవుతాయి. పిడికి ఆనుకొని చుట్టూ ఉంటే గింజలు పిండిగా మారటంలేదు. అట్లాగే లోకుల్లో భగవంతుని పాద చింతన నుండి వైదొలగి లోక వ్యవహారాల్లో మునిగే వారే జననమరణ మాయకు బలైపోతారు. భగవంతుని పాదాలను విడువని వారు మాయకు బలి కారు.

## 56. ధ్యానం - విచారణ

738. సచ్చిదానందమై ప్రకాశించు పరబ్రహ్మయే తానని భావన చేయటమే ధ్యానం. తాను ఒక దేహమనే తలపైన అహంభావం సమూలంగా నాశమైయ్యేటట్టు, మనస్సుని ఆత్మలో నిలుపుటయే విచారణ.

739. ఎవరు ఏ విధంగా భావిస్తున్నారో వారు ఆ విధంగానే ఆత్మను పొందుతు న్నారు. ఏ విధంగాను ధ్యానించక, ఏ భావమూ లేక అంతర్ముఖులై ఊరక “ఉన్నాను" అని ఉండే శాంత స్వరూపులు నిర్గుణ కైవల్యాన్ని పొందుతారు.

వివరణ : నామరూప ధ్యానోపాసనతో ఆత్మయొక్క సగుణ స్వరూపమే పొందుతామని, భావరహితమై ఊరకయుంటే ఆత్మయొక్క నిర్గుణ కైవల్యస్థితిని పొందుతామని ధృవీకరిస్తున్నారు. ఉన్నది నలుబదిలోని 8వ పద్యభావాన్ని ఇక్కడ చిత్రీకరిస్తున్నారు.

740. అహంకార రూపుడైన తనని సమూలంగా నాశం చేసిన తర్వాతనే తన మూల వస్తువైన పరమాత్మ స్థితిని పొందవచ్చును. అహంకారంతో "నేను ఆ బ్రహ్మయే" అని ధ్యానిస్తుంటే ఆ స్థితిని పొందటమెట్లాగ? కనుక విచారణతో నేను అనే అహంకారాన్ని నశింపజేసి సర్వభావ రహితమైన మనోమౌనంలో నుండటమే సరైన సాధన అవుతుంది.

వివరణ : ఉన్నది నలుబదిలోని 32వ పద్యభావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి. 739వ వచనంలో ఉపదేశించినట్లు ఇంతవరకు లోకులు నిర్గుణోపాసనయని తప్పుగా భావించి చేస్తున్న "అహంబ్రహ్మాస్మి" వంటి మహావాక్య ధ్యానపద్ధతులు కూడా కేవలం మనో వృత్తులే కాబట్టి అవి ఆత్మని ఇవ్వలేవు అని ఉపదేశించారు. అంతర్ముఖమైన విచారణే భగవంతుని చేర్చగలదు అని సూచిస్తున్నారు.

741. జ్ఞానమైన బ్రహ్మాన్ని కూడా, పంచేంద్రియాల ద్వారా తెలుసుకోబడు ఒక అల్ప విషయాలలో ఒకటైనట్లు, "అది ఇటువంటి"దని కొందరు ధ్యానిస్తారు. నామరూప దర్శనాన్ని పొందిన తర్వాత అదే శివదర్శమనుకుంటారు. అది అదృశ్య మగుటచేత, దుఃఖించి నిరుత్సాహపడతారు. దీనికి కారణం, ఆ దృశ్యాన్ని చూసే “నేనెవరు?" అని తనలో విచారణ చేసి తనని తెలుసుకోలేని దోషం చేతనే.

వివరణ : ఈ గ్రంథంలో రాబోయే 1070, 1072, 1073 వచనములలోని ఉపదేశాలని కూడా ఇక్కడ చదువుకొని గ్రహించాలి.

## 57. స్వరూప ధ్యానం

742. తనను కోశాలతో కూడిన దేహమని కాకుండా కేవలం చేతనా మాత్రంగా చూచే వాడు ఆత్మయైన శివస్వరూపంలో సంస్థితుడై యుంటాడు.

## 58. ఆకాశంపై ధ్యానం

743. అప్రమేయము, అవిభాజ్యము, అరూపము, అఖండము అయిన ఆకాశాన్ని ధ్యానించే సాధన, కామ్యమనస్సుతో పొందాలనే గొప్ప మహిమలన్నిటినీ కూడా అతి సులభంగా చేకూరుస్తుంది.

744. ఆకాశ ధ్యానం చేసే వాళ్ళల్లో, తర్వాత "ఈ ధ్యానం చేసే "నేనెవ” రనే లో దృష్టితో ఆకాశ ధ్యానాన్ని వదలి అంతర్ముఖమైన వారే జన్మరహితమైన ముక్తిపదవిని పొందుతారు. ఆకాశ ధ్యానం నుండి విడిపడలేని వారు జనన మరణ రూపమైన సుడిగుండంలో చిక్కుకుంటారు.

745. ప్రజ్ఞారూపమైన ఆత్మదేవతను హృదయంలో వెదకి దృడనిష్టకై యత్నించే ఆత్మవిచార శీలుని చూచి అతనికి చిత్తభ్రమణమనీ, పిచ్చి అని అనటం అమృతాన్ని గ్రోలి ఒకడు మృతి చెందాడని చెప్పటం వంటిదేయని గ్రహించు.

వివరణ : ఆత్మ విచారణ సాధన చేపట్టిన వాడు పిచ్చివాడైనాడని లోకులు అనటం తప్పు. ఈ సాధనా మార్గంలో పిచ్చివంటి మానసిక రోగాలు ఎప్పుడూ రావు. దానికి బదులు బుద్ధి వికాసం కలుగుతుందని ఈ వచనభావం. ఇక్కడ మొదటి ఆత్మవిచార భాగంలోని 384-407 వచన భావాలని మరొకసారి జ్ఞాపకం చేసుకోవాలి.

## 59. కాల ధ్యానం

746. నికృష్టమైన జనన మరణాలనే దోషం పోయి, అమృత స్థితిని కోరినవారైతే, ఎటువంటి ఉదయాస్తమయ వికారాలు లేని కాలాన్ని అంటే నిత్యవర్తమానమును నిరంతరం ధ్యానించటమే చేయతగ్గ సాధన.

వివరణ : ఉన్నది నలుబదిలోని 15వ శ్లోకాన్ని ఇక్కడ గ్రహించాలి. భూతకాలం లేదు. భవిష్యత్ అసలు తెలియదు. కనుక ఉన్నది వర్తమానమే.

7.47. వర్తమాన కాల ధ్యానాచరణతో వర్తమానం కూడా మాయమైపోగా, "నేనే ఉన్నాను" (దేశ కాలాలు ఏవీ నాకు అన్యంగా లేవు) అని గ్రహించిన జ్ఞానంతో కాలాతీతులై, ఉనికి మాత్రంగా నిలుకడ చెందిన సత్పురుషులే అమరత్వాన్ని పొందిన మహానుభావులు. ఇతరులందరూ కాలం అనే ఖడ్గానికి బలై నశించేవారే.

వివరణ : శ్రీ భగవాన్ రచించిన 'ఉన్నది నలుబది' లోని 16వ శ్లోకంలో, మనలని శరీరమని భావిస్తే కాలం మనలని కబళించేస్తుందని హెచ్చరించారు. ఆ భావాన్నే ఈ వచన భావంలో “ఇతరులందరూ ఆ కాలుని ఖడ్గానికి బలైపోతారని" సూచించారు.

748. ఉన్నాను అనే సద్భావాన్ని దృఢపరచుకొన్నవారు, తమను తప్ప కాలం అని అన్యంగా చూడరు. కనుక వారు ఏకమూ పూర్ణమూ అను తత్త్వమైన తనను (ఆత్మను) భూత, వర్తమాన, భవిష్యత్ అని త్రికాల భేదాలుగా నెంచరు.

వివరణ : ఉన్నది నలుబదిలో 16వ శ్లోకంలో గల ఉపదేశాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి.

## 60. నిదిధ్యాసన

749. జగత్తును చూస్తే ఉన్నట్లుంటుంది. బాగా విచారించిచూస్తే ఉనికి లేని మిథ్యగా కనిపిస్తుంది. ఈ మిథ్యాజగత్తుపై దృష్టిసారించక హృదయంలో గల ఆత్మని లోదృష్టితో వెదకి తెలిసికొనినట్లయితే, ఇక పునర్జన్మల గురించి ఆలోచించవలసిన అవసరంలేదు.

వివరణ : ఈ భావం తమిళ గ్రంథం తిరుక్కురళ్ లోనిది. ఇక్కడ మూడు విషయాలు తెలుస్తాయి. 1) జగత్తుకి ఉనికి అంటూ లేదు. సామాన్య దృష్టికి ప్రపంచం ఉన్నట్లే తెలుస్తుంది. 2) జనన మరణాలు కేవలం తలపులే. 3) ఆత్మను తెలుసుకొంటే అదే జనన మరణాలను జయించటం.

750. ఎవరైనా దేనిని నిరంతరం ధ్యానిస్తారో, ఆ ధ్యానశక్తి వలన అతడు అదే అవుతాడు. కనుక “నేనునాది" అనే సమస్త బంధాలు పోవాలని నిరంతరం విచారణతో ఆత్మని తలచి అదే అయినట్లయితే అది వానిని భవరోగ విముక్తునిగా చేస్తుంది.

వివరణ : మరణం ఏ క్షణమైనా రావచ్చును. కనుక క్షణికమైన ఈ జీవితంలో ప్రతిఘడియ ఆత్మచింతనతోనే గడపాలని శ్రీ రమణుల ఉపదేశం.

751. తపస్సు యొక్క అంతిమ ధ్యేయం సంపూర్ణ శాంతి, స్పష్టమయిన జ్ఞానమే అని వేదాలు ప్రకటించాయి. ఇదితప్ప, అనంతమైన ఏ ఇతర భోగాలపై ఆశ కలిగినా, ఏ మాత్రం మనశ్చాంచల్యానికి గురి అయినా, తక్షణమే అట్టి తపస్సాధనలను త్యజించాలి.

752. “ఈ ఒక్క వస్తువు లేకపోతే కుదరదు” అనే ఆలోచన ఒకనికి ఉన్నట్లయితే అతడు దానిని పొంది అనుభవించునుగాక. అయితే మనస్సు పరిపక్వత చెంది, ఆ వస్తువుపై వ్యామోహం తగ్గి, దానిని త్యజించాలనే ఆలోచన మనస్సులో ఉన్నట్లైతే ఆ క్షణమే దానిని వదలేయాలి.

753. ఆత్మస్వరూపాన్ని మరచే ప్రమాదం చేత కలిగే మనః క్లేశాలన్నీ నశించగా కలిగే శాంతి యొక్కటే ఈశ్వరానుగ్రహం పొందామనటానికి నిదర్శనమని తెలుసుకో. అదొక్కటే తప్ప, సన్మార్గంలో కలిగిన అనేక ఐశ్వర్యాలను మాత్రం పొందటాన్ని నీవు ఈశ్వరానుగ్రహం పొందావని భావించకు.

వివరణ : సకల ఐశ్వర్యాలు తమకు కల్గినాయి. కాబట్టి తనకి భగవదనుగ్రహం లభించిందని పామరులు అనుకొంటారు. కాని అనుగ్రహానికి నిదర్శనం అదికాదు. ఆత్మనిష్ఠలో నుండి, శాంతి పొంది మనఃక్లేశాలు లేనివాడే నిజంగా భగవదనుగ్రహం పొందిన వాడు. ఇదే 751వ వచనంలో చెప్పిన తపఃఫలం.

754. అనుకొన్నది సాధించే శక్తిగల సంకల్ప బలం పొందటానికి బదులు, జ్ఞాన నిష్ఠలో నుండి తలపులులేని శాంతిమయమైన స్థితిని పొందటమే శ్రేయస్కరం.

## 61. ఇతర సాధనలు

755. కాలాన్ని వ్యర్థం చేయక ఆత్మవిచారణను ఎడతెగక కొనసాగించే వారి జన్మ సార్థకమవుతుంది. ఈ శరీర రూపమే "నేను" అన్న అహంకారం నశించి శ్రేష్ఠమైన పరమానంద సాగరం హృదయంలో పొంగిపొరలుతుంది.

756. పరమోత్కృష్ట ఫలదాయకమైనది ఆత్మవిచారణ ఒకటే. అది తప్ప మనస్సణగటానికి తగిన సాధనలు వేరే లేవు. ఇతర సాధనాలవల్ల మనస్సు అణగినట్లే అణగి మళ్ళీ విజృంభిస్తుంది.

వివరణ : "నేనెవరు?" అను గ్రంథంలో శ్రీ భగవాన్ చెప్పిన ఉపదేశమే ఈ పద్యభావం.

757. ప్రాణాన్ని నిరోధించటం వలన మనస్సు అణగుతుంది. అయితే నిరోధింపబడ్డ కాలంలోనే అది అణగి వుంటుంది. ప్రాణం లేస్తే మనస్సు లేచి పూర్వవాసనలకు లోబడి బాహ్యవిషయాల్లో పడి తిరుగుతూంటుంది.

వివరణ :ఈ భావం కూడా శ్రీ భగవానుల "నేనెవరు?" అనే గ్రంథంలోని ఉపదేశవాక్కులే.

## 62. విచారణకు సహాయకారులు

758. దృష్టి రూపంగా వెలికిపోయే మనోవృత్తులను అణచటానికి అత్యంత శ్రేష్టమైన మార్గమేమంటే, మనస్సుని లోపలికి త్రిప్పి నిలిపే ఆత్మ విచారణ ఒక్కటే.

759. నేనున్నాను అని ప్రజ్ఞగా (స్ఫురణగా) హృదయంలో ప్రకాశించుట వలన, సద్వస్తువు తనను తాను ఎఱిగే చిత్ కూడా అవుతున్నది. మఱపెరుగని ఈ "ఉన్నాను" అనే ఆత్మ ప్రకాశమే హృదయంలో వెదకి విచారణ ద్వారా ఆత్మను తెలుసుకొనడానికి సహాయపడుతుంది.

760.రెండు తలపులకి మధ్య మనస్సు ప్రజ్ఞారూపంలో ప్రకాశిస్తోంది. అదే మన పరమార్థ స్థితియని విచారణతో ఎఱిగి, హృన్నిష్ఠులమై ఉండటమే, పరమపదము.

761. అసంఖ్యాకమైన నామజపం, ప్రీతితో మూర్తిధ్యానం మితమైన సాత్వికాహార నియమం సాధనాలుగా చేసుకొని క్రమంతప్పక ఆచరిస్తే, పాత వాసనలు నశించి మనస్సు ఏకాగ్రమై బలపడుతుంది. -

762. ఏనుగు తొండానికి ఒక గొలుసు ఇస్తే, సదా చలించే ఆ తొండపు చలనం ఆగిపోతున్నట్లు, అశుభవాసనలు గల బలహీనమైన మనస్సుకి మూర్తిధ్యానం, నామజపం అలవాటైతే, మనశ్చాంచల్యమణగి శాంతిలభిస్తుంది.

వివరణ : ఈ పద్యభావాన్ని 'నేనెవరు?' గ్రంథంలో వచన రూపంలో చూడగలరు.

763. ఈ విధంగా అంతర్ముఖమై ఏకాగ్రశక్తిని పొందే మనస్సుకే విచారణ మంచి ఫలితాన్నిస్తుంది. మలిన మనస్సులు జ్ఞాన విచారాగ్నిలో వేసిన పచ్చిదుంగల వంటివి! (అంటే విచారాగ్ని మలిన మనస్సును కాల్చలేదని భావం).

764. కోర్కెలవల్ల అంతులేని దుఃఖాలే కలుగుతాయని తెలుసుకొని, కోర్కెలను త్యజించిన ఉత్తములు తాము ఆచరించే సూటి మార్గమైన ఆత్మవిచారణతో హృదయంలో ఆత్మానందరసాన్ని గ్రోలుతారు.

## 63. సాధనా సమాప్తి

765.త్రిపుటి భేదాలు ఉన్నంతవరకు అహంకారం నశించలేదని ఊహించు కోవచ్చును. కనుక త్రిపుటి భేదాలున్నంత వరకు సాధనలు అవసరమే యని తెలుసుకో.

766. బంధాలు కల్పించే త్రిపుటి భేదాలు స్థూల సూక్ష్మ దేహాలతో ఎంత వరకు ఉంటాయో, అంతవరకు అజ్ఞానమోహరూపమైన కారణ శరీరంతోగల బంధం నశించలేదనే చెప్పవచ్చు. అంతవరకు పునర్జన్మ కూడా పోనట్లే.

767. విచారణ వలన అహంకారం నశిస్తే, తర్వాత తనకు అన్యంగా ఏ వస్తువు కనబడదు. అంతకు ముందు విషయములుగా గోచరించినవి ఇప్పుడు తన ఆత్మ స్వరూపంగానే అనుభూతమవుతాయి.

768. అహంకారం నశించి, ఆత్మనిష్ఠలో నుండి సత్యాన్ని గ్రహించిన పెద్దలు నామరూపాత్మకమయిన ఈ జగత్తును మిథ్యాదృశ్యమాత్రంగా భావిస్తారు. అనంతమైన ఆ అఖండాత్మాకాశమే తామై ప్రకాశించుట చేత ఇవన్నీ నామరూప రహిత చిన్మాత్రమైన తన్మయమే యని వారి తుది తీర్పు.

## 64. ధ్యాన నిష్ఠ - వివేకం

769. దోషరహితమైన ఆత్మనిష్ఠ ఒక్కటే అనాత్మబంధాలని ధ్వంసం చేయగలదు. తమ సహజ సత్యాత్మలో నుండి అసత్యదేహాది ప్రపంచాన్ని వేరుచేసి చూపించే నిత్యానిత్యవస్తువివేకము స్వచ్ఛమైన ఆశారహిత స్థితిని పొందటానికి సహాయపడుతుంది.

770. ఇప్పుడు నీవు “దేహమే నే"నని ఎంచి వ్యవహరిస్తున్నావు. విచారణ చేస్తే, ఆ దేహం నీవు కాదని తెలుసుకుంటావు. కనుక ఇకనైనా “నేనెవరు?” అని విచారించి హృదయంలో మునిగి సాక్షాత్ ఆ బ్రహ్మమే నీవై నిష్ఠలో నుందువుగాక!

771. ఏకము సత్యము అయిన ఉనికిగా ఊరక ఉండటం తప్ప మరెందునా ప్రాణానికి (జీవునికి) ఆశ్రయంలేదని గ్రహించి, వస్తువులపై ఇష్టానిష్టాలు పూర్తిగా తొలగించి ఆ కేవల చైతన్యంలోనే నీవు నిష్ఠగా నుండుము.

772. స్వచ్ఛమైన జ్ఞానంతో అవిద్య పూర్తిగా దహించగా మనస్సు నశించి,ఆత్మయందు స్థిరమైన నిష్ఠగల జ్ఞానులు తమ చిత్తం శివస్థితిలో ఏకమై నిత్యసహజ సమాధి నొంది జీవన్ముక్తులుగా జీవిస్తారు.

## 65. ఊరకయుండుట

773. ఉత్తమము, గొప్ప శక్తివంతమైన తపస్సని, దానిని మనం ఆచరించాలని భగవాన్ శ్రీ రమణ మహర్షులు ఉపదేశించినది ఇదే! ఇంతే! "ఊరక యుండట"మే. ఇది తప్ప మనం అనుష్ఠించవలసిన ధర్మాలు (ధ్యాన, యోగ) వేరేవి లేవు.

వివరణ : మనో వాక్కాయములతో చేస్తున్న కర్మల చేతనే జన్మలు కల్గుతున్నాయి. వాటిని ఉన్నట్లుంచితే జన్మరాహిత్యం సిద్ధిస్తుందని భావం. ఇక్కడ ఆత్మవిద్యా కీర్తనంలోని 4వ చరణాన్ని చదివి చూడండి.

714. మనోవృత్తులణగి నిశ్చలమై 'ఉన్నాను' అనే ప్రజ్ఞామాత్రంగా ఊరక యుండే ఆత్మ స్వరూప స్థితే ఆమహోన్నత స్థితి తానై యుండే గొప్ప స్థితి. అత్యున్నతమైన, అపురూపమైన తపస్సుచే తప్ప ఎవరూ పొందలేని ఆ నిశ్చల తటస్థ స్థితిని పొందిన వారు పుణ్యాత్ములు. వారిని పూజించండి.

## 66. వ్యష్టియహంత

775. "నేను నేనే" అనే జ్ఞానానుభవం లేకుండా ఈ మృణ్మయ శరీరమే నేను అని శరీరాన్ని తానని అభిమానించేవాడు, అతడు స్వప్నంవంటి మోహాంధకారంలో మునిగి శరీర పతనంతో పాటు తాను కూడా నశిస్తున్నట్లు దుఃఖపడతాడు.

వివరణ : నేను నేను అని భావించడం జ్ఞానం. నేను శరీరం అని భావించడం అజ్ఞానం. 'మోసెస్' అనే క్రైస్తవముని అప్పట్లో భగవంతుని జ్యోతి రూపాన్ని చూసి "మీరెవర"ని ప్రశ్నిస్తారు. ఆ జ్యోతి "నేను నేనే" అని జవాబిచ్చిన వైనం క్రైస్తవ మత గ్రంథం ఓల్డ్ టెస్టమెంట్ (పాత నిబంధన) లో చెప్పిన విషయాన్నే భగవాన్ సూచించారు.

776. ఏకమూ, పూర్ణమూ, ఆద్యమూ ఆ పరవస్తువు. అది "ఇటువంటిది" అని ఊహింప శక్యముగాని సద్వస్తువు. అందుచేత దానిని ఆరాధించేందుకే కావచ్చు, అది తనకు అన్యమైనదని భావించటం, తాను వ్యష్టి తత్త్వముగా విడివడి ఉండటం మహాదోషం అవుతుంది.

777. అఖండమైన జ్ఞాన పదార్థానికి విడిగా ఎగసిపడే "నేను ఇది" అని ఒక జీవునిగా నుండటమంటే, అద్వైత బ్రహ్మాన్ని చీల్చి భంగపరుస్తున్నట్లు 'నేను' (జీవుడు), తాను (శివుడు) అని రెండు ముక్కలుగా కోసి చంపుతున్నట్లు, అది అంతటి మహాపాపమని తెలుసుకో.

వివరణ : అఖండమైన బ్రహ్మాన్ని జీవుడు శివుడు అని రెండుగా విభజించటం, బ్రహ్మహత్యాదోషమని ఉపదేశిస్తున్నారు.

778. తలపులతో సత్పదార్థానికి వేరుగా ఒక మనః ప్రపంచాన్ని సృష్టించుకొని, అందు తానొకడు జీవునిగా వేరుగా ఉన్నాడని ఎంచడం కేవలం భ్రమయే. నిజానికి సత్యాత్మలోకంలో, ఏకము, అచలము అయిన సహజ స్థితికి మారుగా అనేకత్వం చలనము గల స్థితి రాజ్యమేలటం ఎలాగ వీలవుతుంది?

వివరణ : అజాతమైన, ఏకాత్మ స్వరూపమే సత్యమని ఉపదేశం

779. సత్పదార్థాన్ని వదలి తానువేరుగా ఉన్నట్లుతోచే మిథ్యాభావనయే బంధలక్షణం. అంతకంటే మరేమీకాదు. కనుక "నేను జీవుణ్ణి" అనే తలపుదయించగానే దానిని (విచారణతో) త్రోసివేయుము.

వివరణ : అఖండమైన హిందూ మహాసముద్రానికి ఒక ఎల్లను సృష్టించి (మానసికంగా), ఆ భాగాన్ని "ఇది బంగాళాఖాత"మని అంటున్నాము కదా! నిజంగా సముద్రాన్ని విడదీస్తున్నామా? లేదు. అట్లాగే అఖండమైన నేను నుండి విడిపడి "నేను జీవుడను" అని అనుకోవటం తలపుమాత్రమే కదా! కనుక "నేను శరీరం" అనే మూలమైన తలపును తీసివేయుటమే బంధనివృత్తి. ఆ తలపుదయించినపుడు ప్రతిసారి, విచారణతో దానిని త్రోసి పుచ్చమని ఉపదేశం.

780. నీ సహజస్థితిలో నిలకడగా నుండటం తప్ప మరొక ఆలోచన నీకు ఉండకూడదు. ఒక వేళ అట్లాగ పొరపాటున ఆలోచించినా, మరొక్క మారు ఆ దౌర్భాగ్యస్థితికి లోనుకాకుండా ఉండాలి. ఇదే వళ్లువర్ చెప్పింది కూడా! "అయ్యో ఎంత పని చేశాను!" అని తర్వాత పశ్చాత్తాపంతో అటువంటి పనులు చేయకూడదు. ఒక వేళ చేసినట్లయితే మళ్ళీ చేయక ఉండటమే ఉత్తమము" అని వళ్లువర్ మాట.

వివరణ : ఈ భావం తమిళ గ్రంథం తిరుక్కురల్లోని 655వ ద్విపద నుండి తీసుకొన్నవి. వళ్లువర్ ఆ గ్రంథ రచయిత,

781. ఆత్మస్థితి యైనటువంటి యోగానందాన్ని "నేను ఎప్పుడు పొందుతాను?" అని చింతించవద్దు! ఆ స్థితి ఎటువంటి కాలనియమాలూ, దగ్గర, దూరమనే దేశ నియమాలూ లేకుండా ఇక్కడే ఇప్పుడే ప్రకాశిస్తున్నది.

వివరణ : ఉన్నది నలుబదిలోని 15, 16వ పద్యభావాలని ఇక్కడ గ్రహించండి.

## 67. మూలాన్వేషణం

782. జీవులు తాము ఉద్భవించిన మూలస్థానం (ఆత్మ) ఏదని విచారిస్తే, హృదయమనే ఆత్మయే అని తెలుస్తుంది. దేహమే నేను అని అభిమానించే జీవనంలో ఉండటం వల్ల సకల విధాలైన కష్టాలు కలుగుతాయి. తాము ఉద్భవించిన స్థానానికి (ఆత్మకి) వెళ్లటమే, జీవనంలోని సకల కష్టాలను తొలగించగల సాధనలన్నిటిలో శ్రేష్టమైనది.

వివరణ :ఆత్మస్థితిలో ఎటువంటి కష్టాలు లేవని, జీవనంలోనే జనన మరణాది సకల బాధలున్నాయని భావం. ఆ సకల బాధలని పోగొట్టాలంటే మూలాన్వేషణమైన ఆత్మవిచారణ తప్ప ఇతర సాధనలు శ్రేష్ఠం కావని ఈ వచనం తెల్పుతోంది.

783. ఆనందప్రాప్తియే నీజన్మహక్కు అని తెలుసుకోకుండా, సుఖాన్ని బయట వెదకి కష్టపడే ఓ అల్పుడా! నీ వెట్లాగ (ఒక జీవుడుగా) వచ్చావో, ఆ మార్గంలో (అంతర్ముఖంగా) వెనక్కి పోతే పరమానంద మందిరాన్ని చేరుకుంటావు.

784. అన్నిటికీ కేంద్రమై ప్రకాశించు హృదయంలో నిలకడచెందే వరకు, పంచేంద్రియజ్ఞానం కొంచమైనా అణగదు. మోహాన్ని కలిగించే పంచేంద్రియ జ్ఞానం దగ్ధమైపోతేనేగాని శుద్ధ జ్ఞానమైన పరమానంద స్థితి లభించదు.

వివరణ : ఈ గ్రంథపు 604వ వచనాన్ని ఇక్కడ మరొకసారి జ్ఞాపకం చేసుకోవాలి. అజ్ఞాన నివృత్తి జ్ఞానప్రాప్తి రెండూ వేర్వేరు చర్యలు కావు. ఒకటే. ఇవి రెండూ వేర్వేరని ఎంచి ఏది మొదట జరుగుతుందని కలత చెందవద్దు. అహంతానాశమును కోరుకుంటేచాలును. అంటే బాహ్యవస్తువులపై నిర్మోహం ఉదయిస్తే చాలు, దైవానుగ్రహం వలన అది సంపూర్తి చెందుతుంది.

785. ఓ మనసా! కల్పితాలైన ఈ ప్రాపంచిక వస్తువులన్నిటినీ చూసి మురిసిపోయి (అందువలన కలిగిన యిష్టానిష్టాలతో) కలత చెందటం మాని, నీవెక్కడ నుండి బయలుదేరావో ఆ మూల స్థానాన్ని (ఆత్మని) వెదకి హృదయాన్ని చేరుకో! అప్పుడు ఆ జ్ఞానమయ పరబ్రహ్మస్థితిలో ప్రపంచాది సకల వస్తువులూ అద్వైతాత్మ స్వరూపంగానే గోచరిస్తాయి.

## 68. సాధకుల ప్రవర్తన

786. సాధకులు చేయతగ్గ ఉత్తమమైన కర్మ ఆత్మనిష్ఠలో నుండటమే. వారు ఈ శుద్ధ అద్వైత ఆత్మనిష్ఠ నుండి ప్రమత్తులై ఏమాత్రం దిగజారినా అది పెద్దదోషమని పెద్దలు చెబుతున్నారు. అట్లాంటప్పుడు ఇక ఇతరుల వ్యవహారాల్లో సాధకులు తల దూర్చటం వంటి పనులు కొంచెమైనా తగునా? (తగదని భావం) ఆలోచించండి.

787. ఇతరుల దోషాలను ఏ మాత్రం ఎంచక, గుణాలను మాత్రమే ఎప్పుడూ చూడగలిగితే, జీవితం ఎప్పుడూ మనోహరంగా ఉంటుంది. ద్వేషపూరితంగా ఉండదు.

788. తాను ప్రయత్నించి సరిదిద్దుకో తగ్గది తన చిత్తమే (ఇతరులనుకాదు) అనే సత్యాన్ని గుర్తించి వ్యవహరించాలి. మనస్సు సదా ఇతరుల దోషాలనే ఎంచుతూ ఉంటే ఇంకా కలుషిత మవుతుంది.

789.ఓ మనసా! జ్ఞానులైన పెద్దలు నీపై ప్రేమను చూపటం నీవు నిరహంకారుడవై మధురమైన గుణాలు కలిగి యుండుట వల్ల కాదు. వారిలో ఔన్నత్యంవల్ల. నీ దుర్గుణాలను ఆ ఉత్తములు సరుకుచేయక మన్నించినందువల్ల తెలుసుకో!

790. తప్పు చేయటం మానవ స్వభావం. సజ్జనులైన వారు తప్పుచేసినట్లయితే, ఆ తప్పులను కప్పిపుచ్చుకోరు; ఒప్పుకుంటారు; వెంటనే తమను తాము సరిదిద్దుకుంటారు కూడా.

791. మంచి కోసం విధించిన నియమాలన్నీ ఆత్మసాధకునికి ఎంతో సహాయపడతాయి. కాబట్టి అవి అతడు అనుష్టించతగ్గవే. అయితే అతను అతి శ్రేష్టమైన ఆత్మవిచారణకు ఆ నియమానుష్ఠానాలు ప్రతిబంధకాలని అతను తెలిసికొంటే వాటిని ధైర్యంతో వదలివేయవచ్చు.

792. నీవు కోరినవన్నీ ఫలిస్తే అది నీ తపశ్శక్తి వలనే తీరాయని అనుకోకు! దైవానుగ్రహం వలనే అవి తీరాయని గ్రహించి ఇంకా భగవత్పాదాలనే శరణని ఆశ్రయించు.

793. భగవదనుగ్రహం ప్రకారం నీ ప్రాపంచిక జీవితంలో జరిగే వన్నీ జరగనీ అని వదలివేయి. దానికి భిన్నంగా చేయాలని నీవు కొంచెమైనా ప్రయత్నించకు. హృదయంలో శాంతంగా నెలకొన్న సాక్షి స్వరూపమైన ఆత్మలో ఐక్యమై ఉండు.

794. నీప్రయత్నాలన్నీ నిష్ఫలములై నీవు ఓటమి పాలైతే, అది నీకు ఒక గుణపాఠంగా ఉండేందుకే అని గ్రహించు. దైవానుగ్రహం లేదా గుర్వనుగ్రహం వల్ల మాత్రమే నీకు ఆత్మప్రాప్తి అవుతుంది. నీ ప్రయత్నం వల్ల మాత్రం కాదు. ఇది నీకు తెలియపరచి, సద్గురు అనుగ్రహాన్ని నీవు కోరేందుకు నీ మనస్సును సిద్ధం చేయటమే ఆ ఓటమి యొక్క ప్రయోజనం.

795. అత్రి మహర్షి కుమారుడు దత్తాత్రేయుని వలె ప్రపంచంలోని ఒక్కొక్క వస్తువు నుంచి ఒక్కొక్క మంచి విషయాన్ని తెలుసుకొనే సజ్జనులు, వారి బుద్ధి వక్రముగా గాక సక్రముగా ఉన్న కారణం చేత, జీవిత మంతా గురుకుల వాసంగానే భావిస్తారు.

వివరణ : దత్తాత్రేయ ఋషి గురించి భాగవతంలో చూడవచ్చు. సాధకులందరు శ్రీ దత్తాత్రేయునివలె ఆచరిస్తే ఈ లోకమంతా గురుకులంగాను, జీవితమంతా గురుకులవాసంగా మారిపోతుంది.

## 69. శాంతి

796. సుస్థిర శాంతి మించిన ఉన్నత లక్ష్యసాధన మరొకటి లేదు. శాంతి సాధనను మించిన ఉత్తమ తపస్సు లేదు. శాంతిని మించిన అమరజీవనం లేదు.

వివరణ : శాంతి అంటే యిక్కడ మనోనిశ్చలత అనీ, ఎటువంటి ఆటంకాలు లేకుండా విచారణ చేత కలిగేదేయని శ్రీ మురుగనార్ తెల్పిన భావం.

797. మనోశ్చాంచల్యమే దుఃఖాన్ని కలుగచేసే శత్రువు. అదే ప్రతీకార వాంఛను రెచ్చగొడుతుంది. ఆ చాంచల్యమే త్రాగిన మైకంతో సమానం. అదే ఒకనిని అజ్ఞాన గాఢాంధకారకూపంలో పడేస్తుంది.

## 70. శిష్యుని ప్రవర్తన

798, అవ్యాజ కరుణ మొదలైన సద్గుణముల సరోవరమైన సద్గురువు శిష్యుని సకల భారములను వహించెడి మాట వాస్తవమే. అయినప్పటికీ ఆయన తన నిత్యానుభూతితో అనుగ్రహించిన సద్బోధలను, ధర్మములను కలలో సైతం మఱవక, వాని నుండి పైదొలగక దృఢంగా అనుసరించటమే శిష్యుని కర్తవ్యం.

వివరణ : శ్రీ భగవాన్ రచించిన “నేనెవరు” గ్రంథంలో చెప్పినట్లు పులి నోటబడినది ఎట్లాగ బయటపడదో, అట్లాగే గురువు తమ అనుగ్రహవీక్షణలో చిక్కిన వారిని రక్షిస్తారే తప్ప వదలరు. అయినా, వారు చూపిన మార్గాన్నే శిష్యులు అనుసరించాలని ఇక్కడ ఉపదేశించారు.

799. మోక్షమార్గంలో దృఢ చిత్తంతో ముందుకు సాగిపోయే శిష్యులు మఱపుచేతగాని లేదా పేదరికం, వ్యాధులు వంటి ఏ కారణాలవల్లగాని వేద ధర్మాన్ని ఆచరించలేకపోయినా కూడా తమ సద్గురువుల ఉపదేశాన్ని అతిక్రమించి నడవనే కూడదు.

800. పరమేశ్వరునికి అపచారం చేసినట్లయితే, దానిని సద్గురువుల దయతో సరిదిద్దవచ్చు. అయితే సద్గురువులకి అపచారం జరిగితే మాత్రం, దానిని పరమేశ్వరుడు కూడా సరిదిద్దలేడు. ఈ మాటనే పెద్దలందరూ ముక్తకంఠంతో చెపుతున్నారు.

వివరణ : దైవభక్తి కన్న గురుభక్తి మిన్న అని ఉపదేశిస్తున్నారు ఈ వచనంలో

801. క్రింద 14 వచనంగా శ్రీ భగవాన్ రచించారు. ఇదే ఉన్నది నలుబది - అనుబంధంలో 39వ పద్యంగా నుండటంచేత ఆ పద్యానికే ఈ క్రింద భావం ఇవ్వబడింది.

## భగవాన్ - 14

కుమారా! అద్వైతాన్ని ఎప్పుడూ హృదయంలో అనుభవించు. కాని బాహ్య విషయ వ్యవహారాలల్లో ఎన్నడూ అద్వైతాన్ని ఆచరించకు. (బ్రహ్మలోకం, విష్ణులోకం, శివలోకం మొదలైన) త్రిలోకాల మూర్తులను కూడా నీవు అద్వైతంగా భావించవచ్చు. కాని సద్గురుమూర్తితో మాత్రం అద్వైత భావం అసలు పనికిరాదని గ్రహించు.

## 71. జీవ కారుణ్యం

802. శ్రీ భగవానులు రచించిన 15వ పద్యమే ఇది. అందువల్ల వారి పద్యానికే వచనం ఇక్కడ ఇవ్వబడింది.

## భగవాన్-15

జన్మబంధాల నుండి తనని విడిపించుకొని తరించే జీవన్ముక్తుడు ఒకడే, యితర జీవులనూ తరింప చేయగలడు. అట్లే తాను ముక్తినొందక బంధంలో చిక్కుకొన్నవాడు ఇతరులను తరింప పూనుకోవడం ఒక గుడ్డి వానికి మరొక గ్రుడ్డివాడు దారి చూపటం లాంటిదే.

803. అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతూ తరించాలనే యిచ్చతో తనవద్దకు వచ్చిన జీవులకు “నేను” అనే అహంకారాన్ని జయించి ఆత్మస్థితుడై ఉన్న జ్ఞాని ఆత్మానుభవాన్ని ప్రసాదిస్తాడు. ఇదే నిజమైన జీవకారుణ్యం. లోకులు చేసే పరోపకారాలు నగణ్యములు. అవి జీవ కారుణ్యమనిపించుకోవు.

804. తమకు తామే వైద్యులు అని పెద్దల నానుడి. కనుక ఓ వైద్యుడా, నీవు మా రోగ నివారణకైమందు యివ్వడానికి ముందు నీ రోగాన్ని నయం చేసుకో. తర్వాత మాకు నీవు వైద్యం చేయొచ్చు.

వివరణ : శ్రీమురుగనార్ చెప్పినది : ఎవరికైనా ఆత్మ జ్ఞానమే జన్మరోగానికి మందు. ఆ రోగమే లేకపోతే శరీర రోగాలేవి ఉండవు. కనుక దానిని మొదట నయం చేసుకోవాలని భావం.

## 72. పితృకర్మలు

805. లోకులు తమ కన్న తల్లిదండ్రులు జీవించి యున్నప్పుడు వారి అవసరాలను తీర్చి కాపాడరు. అయితే వారు మరణించిన అనంతరమో పితృకర్మలన్నీ ఆడంబరంగా చేసి ధనం ఖర్చుబెడతారు. ఈ లోకం పోకడ ఎంత విచిత్రమైనది!

## 73. పరోపకారం

806. ఇతరులను వంచించే వాడు తనకు తానే శత్రువై కీడు తెచ్చుకొనే వాడవుతున్నాడు.

807. ఇతరులకు ఇచ్చేటువంటిదంతా తనకే ఇచ్చుకొంటున్నాడనే సత్యాన్ని గ్రహిస్తే, పరోపకారాన్ని (ఇతరులకిచ్చేది) ఎవ్వరు చక్కగా శ్రద్ధగా చేయరు? (ఎవ్వరూ లేరని భావం).

వివరణ : శ్రీ భగవాన్ రచించిన "నేనెవరు?" అనే గ్రంథంలో చెప్పిన అనుగ్రహ వాక్యాలే ఇవి.

808. సర్వప్రాణులూ తన ఆత్మ స్వరూపంగా నుండటం చేత, ఎవడు ఎవరికి ఏది చేసినా (మంచిగాని చెడుగాని), అది తనకు తానే చేసుకొంటున్నట్టే. (కనుక ఇతరులకి మంచినే చేయాలని ఉపదేశం)

809. బలిచక్రవర్తి లక్ష్మీపతికి భూదానం చేసి పాతాళానికి పోయాడు. అయినా భగవంతునికే దానం చేసిన శాశ్వతమైన కీర్తిని సంపాదించాడు. పరోపకారం వల్ల కీడు కలిగినా, దానివల్ల తాను అమ్ముడు పోవలసినా పరోపకారం చేయదగ్గదే.

## 74. భూతదయ

810. ఏ ప్రాణీ తనను చూపి భయపడకుండునట్లు అందరికీ అభయవచనములు ఇచ్చి, జ్ఞాని శాశ్వతానంద మగ్నుడై ఉంటాడో, అతడు, ఆ జ్ఞాన సమాధి నిష్ఠుడు, యముణ్ణి చూసినా భయపడడు.

వివరణ : జనులకు తమ శరీరాలపై అభిమానం ఉంటుంది. యముడు తమ

శరీరాలను వేరుచేస్తున్నాడనే భయంతోనే మరణభయం అందరికీ సహజంగా కలుగుతుంది. అయితే జ్ఞాని, తాను ఈ శరీరం కాదనే జ్ఞానానుభవంతో జీవన్ముక్తుడుగా (జీవించినపుడే శరీరం నుండి తను విడిపడినవాడై) ఉండుట చేత అతనికి యముడంటే భయము లేదు. భయపడవలసి అవసరం కూడా లేదు. యముడు అంటే భయము లేనివాడగుటచేత జ్ఞాని ఒక్కడే నిర్భయంగా ప్రాణులను నిజంగా దయచూపించ గలవాడని భావం.

811. కొందరు బలవంతులు తమ బలంచేత బలహీనులను కష్టపెడితే దానిని చూసి (సాధకుడొకడు కోపంతో వారి నెదిరించటానికి పూనుకొనే) మనస్సును చలింపనీయకుండా "బలహీనులను దయతో కాపాడే దైవం, దుష్టబలాఢ్యులను తగిన విధంగా శిక్షిస్తాడ"ని తలచి ఆ బలహీనులను దయతో చూచునుగాక!

వివరణ : బలవంతులను ఎదిరించాలనే రజోగుణంకంటే, ఆ స్థితిలో బలహీనులపై దయతో వారికి చేయవలసిన వాటికి పూనుకొనే సాత్విక గుణమే సాధకులకు తగినదని ఉపదేశం. తమపై దొంగలు దాడి చేసినపుడు వారిని ఎదుర్కొనడానికి పూనుకొన్న అనుచరునొకనిని అడ్డుకొని శ్రీ భగవాన్ గాయపడిన వానికి అమృతాంజనం పూసి వాని నొప్పిని పోగొట్టటానికి ప్రయత్నించిన సంఘటన ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి.

812. దేహాన్ని విడిచిన ప్రాణాన్ని మళ్ళీ ఆ దేహంలో ప్రవేశపెట్టి బ్రతికించే శక్తిలేని వారికి, ఏ కారణంచేతనైనా సరే ఏ జీవి ప్రాణాన్నీ హరించేందుకు అధికారం లేదు.

813. హాని కల్గించే దుష్ట స్వభావంగలవారై, ఆకారణంగా (భూత దయ అనే) సద్గుణాన్ని వర్జించినవారే, తమ సహజమైన ద్వేషంతో భయంతో, పగతో, బుసకొట్టి ప్రాణాలు తీసే పాములవంటి క్రూరజంతువులను కొట్టి చంపుతారు. ఇది తగని పని.

వివరణ : అజ్ఞానం నుండే, అన్యభావం కలుగుతోంది. దీని నుండి భయం, భయం నుండి క్రూరత్వం, దాని నుండి మరింత భయం కలుగుతాయి. ఈ విషవలయాన్ని ఛేదించాలంటే జ్ఞానం సంపాదించి భయాన్ని పోగొట్టుకోవాలి.

814. మహాత్ములైన జ్ఞానులు అచంచలమై చిత్త స్థైర్యం కలిగి ఉంటారు. తమను వెంటాడే కష్టాలన్నింటినీ ఓర్పుతో సహిస్తారు. తమ దగ్గరకు చేరిన భక్తులూ ఇతరులూ ప్రారబ్ధవశాత్తు కలిగే దుఃఖాలతో అలమటిస్తుంటే అత్యంత దయతో తామూ కరిగి విలపిస్తారు.

815. ఒక భక్తుని ప్రశ్న : వేంకటరమణా! పచ్చటి ఆకులు గుబురనుకొని తాము దానిపై కాలు మోపితే, అడవి కందిరీగలు (తమ పుట్ట పగిలిపోయిందన్న ఆగ్రహంతో) మీ కాలు వాచిపోయేటట్టు కుట్టాయే! అనుకోకుండా జరిగిన ఆ తప్పుని మనస్ఫూర్తిగా మీరు చేసిన పాపమని ఎంచి, వాటిపై సానుభూతితో దయతో "ఈ కాలే కదా కందిరీగల తుట్టెను తొక్కింది. దానిని కుట్టనీ". అని మీరు కాలిని అట్లాగే ఉంచి నుంచున్నారే ఎందుకు?

## భగవాన్ - 16 : జవాబు

పచ్చటి ఆకుల మధ్యలో పెట్టిన కందిరీగ తుట్టె చితికిపోయేలాగ పెట్టిన కాలు వాచిపోయేటట్లు కుట్టినా, అది యాదృచ్ఛికంగా జరిగిన తప్పే అయినా, జాలిపడక కాఠిన్యం వహిస్తే అట్టి వాని మనస్సును గురించి ఏమని చెప్పాలి? (భూతదయలేని మనస్సే అట్లాగ జాలి లేకుండా ఉంటుంది!)

# 75. సమత్వం

816. మంచి వాళ్ళుగా జీవించాలనుకొనేవారు, ఇతరులకు లభ్యమయ్యే వాటినే తాము కూడా పొందాలనుకునే సమత్వాన్ని వదిలేసి, తమకు మాత్రం ప్రత్యేకంగా కొన్ని హక్కులను దక్కించుకొనుట ఎంతో దోషం.

వివరణ : శ్రీ రమణ మహర్షులు తమ ఆశ్రమంలో ఇతరులకు భోజనం మొదలైనవి ఏవి వడ్డిస్తున్నారో అని తప్ప తమకి ప్రత్యేకంగా ఏదీ వడ్డించటానికి ఇష్టపడేవారు కాదు. అట్లాగే ఇతర సౌకర్యాల విషయాలలో కూడా తమకు ప్రత్యేకత చూపించనిచ్చే వారు కాదు. సమానత్వానికి వారే దృష్టాంతం.

817. ఇతరులకు ఉన్న హక్కులు మనకూ ఉండవచ్చు. అంతేగాని ఇతరులకు లేవని చెప్పి నిరాకరించిన హక్కులను మనం అనుభవించటం మాత్రం చాలా తప్పు.

వివరణ : ఒక విదేశీయుడు, మన దేశపు ఆచారాలు తెలియకపోవడం చేత శ్రీ భగవాన్ ఆసీనులైయున్న వైపు కాళ్లుచాచి కూర్చున్నారు. "ఇది తప్పు. ఇతరుల వైపు కాళ్ళు చాచుకుని కూర్చోకూడదు. కాళ్ళు ముడుచుకొని కూర్చోండి" అని ఒక ఆశ్రమవాసి అన్నారు. ఇది విన్న శ్రీ భగవాన్ కూడా చాచుకున్న తమ కాళ్ళని కూడా మడిచి కూర్చున్న సంఘటన మనమందరం విన్నదే!

818. సమత్వాన్ని పాటించని వారు సమత్వమే రూపమైన దైవానికి వ్యతిరేకంగా నడచుకున్న వారవుతారు. వారు దైవాన్ని పూజాదులతో చక్కగా ఆరాధించిన వారైనప్పటికీ భగవదారాధనను తృణీకరించినవారే.

వివరణ : సమత్వం భగవత్స్వరూపం, భగవంతుని సహజ స్థితి. కాబట్టి దైవానుభవాన్ని సమాధి అని అంటున్నాము. సమత్వాన్ని పాటించనివారు దైవానికి వ్యతిరేకంగా నడచుకుంటున్నవారు. ఎండగాని వానగాని ఈశ్వరుడు దేనినీ నిరాకరించడు. శిష్టులకి, దుష్టులకి మధ్యనున్న తటస్థస్థితి నిష్పక్షపాత స్థితి అని పండితుల వాక్కు. అందువల్ల భక్తులు కూడా నిష్పక్షపాత స్థితి నుండి వైదొలగకూడదు. తొలగితే వారి దైవారాధాన నిరర్ధకం అని శ్రీ మురుగనార్ తెల్పినభావం.

## 76. మనస్సాక్షి

819. తీవ్ర ఆత్మసాధకులు తమ మనస్సాక్షి ప్రకారం నడచుకొంటారు. మంచివారని ఎంచి మొదట వారు కొందరితో స్నేహం చేయవచ్చు. తరువాత ఆ స్నేహ భావన చెదరిపోవచ్చు. అటువంటప్పుడు అట్టివారితో స్నేహం కొనసాగించటంకంటే, తమ అంతరాత్మ ప్రబోధానుసారం వారి నుండి తప్పుకోవటమే మంచిది.

## 77. సత్యం

820. ఈ వచనంలో రెండు భావాలున్నాయి.

1) తాను ఒకరికి ఇస్తానని ముందే యిచ్చిన మాటతప్పి, తర్వాత ఇవ్వకుండా నిరాకరించటం అనధికారికి చెప్పే వేదాంతం కంటే కూడా తప్పు.

మరొక భావం

పరిపక్వత లేని వానికి "ఆత్మయే పరవస్తువు" అనే సత్యాన్ని చెప్పటం చెప్పేవాని దోషమే అవుతుంది. ఇంతకుముందు అతనికి తాను చెప్పిన వ్యవహారిక సత్యాన్ని నిజమే అని నమ్మాడు. ఇప్పుడు దానికిమారుగా చెప్పిన పరమార్థ సత్యాన్ని అతడు అసత్యమని నిరాకరిస్తాడు.

821. అందరికీ అధిపతి, అందరి హృదయకుహరాలలో ఉండే పరమాత్మ (నేను, నేను అనే ఆత్మగా) సర్వధర్మములకు మాతృస్థానములో ఉన్న సత్యం యొక్క స్వరూపంగా ప్రకాశిస్తున్నాడు. కనుక ప్రాణాలొడ్డి అయినా సరే మాట తప్పకుండా ఉండటమే మంచిది. లేకపోతే ఇహపరలోకాలలో అది తప్పించుకోలేని దుఃఖాన్ని కలుగజేయగలదు.

## 78. అనాసక్తి

822. నీటిలో పడవ ఉండాలే తప్ప, పడవలో నీరు ప్రవేశిస్తే పెద్ద కీడు సంభవిస్తుంది. అట్లాగే, చుట్టూ సముద్రంలాగా ఆవరించిన ఈ లోకంలో మనిషి జీవించవచ్చునే కాని, మనిషి మనస్సులో లోకం (ప్రపంచ వ్యామోహం) ప్రవేశిస్తే అతని బ్రతుకంతా దుఃఖమయమైపోతుంది.

823. నిండిన కుండ నీటిలో మునుగుతుందే తప్ప నీటిని పీల్చుకోని కట్టె నీటిలో నున్నా మునిగిపోదు. అట్లాగేప్రపంచంపై ఆశలు కల్గిన లోకులకు తప్ప, ప్రపంచంపై వ్యామోహం లేని పెద్దలకు లౌకిక వ్యవహారాలలో నిమగ్నులయినా వారికి బుద్ధి చలించదు.

824. ప్రాపంచిక వ్యామోహాలు లేక జీవించగలవాడు లోక వ్యవహారాలన్నింటిలో మునిగి తేలుతున్నా కూడా అతనికి ఎటువంటి కీడు కలుగదు. అతని చిత్తం శివమయమై ప్రకాశించి శక్తివంతమవుతుంది.

825. సత్యంగా గోచరించే ఈ మిథ్యా ప్రపంచాన్నే తన సుఖానికి ఆధారమని ఎంచి, దానిపై వ్యామోహంతో నశించి పోకూడదు. చింతపండు పెంకుకు (గుల్లకి) అంటుకోకుండా ఉండే విధంగా, ఈ లోకంలో జీవించినా కూడా లోకాన్ని త్యజించి జీవించడమే తెలివైనపని. (ఆత్మ స్వరూపంలో నిష్ఠగలవాడవై ఉండటమంటే దేహంపైన లోకంపైన అహంకార మమకారాలు లేకుండా జీవించడమే)

826. బలంగా లేని పునాది పై కట్టిన పెద్ద భవనం కూలి వృధా అయిపోతుంది. కనుక, ఆత్మాన్వేషణమునకు తపస్సు చేసే సాధకులు ప్రథమంగా ఎట్లాగైనా సత్ప్రవర్తనను భక్తి వైరాగ్యములను అలవరచుకోవాలి. సత్ఫలితాలని పొందాలి. ఇది వారి కర్తవ్యం.

వివరణ : చిత్త వృత్తులను నిరోధించే ప్రయత్నాలు సాధకునికి ప్రారంభంలో అత్యంత అవసరం. సాధన తొలిదశలో సాధకులు స్వతంత్రులు లాగ లోక వ్యవహారాల నడుమ నటిస్తే చివరికు నిరాశ నిస్పృహలకులోనవుతారు.

827. ఆత్మనిష్ఠలోని వాడు జ్ఞానరూపుడై వెలుగొందుతాడు. ఆ విశుద్ధ జ్ఞానంలో జగద్వస్తువుల సాన్నిధ్య కారణంగా విషయచింతనలు ఉన్నట్లు తోచినా, ఆకాశంలోని నీలిరంగు మాదిరిగా ఎప్పుడు లేనివే అవుతాయి.

## 79. త్యాగ మహిమ

828. సన్యాసధర్మం ఎంతో కష్టమైనది. జారుడు నేల మీద నడిచినట్లే. సన్యాసధర్మం నుండి మానసికంగా కొంచెం దిగజారినా ఎంతో కీడు కలుగుతుంది. మనస్సు అనేది ఒక దొంగ. అది వంచిస్తుంది. దానితో మఱపు ఆవరిస్తుంది. కనుక సన్యాస మార్గానుయాయి అయినవాడు మఱపు ఏమాత్రం ఆవహించకుండా తన్ను తాను కాపాడుకోవాలి.

829.తాము ఇంకాఎన్నాళ్ళు బ్రతికుంటామని నిక్కచ్చిగా చెప్పడం ఎవరకీ సాధ్యంకాదు. కనుక జన్మబంధాన్ని త్రెంచుకోడానికి దృఢ సంకల్పం బూనిన తీవ్రసాధకులకు తమ శరీరంపైన ప్రాపంచిక విషయాల పైనా ఏ క్షణాన ఏవగింపు ద్వేషం కలుగుతాయో ఆ క్షణమే వెంటనే అన్నిటినీ త్యజించి వారు సన్యసించటమే మేలు.

వివరణ : ఆశ్రమ క్రమం సామాన్యులకే కాని తీవ్రముముక్షువులకు కాదని భావం.

830. బాగాపండిన పండు చెట్టునుండి తానంతట అదేరాలిపడినట్లు సాధకుడు పరిపక్వదశను పొందినట్లయితే ప్రారబ్ధం అడ్డుపడితే తప్ప, గార్హస్థ్య జీవితాన్ని ఉప్పులేని గంజిలాగా నిస్సారమని త్రోసి పుచ్చుతాడు. త్యజిస్తాడు.

831. స్వప్నంలోవలె జాగ్రదావస్థలో మనచుట్టూ ఉన్నట్లు గోచరించే నామ రూపాత్మకమైన ఈ ప్రపంచం మనస్సు యొక్క మిథ్యాకల్పనా మాత్రం.. ఇట్టి నిశ్చయ బుద్ధితో దానిపై ధ్యాసలేకుండా సన్యసించిన వారు మాత్రమే అజ్ఞానావరణాన్ని ఛేదించగల్గుతారు. ఇతరులంటారా? అజ్ఞాన పాశాన్ని ఎట్లాగ త్రెంచుకోవాలో తెలియనివారు.

832. ఏకమూ, సత్యము, జ్ఞానము అయిన ఆత్మ స్వరూపాన్ని అనుభవపూర్వకంగా ఎరిగిన శుద్ధ జ్ఞానులు ఈ ద్వైత రూప ప్రపంచాన్ని నిజమని భావించి కలత చెందరు. నిస్సారమైన, మాయా దృశ్యంగా గ్రహించి దానిని వెంటనే త్యజిస్తారు.

833. ఈదేహం, ఈ ప్రపంచం, ఈ జీవితం క్షణ భంగురమైనవని బుద్ధుడు బాగా గ్రహించాడు. తన రాజ్యసంపదను త్యజించి సన్యసించాడు. కనుక, ఇంద్రియగోచరమయిన ఈ జగత్తు యొక్క మిథ్యత్వాన్ని తెలుసుకొన్నవాడు ఈ లౌకిక ప్రపంచంలో బ్రతకడం కష్టమే.

834. దేనికీ కొంచెమైనా భయపడక ధైర్యంతో (వైరాగ్యంచేత) ఈ ప్రాపంచిక జీవితాన్ని గడ్డి పోచకన్నా హీనంగా ఎంచి సన్యసించిన పెద్దలే భగవంతుని దర్శించగల బుద్ధిమంతులు. ఇతరులు ప్రపంచాన్ని సత్యమని నమ్మే అల్పులే.

835. నిజానికి ఉనికి లేనిది, కాని ఉన్నట్లు గోచరించేది అయిన ఈ ప్రపంచం, కనిపించినా, లేనిదే. ఇట్లు గ్రహించి సన్యసించటమే జ్ఞాన రూపమైన ఆత్మస్థితిని పొందటమని పెద్దల వాక్కు.

వివరణ : ఆత్మ లేక భగవత్సాక్షాత్కారం అంటే ఏమిటి? అది ఎప్పుడూ ఉన్న వస్తువే. ప్రపంచం ఎప్పుడూ లేని వస్తువు. అయితే ప్రపంచం నిజంగా ఉందని భావించినంతకాలం భగవంతుడు, ఆత్మ పొందలేనిదిగాను, మాయమైన వస్తువుగాను గోచరిస్తుంది. జగత్తు మిథ్యయని బుద్ధితో గ్రహించి సన్యసించటమే ఆత్మని పొందటమని భావం.

836. త్యజించతగినవన్నింటినీ త్యజించి త్యజించలేనిది త్రోసిపుచ్చలేనిదేదైతే మిగిలి ఉంటుందో ఆవస్తువే హృదయంలో ప్రకాశించే సత్యాత్మ స్వరూపం. అదే అనంతానంద స్థితి.

837. త్యజించవలసిన అహంకారాన్ని త్యజించిన వారు అంతకన్నా త్యజించ వలసినదేదీ లేదు.

వివరణ : ఉన్నది నలుబది 26వ పద్యాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవలెను.

838. సాధువుల చిత్తం సదాశివమయంగా ఉండి ప్రకాశిస్తుంది. ఆ కారణంచేత వారు కోరి పొందదగినది మరేదీ లేదు. (సన్యసించవలసినదీ ఏదీ లేదు అని భావం)

839.తన సొంతమంటూ ఏమీ లేకుండా, ఏమిచ్చినా నిరాకరించి లోకంలో తిరిగే గంభీర హృదయుడైన సన్యాసి దేనినైనా యివ్వగలిగే రాజుని కూడా మానసిక వ్యధకి గురిచేస్తాడు! ఆహా! ఎంత అద్భుతం!!

వివరణ : జ్ఞానుల సంపద అంతులేనిదని భావం

## 80. నిజమైన సన్యాసం

840. "నేను అన్నిటిని సన్యసించాను" అని తన్ను గురించి చెప్పుకొనే సన్యాసి కంటె "శరీరమే తాను అనీ, తాను కుటుంబ జీవన బంధితుడ"ననీ తనను గురించి చెప్పుకొనని గృహస్థుడే అత్యంత శ్రేష్ఠమైన సన్యాసియని గ్రహించు!

వివరణ : అహంకారాన్ని త్యజిస్తే అన్నిటినీ త్యజించినట్లేయని భావం.

## 81. నిజమైన మనస్సు

841. (మంచి మనస్సుఅనీ, చెడ్డ మనస్సు అనీ) మనస్సు రెండు విధాలని చెప్పడం ఎందుకంటే, అది శుభాశుభవాసనల వశమై యుండుటవల్లనే. మంచి అనీ చెడూ అని రెండు విధాలుగా గోచరించే ఈ మనస్సు, నిజానికి అది ఒకే ఒక మనస్సు అని తెలుసుకో!

వివరణ : నేనెవరు? గ్రంథంలోని భగవానులవాక్కులే ఈ వచనం.

842. నా మనస్సు అనీ, నీ మనస్సు అనీ గోచరించే పృథక్ మనో భావమే బంధహేతువు. పరమాత్మ యొక్క చిద్రూపంగా స్పష్టంగా ఉన్నది. ఉన్నట్లుగా ఉన్న శుద్ధ మనస్సే నిజమైన మనస్సు అని గుర్తించు.

843.దేహాలు అనేకంగా కనబడటాన్ని బట్టి అనేకమైన 'నేను' (జీవులు)గా గోచరించే వారందరూ ఒకే ఒక నిజమైన "నేను" అని తెలుసుకో! ఆత్మదృష్టితో వాటినన్నిటినీ ఒకటిగానే చూసి తెలుసుకో.

## 82. అహంతా నాశం

844. దుఃఖాన్నిచ్చే మోహరూప అహంకారాన్ని ఇది ఎవరు? (నేనెవరు) అని సూక్ష్మమైన బుద్ధితో విచారించి త్రుంచి వేయి. ఈ విధంగా చిజ్జడగ్రంథి యొక్క మూలాన్ని కోసివేయి. గ్రంథి విచ్ఛేదమయిన హృదయంలోనే గాని మరెక్కడా బ్రహ్మానంద రూపమయిన శాంతి లభించదు.

845. ఆత్మ విచారణ చేయటంద్వారా మౌనమనే గునపానికి బాగా పదును పెట్టు. శరీరమే "నేను" అనే రూపంలో మొలిచిన అహంకార తరువును కూకటి వేరుతో సహా పెకల్చిపారవేయి. బ్రహ్మానందానుభవానికై అనుసరించవలసిన ఉపాయం ఇదే.

846. "ఈ దేహమే నేను" అనే అహంభావమే సకల సంసార దుఃఖాలకు మూలం. కనుక "దేహమే నేను' అనే ఈ మిథ్యాభావాన్ని పోగొట్టాలి. అందుకు ఆత్మవిచారణ ఒకటే సరియైన సాధన. ఇక ఏ ఇతర సాధన అయినా వృద్ధాశ్రమయే అవుతుంది. అందువల్ల వాటిని అనుసరించవద్దు.

847. అజ్ఞానం బోధించిన "ఈ శరీరమే నేను" అనే భ్రాంతి నశించటమే మోక్షం. అదే సన్యాసం. అదే జీవన్ముక్తి. అదే నిత్యానిత్యవస్తు వివేకం. ఇది తెలుసుకో.

848. దేహాత్మ బుద్ధి త్యాగం ఒక్కటే శ్రవణము, మననము, నిదిధ్యాస, అనుగ్రహము, మౌనము, పరమపదము, శాంతి, ఆత్మ, భక్తి, దానము, తపస్సు, ధర్మము, యోగము మొదలైనవన్నీ.

వివరణ : పై రెండు వచనాలు (847, 848) కలిపి రచించినదే భగవాన్ 17వ వచనం.

## భగవాన్-17

'నేను దేహం' అనే మిథ్యా భావాన్ని త్యజించటమే దానము, తపస్సు, యాగము, ధర్మము, యోగము, భక్తి, స్వర్గము, సద్వస్తువు, శాంతి, సత్యము, అనుగ్రహము, మౌనస్థితి, జీవన్ముక్తి, జ్ఞానము, సన్యాసము, మోక్షము, మహానందము మొదలైనవన్నీయని తెలుసుకో!

వివరణ : 'శరీరమే నేను' అనే తప్పుడు భావాన్ని ఆత్మ విచారణ చేత తొలగించుటొక్కదానివల్లే పైన చెప్పినవన్నిటినీ పొందిన వారవుతారు. కనుక విచార మొక్కటే ఇవన్నీ అని తెలుసుకోవలెను.

849. స్వర్ణాభరణాలు అనేక నామరూపాలతో కనబడతాయి. అట్లాగే, శ్రేష్ఠమైన ఆచరణీయ ధర్మాలన్నీ (పైన చెప్పినవి) అనేకం శాస్త్రాల్లో చెప్పబడినాయి. ఆభరణాలన్నిటికీ స్వర్ణమొక్కటే ఆధారవస్తువైనట్లు ఆ ధర్మాలన్నిటికీ అహంకార త్యాగమొక్కటే సారపు ధర్మం అని గ్రహించు.

850. ఎన్నో కష్టాలకు దారితీసే దురాశను, "నాది" అనే మమకారాన్ని త్యజించిన ధీరుడు ఆత్మ విచారణ ద్వారా ముందుకు సాగి "నేను" అనే అహంకారాన్ని కూడా పరిత్యజిస్తాడు. తద్వారా సకల ధర్మముల ఫలితాన్ని పొందుతాడు.

851. 'నేను' అనే అహంకారం విజృంభించి భగవంతుని పూర్ణత్వాన్ని (ఏకత్వాన్ని) భంగపరుస్తుంది. అహంకారం ఆత్మలో లీనమవటమే భగవంతుని జ్ఞాన సన్నిధిని చేరగోరే సాధకుడు తప్పక ఆచరించవలసిన తపస్సు.

వివరణ : శివసాన్నిధ్యమైన మూలస్థానంలోనికి ప్రవేశించాలని కోరేవారికి ఎటువంటి తపోనియమాలుండాలో ఇక్కడ ఉపదేశించారు.

852. భగవంతునికి సహజమైన పరిపూర్ణత్వాన్ని (నేను ఈ శరీరమే అని) కుంచించే అహంకారాన్ని నశింపజేయటమేనిర్దుష్టమైన భగవదారాధన అని జ్ఞానుల అభిప్రాయం.

853. తాము (అహంకారం) భగవంతునికి ఆహారమవ్వాలని తలచకుండా, భగవంతుణ్ణి తాము వశపరచుకోవాలని ఎంచి అహంకారంతో ఉపాసన చేసే కామ్యార్థులైన భక్తుల అహంకారమే వారి నాశమునకు కారణమై, " వారే యమునికి ఆహారమైపోతారు.

854. ఇంద్రియగోచరమైన దృశ్యమానమైన ప్రపంచమూ, దానిని చూసే అహంకార రూపుడైన జీవుడూ (ద్రష్ట, దృశ్యము, దృక్కు అనే త్రిపుటి) జ్ఞానమయమై ప్రకాశించే శివస్వరూపంలో లయమై నశించాలి. లేకపోతే శ్రేష్ఠమైన ఆ బ్రహ్మీ స్థితిని పొందటం అసాధ్యం.

855. అచలమై ప్రకాశించు ఆత్మస్వరూపం అల్ప మానవులకు గోచరిస్తుందా? (గోచరించదు : కనుక) చిజ్జడ గ్రంథి రూపంలో తోచే అహంభావం నశిస్తేనే గాని ఆత్మస్వరూపమైన మన సహజస్థితిని పొందలేము.

856. “శరీరమే నేను" అని (చైతన్యమైన ఆత్మకి జడమైన శరీరానికి నడుమ (అంటే ఆ రెండూ కానిదైన) అహంకారం ఒకటి తలెత్తి, నిత్యమై వెలిగే శాంతి, ఆనందాలని సమూలంగా నశింపచేసింది కదా? కనుక "నేను" అనబడే అహంకార రాక్షసుని వధిస్తే తప్ప, కైవల్య స్థితిని పొందలేము.

857. జీవుడగు మనోబుద్ధి అనే చంద్రుని ప్రతిబింబ ప్రకాశం పరమాత్మ స్వరూపమైన జ్ఞాన సూర్యుని వెలుగులో మునిగి నశించి అక్కడ ఆత్మజ్ఞానమయంగా ఎప్పుడు లీనమైపోతుందో ఆ రోజే శుభప్రదమైన అమావాస్య .

(తమిళ ప్రజలకు అమావాస్య చాలా మంచి రోజు : అనువాదకుడు)

858. మరణిస్తేనే మోక్షం సిద్ధిస్తుంది. వేరే ఉపాయం చేత సిద్ధించదు. అయితే మరణించడం అంటే 'నేను, నాది' అనే అహంకార మమకారాలను చంపటమే గాని (ఈ దేహాన్ని చంపేస్తే మనం నిజంగా చనిపోయినట్లు కాదు కనుక) ఈ శరీరాన్ని చంపటం కాదు. ఆత్మహత్య పెద్దనేరం.

వివరణ : ఒక నేరస్థుణ్ణి దండించటానికి బదులు వాడు కూర్చున్న కుర్చీని విరగ్గొట్టటంవంటిదే అహంతను నశింప చేయకుండా, శరీరాన్ని నశింప చేయడమవుతుందని శ్రీ భగవాన్ చెప్పేవారు.

859. అనేకంగా గోచరించి వ్యామోహం నిండిన ఈ ప్రపంచంపై విరక్తికల్గి ఆశలు నశించిన వారు మాత్రమే శివజీవితాన్ని (శివసాయుజ్యాన్ని) పొందుతారు. అటువంటి శుద్ధాత్మ జ్ఞానానుభవం ద్వారానే నిజానందానుభూతి కలుగుతుంది. వేరేవిధంగా కలగదు.

వివరణ : ఆశలు నెరవేరడం ఆనందంకాదు. ఆశలు త్యజించటమే మహానందం అని భావం.

860. మరణం, దాని వెంబడి జననం, ఇలా లెక్కలేని జన్మలపల్ల ప్రాప్తించేది. తీవ్రమైన దుఃఖమే. ఇట్టి దుఃఖాన్ని పోగొట్టగలిగేదీ, ఎప్పటికీ మళ్ళీ జన్మని కలిగించనిది అయిన అతి గొప్ప మరణం ఏదని మీరు ప్రశ్నిస్తే అజ్ఞానరూపమైన “నేను” అనే అహంకారమూ 'నాది' అనే మమకారమూ నశించుటయేయని తెలుసుకో!

వివరణ : దేహసమాప్తి అనబడే ప్రతిమరణం మళ్ళీ మరొక దేహప్రాప్తికి హేతువవుతోంది. కనుక ఈ దేహ మరణాన్ని పొందటం కంటే అతి పెద్ద మరణమైన అహంకార మమకారాల మరణమే శ్రేష్ఠమైనట్టిది. అటు తర్వాత ఈ దేహానికి సంభవించే జనన మరణాలు పూర్తిగా తొలగుతాయి.

861. 'శరీరమే నేను" అనే అవిద్యారూపమైన అహంకారమయ జీవితం, 'నేనెవరు" అనే విచారణ చేతనే నశిస్తుంది.

862. అసద్రూపమైన అహంకారాన్ని సచ్చిద్రూపంలో ఐక్యమొనర్చి, జ్ఞానాకారంగా నిలవటమే సమాధి. అదే ఆత్మ స్థితి.

863. “దేహమేనేను” అని భావించే అవిద్య నశిస్తేనే సత్యజ్ఞానానుభవం కలుగుతుందని గ్రహించు.

864. ఎవడు తన సచ్చిత్ స్వరూపంలో మోహంతో కూడిన అహంకారాన్ని లీనం చేయగలడో, వాడే సర్వకర్మారంభ పరిత్యాగమొనర్చువాడు. అతని హృదయంలో శాంతి ఆనందం సహజంగా ఉప్పొంగుతుంది.

## 83. తత్త్వజ్ఞానం

865. (సర్వశక్తి సంపన్నుడైన పరబ్రహ్మ స్వరూపం నుండి తాను వేరైనట్లూ, ఆయనతో సమానమనీ నిరూపించుకొంటూ) సర్వాధికారం ఉన్నదని ఎగిసిపడే జీవుడైన అహంకారమొకం నశిస్తేనే, పరమాత్మజ్ఞానం అనుభవమవుతుంది.

866. "దేహమేనేను" అనే అభిమానమే అహంకారం. అది నశిస్తే దుఃఖహేతువైన మోహం, దానివల్ల కలుగు వ్యధలన్నీ పూర్తిగా తొలగిపోతాయి. అందుకు ఆత్మ విచారణ చేయాలి. ఆత్మవిచారణవల్ల హృదయంలో సుఖస్ఫూర్తి కలిగి వికల్పాలన్నీ నశిస్తాయి. అంతట జ్ఞానస్వరూపం ప్రకాశిస్తుంది.

867. లేనట్లు అనిపించే భగవంతుడొక్కడే నిత్య ప్రత్యక్షంగా ఉన్నాడు. తానొక్కడు ఉన్నట్లు తోచే జీవుడు త్రికాలాలలోను లేడు. ఇది అనుభవపూర్వకముగా తెలుసుకొనుటయే బ్రహ్మజ్ఞానము.

868. మనస్సు శుద్ధ సత్త్వ స్వరూపమై ప్రవృత్తిరహితమై మౌనంగా స్వస్థితిలో నెలకొని ఉండటమే సహజ సమాధి. అద్వైత జ్ఞాన శోభ అదే.

వివరణ : త్రిగుణాలను దాటి అక్కడ నెలకొని ఉండటమే సహజనిష్ఠ. అయినప్పటికీ సత్త్వమే మనస్సు యొక్క ఆది స్వరూపం కాబట్టి "సత్త్వ మౌనం" అని శ్రీమురుగనార్ భావం.

## 84. సాక్షి ఎవరు?

869. ఆత్మ చిద్వ్యోమం. స్వయం ప్రకాశమైన అఖండరవి. అట్టి ఆత్మకు సర్వసాక్షిత్వమనే గుణాన్ని ఆపాదించటం అజ్ఞానుల కల్పనమాత్రమే. యథార్థంకాదు. గుణాతీతమైన ఆత్మకు సాక్ష్యాది గుణాలు ఏర్పడటానికి హేతువుగా అజ్ఞానాంధకారమనో, మాయ అనో మరొక వస్తువేదీ లేదు. ఆత్మ ఏకము.

వివరణ : ఆత్మని సర్వసాక్షీభూతుడనీ, సర్వజ్ఞుడని గొప్పగా వర్ణించటం అజ్ఞానుల ఆటలే

870. "నేను జగత్తును చూస్తున్నాను" అని అంటే నిజంగా దానిలోని అర్థం ఏమిటి? మర్మం ఏమిటి? "నిర్మల సత్యజ్యోతి, పరిపూర్ణజ్ఞాన స్వరూపం, అఖండ చైతన్యతత్త్వం అయిన శుద్ధాహంభావములోనే ఇంద్రియ గోచరమయిన జగత్తూ, ఆ జగత్తును చూచే జీవుడూ తోస్తున్నారు." ఇదే దాని అర్థం. దానిలోని మర్మం.

వివరణ : చూడబడే లోకం, చూచే జీవుడు సత్యంకాదు. చైతన్య ప్రకాశం ఆధారంగా కల్పిత దృశ్యాలే అవి ఆ దృశ్యాలు కూడా ఆత్మకి కాదు. ఆ దృశ్యాలలో ఒక్కడైన జీవునికే. ఉన్నది నలుబదిలోని 7వ పద్యాన్ని ఇక్కడ అన్వయించి చదువుకోవాలి.

871. దృశ్యమానమైన జగత్తును నిజమని నమ్మించే పంచేంద్రియ జ్ఞానం మిథ్య. ఆ జగత్తును గోచరింపజేసే పంచేంద్రియాలూ దానిని గ్రహించే అహంకారము, దృశ్యమయిన జగత్తులాగే మిథ్యామాత్రము.

వివరణ : త్రిపుటియైన ద్రష్ట, దృశ్యం, దృక్కు ఈ మూడూ అసత్యాలే, చూచే జీవుడు, వానిని చూచే చూపు, చూడబడే జగదృశ్యంలోనివే అనిభావం. ఉదాహరణకి ఒక రాజు తన ముందర ఒక దృశ్యం చూస్తున్నట్లు సినిమా తీశారనుకొందాం. ఆ సినిమాని ప్రదర్శిస్తే ఆ దృశ్యాన్ని చూసే రాజు కూడా ఆ సినిమాలోని ఒక దృశ్యమే అని గ్రహించాలి.

872. కన్నుకు కన్నైన ఆత్మను దర్శించి, స్వస్థితిని పొంది, " పరమాత్మ వేరు, నేను వేరు" అనే భేద దృష్టిని వీడినవాడు "ఆ పరమాత్మను నేనే" అనే జ్ఞానంతో ప్రకాశిస్తాడు.

873. స్వరూప స్థితిని పొందిన ఆత్మజ్ఞాని బంధరహితుడు. అతడు చిద్గగన సామ్రాజ్యాధినేత. దృగ్గోచరములైన సకల జగదృశ్యములకు అతడు ఆత్మదృష్టితో అనగా స్వరూపములుగా చూస్తాడు.

874. దృశ్యమైన ఈ మిథ్యా జగత్తులో మనం జన్మిస్తున్నామని చెబుతాం. ఆత్మదృష్టితో చూసినపుడు "శరీరమే నేను" అనే అహంకారం వల్ల, అవివేకం వల్ల యిలా చెబుతున్నామని గ్రహించాలి.

వివరణ : శరీరాన్ని నేను అని అభిమానించటమే జన్మ. పోషించటమే జీవితం; దానిని తాత్కాలికంగా మరచిపోవటమే మరణం; ఆ అజ్ఞానాన్ని ఆ అభిమానాన్ని పెంచి శాశ్వతంగా నశింపజేయుటయే జ్ఞానం లేదా మోక్షమని భావం.

875. అహంభావం పోవుటచేత పొందే అఖండాత్మ దృష్టితో చూస్తున్నపుడు ఈ ప్రపంచమంతా ఆ సద్వస్తువైన తనలోనే ఉన్నదని తెలుస్తుంది. స్వప్నంలో కనబడు అనేక దృశ్యాలు ఆ స్వప్నాన్ని చూసే వానికి వేరుగా అప్పుడు కనబడినట్లే, మనమే అయిన ఆత్మయే జాగ్రత్తులో అన్యవస్తువుల వలె చూడబడుతున్నామని తెలుసుకో.

వివరణ : నిద్రించేవాని నుండే స్వప్న దృశ్యములు కనబడుతున్నాయి. అవి స్వప్న సమయంలో వానిని చూచేవానికి వేరు వస్తువులుగా కనబడినా, అవన్నీ (చూచేవానిలో సయితం) వానికి అన్యమైనవి కావు. అన్నీ అతనే. అట్లాగే, ఈ జాగ్రత్తులో ఆత్మయైన మనమే చూచే జీవునిగా అతనికి అన్యంగా గోచరించే జగత్తుగాను గోచరమవుతున్నాయని భావం.

876. అవాస్తవమైన సర్పదృశ్యం పోయే వరకు దానికి ఆధారమైయున్న వాస్తవమైన త్రాడు గోచరించదు. అట్లాగే అవాస్తవంగా కనబడే ఈ జగద్దృశ్యం పోయేవరకు దీనికి అధిష్ఠానంగా ఉండే సత్యమైన ఆత్మస్వరూపం గోచరమవ్వదు.

వివరణ : శ్రీ భగవాన్ రచించిన "నేనెవరు?" గ్రంథంలో ఇచ్చిన భావమే ఈ వచనం.

877. "ప్రపంచం సత్యం" అనే భావం పోయినపుడే పరమాత్మ జ్ఞానం కలుగు తుంది. ఆ పరమాత్మజ్ఞానం పొందిన జీవితమే జీవులకు నిజమైన సహజమైన జీవితం. మరేవిధమైన జీవితమైనా (బ్రహ్మలోక నివాసము ఇత్యాది) నగణ్యమైనదే.

## తత్త్వానుసంధానం

రెండవ భాగం సంపూర్ణం.

మూడవ భాగం

## తత్త్వానుభవం

## 1. అపరోక్ష జ్ఞానం

878. ఆత్మయే నిజమైన నేత్రం. అది తెలిసికొనేది తననే కాబట్టి ఆ ఆత్మ ఒక్కటే సత్యమైన అపరోక్ష వస్తువు. అయితే ఆత్మ దృష్టిలేని జీవులు బాహ్యంలో తమకన్యంగా గోచరించే విషయాలను పంచేంద్రియాలతో గ్రహించి, వాటినే ప్రత్యక్షమైనవని అంటారు.

వివరణ : తెలిసికొనే జగద్వస్తువుల జ్ఞానాన్నే లోకులు ప్రత్యక్షమంటారు. అయితే మనకి కనిపించే యీ ప్రపంచం ప్రత్యక్షం కాదు. ఎందువల్లనంటే ప్రపంచాన్ని చూడటానికి మనస్సు, నేత్రాలు, వెలుగు మొదలైన యితర ఉపకరణాలు అవసరమవుతాయి. అంతకంటే సత్యమై ప్రత్యక్షమైనది స్వస్ఫురణయైన (సచ్చిత్) ఆత్మయే. "నేను ఉన్నాను" అనే తొలి

జ్ఞానానికి తర్వాతే "జగత్తు మొదలైన ఇతరములున్నాయి", అనే జ్ఞానం కలుగుట చేత అవి ప్రత్యక్షం కావు. తానే (ఆత్మయే) నిత్యప్రత్యక్షము అని సెలవిచ్చారు.

879. అనంత చక్షువైన ఆత్మకి త్రిపుటిగా చూసే దృశ్యజ్ఞానం కలుగునా? (కలుగదు). శక్తివంతమైన జ్ఞానాగ్నిలో దృశ్యాలన్నీ దహించబడి ఆత్మమయముగా గోచరిస్తాయి.

880. పై పద్యభావంలో చెప్పిన "అనంతచక్షువు" (అనంతదృష్టి) అంటే, మంచి చెడులు, దేశ కాలాలు, కార్యకారణములు, ఫలితాలు మొదలైన భేదభావాలు లేశమైనా లేని ఏకత్వజ్ఞానమే అది అని అర్థం.

## 2. నిత్యమైన ఎరుక (శాశ్వతమైన అవగాహన)

(Eternal Awareness )

881. అంతర్ముఖంగా చేసే ఆత్మ విచార సాధన ఫలితమేమంటే, (నేను దేహం అనే)మిథ్యయిన అహంభావం నశించుటయే! అంతేకాని నిత్య సిద్ధమై స్వయం ప్రకాశమైన ఆత్మస్వరూపాన్ని పొందటమన్నది విచారణ యొక్క ఉద్దేశ్యం కాదు🌹.

వివరణ : అహంకారం నశిస్తే చాలు : ఆత్మని పొందినట్టే!!

882. అవిద్య మాయమై ఆత్మ సిద్ధి అయినట్లు అంటున్నామే కాని, ఇది దశముని కథలో పదియవవాడు దొరికాడనటం వంటిదే. ఆత్మనిత్యంగా అపరోక్షంగా ప్రకాశిస్తూనే ఉంది. అందుచేత జ్ఞానానుభవం కొత్తగా వచ్చేది కాదు.

వివరణ : పది మంది మూర్ఖులు ఒక ఏటిని దాటిన తర్వాత అందరూ ఒడ్డు చేరారా అని తెలుసుకోటానికి తమని లెక్క పెట్టి చూసుకున్నారు. లెక్క పెడుతూన్నప్పుడు ఒక్కొక్కడు తనను వదలి లెక్క పెట్టడం వలన, తొమ్మండుగురే ఉన్నారనుకున్నారు. అందువలన వారిలో ఎవరో ఒకడు ఏటిలో మునిగి పోయాడని దుఃఖించారు. అప్పుడు అక్కడికి వచ్చిన ఒక బాటసారి తన ముందు ఆ పది మంది ఉండటాన్ని చూసి, వీరి అజ్ఞానాన్ని పోగొట్టటానికై ఒక్కొక్కనికి ఒక దెబ్బకొట్టి దెబ్బ తగిలినప్పుడెల్లా ఒకటి రెండు అంటూ లెక్క పెట్టమని చెప్పాడు. పది మందీ దెబ్బలు తిని ", అవును మేం పదిమంది ఉన్నాం. పోయిన వాడు దొరికాడు" అని రూఢి పరచుకొన్నారు. ఈ నిరూపణ కొత్తది కాదు. ఈ భావాన్నే ఈ పద్యంలో చెప్పారు. అవిద్య (జ్ఞాపకం లేకపోవటం) పోవటమే సాధనా ఫలితం. తనని (ఆత్మని) కొత్తగా పొందటం కాదు.

883. స్వర్ణంతో తయారు చేసిన ఆభరణాన్ని కరిగించి రూపం పోయిన తర్వాతే స్వర్ణ మంటామా? ఆభరణ రూపంలో నున్నా అది స్వర్ణమేకదా! అట్లే చిత్తం కల్పించిన మిథ్యారూపములైన జగజ్జీవేశ్వరులు అనే మూడుతత్వాలూ సదా సచ్చిత్ స్వరూపమే (ఆత్మయే) యని తెలుసుకో!

884. ఒక వనిత తన మెడలో ధరించిన ఆభరణం కనబడలేదని, (అంతటా వెదకిన తర్వాత) తన మెడలో తడిమి చూసుకొని దానిని తిరిగి పొందినటువంటిదే (అంటే తాను ఎప్పుడూ దానిని పోగొట్టుకోలేదని తెలియటం వంటిదే) తనను వెదకి ఆత్మవిచారణ చేత ఆత్మానుభవం పొందటమవుతుంది. (తాను ఎప్పుడూ బద్ధుడైన జీవుడు కాదు. అప్పుడు, ఇప్పుడు తాను పరబ్రహ్మమే అనే జ్ఞానాన్ని పొందటమే).

885. అత్యంత మర్మంగా వ్యవహరిస్తున్న ఇంద్రియమైన ఈ అహంకారం ఎవరని విచారించి తెలుసుకోవాలి. అంతేగాని ఇతర మార్గాలలో ఎంత ప్రయత్నించి శ్రమపడినా, హృదయంలో సదా ఉన్నటువంటి ఆత్మనిధిని పొంది సుఖించలేడు.

వివరణ : ఈ పద్యంలో శ్రీ భగవాన్ తమ దృఢమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కర్మ, భక్తి, యోగం, జ్ఞానం మొదలైన ఏ మార్గంలో ఎంత శ్రమ పడ్డా ఆత్మానుభవ ఆనందం లభ్యంకాదనీ, ఆ విధంగా ప్రయత్నించే తాను ఎవరు అని విచారిస్తేనే బ్రహ్మానందం కల్గుతుందని రూఢి పరుస్తున్నారు.

886. సాధకుడైనవాడు తపస్సాధనాంతంలో, తాను అనుభవిస్తానని ఎంచే ఆ సాటిలేని బ్రహ్మపదం (ఆత్మజ్ఞానం) ఒక సద్వస్తువే. ఎల్లప్పుడూ ఉండేటువంటి వస్తువు. అయినట్లయితే, భవిష్యత్తులో కలుగబోయే అనుభవానికి సమానంగా ఇప్పుడూ అపరోక్షంగా (ప్రత్యక్షానుభవంగా) అతనికి ఉండి తీరాలి.

887. ఆ ఆత్మస్థితి ఇప్పుడు లేనిదై (తపస్సు చేసిన) పిదప పొందదగినదైతే, అట్లు కొత్తగా లభించే ఆ స్థితి మన సహజ స్థితి కాదు కాబట్టి (ఎప్పుడైనా ఒక రోజున) మనలని వదలిపెట్టి పోయేదే కాని అది మన వద్ద శాశ్వతంగా ఉండేదికాదు.

వివరణ : పైన తెల్పిన 886, 887వ వచనాలలో చెప్పిన భావం, సాక్షాత్కార స్థితి ఈ రోజే, ఇక్కడే నిత్యసిద్ధంగా, ప్రత్యక్షంగా నున్నదనే భావంగా అమరింది.

888. అది (ఆ బ్రహ్మం) కూడా పూర్ణమే. ఇది (ఈ ప్రాపంచిక దృశ్యం) కూడా పూర్ణమే. ఆ పూర్ణ బ్రహ్మంతో పూర్ణమైన ఈ ప్రపంచం లయమై ఏకమైనా కూడా బ్రహ్మమైన ఆ పూర్ణం పూర్ణంగానే వుంది. మళ్ళీ ఆ పూర్ణ బ్రహ్మం నుండి ఈ పూర్ణ ప్రపంచ విడిపడినట్లుతోచినా ఆ బ్రహ్మవస్తువు పూర్ణంగానే మిగిలియుంటోంది.

వివరణ : "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే "అనే శ్లోకాన్ని భగవాన్ అనువదించినట్లు చెప్పబడినది.

889. 'అది' అనబడే 'తత్' పదం కూడా చిదాకాశామే. 'నీవు' అనబడే 'త్వం' పదం కూడా చిదాకాశమే. 'తత్త్వం (అసి)' అని బోధించే మహావాక్యోపదేశమూ చిదాకాశమయమే అవుతుంది. సకలానికి ఆధార వస్తువుగా నుండి ప్రకాశించు సత్యపరిపూర్ణ బ్రహ్మం తప్ప కొత్తగా పొందేందుకు ఏదీ లేదు. లేదా ("నేతి" ద్వారా) త్రోసి పుచ్చటానికీ ఏదీ లేదు.

890. అద్వితీయమైన పూర్ణాత్మ స్వరూపాన్ని తప్ప, 'అది' అని 'ఇది' అని వ్యవహారిక సత్యం ఆధారంగా చెప్పబడుతూన్న అన్ని తత్త్వాలు ఏ మాత్రం సత్యం కావు అన్నదే పరమార్థం. అవన్నీ కేవలం కల్పితాలేయని జ్ఞానుల సిద్ధాంతం.

891. (ప్రపంచమైన) అనేక వస్తువులుగా సృష్టింపబడి యుండి కూడా ఆ ఏక వస్తువు ఏ మాత్రం మార్పు చెందదు. ఇది జ్ఞానుల స్వానుభవంతో చెప్పినమాట. ఆది నుండి ఎప్పుడూ ఎవరైనా ఆ వస్తువుగానే ఉన్నారు. మన యధార్థ స్థితి నిత్య అపరోక్షమే అని తెలుసుకోవాలి. ఈ జ్ఞానాన్ని పొందటమే మోక్షమని గ్రహించు.

892. ఆత్మ స్వరూపం అద్వైతం అన్న విషయాన్ని శ్రవణ మననాలతో చక్కగా విశ్లేషించి, తర్వాత నిదిధ్యాసనతో పొందటానికి బాగా ప్రయత్నించినా ప్రమాదవశాత్తు అనేకసార్లు తడబడి తప్పి, ఇంకా ఏం చేయాలో దిక్కుతోచక కంగారుపడే జీవుని సకల మనోవృత్తులూ ఉడిగినప్పుడు హృదయంలో తనంతట ప్రకటితమయ్యే స్ఫురణే ఆ సద్వస్తువు యొక్క సహజ లక్షణం..

వివరణ : సాధకుని నిజమైన అనుభవాన్ని పై వచనం చక్కగా చెబుతోంది. సాధనలన్నీ చేసి, అనేకసార్లు తడబడి తన అశక్యతను గ్రహించి దుఃఖించటం, క్రుంగిపోవటం ఎంతో మంది సాధకుల అనుభవమే కదా! అట్లాగ మనస్సు సోలి తిరిగి సంబాళించుకొన్న ఆక్షణమే ఆత్మస్ఫురణ ఎటువంటి అడ్డంకి లేక మెరపులా అప్పుడే ప్రకాశిస్తుందని పై వచన భావం.

## 3. నిర్వికల్ప సమాధి

893. అనేకంగా కనిపించే ప్రపంచాన్ని గ్రహించకుండా (శరీరం కట్టెలాగా) ఉండటమే నిర్వికల్ప సమాధి యొక్క లక్షణమనటం సరికాదు. అంతరంలో మనస్సు మృతమై ఏ సంకల్ప వికల్పాలు లేకుండా ఉండటమే అత్యంత శ్రేష్ఠమైన నిర్వికల్పసమాధి అవుతుంది.

వివరణ : నీటిలో కరిగిన ఉప్పు బొమ్మ వలె, మనస్సు ఆత్మలో కరగి రూపాన్ని పోగొట్టుకొన్నది. అందువల్ల మళ్ళీ ఇంక ఉద్భవించదు. మనోనాశమైన సహజ నిర్వికల్పమే నిజమైన సమాధి స్థితియగును.

894. “ఉన్నాను” అనే సహజ స్ఫురణ మాత్రంగా యుండటమే సమాధి. నేను శరీరము, నేను మనిషిని, నేను ఇది లేదా అది అనే అహంకార ఉపాధితో కలిసి లేచే ఉత్తమ పురుష (పరిమితమైన) భావం నుండి విడిపడి, అపరిమితము శుద్ధమైన ఉనికి యగు సమాధి స్థితిలో నిలకడగా నుందువుగాక!

895. "నేను ఇదిగా అదిగా ఉన్నాను" అనే అహం భావం లేకుండా "నేను ఉన్నాను" అనే కేవల స్థితియే మౌన సమాధి యని జ్ఞానులంటారు. ఆ మౌన సమాధి సిద్ధించేవరకు “శరీరమేనేను” అనే భావన తెగిపోయేవరకు ఆత్మావలోకనాన్ని విడవకుండా సాధన చేయి.

896. ఉదయాస్తమానాలు కలిగిన "నేను" అనే అహంభావం వలె కాక ఆత్మయైన “తాను" (ఉదయాస్తమానాలు లేక) ఎల్లప్పుడూఒకే విధంగా వెలుగొందుటచేత, 'నేను' అనే అవిద్యాభావాన్ని త్రోసిపుచ్చి 'తాను'గా వెలుగొందుము.

897.“నేను ఒక జీవుణ్ణి" అని ఎంచి నీ సహజ స్థితి నుండి దిగజారిన మనసా! (నీవుయిక) "నేనే బ్రహ్మమును" అని ధ్యానించుటనారంభిస్తే, మళ్ళీ మోసపోతావు! ఎందుకంటే ఉత్తమమైన ఆ పూర్ణస్థితిలో ఉన్న తనని (ఆత్మని) తప్ప "నేను ఇది" అని ఎంచటానికి ఏదీలేదు.

898. ఏ తలపులేక కేవలం “ఉన్నాను” అని వెలిగే స్వస్థితిలో మనస్సు ఏకమైయుండుటచేత అనుభూతమయ్యే అఖండ సత్తే సమాధి. ఇలా మనస్సు అణగి పరమాత్మంగా మిగులుతుంది. ఆ స్థితిలో మనస్సే దైవం అని చెబితే అది సత్యమే అవుతుంది.

వివరణ : లేచిన తరంగం శాంతంగాఉంటే సాగరమైపోతుంది. అట్లాగే ప్రవృత్తి కూడా. ఉపాధులున్నంత వరకు దేనిని మనస్సంటున్నామో అదే నిశ్చలం అఖండం అయితే బ్రహ్మము అవుతుందన్నారు. అది, ఇది అనే అన్ని ఉపాధులకు అతీతంగా ఉన్న తన స్థితినే దైవమంటారు. బ్రహ్మము అంటారు..,

899. మనస్సుకూ బుద్ధికీ మూలమైన “ఉన్నాను" అనే సద్వస్తువుని పొందే ఉపాయాన్ని విను. వస్తువులను తెలిసి కొనే మనస్సు చేతనే "ఈ మనస్సనబడే దాని రూపమేమిటి?" ఇది ఎక్కడ నుండి ఉదయిస్తోంది?" అని విచారించి తెలుసుకొనుటయే మనస్సు అంతర్ముఖమై ఆత్మలో మునిగే మార్గమవుతుంది.

వివరణ : అరుణాచలాష్టకంలోని 5వ పద్యాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవాలి. ఏమి చేసినా నశించని మనస్సు, తన రూపమేమిటని తనను గూర్చి విచారిస్తే నశిస్తుందని శ్రీ భగవానుల భావం. మనస్సుచేత ఇతరములను విశ్లేషించటం, ధ్యానించటం అంతర్ముఖత్వం కాదు. అది సద్వస్తువును పొందే మార్గమూకాదు. లోదృష్టితో మనస్సుని ఆత్మలో లీనం చేయటమే దానిని నశింపచేసే మార్గం. ఇదే సద్వస్తువును పొందే మార్గం.

900. బుద్ధి చలించక అణగి తానుతానుగా నుండటమే తాను శివపదాన్ని పొందటమవుతుంది. తెలియబడుటకుగాని తెలుసుకొనుటకుగాని రెండవ వస్తువులేక, కేవలముగా వెలిగే స్థిర ప్రజ్ఞయే శుద్ధ శివపదమవుతుంది కదా!

901. తప్పనిసరిగా పొందవలసిన జ్ఞానమని మహాత్ములు చెప్పే మౌన స్వరూపం ఏమిటి? బాహ్యాంతరములలో ఒకే స్ఫురణ రూపంగా సమాధి స్థితిలో ప్రకాశించే “ఉన్నాను” అనే చిదానందమే.

వివరణ : ఒక పరిధికి లోబడిన దేహాన్నే "నేను" అని భావించుటచేతనే "ఉన్నాను'" అనే ఎరుక దేహంలో మాత్రమే గోచరించుతున్నదనీ శరీరానికి బయట తాను లేననీ, ఒక భావం అందరికి కలుగుతోంది. శరీరం నేను అని భావించకపోతే

లోపల-బయటా అనే భేద భావం కలగడానికి ఆస్కారం లేదు.. లోపల బయట లేని ఎరుకగా గోచరించు "ఉన్నాను" అనే ప్రజ్ఞయే సత్యజ్ఞానమగు పూర్ణ వస్తువు.

902. మౌనమే రూపమై వెలుగొందు అనాది వస్తువును "నేను అది" అని ఎంచి కష్టపడటం దేనికి? మనస్సు మౌన రూపం దాల్చటమే సమాధినిష్ఠ అవుతుంది. ఆ సమాధి నిష్ఠ "నేను" అనే తొలి తలపు లేకుండటయే. అదే మనస్సులేని మౌనం. ఇట్లాగ "నేను" లేకపోయిన తర్వాత "నేను అది బ్రహ్మం" అని ఎంచటానికి చోటేది?

వివరణ : అహం బ్రహ్మాస్మి, సోహం, శివోహం అని ధ్యానించటం జ్ఞాన సాధన కాదనే శ్రీ భగవానుల ఉపదేశం. తనని ఎవరు అని విచారించి నేను లేకుండా పోవటమొక్కటే నిజమైన జ్ఞానసాధన.

## 4. నిర్వికారం

903. మహాజ్ఞానులారా! మీ నిశ్చితాభిప్రాయమేమిటో చెప్పండి! ఈ జగత్తు దృశ్యముగా కన్పిస్తోంది. మరల అదృశ్యమైపోతోంది. ఈ జగద్వికారము వాస్తవమైనదేనా? లేక నిర్వికారమైన సద్వస్తువు వికారము చెందినట్లు కన్పిస్తోందా?

వివరణ : ఈ గ్రంథంలోని 63, 64, 65వ భావాలను ఇక్కడ మరొకసారి పరిశీలించాలి. వాటి భావాన్నే 903 నుండి 907 వరకు పునరుద్ఘాటిస్తున్నారు. యదార్ధ వస్తువు నిర్వికారమైనది. మార్పులు, అనగా పుట్టుట, పెరుగుట, తరుగుట, మరణం, నామ రూపాలు మనస్సు ఇంద్రియాలు సృష్టించినవే. ఇవి యదార్థాన్ని ప్రభావితం చేయలేవు.

904. చావు పుట్టుకలు కల ఈ నశ్వర శరీరానికే జగత్తు యొక్క ఆద్యంతములు గోచరిస్తున్నాయి. జ్ఞాన స్వరూపమయిన ఆత్మకు జననమరణాలు సంభవిస్తున్నాయటనం విడ్డూరం. ఆకాశంలో మేఘమాలికల కదలికలను చూచి ఆకాశం మార్పు చెందుతున్నదని చెబితే అది అజ్ఞానమే.

905. వాసనాక్షయమైతే జ్ఞాన దృష్టి అలవడుతుంది. జ్ఞానదృష్టితో చూసినపుడు గోచరించే ఈ జగత్తు బొత్తిగా అగోచరమే అవుతుంది. అలా జగత్తును త్రోసి పుచ్చే ఆత్మవస్తువును వికారాత్మకమైన దనటం భ్రాంతే అవుతుంది. అంతకంటే పెద్ద భ్రాంతి మరొకటి ఉంటుందా? (ఉండదని భావం)

వివరణ : ఉన్నది నలుబదిలో 4వ పద్యభావాన్నే ఇక్కడ కూడా శ్రీ భగవాన్ చెప్పారని గుర్తించాలి.

906. పృధివి, జలం, అగ్ని వాయువు మొదలైన నాల్గు భూతాల గుణాగుణ వికారాలు సర్వ వ్యాపకమైన ఆకాశాన్ని ఎట్లాగ అంటుకొనవో, అట్లే జగత్తు యొక్క చలనాలు మార్పు చెందని ఆత్మని ఎప్పుడూ అంటవు.

వివరణ : 'నేను ఎవరు?' అనే గ్రంథంలో శ్రీరమణులు చెప్పే భావాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి.

907. భార్య అని, ఆడపడచు అని, కోడలు అని, తల్లి అని, ఇంకా ఎన్నో విధాలైన చుట్టరికాల పేర్లతో ఒక స్త్రీయే అనేకుల ఆలోచనలో కనబడుతోంది. అయినా నిజానికి ఆమె రూపం కొంచెమైనా మార్పు చెందటం లేదుకదా! (అట్లాగే అజ్ఞాన దృష్టితో జగజ్జీవేశ్వర నానావిధ నామ రూప వికారాలను భావించినా ఏకమైనటువంటి ఆత్మ నిర్వికారమే అని భావం)

## 5. ఏకాంతం

908. అవినాశియైన మోక్షాన్ని పొందే మార్గంలో నుండే సాధకులకు తప్పక ఉండవలసిన అనేక సద్గుణాలనూ పరిశీలించి చూస్తే, ఏకాంతాన్ని కోరే గుణమే మనస్సులో బాగా వేళ్లూనుకొని ఉండవలసిన గుణము.

వివరణ : ఏకాంతం ఒక గుణం కాదు. అది ఒక మానసిక స్థితియని శ్రీభగవాన్ చెప్పేవారు. ఒక ముముక్షువుని మనస్సు సకల వాసనా రహితమైన ఆనందస్థితినే కోరేలాగుండాలని ఈ భావంలో సూచిస్తున్నారు. రాబోవు 912వ వచనాన్ని కూడా ఇక్కడ చదువు కోవాలి.

## 6. అసంగం

909. ఓ మనసా! నిజంగా ఆత్మ స్వరూపమైన నీ సన్నిధిలో అసత్యమైన దేహాది తత్వాలు ఒకదానితో నొకటి చేరి లెక్కలేని వికారములను పొందినా, నీవు అసంగుడవై వాటికి వేరుగా నిలబడి చెదరక, వాటికి సాక్షిగానుండెదవు గాక!

910. ఏఏవి తనను ఎంతెంత చేరినా, లేదా తననుండి ఏఏవి ఎంతెంత పోయినా, వాటి రాకపోకలకు సాక్షిగానున్న ఆత్మ వాటికి వేరైన వస్తువుగా - అంటే గాలిలో గడ్డిపోచ తేలిపోతున్నట్లు, చిత్త వికారంచెందక - వాటితో తాను బాధింపబడక అసంగుడై ఉండుటయే సహజ జ్ఞానస్థితి యగును.

వివరణ : సినిమా తెరమీద నిప్పు, నీరు బొమ్మలు కనబడినపుడు, వాటివల్ల బాధింపబడక, వాటికి ఆధారమై తెరఉన్నట్లు అని భావం.

911. అన్ని వస్తువుల లోపల, బయట, అడ్డంగా, నిలువుగా ఆకాశం వ్యాపించివుండినా ఆ వస్తువులతో కొంచెమైనా సంగము లేనట్లు, దేనియందూ బంధములేని ఆత్మగా తనును తాను తెలుసుకొంటే వాటి మోహంలో పడడు.

వివరణ : ఆత్మజ్ఞానం లేనిచో ప్రపంచంలో అసంగుడై జీవించడం కష్టమని ఉపదేశం.

912. లోపల దాగియున్న పూర్వ వాసనలే నిజమైన బంధం. వాటినే వదలేయాలి. (బాహ్యవస్తువులను వదలేయటం బంధ విమోచనం కాదు). కాబట్టి వంచించే భావాలు దగ్ధం కాగా మనస్సు నశించిన జ్ఞానులు ప్రపంచంలో ఏ వర్ణాశ్రమ ధర్మం ప్రకారం జీవించినా తప్పులేదు. (వారు బంధరహితులే).

## 7. మనోనాశం

913. అస్థిరమై చంచలమైన మనస్సులు కలవారికి జీవితంలో అన్ని కార్యాలలోను వ్యతిరేకమైన ఫలితాలే కల్గుతాయి.

వివరణ : మనస్సు చలించే మార్గంలో పోకుండా నిగ్రహంతో ఉండటం మేలని బోధిస్తున్నారు.

914. వాయు దేవుడు కూడా సిగ్గుపడే వేగంతో ఎచ్చటా స్థిరంగా లేకుండా చలించే మనస్సుని, ఎక్కడికి తిరగలేక ఉన్న చోటునే పడుండే కుంటివాని వలె, నిశ్చలంగా నుండే విధంగా అణచి నాశనం చేయటమే నిజంగా అమరత్వాని పొందడమంటే.

915. తామర తంపరగా మొలిచే కోరికలను (కామ క్రోధమోహాలు), అవి మొలవక ముందే వేరుతో సహా పెకిలించివేస్తే, శాంతించిన నిస్తరంగ సముద్రంవలె ఉంటుంది. జ్ఞానం అంటే అదే.

916. ఎటువంటి దుఃఖాలనైనా కల్గించగల పంచేంద్రియాలలో దేని ద్వారా కూడా మనస్సుని కొంచెమైనా పోనీయక, కల్లోలితమయిన కడలి అలలు తగ్గి శాంతించినట్లు, మనస్సణగటమే జ్ఞానం.

917. మేఘావృతమైన ఆకాశంలో సూర్యుని చూడలేము. అట్లాగే అజ్ఞానాంధ కారమయమైన తలపులతో నిండిన మనోకాశంలో ఆత్మ స్వరూపాన్ని చూడలేము.

918. మనస్సుని జయించినవాడు జ్ఞానగజం యొక్క అంబారిపై ఊరేగే గొప్పచక్రవర్తి అవుతాడు. మనశ్చాంచల్యమే నికృష్టమైన జన్మదుఃఖమగు బంధము. ఇదిగ్రహించు.

919. మనస్సు నిశ్చలమై, చిత్తం అణగిన స్థితే మోక్షానికి తగిన సమాధి స్థితి. కనుక మనస్సు శాంతించడానికి ఉత్సుకతతో ప్రయత్నించి వంచించే మనశ్చాంచల్యాన్ని నశింప చేయుదువు గాక!

920. ఆత్మ దర్శనంతో తప్ప అహంకారం నశించదు. అట్లాగే మనోనాశంతో తప్ప పీడకల అయిన ఈ జగద్దృశ్యం పోదు.

వివరణ : ఆత్మజ్ఞానమే దుఃఖ నివృత్తి అని ఉపదేశం.

921. మనస్సును ఎదిరించి నశింప చేయడం ఎవరి తరమూ గాదు. దానిని జయించే ఉపాయం ఒకటే. మనస్సు నిజంగా ఒక వస్తువుకాదు అని భావించి దానిని లెక్క చేయక, ఉదాసీనతతో, దాని మూలమైన ఆత్మనే కోరి, వెదకి, తెలిసికొని అనుభవించి అందే సంస్థితమై యుంటే, అసత్యమైన ఆ మాయా మనస్సు యొక్క ప్రవృత్తి వేగం నింపాదిగా నశిస్తుంది.

వివరణ : వాలిని ఎదిరిస్తే తమ శక్తిలో అర్థ భాగం పోగొట్టుకుంటారట. మనోమాయ యొక్క వేగాన్ని ఎదిరించి పోరాడటం కూడా అటువంటిదే. దానిని పట్టించుకోకుండా ఉదాసీనతవహించి మన దృష్టిని అంతర్ముఖం చేస్తే మనస్సు బలహీనపడి క్రమంగా తానే నశిస్తుంది.

922. మనో వృత్తులను ధ్వంసం చేసే ఉపాయం కొంచెమైనా తెలియక దుఃఖించే ప్రజలారా! దృశ్యమాన ప్రపంచం, దానిని చూచే జీవుడూ మిథ్యా దృశ్యాలుగా తన నుండి (ఆత్మ నుండి), ఉద్భవించేవేయన్న సత్య దృష్టిని పొందట మొక్కటే (మనస్సుని దగ్ధం చేసే) ఉపాయం.

923. స్వర్ణంలో అనేక రకాల ఆభరణాలవలె, ఎండమావిలో జలంవలె,స్వప్నంలో కోటలోనున్న నగరంవలె కనబడేవన్నీ నిజానికి ఆత్మమయమే. చూసే తనకంటే వానిని అన్యమైనవిగా ఎంచుట తెలివి తక్కువ తనమవుతుంది.

## 8. మృత మనస్సు

924. తలపులుగా విస్తరించుట మాని నశించిన తరువాత కూడా మనస్సు (నేను అనే అహంకారం) జ్ఞానానంద నిలయంగా ఉంటుంది. అంతవరకు కాలగర్భంలో మరుగైపోయినట్లు తోచినా ఆ సద్వస్తువు నిరంతరం ప్రకాశిస్తూనే ఉంది అని నిశ్చయంగా చెబుతా.

వివరణ : ఉపదేశసారంలోని 20వ పద్యం, ఉన్నది నలుబదిలోని 12వ పద్యం ఇక్కడ జ్ఞప్తికి తెచ్చుకోవలెను. నేను ఈ దేహం అనే రూపంలో ఉదయించిన తొలితలంపు నశించిన తర్వాత కూడా "నేను నేనే" అని వెలిగే సచ్చిదానందాత్మ ఒకటుందని ఇక్కడ చెప్పబడింది.

925. "ఇప్పుడు అప్పుడు" అనే కాల భేదము, ఇక్కడుంది అక్కడుంది అనే దేశ భేదము "ఉన్నది - లేనిది" అనే సత్య భేదము లేక అవినాశము సర్వ వ్యాప్తము అయి వెలిగే నిత్యసిద్ధ వస్తువే శుద్ధ శివత్త్వం.

## 9. సర్వజ్ఞత్వం

926. తాను (ఆత్మ) తప్ప ఉనికి గల వేరే వస్తువులేదు కాబట్టి, అద్వితీయమై వెలిగే ప్రజ్ఞయే సర్వజ్ఞత్వం అవుతుందే తప్ప, త్రికాలాల్లోని వ్యవహారాల నెరిగే అన్యజ్ఞానాన్ని (సాపేక్ష జ్ఞానాన్ని) సర్వజ్ఞత్వమనగలమా? కాదని గ్రహించు.

వివరణ : త్రికాలాల్లో జరిగే వ్యవహారాలని తెలుసుకొనటం, 64 కళలనే అపరవిద్యను నేర్చుకొని యుండటం, యిటువంటి పలురకాలైనన్నీ అన్య విద్యలన్నీ సర్వజ్ఞత్వం అని లోకులంటారు. అయితే అది నిజం కాదు. ఉన్నది నలుబది 26వ శ్లోక

భావాన్ని బట్టి ఇవన్నీ అహంకారం యొక్క విశేష జ్ఞానమే కనుక ఇవి అవిద్యయే. అజ్ఞానమే. తాను పూర్ణంగా వెలిగే ఏకాత్మ జ్ఞానమే సర్వజ్ఞత్వమని గ్రహించాలి.

927. మనస్సు సంపూర్ణంగా అణగని సాధకులకు తాము ఇంత వరకు నేర్చిన అల్పజ్ఞానములచేతనే అనేక కీడులు రాశులుగా పోగైనపుడు, ఇంకా తమకు తెలియని విషయాలన్నిటినీ తెలిసికోవాలనుకొనటం చేత, ఉన్నటువంటి అజ్ఞాన మోహాంధకారం ఇంకా దట్టమవుతుందే తప్ప సత్ప్రయోజనమేమీ కలుగదు.

928. కేవలం సత్స్వరూపమైన తనను (ఆత్మను) అనేక విషయాలనెరిగే మానుష రూపునిగా నెంచి అజ్ఞాని మోహము చెందుచున్నాడు. ఆ మోహం చేత, అసత్య దృశ్యమైన ఈ ప్రపంచాన్ని సత్యంగా చూస్తున్నాడు. అట్టి అజ్ఞానికీ పలురకాలైన విద్యలెఱుగుట సర్వజ్ఞత్వమని చెప్పవచ్చునే తప్ప, నిర్మోహియైన జ్ఞానికైతే ఆ విద్యలన్నీ కేవలం వెణ్ణి తప్ప మరొకటి కాదు.

929. తాను అన్యాన్ని తెలిసికొనే జీవుడే అని యెంచి మోహంలో పడినప్పుడే, “అయ్యో! నేను కించిజ్ఞుడ'నని దుఃఖ పడవలసి వస్తుంది. ఆ కించిజ్ఞత్వం ఆత్మ జ్ఞానానుభవ సమయంలో అసత్యమై నశించినట్లే, సర్వజ్ఞత్వమని చెప్పబడేది కూడా ఆ ఆత్మ జ్ఞానానుభవంలో అసత్యమై నశించవలసినదే.

930. తాము కించిజ్ఞులమని (అహంకార స్వరూపులమని) భావించే అజ్ఞానుల కోసం వేదాలు ఈశ్వరుణ్ణి సర్వజ్ఞుడని స్తుతిస్తున్నాయి. దైవాన్ని గురించిన అనుభవజ్ఞానం కలిగినపుడు, సత్యమై నిత్యమై పూర్ణమై ఏకమై సహజమై ఉండే ఆ దైవం దేనినీ ఎఱుగుట లేదని తెలుస్తుంది.

931. "జీవన్ముక్తులు కూడా ఇతరులవలె ఈ జగత్తుని చూస్తారు. వారు చూసేటప్పుడు అనేక భేదాలు కూడా కనిపిస్తాయి. అయితే వారు భేదాలను చూస్తూనే వాటిలోని అభేదాన్ని అనుభవిస్తున్నా"రని లోకులు చెప్పటం అసత్యం అబద్ధం కూడాను.

వివరణ : జీవన్ముక్తుల గురించి ప్రజలలో ఎన్నో అపోహలున్నాయి. పైన చెప్పినదొకటి. భగవాన్ శ్రీరమణులు మాత్రం ఈ భావం తప్పు, అబద్ధం అని ఈ వచనంలో వివరించారు. ఏకారణం చేత అది అబద్ధం, తప్పు అని రాబోయే వచనంలో వివరిస్తున్నారు. ఇతరుల యొద్ద దొరకనిది భగవాన్ ఒక్కరే ఇచ్చిన కొత్త సత్యం.

932.మోహ బుద్ధిచేత అనేక భేదాలను చూసే అజ్ఞానుల దృష్టిలో ముక్తుడు కూడా విభిన్న వస్తువులను చూస్తున్నట్లు గోచరిస్తాడు. కాని ఆ ముక్తుడు దేనినీ చూడడు. అతను ద్రష్టకాదు.

వివరణ : ఈ గ్రంథంలోని 119వ పద్యభావాన్ని ఇక్కడొకసారి జ్ఞప్తికి తెచ్చుకోవలెను. తనను ఒక వేరు వ్యక్తిగా నెంచి చూసినంతకాలం జ్ఞానిని కూడా ఒక వేరు వ్యక్తిగానే చూస్తాడు. మరొక విధంగా అతను చూడలేడు. కనుక అవ్యక్తము అశరీరము అయిన జ్ఞానమే తానైన ముక్తుని కూడా ఒక ద్రష్టగా చూడటమూ, ముక్తుడు కూడా తనలాగానే భేదాలను చూస్తున్నాడనటం అజ్ఞాని దృష్టిలోనే సత్యం గాని జ్ఞాని ద్రష్టకాడు; అతను దేనినీ చూచుటలేదన్నదే సత్యం.

933.తాను కించిజ్ఞుడనని ఎంచటం బాహ్య వస్తువులను గ్రహించుట వలన కలిగిన దోషమేయగును. బాహ్య వస్తువులను గ్రహించటం మాని ఆత్మ విచార సాధనతో తన సత్యాన్ని గ్రహిస్తే ఆ అల్పజ్ఞానం నశించి పూర్ణ జ్ఞానంగా వికసిస్తుంది.

934. జీవుల దోష దృష్టికి ఏ ఆత్మ అనేక రూపాలలో ఈ ప్రపంచ దృశ్యమవుతున్నట్లు గోచరిస్తోందో ఆ అద్వైతాత్మను ప్రత్యక్షంగా అనుభవించి (అది ఆ విధంగా ఎప్పుడూ ఏదీ అగుట లేదని) ఎఱుగుట సరైన సర్వజ్ఞత్వం. ఇతరములు కావు.

వివరణ : దోష దృష్టి పోయి జ్ఞాన దృష్టి పొందటమే సర్వజ్ఞత్వమని శ్రీభగవాన్ ఉపదేశిస్తున్నారు.

935. స్వప్నంలో మనం చూసే కల్పిత వస్తువులన్నీ మనలోనేయుండియుండక పోతే అవి ఆ స్వప్నంలో కనబడి ఉండేవి కావు. ఈ న్యాయ ప్రకారమే జాగ్రత్లో కనబడే ఈ ప్రపంచమంతా ఏ ఒక వస్తువులో కేవలం కల్పితమై కనిపిస్తోందో ఆ ఏకమైన ఆత్మను అనుభవ పూర్వకంగా తెలిసికొనుటయే సర్వజ్ఞత్వం అవుతుంది.

936. ప్రస్తుత నాగరికత యొక్క వ్యామోహంలో పడక, నికృష్టమైన లౌకిక విద్యారంగాలలో ఆసక్తినివీడి దానిని త్రోసిపుచ్చటంతో పాటు, పరమాత్మ పేరు, జీవాత్మ పేరు అనే భేద బుద్ధిని కూడా వేరుతో సహా పెకలించి పారవేస్తేనే శివజ్ఞాన సత్యం గోచరిస్తుంది.

## 10. తురీయాతీతం

937. జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి అవస్థాత్రయాలు అహంకారం నశించిన జ్ఞాని నుండి వీడిపోతాయి. శేషించిన తురీయావస్థయే (నాల్గవ అవస్థ) తురీయాతీతంగా జ్ఞానిలో గోచరిస్తుంది.

938. కేవలం సచ్చిత్స్వరూపమైన తురీయావస్థ అద్వితీయమైన తురీయాతీతము కూడా. మూడు రకాలుగా వస్తూపోతూండే జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు మిథ్యా దృశ్యాలేయని, తానే (ఆత్మ) వాటి రాకపోకలకి అధిష్ఠానమని గ్రహించు.

939. అసలు ఈ జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడూ నిజమైతేనే కదా శుద్ధ జ్ఞాన స్థితియైన జాగ్రత్ సుషుప్తిని "నాల్గవది లేదా తురీయ"మని చెప్పటానికి? తురీయంలో ఆ స్థితులు మూడు మిథ్యయని తెలియుట వలన ఆ జాగ్రత్ సుషుప్తి ఒక్కటే నిజమైన స్థితి. ఇదే తురీయాతీతం కూడానూ.

## భగవాన్ - 18

జాగ్రత్ స్వప్న సుషుప్తి ఈ మూడవస్థలను నిజమని ఎంచే అజ్ఞానులకే ఈ మూడింటికంటే మేలైన "జాగ్రత్ సుషుప్తి" అనే అవస్థకి "తురీయ" మని పేరు పెట్టారు. అట్లా చెప్పబడే తురీయమొక్కటే నిజమైన అవస్థ అవుతుంది. అందువల్లనే, దృశ్యమాత్రములైమిగతా మూడవస్థలు అసత్యమవుతున్నాయి. కాబట్టి తురీయ మనబడే మొదటి అవస్థయే తురీయాతీతమూ అవుతుంది అని నిశ్చయంగా తెలుసుకో.

940. ఈ తురీయాన్ని "ఎప్పుడూ మేల్కొనక నిద్రించే మహా నిద్ర" అని అన్నా లేదా, నిద్ర లేని "కేవల నిత్యజాగ్రత్" అని అన్నా కూడా సరే.

## 11. అఖండ వృత్తి

941. వృత్తులన్నీ భిన్నములైనవైతే (ఖండం), తద్వ్యతిరిక్తమైన "అఖండం" అంటే వృత్తులులేని ఒక స్థితే కదా! అట్లుండగా, బ్రహ్మస్థితిని అఖండాకారవృత్తియని అనటం సముద్రాకారనది అని చెప్పటం లాంటిదే!

వివరణ : సాధకులలో కొందరు "అహంబ్రహ్మాస్మి అనే అఖండాకార వృత్తి ధ్యానాన్ని సాధనచేస్తున్నాను" అని చెప్పుకోవటం, అట్లాగే ఇతరులని కూడా సాధన చేసుకోమని ప్రసంగాలు చేయటము వింటున్నాము కదా! అఖండ స్థితిలో వృత్తికి స్థానమేది? సముద్రంలో నది కలసిపోతే ఇక దానిని సముద్రమనే చెప్పాలి కాని దానిని సముద్రాకార నది అనటం మాటల గారడి తప్ప మరేది కాదు. అట్లాగే స్వరూప జ్ఞానాన్ని అఖండమనే చెప్పాలి తప్ప, దానికి ఒక వృత్తి పదాన్ని చేర్చి అఖండాకార వృత్తి అని చెప్పటం సబబు కాదని భావం.

## 12. గ్రంథి విచ్ఛేదం

942. మనస్సు దుఃఖములకు క్రుంగక, సుఖములకు పొంగక సమంగా, ఉదాసీనంగా శాంతితో నుండటమే గ్రంథివిచ్ఛేదమయినట్లు గుర్తు.

943. గతాన్ని తలచుకోకుండా, రాబోయే వాటిని గురించి కూడా ఆలోచించక వర్తమానంలో సాక్షిగా నుండి, శాంతితో తృప్తితో నుండటమే గ్రంథి భేద లక్షణం.

944. ఏయే తలపులు కలిగినా అవి తనకు (ఆత్మకు) విడిగా ఉండలేవు "అయ్యో! తలపులతో ఆత్మావలోకనం మధ్యలో ఆగిపోయిందా" అని భావించకుండా నుండటమే గ్రంథి విచ్ఛేద లక్షణం,
13. కృత కృత్యత
945. ఎవరెవరు ఏయే వస్తువుల ద్వారా, ఎక్కడెక్కడ ఏయే అనుభవాలను పొందినా ఇంద్రియాల ద్వారా పొందే ఆయా అనుభవాలు అన్నీ, జ్ఞాన దృష్టితో చూస్తే ఆత్మానుభవం యొక్క భిన్నరూపాలే.

వివరణ : ఈ గ్రంథంలోని 1074 వచనము ఇక్కడ ఒకసారి చదువుకోవాలి. శ్రీరమణుల ఉపదేశమంజరిలోని, అభ్యాస ప్రకరణ 6వ ప్రశ్నకి సమాధానం ఇక్కడ అన్వయించుకోవలెను.

946. ఆత్మానుభవం కలిగిన వెంటనే, సుఖం ఇటువంటిదని తెలుసుకొనే మొదటి వృత్తియైన మనస్సు బయటికి పోలేక జ్ఞాన సముద్రంలో మునుగుట చేత, ఆత్మ సుఖాతీతమే తప్ప సుఖ స్వరూపమని చెప్పటం కూడా కేవలం కల్పితమేయవుతుంది.

వివరణ : ఆత్మ సుఖదుఃఖాలకతీతమైన వస్తువు. అలాంటప్పుడు ఆత్మని సుఖ స్వరూపమని చెప్పడం కంటే "సుఖాతీతమనటమే సరియైనదని శ్రీభగవానుల మాట.

947. "తాను పైన చెప్పినటువంటి సుఖాతీత ఆత్మయే" అని విచారణతో పరిశీలించి ఆత్మని అపరోక్షంగా అనుభవించి ఎఱిగిన తర్వాత, ఆ జ్ఞాని అసత్యమైన ఇంద్రియ సుఖాలలో దేనిని ఎవరికొరకు ఎవరు అనుభవించాలని కోరుకుంటాడు? (అంటే తనకంటే వేరుగా ఇతరులో, ఇతర సుఖాలో లేనందువలన కోరికలు లేనివాడని భావం)

948. (అజ్ఞాన)జన్యమైన కర్తృత్వ బుద్ధి నశించిన జ్ఞానికి “ఇది చేయాలి” అనే కర్మ విధులేవి లేవు. అయితే జ్ఞానులు కూడా ఆయా కర్మలు చేస్తారని వేదాలలో కర్మకాండనుగూర్చి చెప్పటంలోని ఉద్దేశ్యం ఏమంటే ఇతరులు ఆచరించే వైదిక ధర్మాన్ని కాపాడటం కొరకే. అంతేగాని జ్ఞానులు ఆచరించాలని కాదు.

949. అహంకారం నశించిన జ్ఞానులకు అంతకంటె పొందదగిన లాభమేమేదీలేదు. ఇక వారు చేయవలసిన దేదీ లేదు. అందువల్ల వారు కృతకృత్యులైన వారే.

వివరణ : ఉపదేశసారం 15వ శ్లోకార్థాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి.

శ్రీ మురుగనార్ చెప్పినది: నిరహంకార స్థితియే శుద్ధమౌనం. ఆనందాతీతమన్నా, తురీయాతీతమన్నా అదియే. దానిని పొందినవారే కృతకృత్యులని భావం.

950. స్వస్వరూపమైన సదాశివ స్థితిలో ఏ ప్రయత్నములేకుండా అణగి ఉంటే, జ్ఞాని అయినవాడు, ఇక చేయవలసినదేదీ లేదు. అతడు కృతకృత్యుడు. శాంతి మయుడు. ఆనందమగ్నుడు.

951. పరిపూర్ణమైనటువంటి ఆత్మానుభూతినొందిన ఆ మహాత్ములు తమకన్యంగా దేనినైనా తెలిసికొంటారా? వారి బ్రహ్మానందానుభవాన్ని మోహభరితము ఖండమూ అయిన మనస్సు చేత కొలవగలమా! (కొలువలేమని తెలుసుకో).

వివరణ : ఉన్నది నలుబదిలోని 31వ పద్య భావాన్ని ఇక్కడ అన్వయించు కోవాలి.

## 14. దుఃఖ రాహిత్యం

952. అందరిలోను వారివారి నిజస్థితిగా వెలిగే హృదయమే నిజమైన ఆనంద సాగరము. కనుక దుఃఖమంటే ఆకాశంలో నీలి రంగువలె కేవలం కల్పితంగా గోచరిస్తున్నదే తప్ప నిజానికి అది లేనటువంటిదే.

వివరణ : సత్యంగా ఉన్నది మన సహజ ఆనందమొక్కటే. దుఃఖం అని ఒకటి లేనే లేదు. అహంకారం యొక్క దోష దృష్టిలో "సుఖదుఃఖాలు" అనే ద్వంద్వాలు కల్పించబడ్డాయి. అహంకారం ఎంత నిజమో దుఃఖం కూడా అంతే నిజం. రంగులేని ఆకాశంలో నీలి రంగు కనబడుతున్నట్లు, జీవుని దోష దృష్టిలో కనబడే దుఃఖం కూడా ఒక మిథ్యా దృశ్యమే యని ఇచ్చట ఉపదేశించారు.

953. అజ్ఞాన మోహాంధకారాన్ని చూడని జ్ఞానరవి అయిన మన ఉనికి ఆనంద రూపంగా వెలుగుతోంది. అసత్యమైన (నేను దేహము అనే) అహంకారం వల్ల దుఃఖం కల్గుతోందేగాని, దుఃఖం ఎవ్వరూ నిజంగా పొందటం లేదు.

వివరణ : భోజనం చేసి సుఖంగా నిద్రపోయే వాడు స్వప్నంలో తాను ఎక్కడెక్కడో తిరిగి ఆకలితో అలసిపోయినట్లు చూస్తాడు. అయితే మెలకువ రాగానే తాను అనుభవించిన ఆకలి బాధలు నిజంగా లేకుండా పోయినవే కదా. ఉన్నది నలుబది అనుబంధం 30వ పద్యభావంలోని ఉపమానాన్ని ఇక్కడ అన్వయించకోవలెను. దుఃఖం నిజంకాదని ఇక్కడ ఉపదేశం. జీవితంలో కల్గే దుఃఖాల వలన మనస్సు విరిగిపోయి సాధన నుండి జారిపోకుండా తితిక్షను పెంచుకోటానికే అధ్యాయంలోని పద్యాలు కూడా దుఃఖరాహిత్యాన్ని వివరిస్తున్నాయి.

954. ఆనంద రూపమైన ఆత్మ స్వరూపాన్ని పరిశీలిస్తే, అక్కడ దుఃఖమంటూ ఏదీ లేదని తెలుస్తుంది. జడ శరీరంపై “నేను ఇది" అనిదేహాత్మ బుద్ధి కలిగి యుండుటచేతనే దుఃఖాన్ని పొందుతున్నాము. మనం కానిదాన్ని మనమని అనుకోవటం వలనే ఈ విధంగా దుఃఖపడుతున్నాము.

955. “నేను అద్వితీయుడను, ఏకాత్మ స్వరూపుడను" అని తెలిసికోలేని వాడు అనవసరంగా భయపడి ఎల్లప్పుడూ దుఃఖిస్తుంటాడు. (దుఃఖానికి) మూలకారణమైన “దేహమే నేను" అనే అహంభావాన్ని నశింపజేసి స్వభావమైన ఆత్మజ్ఞానంతో అద్వితీయస్థితిలో నుండువుగాక!

956. ఆత్మ జ్ఞానమే సద్గతియని ఆశ్రయించి పొందితే అజ్ఞానం వలన కలిగే జన్మదుఃఖం తొలగిపోతుంది. అసలు దుఃఖమే జనించదు.

## 15. సుషుప్తి యొక్క వ్యాపకత్వం

957. సుషుప్తి యింకా స్వప్నంలోకి వ్యాపించలేదని మనస్సును కలత చెందనీయవద్దు. జాగ్రదవస్థలో విచారణ ద్వారా మనస్సు అణగి, సుషుప్తి లభ్యమైతే, కలలోకూడా అది సిద్ధిస్తుంది. (ప్రత్యేక ప్రయత్నం అక్కరలేదని భావం.)

958. మెలకువలో సుషుప్తిని (జాగ్రత్ సుషుప్తి అనే తురీయమును) పొందేవరకు తాను ఎవరు అనే ఆత్మ విచారణని వదల కూడదు. అంతేకాదు, కలలో కూడా సుషుప్తి అవస్థను పొందే వరకు మెలకువలో ఆత్మ విచారణ చేయటం ఎంతో అవసరం.

### భగవాన్ - 19

సదా "నేను ఎవడను?" అనే ఆత్మ విచారణ చేయుట వలన మెలకువలో సుషుప్తి సిద్ధిస్తుంది. కనుక మెలకువలోను స్వప్నంలోనూ సుషుప్తి నిండి ప్రకాశించే వరకు నిత్యమూ ఆత్మ విచారణనే సాగించు!

## 16. జాగ్రత్ సుషుప్తి

959. జగన్మాయలోపడి దుఃఖములనెడి పదునైన బాణాలతో మనస్సు గాయపడి, దుఃఖిస్తూ బ్రహ్మానందం కోసం అల్లాడి తిరిగే ముముక్షువు లారా! ఎఱుకతో కూడిన నిద్ర ఐన జాగ్రత్సుషుప్తే పరమ సుఖం.

960. పంచేంద్రియములచే వంచింపబడక హృదయ కమలంలో నెలకొని ఉండి, నిద్రకాని నిద్ర అయిన జాగ్రత్ సుషుప్తిలో ఉండే విద్వాంసులు మాత్రమే మోక్షదృష్టి కలిగినవారు. ఇతరులందరు జగద్వ్యాపారమనెడి గాడాంధకారంలో నిద్రావశులైనవారే.

## 17. అద్వైత జ్ఞానం

961. "నేను" అనే అహంకారం శివునిలో లీనమై నశింపగా శివభక్తి జ్వాల ఆత్మానుభవంగా ప్రకాశిస్తుంది. “శివోహం” అనేడి అద్వైత సిద్ధి అదే. వివరణ : అహంత నశించేందుకు ఆత్మ విచారణయే సాధనమగుట చేత 'శివోహం

శివోహం' అని జపించటం లేదా ధ్యానించటం ఆ స్థితికి చేర్చే అభ్యాసం కాదు అని గ్రహించవలసినదని భావం.

962. మనోమాలిన్యాలు పోయేటట్టు “నేనెవరు?” అనే ఆత్మ విచార మొనర్చి హృదయమనే చెకుముకిరాయిపై మనస్సును సానబెట్టాలి. అట్టి నిరంతర ఆత్మావలోకనంతో విచారాగ్ని పుడుతుంది. ఆ విచారాగ్ని వలన కలిగిన ప్రకాశమే మహమ్మదీయ మతంలోని మహావాక్యమైన “అన్ అల్ హక్ - నేను ఆ పరావస్తువే" అనే జ్ఞానమవుతుంది.

వివరణ : ఈ గ్రంథంలోని 341, 663వ వచనములను చూడవలెను.

963. అద్వైత జ్ఞాన నిష్టయే నిజమైన ధీరత్వం అనిపించుకుంటుంది. మిథ్యయైన ఈ ద్వైత ప్రపంచంలో ఎందరి శత్రువులపై తమ శక్తిని చూపినా, ఎందరిని జయించి తమ వశం చేసుకున్నా అదంతా వారి మనస్సులో చోటు చేసుకున్న భయం వల్లనే అని గ్రహించు.

వివరణ : అద్వైతానుభవం గల జ్ఞానులకు అన్యమేలేదు. కనుక భయం లేదు. అందుచేత వారే నిజమైన మగసిరికల ధీరులు.

964. దట్టంగా అలముకొన్న మోహమే అహంకారం. దానిచేత కల్పించబడిన భేదాలన్నీ నశిస్తే అది అద్వైత స్థితి. కేవలం ఆత్మదర్శనం. అదే విభేదాలన్నింటినీ అధిగమించిన మౌనానుగ్రహం. జ్ఞానస్థితి. మహాత్ములకు అది అనుభవ గమ్యమైన పరమపదము.

## 18. దైవానుగ్రహం

965. నీవు దైవం వైపు ఒక అడుగువేస్తే, కన్నతల్లికంటే గొప్ప కరుణగలవాడైన దైవమూ నీవైపు తొమ్మిదడుగులు వేసి నిన్ను తన రక్షణలోనికి తీసుకుంటాడు. సద్గురువు రూపంలో మనలని అనుగహించిన భగవంతుని కరుణ అంత గొప్పది.

966. ఒక్కొక్కరిలోను ఆత్మగా “ఉన్నాను” అని స్ఫురించే చిత్ప్రకాశమే భగవత్స్వరూప మంటారు. ఉప్పొంగే ప్రేమతో హృదయమైన ఆత్మను అనగా భగవంతుణ్ణి ధ్యానించకపోతే ఆ దోషం భగవంతుని దెలా అవుతుంది? భగవంతుణ్ణి ధ్యానించని వారిదే అవుతుంది.

967. మనస్సు అంతర్ముఖమై, దేహమే నేనను అహంభావం నశించగా, "నేను నేను" అని అఖండంగా వెలిగే సత్పదార్థమే మన ఆత్మ స్వరూపము. అదే భగవంతుని దివ్యానుగ్రహము. గుణాతీతమై మనోతీతమైనదైనా ఆ సద్వస్తువు కరుణతో భక్తులను తరింపజేసే నిమిత్తం సద్గురు రూపంలో అవతరిస్తుంది.

వివరణ : భగవంతుడు, గురువు, అనుగ్రహం, ఆత్మ ఇవన్నీ సత్యం యొక్క వివిధ రూపాలు.

968. దైవానుగ్రహ రూపమయిన ఆత్మానుభవం గల భక్తుల మనసు శుద్ధ సద్రూపంగా వెలుగొందుతుంది. ఇంతవరకు భ్రాంతికి కారణమైన చిజ్జడ గ్రంథి అనగా అహంకారం ఇక తలెత్తదు. హృదయంలో అణగినశిస్తుంది.

969. నిత్యం ఉప్పొంగి ప్రవహిస్తున్న భగవదనుగ్రహమనే అమృత జలాలలో జీవులందరూ సహజంగా మునిగే ఉన్నారు. అయినా వారు మాయకులోనై దుఃఖిస్తున్నారు. పొంగి ప్రవహిస్తున్న గంగానది మధ్యలో నిలబడి తనదాహాన్ని తీర్చుకోవడం ఎలాగో తెలియక పరితపించే మూర్ఖుని వంటిదే ఇది.

970. జీవులందరి యెడల అనుగ్రహ దృష్టిగల ఆ సర్వేశ్వరుడు చెడ్డవారిని మాత్రం అనుగ్రహించక ఎందుకు తృణీకరిస్తాడు? కనబడే వస్తు జాలమునకు అభిన్నమై అంతటా నిండి ప్రకాశించే భగవంతుని అనుగ్రహ వీక్షణాలు అన్నింటిపైనీ సమానంగా ప్రసరిస్తూనే ఉంటాయి. భగవంతుడికి అనుగ్రహం లేదని ఎవరికయినా అనిపిస్తే, అందుకు కారణం వారి చిత్తభ్రాంతియే. అట్టివారు రేచీకటి ఉన్న వారి లాంటివారు.

## 19. సచ్చిదానందం

971. అన్యములను తెలుసుకొనే మోహరూపమైన మనస్సుని బాహ్య విషయాలందు ప్రసరించనీయక, ఉన్నాను అనే హృదయాన్ని ఆశ్రయించి అంతర్ముఖుడైతే ఆ సచ్చిదానందం నిత్యసిద్ధంగా అనుభవమవుతుంది.

972. చిత్స్వరూపమైన చిత్తం వృత్తిరూప చలనం లేక కదలిక ఉన్నట్లయితే తాను ఉనికియే అని ఎఱుగుతుంది. ఇలా సత్త్వము చిత్త్వముతో మిళితమైతే ఆనందమవుతుంది. ఆ ఆనందం సచ్చిత్స్వరూపమైన తాను తప్ప మరెవరు?

వివరణ : తనని సత్తు అని తెలుసుకొవటమే బ్రహ్మానందం. ఆత్మయైన తనని శరీరమనుకొనే మోహబుద్ధియే చిత్తం. ఈ మిథ్యాభావనలోనే దుఃఖం కనిపిస్తోంది. ఇట్లుగాకుండా తనను ఆత్మయని తెలుసుకుంటున్నప్పుడు చిత్తమనే చలనరూపం పోయి చిద్రూపము నొందుటచేత అది తననే సత్తుగా తెలిసికొంటున్నది. ఈ సత్్చిత్తల ఐక్యమే ఆనంద మయమగుటచేత, దుఃఖము అంటూ ఎప్పుడూ లేకుండా తానే సత్తు, చిత్తు ఆనందం అనే సత్యం గోచరిస్తుందని ఉపదేశం.

973. చిత్ అయిన ఆత్మకి, జడమైన శరీరానికి వేయబడిన అసత్యపు ముడి జీవుడనే అవిద్య. జడశరీరాన్ని "నేను" అనే అభిమానాన్ని వదిలేస్తే (అంటేనశిస్తే) చిత్స్వరూపమే కేవల సత్ మాత్రంగా, తానుగా, మిగిలి ఉంటుంది. అందుచేత ఆనందం కూడా ఎప్పుడూ తానేఅవుతుంది.

974. అప్రమత్తతో కూడిన స్వరూప జ్ఞానమే నిజమైన భక్తిమార్గం లేక ప్రేమమార్గం. అద్వయ బ్రహ్మానంద రూపమయిన ఆ స్వస్వరూప జ్ఞానమే ప్రేమతత్త్వంగా ప్రకటితమవుతుంది.

వివరణ : సత్తు, చిత్తు, ఆనందం ఇవి మూడు కావు. ఒక వస్తువే. తన ఉనికిని (సత్) తెలిసికొనుటయే (చిత్) సుఖం (ఆనందం) అని మనం తెలుసుకోవాలి. 979వ వచన భావాన్ని కూడా ఇక్కడ ఒకసారి జ్ఞాపకం చేసుకోవాలి.

975. నశ్వరమైన మృణ్మమయ శరీరమే "నేను" అనే అభిమానం కారణంగా అహంకారం కారణంగా ఈ లోకాలన్నీ శాశ్వతమైనవిగా సత్యమయినవిగా కన్పిస్తున్నాయి. అహంకారం నశిస్తే ఆత్మశ్లేషించి ఉంటుంది. అప్పుడు నామరూపమయ జగత్తు యావత్తూ, పరిచ్ఛిన్నముగా తోచే సత్తామాత్రముగా సాక్షాత్కరిస్తుంది.

వివరణ : అహంకారం సత్తుకాదు. కనుక నామరూపాలు నిజం కావు ఆత్మయే సత్తు. ప్రపంచం కూడా ఆత్మగా సత్యమని తోస్తుంది.

976. జీవులు చైతన్య స్వరూపులుగా గోచరించటానికి కారణం అవిద్యారూపమైన అహంకార పిశాచమే. ఆ అహంకారం నశిస్తే ఆత్మ శేషించి ఉంటుంది. అప్పుడు ఆ ఆత్మ దృశ్య మాత్రులయిన జీవుల ఎఱుకకు ఎఱుకగా చిదాకారముగా సాక్షాత్కరిస్తుంది.

977. సుఖరహితమై వేదనా స్వరూపమైన అహంకారం కారణంగానే ఇంద్రియ విషయములు సుఖదాయకములుగా గోచరిస్తున్నాయి. అహంకారం నశిస్తే ఆత్మ శేషించి ఉంటుంది. అప్పుడు ఆ ఆత్మ సకల భౌతిక సుఖాల కాధారమైన ఆనంద స్వరూపంగా సాక్షాత్కరిస్తుంది.

వివరణ : 975, 976, 977 వచనములను కలిపి చదువుకోవాలి.

978. "సుఖస్వరూపమైన పరబ్రహ్మమే మనం అయినట్లయితే సుఖాన్ని అనుభవించే భావన మనకు కలుగదు. (కనుక మనం పంచదార వలె మారక దానిని రుచిచూసే చీమవలె ద్వైతంగానే వుండాలి)" అని చెప్పే వారు, పంచదార ఎట్లు తన రుచిని తాను ఎరుగలేని జడ పదార్థమో అట్లాగే ఆనందస్వరూపమైన బ్రహ్మము కూడా జడ వస్తువేయని తర్కింప జూచేవారే.

వివరణ : పంచదార జడ పదార్థం. చీమ దానిని అనుభవించే బుద్ధి కలగినది. అయితే బ్రహ్మం ఇటువంటిది కాదు. సత్తు అయిన అదే తనను తెలిసికొనే చిత్తు అవుతుంది. ఆ చిత్స్వభావమైన ఆనందమూ అదే కనుక బ్రహ్మానందాన్ని తెలిసికొని అనుభవించటానికి బ్రహ్మమునకు అన్యంగా ఒక చిద్వస్తువు అవసరంలేదు.

ఆనందమూ, ఆ ఆనందాన్ని తెలుసుకొనే బుద్ధి, ఈ రెండూ తానే అయిన ఆత్మని జడపదార్థమైన పంచదారతో పోల్చటం తెలివితక్కువతనము.

979. ద్రవత్వం, తియ్యదనం, చల్లదనం ఈ మూడు గుణాలు కల్గిన నీరు ఎట్లు ఒకే వస్తువో, అట్లాగే బ్రహ్మమును గూర్చి, సత్ చిత్ ఆనందం అని మూడు అంశాల వలె చెప్పినా, అనుభవంతో తెలిసికొంటే ఆ మూడు (మనమైన ఆత్మ) ఒక వస్తువే.

## 20. ఉనికి(BE-ing)

980. మన సహజస్థితి ఉనికి. ఆ ఉనికి ఒక్కటి తప్ప ఇతరములన్నీ కల్పితములే. అసత్యములే. ఉనికి లేని (అసత్తు)వన్నీ అనిత్యాలు. కానీ మన ఉనికి మాత్రం నిత్యము.

వివరణ : ఇక్కడ తెల్పిన ఉనికి అంటే శరీరం, మనస్సు కానటువంటి మన ఎరుకయే అని గ్రహించాలి. నిద్ర, మరణం ప్రళయం వంటివన్నీ అసత్యమై మరుగైపోయినా, అవినాశి యైనటువంటి ఉనికిగా ప్రకాశించే బ్రహ్మముమాత్రమే అని అభిప్రాయం.

981. ప్రజ్ఞారూపంలో వుండే మనం లేకుండా ఉండము. ఇతర వస్తువులను తెలిసికొనే సాపేక్ష జ్ఞానం (Relative Knowledge) అంతమైతే, అంటే శుద్ధజ్ఞానమైన (ఉన్నాను అనే) స్పురణలో అసత్యంగా గోచరించు ద్వైతమంతా అణగితే, ప్రజ్ఞారూపంలో నున్న మనకు నాశమే లేదు అని తెలుస్తుంది.

982. సత్యమే పరమాత్మ స్వరూపం. ఆ స్వరూపంలో కేవలం కల్పితంగా "నేను ఇది" అని చెప్పే అహంభావం తలెత్తుతుంది. దానివల్ల స్వరూప విస్మృతి ఏర్పడుతుంది. అట్టి అజ్ఞానులకు పరిపూర్ణ ఆత్మస్వరూపం శూన్యమనిపిస్తుంది.

వివరణ : శ్రీ మురుగనార్ తెల్పినది: "నేను" అనే తలపే అహంభావం. అది తలెత్తటమే దేహాత్మ బుద్ధి. దానితో బంధం ఏర్పడుతుంది. స్వరూప విస్మృతి కలుగుతుంది. అజ్ఞానం జనిస్తోంది. అదే నిజంగా బ్రహ్మహత్యా దోషమని తెలుసుకోవాలి. ఇట్లాగ ప్రమాదంలోపడి కొట్టుకుంటున్న బద్ధులకు అనగా జీవులకు పూర్ణస్థితి గ్రహింపరానిదై శూన్యంవలె గోచరిస్తుంది.

983. బహిర్విషయములను తెలుసుకొనే జీవుడననే భ్రాంతికి లోనుకానివాడు, తన నిజస్థితి పరమాత్మ స్వరూపమే అని తెలుసుకున్నవాడు అష్టసిద్ధులపై వ్యామోహము వీడి సంపూర్ణ ఆత్మశాంతిని పొందును.

984. సద్వస్తువైన తన ఉనికిని ఆశ్రయించిన ఆత్మనిష్ఠుని మనస్సు చెదరదు, అధైర్యం ఉండదు.

వివరణ : భయం, అన్యవస్తువొక్కటి ఉన్నంత వరకే కలుగుతుంది. ఉన్న వస్తువు తాను మాత్రమే అనే అనుభవానికి పుష్టిచేకూరిన ధీరుడే నిష్ఠాబలం కలవాడవుతాడు. ద్వైత శూన్యమైన దృష్టికల వానికి భయం ఉండదు. సందేహం ఉండదు అని ఉపదేశం.

## 21. అంతా బ్రహ్మమే

985. ఆత్మస్వరూపం (మనస్వరూపం) సత్యజ్ఞానాత్మకము. అందులో మనోబుద్ధులనెడి మిథ్యా దృశ్యాలు ప్రతిబింబించి ద్వంద్వాలు త్రిపుటులూ ఏర్పడుతున్నాయి. వీనితో కూడిన ఈ జగద్దృశ్యం యావత్తూ తన్ను తానేఱిగి స్వస్థితుడై అద్వయుడై ఉన్న జ్ఞాని దృష్టిలో ఆత్మయే. తానే.

986. స్వస్థితుడై ఉన్న తాను తప్ప రెండవ వస్తువులేదు. ఉంటే అది తాను కాదు. ఉన్నది ఏదో అదొక్కటే సచ్చిత్తు. పరవస్తువు. ఆ పరశివస్థితిలో గోచరించేదంతా పరబ్రహ్మమే. వేరుకాదు.

987. సత్యమైనా సరే, అసత్యమైనా సరే, నేర్చుకోవలసిన విద్యలైనాసరే, లేదా అవిద్యయైనా సరే, మనస్సుకు ప్రియమైనవైనా సరే; అప్రియాలైనా సరే: అంతా బ్రహ్మమే; వేరుకాదు.

988. శ్రద్ధ అశ్రద్ధ; తలపు, తలపులేమి; ఇష్టానిష్టాలు, జ్ఞానం అజ్ఞానం: ఉచ్చ నీచాలు; నిందాస్తుతులైనా అన్నీ బ్రహ్మమే, వేరుకాదు.

వివరణ : ఈ ప్రకరణంలోని నాలుగు పద్యభావాలు బ్రహ్మ స్వరూపంయొక్క ఏకత్వాన్ని దృఢపరిచాయి. ఉన్నవి ద్వంద్వాలు కావు. ఏకాత్మ బ్రహ్మమొక్కటే ఉన్నదని భావించాలే తప్ప లేని దానిని గురించి చెప్పారనో, వానిలో భ్రాంతి చెందితే తప్పేమీ లేదనో చెప్పారని మాత్రం అనుకోకూడదు.

## 22. సామరస్యం

989. మౌనమే జ్ఞానపరమావధి. మౌనమే వేదాంత ధర్మం. అన్ని మతాలు ఆ మౌనానికి మార్గాలుగా ఉన్నాయి. అద్వైత సిద్ధికి తోడ్పడుతున్నాయి. అందుచేత వేదాంతానికీ ఆయా మతాలకూ కొంచమైన విరోధం లేదు.

990. సంకుచిత బుద్ధులై క్రోధావేశంలో ఎవరైనా (ప్రస్తుతమున్న మతాలు వదలి) మరొక క్రొత్త మతం స్థాపిస్తే ఆ మతం కూడా ఆఖండ జ్ఞానరూపంగా వెలుగొందే ఆ బ్రహ్మమునకు చెందినదే అవుతుంది.

991. నీకు ఏ మతం మీద నమ్మకమున్నా సరే. ఆ సొంత మతంపై గల అభిమానంచేత ఇతర మతాలను ఎదిరించి వాదించడానికి బహిర్ముఖుడవుకాకుండా అంతర్ముఖుడవై నీ మతాన్ని నిజమైన ప్రేమతో ఆదరించి ఆరాధించు.

992. ద్వైతం, విశిష్టాద్వైతం, శుద్ధాద్వైతం మొదలైన మతాల గురించి పలురకాలుగా వాదించకుండా, భగవంతుని స్మరించి ఉపాసించి ఆయన అనుగ్రహంతో జ్ఞానాన్ని పొందటమే శ్రేష్ఠము.

993. 'మనస్సు' అని ఒకటి ఉన్నంతవరకే "మతం" కూడా ఉంటుంది. ఆ మనస్సే తాను “ఎవరు?" అని అన్వేషిస్తే లోదృష్టి గని హృదయంలో అణగుతుంది. శాంతి రూపమైన ఆ మహామౌన స్థితిలో “మతం” అంటూ ఒకటి పుట్టదు.

## 23. శైశవత్వం (శిశు సహజమైన అమాయకత్వము)

994. కోటానుకోట్ల మానవులలో అహంత అణగి మనోవ్యాపారములుడిగి జ్ఞానులు పసిబాలురవలె జీవిస్తారు. భగవంతుడు వారిని నిరంతరం మాతాపితరుల మాదిరిగా కరుణతో కాపాడుతుంటాడు.

995. ఎటువంటి మనోవికారాలు లేని పరిశుద్ధమైనటువంటి మహాత్ములే భాగ్యశాలురు. వారు తల్లివంటి భగవంతుని ఒడిని వీడకుండా ఎల్లప్పుడూ రమించి ఆనందిస్తారు.

## 24. ఆత్మతో ఐక్యం

996. “నేను ఇది, నేను అది" అనే అహంత నశింపగా, సచ్చిదాకాశ రూపుడైన ఆత్మనాధునితో కూడి, అనన్యముగా అనుభవించే బ్రహ్మైక్యస్థితియే శివభక్తి మహాత్మ్యం. (జీవునికి భగవంతునిపై గల మధుర భక్తి అనే పాతివ్రత్యమహిమ).

వివరణ : ఈ వచనంతో ఈ గ్రంథంలోని 73వ వచనాన్ని కూడా అన్వయించుకోవాలి.

997. నేను (జీవాత్మ) అని, అతను (పరమాత్మ) అనే రెండూ లేకుండా ఏకమై రమించే ఆ మౌనంలో మాటలతో పనేమిటి? (లేదని భావం). నేను అనే అహంభావం తెగిపోయి, జ్ఞాన సముద్రంలో జ్ఞాననది విలీనమైన ఆస్థితిని వర్ణించటానికి మాటలు పనికొస్తాయా? (పనికిరావు. మాటలకతీతమైనదని భావం)

998. ఆత్మలో రమించు అనుభవం పొందినటువంటి జ్ఞానుల ఆనందస్థితిని దానిని అనుభవించిన వారే తెలిసికోగలరు. అనుభవించని వారు ఎట్లాగ తెలిసికోగలరు? తేనెను త్రాగిన తేనెటీగ అందులోనే మత్తుగా పడివుంటున్నట్లు, ఆత్మానందంపొందిన వారి స్థితి, తాను తప్ప అన్యవస్తువులేని ఏకమైయుండే స్థితే.

999. ఆత్మానుభవం పొందినవారే ఆ సుఖాన్ని అనుభవించగలరు. కాని వారు దేహాత్మ బుద్ధి నశించి ఆ ఆనందాతీత మౌనాన్ని సాధించిన విధానమేమిటో వారికి తెలియదు.

## 25. చిత్ప్రకాశం

1000. అహంకారము యొక్క సాపేక్ష జ్ఞానంతో (Relative Knowledge) ఈ లోకాన్ని తనకి అన్యమైన ఒకవస్తువుగా చూస్తున్నప్పుడు, చూచే ఆ బుద్ధి కూడా జడమే. అహంకారం నశిస్తే ఆ అహంకారానికి మూలమైన చిత్ప్రకాశ స్వరూపం స్వయముగా అనుభవమవుతుంది.

1001. సత్తు అయిన వస్తువేదో అదే దానిని తెలిసికొనే చిత్తు కూడాను. కనుక చిత్తం తన ఉపాధిని వీడి కేవలం చిన్మాత్రమైతేనే తప్ప శ్రేష్ఠమైన చిదాభాస మాత్రమగు బుద్ధి అద్వైత స్థితిని తెలుసుకోలేదు.

1002. తూర్పున సూర్యుడుదయించే వరకే లోకంలో చంద్రుని కాంతిని మెచ్చుకోవచ్చును. అహంకారం అంతమై ఆత్మజ్ఞానోదయం అయ్యేవరకే జీవుని అనగా మనస్సు యొక్క గొప్పదనం మెచ్చుకోతగ్గదిగా ఉంటుంది.

1003. చిదాకాశ రూపమైన జ్ఞానుల హృదయంలో ఉదయాస్తమయములు లేని సూర్యునివలె ఆత్మ ప్రకాశిస్తుంటుంది. అట్టి వారి మనస్సు పగటి చంద్రునివలె నిరుపయోగంగా ఉంటుంది.

1004. అద్దములో ప్రతిబింబించే రవికిరణ కాంతి సమమైన మనస్సే ఈ మాయామయ నామరూపమయ ప్రపంచ దృశ్యమును ప్రతిబింబింప జేస్తోంది. ఆత్మజ్యోతి సూర్యునివలె స్వయం ప్రకాశకమైనట్టిది.

(అంటే ఆత్మ ప్రకాశము ముందు ప్రాపంచిక నామరూపాలు అసత్యమైనవని భావం)

## 26. అనంత చైతన్యం-బ్రహ్మం

1005. అక్కడ అన్యము కన్పించదు. అన్యము వినిపించదు. అన్యము తెలియదు. అదే భూమ విద్య. అదే అనంత చిచ్ఛక్తి.

("యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా అని శ్రుతివాక్కు :- మురుగనార్)

1006 చూడబడే వస్తువులు, వినబడే విషయవస్తువులూ (అంటే పంచేంద్రియాలకి అనుభవమయ్యే దృశ్యమంతా), వాటిని గ్రహించే అహంత దేనియందు అణగి నశించిపోతున్నాయో, ఆ అద్వితీయ, అనంత, జ్ఞానరూప బ్రహ్మమే పరమానందము.

## 27. జ్ఞానాకాశం

1007. ప్రపంచ మంతటా అక్కడక్కడ ఉన్న మహాత్ములను దర్శించి ప్రణామాలర్పించి అత్యంత భక్తితో వినయంతో సత్యమును గూర్చి తెలుసుకొనగోరు ముముక్షువులారా! ఆ మహాత్ములు ఉపదేశించేది చిదాకాశ స్వరూపానుభవమును గురించే. (ఉన్నాను అనే సద్రూపజ్ఞానమే వారి అనుభవం అనిభావం)

1008. ప్రపంచమంతా పరుగులు తీసి వెదకి వెదకి సమీపించిన శిష్యులకు సద్గురువు చూపించే పరమావధి ఉనికి అనే ఆ అద్భుత చిదాకాశతత్త్వమే.

1009. ఎక్కడెక్కడో వెదకి వేసారిన పిదప కష్టములన్నీ గట్టెక్కున్నట్లుగా మనకు లభించే ఆశ్రయస్థానం, నాశరహిత స్థితి ఏదంటే, సత్యజ్ఞానంగా ప్రకాశిస్తున్న శివస్వరూపుడగు జ్ఞాన గురువు చూపించే అద్భుత తురీయ స్థితియైన చిదాకాశమే.

1010. పాము తన కుబుసాన్ని వదలేస్తున్నట్లు అసంఖ్యాకమైన సంకల్పాలన్నిటినీ త్రెంచి వేయగలది స్థిరమైన ఆత్మ నిష్ఠ. ఆ నిష్ఠలో చివరి వరకూ ప్రయత్నించినట్లయితే, అనుభవమయ్యేది ఏది? జ్ఞానమాత్రమైన చిదాకాశమే.

1011. అజ్ఞానానికి మూలకారణమైన చిదాభాస జీవుడు జ్ఞానాగ్నిలో సమూలంగా దగ్ధమైతే, ఆ కాలిన స్మశానమనే చిదాకాశమునందంతటా వ్యాపించి ఉండే చిజ్జ్యోతి కార్చిచ్చుతో సమానముగా ఉంటుంది.

1012. “దేహమే నేను” అనే అవిద్య నశించగా తాను మిగులుతుంది. అది ఆత్మరూపమైన మౌనస్థితి. మనం పొందదగిన మహద్భాగ్యమదే. “ఎందువల్ల అట్లాగ?” అని ప్రశ్నిస్తే ఆపరమౌనస్థితి దుఃఖ రహితమైనట్టిది. కామనాశూన్యమైనట్టిది. అది కేవలం చిదాకాశమే అని తెలుసుకో.

1013. అహంకార దోషమును సమూలంగా నిర్మూలించగలిగేది సద్గురు వొక్కడే. అట్టి సద్గురుని అనుగ్రహ విశేషం చేత మాత్రమే అనన్యమై వెలిగే సచ్చిదాకాశ మహిమను గ్రహించటం సాధ్యమవుతుంది. మరోవిధంగా అది సాధ్యంకాదు.

1014. ఆ జ్ఞానాకాశ మహిమను దర్శించినవారు అహంకార శూన్యులై ఉంటారు. మమకార రహితులై ఉంటారు. వారికి ఈ దేహము ఈ లోకము ఈ దృశ్యమాన వస్తుజాలమంతటి పట్ల నాది అనే భావం ఉండదు. జన్మపరంపర వల్ల కలిగే దుఃఖం ఉండదు. వారు మౌనముద్ర వహించిన శివస్వరూపులై పరమానందాకారులై వెలుగుతుంటారు.

1015. పంచేంద్రియములు శబ్ద స్పర్శరూప రస గంధాత్మకములు. లోకములన్నీ పంచేంద్రియ విషయములు. లోకములను సృష్టించేది పరాశక్తి. పరాశక్తికి కారణభూతమైనది ఈచిదాకాశమే.

వివరణ : పైన యిచ్చిన 1007 నుండి 1015 వచనములన్నీ చిదాకాశ మహిమను గూర్చి చెప్పటానికే అని తెలుసుకోవాలి.

మోక్షమైన జ్ఞాన లాభానికి అర్హత ఏమంటే మనస్సు పోయి, అంతర్ముఖమై తన ఉనికిలో ఉండటమే దానికి అర్హత. దీనిని ఉపదేశించటానికి ఈ జ్ఞానాకాశం గురించి వివరించారు. దీనినుద్దేశించే శ్రీ భగవాన్ ఒకసారి "ఇక్కడకు వచ్చే వారందరు తాము కేవలం మోక్షం కోసమే వచ్చినట్లు చెప్పుకుంటారు! అయితే మోక్షానుభవాన్ని మచ్చుకి లేశమాత్రము రుచి చూపించినా చాలు: ఇక్కడ ఎవ్వరూ ఉండకుండా ఎగిరిపోతారు!!" అని హాస్యోక్తంగా అన్నారు.

## 28. చిదాకాశం

1016. అన్నిటి యందు “నేను నేను” అని స్వయంగా ప్రకాశిస్తున్న జ్ఞానాకాశమైన ఆత్మ (పరబ్రహ్మము) అంతటా ఉంది. దానికై బయట ఎక్కడెక్కడో తిరిగి వెదకుతూండటం దేదీప్యమానంగా ప్రకాశించే సూర్యుణ్ణి పట్టపగలు దీపంతో వెదకటంతో సమానం.

వివరణ : శ్రీ మురుగనార్ తెల్పిన భావం చిదాకాశం - దహరాకాశం, హృదయాకాశం, జ్ఞానాకాశం అన్నీ అదే. అదే ఆత్మ స్వరూపంగా ప్రకాశించు ఈశ్వరుని నిజ స్వరూపం.

1017. “నేను” అనేది మిథ్య. “ఇది”, అని అన్యముగా కనిపించే జగత్తు మిథ్య. ఈ నేను ఈ లోకమును చూడటం మిథ్య. ద్రష్ట, దృక్కు దృశ్యము అనే ఈ మూడింటికీ అనగా త్రిపుటికి ఆధారమైన మాయ (అహంకారం) మిథ్య. జ్ఞానాకాశం ఒక్కటే సత్యము.

1018. లోకాలకన్నింటికీ ఆధారంగా (సినిమాకు తెరవలె) ఉన్న ఆ చిదాకాశం, ఆసద్వస్తువు, ఆ ఉనికి లేనట్లుగాను, పంచేంద్రియ గోచరమగు జగద్దృశ్యము ఉన్నట్లుగాను భ్రాంతి చెందే వారికి పరమసత్యమును గూర్చిన జ్ఞానం లభించటం అసాధ్యం.

1019. నిష్కళంక నిరాటంక చిదాకాశతత్త్వ (జ్ఞాన) మహిమ వాసనారహితులై శివసములై వెలిగే జ్ఞానులకు తప్ప వేరెవరికి సుబోధకమవుతుంది? (ఎవరికీ లభించదని భావం).

## 29. దానిని ఎరుకపరుచుట (జ్ఞాన బోధ)

1020. ఈ సద్రూపమే చిదాకాశం. వర్ణింపనలవిగాని పరమ శివస్వరూపం. ఆత్మస్థితి. దీనిని నేను సైతం గ్రహించునట్లుగా జ్ఞానమూర్తి శ్రీ రమణులు నాకు అనుగ్రహించారు.

1021. ఆత్మ తనపై తానే కరుణ వహించి స్వస్వరూపమైన ఆత్మను ఎఱుక పరచింది. ఆత్మస్వరూపమే అయిన క్షణంలో ఆత్మ స్వరూపమే అయిన స్థలంలో ఆత్మను ఆత్మయే (స్వస్వరూపాన్ని) తెలుసుకొన్నాడు.

వివరణ : జీవుడు ఆత్మని తెలుసుకొనడు. తెలిసికొనలేడు. జీవాత్మ నశించగా ఆత్మయే ఉన్న తనను ఉన్నట్లుగా తెలుసుకొనుచున్నదనే సత్యాన్ని ఇక్కడ వివరించారు.

పై రెండు వచనములలో భగవాన్ శ్రీరమణ మహర్షులు తమకు అనుగ్రహించిన వరమ జ్ఞానసంపదని శ్రీమురుగనార్ చెప్పారు. 1021వ వచనంలో "నేను తెలుసుకున్నాను" అని కూడా చెప్పక, ఆ భావం కూడా అణగి "ఆత్మని ఆత్మయే తెలిసికొన్నాడ"ని చెప్పిన శ్రీమురుగనార్ భక్తిని, వినయాన్ని గ్రహించాలి.

## 30.ఆత్మ

1022. అహంత ప్రపంచాన్ని గోచరింపజేస్తుంది. తాను ఎవరు అని ఎఱుక పరచకుండా మరుగై యుంటుంది. మరుగైయుంటూ ప్రపంచాన్ని గోచరింపజేస్తున్న తన పుట్టుకకు మూలమేదని (ఆత్మ) విచారణ ద్వారా లోనికి మరలితే, ఆ మూలమైన హృదయంలో "నేను నేను" అని స్ఫురిస్తూ ఉంటుంది. అదే ఆత్మ. అవినాశియైన మన నిజస్థితి.

1023. కుత్సితమైన మనసు ఎప్పుడూ బహిర్దృష్టియే. అది ఎదుట కనిపించే జగత్తును మాత్రమే చూస్తుంది. వ్యామోహంతో దాని వెంట పరుగులు తీస్తుంది. అలా చేయకుండా, “దీన్ని చూసి గ్రహించేదెవరు?" అని ఆత్మావలోకమొనర్చాలి. విచారణ చేయాలి. చేసి, స్వస్వరూపంలో నిలవాలి. ఆత్మనిష్ఠలో ఉండాలి. ఇదే అసలు పొందదగిన స్థితి. ఉత్కృష్టమైన స్థితి.

1024. ఆత్మజ్ఞానులైనవారు నాలుగు విధ ఆశ్రమములలో ఏ ఆశ్రమాన్ని అయినా అనుసరించవచ్చును. వారి దేహం ఏ వర్ణములోనైనా పుట్టి ఉండవచ్చు. కాని వారు ఆత్మస్థితులై మాత్రమే ఉంటారు. వర్ణాశ్రమ భేదాలకు అతీతులై ఉంటారు. అదివారి సహజాత్మ స్థితి. సత్స్థితి. ఆయా వర్ణాశ్రమాలు వారి శరీర యాత్రకు ఏర్పడినట్టివి. అవి మిథ్యామాత్రములు. కాదా! చెప్పండి!

1025. ఆత్మస్థితి ఒక్కటే ఆశించతగినట్టిది. అదేనిజమైన ప్రేమ స్వరూపం. సత్యలోకంలోని బ్రహ్మకువలె సమస్త భాగ్యాలున్న ఉత్కృష్ట దశ కూడా ఎండమావిలోని నీటి వంటిదే. అది జీవులను మాయామోహితుల్ని చేసేదే.

1026. ఆత్మ స్వరూపమే అందరికీ సహజ స్థితి. అదే నిజమైన ఆనందం. ఆ సత్యాన్ని గ్రహించలేనివాడు మోహవశుడై మనస్సును అనాత్మ విషయాలలోనికి వెడలనిస్తాడు. వానిలో ఆనందాన్ని వెదకసాగుతాడు. ఇలా చేయటం వల్ల అతడు మార్గచ్యుతుడై ఆత్మసూఖాన్ని కోల్పోతాడు.

1027. ఆత్మ సుఖమొక్కటే మహానందం ఇది తెలిసికొనుట చేత జ్ఞానులు ఆత్మ నిషులై ఉంటారు. ఇది తెలియని వారు లౌకిక సుఖాలకై ప్రాకులాడుతుంటారు. వారు లౌకికులుగానే వుంటారు.

1028. మన యదార్ధ స్వరూపం ఆనందం. అజ్ఞానులు ఇది తెలుసుకొనలేరు. కస్తూరి మృగం తన దగ్గరనుండి వచ్చే సుగంధం వేరెక్కడనుండో వస్తున్నదని భావించి దానికోసం అంతా వెదకి అల్లాడుతుంది. వీరు కూడా అలాగే తిరిగి తిరిగి కలత చెందుతున్నారు. జ్ఞానులకు, ఆత్మ సుఖము తెలుసు. వారు లౌకిక సుఖాల వెంటబడిపోరు.

1029. సుఖమంటే ఆత్మ స్వరూపమే. మరోకటిఏదీ కాదు. ఉన్నది ఆత్మ సుఖమొక్కటే. ఈ సత్యాన్ని గ్రహించి ఆత్మ నిష్ఠుడవై ఆత్మ సుఖాన్ని సదా అనుభవింతువుగాక!

వివరణ : శ్రీ భగవాన్ రచించిన "నేను ఎవరు?" అన్న గ్రంథంలోని భావమే ఈ వచనం.

## 31. ఆత్మ బలం

## భగవాన్ - 20

ఆత్మలో నెలకొన్నవాడు పంచేంద్రియములను జయించి దృఢజ్ఞాన నిష్ఠుడై జ్ఞానాగ్ని రూపుడై ఉంటాడు. అతడే వజ్రాయుధాన్ని దాల్చిన ఇంద్రుడు. అతడే యముణ్ణి హతమార్చిన మహేశ్వరుడు, కాలకాలుడు.

1030. జ్ఞానశక్తి కలవాడు ఆత్మనిష్టలో ఉంటాడు. పంచేంద్రియాలను సమూలంగా నశింపచేస్తాడు. జ్ఞానాంకుశధరుడైన అతడు యముని జయించిన సాక్షాచ్ఛివుడు. అతడే కామక్రోధలోభమోహమద మాత్సర్యాల రూపమైన మనోవికారములను నిర్మూలించగల జ్ఞానసూర్యుడు.

1031. శ్రోత్ర త్వక్ ఛక్షు జిహ్వ ఘ్రాణములు పంచేంద్రియములు. వాని ద్వారా ప్రవర్తించే మనస్సు ఆరవ ఇంద్రియం. ఈ షడింద్రియములు ద్వారా అహంత వ్యవహరిస్తోంది. అహంతయే సూరపద్ముడనే దుష్టరాక్షసుడు. అతడు లెక్కలేని లోకాలను సృష్టించి, వానితో భోగించగల శక్తిశాలి. కాని జ్ఞాని అయినవాడు ఆ అహంకార రాక్షసునిపై ఆగ్రహిస్తాడు. ఎదిరిస్తాడు. అక్కడ వానిని హతమారుస్తాడు. అట్టి జ్ఞాని బ్రహ్మానందదాయకుడైన కుమారస్వామియే అని తెలుసుకో.

## 32. ఆత్మ స్వరూపం

1032. ఒక చిత్రం వలె జడమైన ఈ శరీరాన్నే "నేను" అని అభిమానించి జీవించే లోకుల్లారా! బొమ్మ దేనినైనా తలచగలదా? ఆ శరీరంలో నుండే ప్రాణమే తలపోస్తున్నది. మరచిపోతున్నది కనుక "మనం" అంటే ఆ ప్రాణమే అని తెలుసుకో.

1033. పై పద్య భావంలో చెప్పిన తలపు మరపులతో వ్యవహరించే ప్రాణమే "శరీరమే నేను" అనే రూపంగల జీవుడు. అయితే దేహం నేనుకాదని పై పద్యం ద్వారా నిర్ణయించుటచేత ఆ అహంకారానికి ఒక రూపాన్ని చూడలేక పోతున్నది కదా! కనుక ఇన్నాళ్లు ఆ జీవుణ్ణి తనకు ఆశ్రయంలా (ప్రాణానికి శరీరంలా) అనుకొని ఆ జీవునిలో ఉంటూ వచ్చిన వేరొక ప్రాణమే (ఆత్మయే) "నిజమైన ప్రాణమ"ని ఒప్పుకోవలసి వస్తోంది. నిజమైన ప్రాణమైన ఆ ఆత్మ తప్ప జీవుడనే అనేక రకాల ప్రాణాలు ఎట్లాగ నిజమవుతాయి?

వివరణ : జడమైన శరీరాన్ని "నేను" అనే (ప్రకాశించు చిత్తువలె) అభిమానించు అభిమానమే జీవుడు. అయితే ఈ జీవుడు అసత్యం కాబట్టి యితడు ప్రాణం కాదు. జడమైన శరీరాన్ని జీవుడు నడిపిస్తున్నట్లు ఈ జడమైన జీవుని ఏ ఆత్మ నడిపిస్తున్నదో (అంటే ఈ జీవుడుండటానికి ఒక చిత్తువలే - ప్రాణంగా ఏది వున్నదో) ఆ ఆత్మయే నిజమైన ప్రాణం. అది కాదని వేరుగా ఏ జీవుడైనా వుండగలడా? ఉండలేడు కాబట్టి, ఈ ఆత్మయైన నిజమైన ప్రాణము తప్ప ఎక్కడా, ఎప్పుడూ ఏ జీవులు లేరని ఇక్కడ ఉపదేశించారు. 1051వ వచనాన్ని కూడా అన్వయించుకోవలెను.

1034. గోచరించే జాగ్రత్ స్వప్నములలోను, జగత్తు గోచరింపని సుషుప్తిలోను శరీరం లేకుండా సుఖ స్వరూపమైన నీ ఉనికి ప్రకాశిస్తూనే ఉంది.

1035. పంచేంద్రియాలకు స్ఫురించే ఈ ప్రపంచం నిజంకావచ్చు, లేదా మనః కల్పితం కావచ్చు. కాని ప్రపంచాన్ని చూసే నీవక్కడ వున్నావుకదా! "ఉన్నాను" అనే ఆ శుద్ధ చైతన్యమే (సచ్చిత్) నీ ఆత్మ స్వరూపము. ఇది తెలుసుకో!

1036. జ్ఞానా జ్ఞానములు లేక కేవలం ఉన్నాను అనే ఎఱుక మాత్రంగా ఉన్నదే ఆత్మ. ఆ ఆత్మ పూర్ణజ్ఞానము. స్వయం ప్రకాశము, కేవలం స్ఫురణము. పరబ్రహ్మ స్వరూపము. అందులో ఎట్టి అజ్ఞానం లేదని గ్రహించు.

1037. ఆ బ్రహ్మ స్వరూపము విశుద్ధ జ్ఞాన రూపము. అందులో అజ్ఞానం లేదు. అది జ్ఞాన స్వరూపమే కాని యెడల దాని నుండి త్రిపుటి భేదాలయిన మనస్సు, బుద్ధి, విజ్ఞానం ఎలా ఉద్భవిస్తాయి?

వివరణ : ఉన్నది నలుబది 12వ పద్యంతో పోల్చిచూసుకోవలెను.

1038. ఆత్మ స్వరూపం నిర్గుణం. అందువల్ల ఎఱుక ఆత్మకి ఒక గుణం కాదు, అంతేకాకుండా ఆత్మ కర్తృత్వ రహితం. కాబట్టి ఎఱుక ఆత్మ యొక్క ఉపాధికాదు. కనుక ఆత్మ ఎఱుక రూపమని తెలుసుకో.

1039 ఏది తానే నిరంతరం "నేను ఉన్నాను" అని అందరిలో స్వయంగా ప్రకాశిస్తున్నదో, ఎటువంటి ఉపాధులు లేని, దృఢమైన ఎఱుకయే ఆత్మ స్వరూప లక్షణమగును.

1040. పైన తెల్పిన విధంగా ఎఱుకయే స్వరూపంగా గల ఆత్మయొక్క ఉనికిని విషయములను తెలుసుకొన్నట్లు తెలుసుకోవడం ఎలా? తెలుసుకొనేందుకు వీలులేదు. కనుక మిథ్య అయిన అహంత నశించినపుడు, అంతశ్శాంతి నెలకొన్నప్పుడు, ఆత్మ తనకు తానుగా ప్రకాశిస్తుంది.

1041 త్రిపుటిలో దేనికీ మనమైనటువంటి ఆత్మకి వేరుగా ఉనికి లేదు. అయినా, 1041 ఆ త్రిపుటిలో ఏదీ మనం కాదు (ఆత్మకాదు). వాటికన్నిటికీ ఆధారవస్తువుగా ఉండేదే సత్యాత్మ స్థితియగును.

వివరణ : చూచేవాడు, చూడటం, చూడబడే వస్తువు ఇవి త్రిపుటి నేను చూసే వాడిని, నేను చూస్తున్నాను, ఇవన్నీ నాచేత చూడబడుతున్నాయనే మూడింటిలో ఏయొక్కటి "నేను" లేకుండా ఉండలేనివి. అయినా, చూచే "నేను" ఆత్మ వస్తువుకాదు. అది అహంకారమే కాబట్టి ఆ త్రిపుటిలో ఏదీ ఆత్మకాదు అని వివరించారు. చూచుట మొదలైన ప్రవృత్తులు ఆత్మయొక్క స్వభావం కాదు. "చూస్తున్నాను" అంటే అహంకారం యొక్క స్వభావం. "ఉన్నాను" అనే మూలాధారమైన భావం లేకపోతే "చూస్తున్నాను అనే విశేష జ్ఞానం అహంకారానికి కలగదు. కాబట్టి ఆత్మను కాదని త్రిపుటి ఏది వుండలేదు. దృశ్యజ్ఞానం ఆత్మకి కాదు. కనుక ఆ త్రిపుటి ఆత్మకాదని ఇక్కడ చెప్పబడింది.

1042. నిత్య పరిపూర్ణ, విశాలమైన ఆత్మ స్వరూపం ద్వైతంగా పొందతగ్గ ఒక వస్తువుకాదు. తనను పొందటం అంటే (యోగం అంటే)తన ఉనికిని ఎఱుగుటయే. ఆ ఎఱుగుట కూడా అన్యము నెఱుగుటకాదు. తన ఉనికి అయిన అదే ఆత్మ స్వరూపం.

1043. స్థూల సూక్ష్మములు, శూన్యత్వ పూర్ణత్వములు, ధైర్యాధైర్యములు మొదలయిన ద్వంద్వాలన్నింటినీ ఎఱిగే జ్ఞాన మొకటి ఉంది. అది అన్నింటికీ మూలమై ప్రకాశిస్తోంది. అనంతంగా ఉన్న ఆ జ్ఞానమే ఆత్మ (నేను)

1044. అహంతయే అజ్ఞానం. దానికున్న నామ రూపములు అనేకం. ఉపాధులు అనేకం. అది ఎన్నో పర్యాయాలు పుడుతుంటుంది. నిజానికి ఏమీ చేయకపోయినా అది ఏవేవో సత్కర్మలూ, దుష్కర్మలూ చేస్తున్నట్లుగా భావిస్తుంది. అల్లాడుతుంది. దుఃఖం లేకపోయినా దుఃఖిస్తున్నట్లు భావిస్తుంది. దీనికి అవకాశం ఇచ్చేది అన్నింటికీ ఆధారంగా ఉండే ఆత్మయే. ఎఱుక ఐనతానే.

1045. ఏ ఒక శరీరంపైన "నేను" అనే అభిమానం లేకుండా "ఉన్నాను" అనే సహజమైన స్ఫురణ ఒక్కటి ఉందో, అది సూర్యుని వలె స్పష్టమై సత్యమై స్వయం ప్రకాశమై హృదయాకాశమై ఉన్న ఆత్మ అని తెలుసుకో.

1046. చిత్ప్రకాశము అతి సూక్ష్మము. అది అహంతారహితము. మౌనము.

ఉన్నవస్తువు. "నా స్వస్థితి ఏమిటో నేను ఎఱుగలేకున్నాను" అని మనస్సు అలసిపోయి దుఃఖించేట్లు చేసేది ఈ సచ్చిత్తే. ఆత్మయే.

1047. ఈ లోకమంతా మిథ్యా దృశ్యాలతో నిండిన చలన చిత్రం వంటిది. ఆత్మమాత్రం తెర మాదిరిగా చలన రహితంగా ఉండే సత్యజ్ఞాన స్వరూపము.

1048. ఆ సచ్చిత్ స్వరూపమైన తెరమీద కనిపించే దృశ్యాలే ఈ త్రిపుటి రూపమైన ప్రపంచం.

1049. సప్త స్వరాలను పలికించటానికి తప్పని సరిగా కావలసిన శ్రుతిలా చలన చిత్రాలకి ఆధారమైన తెరలా, తాను మారకుండా జగత్తులోని మార్పులన్నిటికీ ఆధారమైనదిగా, నిష్కళంకమై తానుగా ఉంటూ ప్రకాశించేదే ఆత్మ వస్తువు.

1050. ఆత్మయే ఈ మిథ్యా జగత్తులోని దృశ్యాలన్నింటిలోను దాగి ఉన్నది. అనేక రకాలుగా తోస్తున్న ఈ మాయా ప్రపంచాన్ని నిజమైనదిగా గోచరింపచేస్తున్నది. అయినా ఆనామరూపములు సృష్టిలయముల లక్షణాన్ని తాను పొందక, సర్వత్ర సర్వదా ఉన్నది వెలుగుతోంది.

1051. అవినాశియైన ఆ అంతరాత్మ ప్రతి జీవిలోను అంతర్యామిగా వెలుగుతూ కూడా తాను ఆ జీవుల చేత గ్రహింపబడటం లేదు. ఆ ప్రతి జీవుణ్ణి తాను ఉండు స్థానంగా భావించి, ఒక క్షణమైన వదలక, అలసిపోక నడిపిస్తున్నాడు.

1052. తిరుగుతున్న బండి చక్రపు ఆకులవలె, ఉదయాస్తమయములే తన స్వభావంగా సదా తిరుగుతూండే జీవుడు ఆత్మకాదు. తిరగకుండా చక్రం లోపల ఉండే ఇరుసు చలనం లేకుండా ఉండేదే సత్యాత్మ.

1053. దృశ్యమై కనబడేవి కనబడనీ! అదృశ్యమైయ్యేవి కనబడకపోనీ! ఆత్మ స్వరూపజ్ఞానానికి దానివల్ల మంచిగాని చెడుగాని ఏముంటుంది? (ఏమీ లేదు). పూర్ణమై శివమై ఏకమై వెలిగే సద్వస్తువులో అవన్నీ విలీనమై మరుగైపోగా మిగిలి ఉండేది ఏదో అదే మన ఆత్మ స్వరూపం.

వివరణ : సృష్టి స్థితి సంహారాలకు లోనయ్యే ప్రపంచ దృశ్యం ఉన్నా మాయమైనా దాని వలన ఏ విధంగాను బాధింపబడక, ప్రళయంలో ఈ దృశ్యమంతా నాశనమైన తర్వాత కూడా తాను అద్వితీయమై పూర్ణమై ప్రకాశించేది ఏదో అదే ఆత్మ, అదే శివం అని భావం.

1054. “నేనెవడ”నని విచారిస్తే మనల్ని వంచించే అహంత అణుగుతుంది. నశిస్తుంది. అప్పుడు విశదంగా స్ఫురించేదే జ్ఞానం. ఆత్మ. దీనినే భగవదనుగ్రహ తాత్పర్యమనీ, శివుడు అనుగ్రహించిన నటరాజ దర్శనమనీ ఉపనిషత్తులు పేర్కొంటున్నాయి.

1055. అద్వితీయ పరబ్రహ్మ స్వరూపము అనాదియైనది. అత్యంతోత్కృష్టమైనది. ఆ ఆత్మస్వరూపం శూన్యము వలె గోచరించినా శూన్యము కాదు. అది ఏకైక పూర్ణ సత్తి. అనన్యజ్ఞానము.

(ఉన్నది నలుబదిలోని 12వ పద్యభావాన్ని యిక్కడ పోల్చి చూసుకోవలెను)

1056. “నేను” అనే అహంభావం ఏమాత్రం ఉదయించని స్థలమే మౌనమని, ఆత్మ స్వరూపమని జ్ఞానులు అంటారు. ఆ పరమమౌనమైన ఆత్మ స్వరూపమే జగజ్జీవేశ్వరులవుతుంది.

1057. అన్ని వస్తువులకి ఆకాశమే ఆధారమైనట్లు జగజ్జీవేశులు మూడింటికి ఉనికి మాత్రమైన ఆత్మ స్వరూపమే ఆధార వస్తువు, పరంధామము, పరశివతత్త్వము అదే. అక్కడికి చేరిన వారికి రాకపోకలుండవు.

## 33. ఆత్మ వైభవం

1058. కేవల సత్ స్వరూప వైభవంలో చూచేవాడే చూడబడే వస్తువులు (ద్రష్టతోనే దృశ్యమైన జగత్తు) అవుతాడు. కనుక ఆత్మయే ఏకైక సత్యం. విషయములను చూచే అహంత నశిస్తే మౌన ప్రజ్ఞ శేషిస్తుంది. అదే పరమజ్ఞాన స్వరూపం. ఆత్మ.

1059. ఆత్మ స్వరూపం చిదానంద నిలయం. ఆపార శాంతి సముద్రం. మనస్సును లోనికి మరల్చి అందులో మునిగితే అంతులేని ఆత్మానుగ్రహం లభిస్తుంది.

1060. కనుక దానిని మూల్యముగా చెల్లించి పొందదగిన వస్తువు ఏదీలేదు. తపస్సు చేసి పొందినట్లుగా కూడా ఎవరూ చూడలేదు.

1061. అత్యంతోత్కృష్టమయిన పరమాత్మ సాక్షాత్కారాన్ని తప్ప ఈ మానవజన్మలో పొందతగిన సత్ఫలితం వేరొకటి లేదు. ఆ ఆత్మని అనుభవించాలంటే అంతర్ముఖుడవై ఆత్మ విచారణ చేసి, నిస్సారమైన అహంకారాన్ని నాశనము చేయుదువుగాక!

1062. ఎల్లప్పుడూ సిద్ధమై ప్రకాశిస్తున్న జ్ఞానము ఆత్మ రత్నము. అటువంటి అరుదైన ఐశ్వర్యాన్ని (కలిమిని) విచారణ చేత హృదయంలో వెదకి పట్టుకొన్నట్లయితే దుఃఖహేతువులైన జననమరణ బాధలు తొలగిపోతాయి. అజ్ఞానమనే లేమి తీరుతుంది.

1063. ఆ ఆత్మజ్ఞాన రత్నం యొక్క మహిమ తెలియకపోవటం చేత లోకులుదానికై ప్రయత్నించక బద్ధకస్థులై కష్టాలపాలవుతున్నారు. ప్రతి యొక్కరి హక్కు అయినటువంటి ఆ ఆత్మరత్నాన్ని విచారణ అనే ఉపాయం ద్వారా తెలుసుకొని పొందినవారే పండితులు. వారే బ్రహ్మానందాన్ని అనుభవించేవారవుతారు. కనుక నీవు కూడా దానినే ఆచరింపుము.

1064. మనస్సును శాంతంగానుంచుకొని, “ఉన్నాను” అనే ఎరుక రూపమైన నేను, “ఎవరు?” అని విచారణ చేసి తన చిత్స్వరూపమైన ఆత్మను పొందటానికి బదులు చిత్తు నుండి విడివడి పంచేంద్రియ విషయాలలో పడి దుఃఖించటమెందుకు?

1065. పామరులు కోరే అణిమాది అష్ట సిద్ధులన్ని సిద్ధించినా మూలమైనటువంటి చిజ్జడ గ్రంధిని ఛేదించి ఆత్మ రత్నాన్ని పొందకపోతే నేర్చిన విద్యలన్నీ నిష్ప్రయోజనమే.

1066. స్థిరమైన ఎఱుకతో నిండిన మౌనమే సంపద. అదే నిజమైన సంపద అని పెద్దలంటారు. పొందవలసినది శ్రేష్ఠమైన ఆ మహాజ్ఞానసంపదే. అది మనోనాశమునకై ప్రయత్నించే వారికి మాత్రమే లభిస్తుంది.

1067. సముద్ర గర్భంలో ముత్యాలు ఏరేవారు, ఒక రాతిని నడుముకి కట్టుకొని, సముద్రంలో మునిగి ఊపిరి బిగపెట్టి అక్కడుండే మంచి ముత్యాలని తీసుకొచ్చి ఆనందించే విధంగా, వైరాగ్యమనే రాతిని కట్టుకొని, హృదయంలో లోతుగా మునిగి, ఆత్మ ముత్యమైన సంపదని పొంది దుఃఖాలు నశించి ఆనందింతువు గాక!

వివరణ: శ్రీ భగవాన్ రచన "నేనెవరు" లోని భావమే ఈ వచనం.

1068. అహంకార మమకార రహితమై, నిష్కళంకమై ఉన్నాను అనే ప్రజ్ఞా మాత్రంగా వెలిగేదే ఆత్మ. అదే మౌనము. అదే ఎఱుక. దానిని పొందటమే అన్నింటికంటే శిఖరాయమానమైన మహా విజయం.

## 34. పరమాత్మ

1069. మనః ప్రాణములణగగా పరమ సుఖప్రాప్తి కలుగుతుంది. అదే నిష్కళంక జ్ఞానము. మనోతీతమైన ఆత్మ స్వరూపము. శాంతిమయమయిన దివ్యస్థితి. తలపులతో వ్యాకులత చెందే మనస్సును శాంతింపజేసే పరమౌషధము అదే.

1070. ఈ శరీరం అశాశ్వతం. మిథ్య. లోకులు దీన్ని తాముగా భావిస్తారు. ఆత్మ స్వరూపమే తాము అని తెలుసుకోలేరు. వారికి ఒక్కొక్కసారి నామరూపాత్మకమయిన దేవతా సందర్శనం కలుగుతుంది. దీనికే వారు పులికరించిపోయి ఆనందిస్తుంటారు.

1071. తనకు అన్యంగా కనబడే దైవాలను స్తుతించి ఉపాసిస్తేనే అనాత్మకు చెందిన సకల భోగ భాగ్యాలను పొందవచ్చును. అయితే నిత్యము, పరమము, సచ్చిదాత్మకము, శివజ్ఞాన పదము అయిన ఆత్మావలోకన జీవనంలోని సుఖాన్ని ఇతర దేవతలు ప్రసాదించగలరా? (ఇవ్వలేరు).

1072. నిద్రలో ఏమీ తెలియదు. మెలకువలో తెలుస్తుంది. నిద్రలోని తెలియమికి మెలకువలోని తెలివికీ తాము సాక్షులై ఉన్నారు. ఇది తెలుసుకోలేక తమకుతాము ఒకసారి దైవ దర్శనాన్ని పొందామనీ, పిదప దాన్ని పోగొట్టుకున్నామని భ్రాంతి చెందుతారు.

1073. శ్రద్ధతో మనం ఆరాధిస్తే అనేక దేవతా రూపాలు కన్పిస్తాయి. మరల మాయమైపోతాయి. ఇలా అని మార్పుచెందేవిగా ఉంటాయి. కాని మన ఉనికి నిత్యమూ ఉండేది. మార్పు చెందనిది. అదే నిజమైన దైవం.

1074. ప్రత్యేకంగా చూస్తే ఇక్కడ అక్కడ ఇది అది అని కన్పించేవన్నీ, వేరుగా కన్పించక, స్వస్వరూపంగానే కన్పిస్తే, అట్టి అఖండ జ్ఞానమే శుద్ధ చిదాకాశమవుతుంది.

1075. మధ్యమ, ప్రథమ పురుషలుగా నెంచేవన్నీ మనః కల్పితములే. ఇది తెలుసుకొని (మధ్యమ, ప్రథమ పురుషలులేని) “నేనున్నాను" అని ఉన్నట్లు ఊరక ఉండాలి. అప్పుడు అనుభూతమయ్యే ఎఱుకయే సచ్చిత్ స్వరూపమైన ఆత్మ.

1076. పరమ సత్యమైన ఆత్మ సత్యాన్ని గురించి కాకుండా అన్యములగు అనాత్మ తత్త్వములను గురించి తెలుసుకొనటం అవిద్యవల్లనే, మోహంవల్లనే. అలాచేయటం మంగలి క్షురకర్మ చేయగా వెంట్రుకలను పోగుచేసి బయట పారవేయకుండా, ఒక్కొక్క వెంట్రుకను పరిశీలించి లెక్కించునటువంటి నిరుపయోగమైన పనికి సమానము.

1077. ఆత్మరతులై అంతర్ముఖులై స్వనిష్ఠులైన వారికి ఆనందం పొంగుతూ ఉంటుంది. ఆనందం, ప్రేమ, శివం, ఆత్మ, అనుగ్రహం, జ్ఞానం, శాంతం, మోక్షం ఇవన్నీ తన నిజస్థితిని సూచించే నామాలే.

## 35. అభయ స్థితి (నిర్భీతి )

1078. వారి మనస్సులు భేద భావము కలిగినట్టివి కావటంచేత దేవతలు సైతం ఆత్మ యొక్క కేవలత్వాన్ని చూసి భీతికి లోనవుతున్నారు. తాను కాని వన్నిటినీ త్రోసిపుచ్చే విచారణతో తన సత్యాత్మ స్వరూపాన్ని పొంది ఆ అద్వైత స్థితిలో నుండుటయే జ్ఞానం.

1079. ఆత్మ సాక్షాత్కారం పొందినప్పుడే ఆనందానుభూతి కలుగుతుంది. చిత్త శాంతిచేకూరుతుంది. ఆకాశంవలె అంతటానిండి, అద్వితీయమైన ఆ ఆత్మసామ్రాజ్యంలో ఎటువంటి కోరికలూ ఉండవు. ఎటువంటి భయాలూ ఉండవు.

## 36. అద్వైతం

1080. ఘటాకాశం అనీ మఠాకాశం అనీ పేరు చేసి చెప్పినా, ఘటంలో గాని మఠంలోనగాని ఆకాశం ఒక్కటే. అలాగే సచ్చిదానంద ఘనమైన ఆత్మస్వరూపం ఒక్కటే. దేహం మొదలైన ఉపాధి భేదం కారణంగా ఈశ్వరుడనీ జీవుడనీ వేరుగా గోచరించినా జీవేశ్వర నిజతత్త్వంలో భేదమేమి లేదని గ్రహించు.

1081. “ఉన్నాను” అనే స్ఫురణలో జీవుడనీ శివుడనీ రెండు వేర్వేరు స్ఫురణలు కలుగ గలవా? కలగవు. ఒకే పదార్థంతో చేసిన నాయకుని ప్రతిమకూ దాసుని ప్రతిమకూ మూలగతమైన భేదముంటుందా? చెప్పు.

వివరణ : ఉపదేశసారంలోని 24వ శ్లోకాన్ని చూడవలెను.

## 37. నాస్తికత

1082. తన్ను “లేనివాడ"ని (తాను లేడని) తన ఉనికిని గుర్తించని మనిషి నిన్ను “లేనివాడ”ని వాదిస్తాడు. తన సత్యాన్ని అంటే అహం స్ఫురణని ఉన్నదున్నట్లు తెలుసుకుంటే, ఆ అహం స్ఫురణే అయిన నిన్ను “లేని వాడని" ఎట్లాగ చెప్పగలడు?

## 38. ఆస్తికత

1083. దేవుడున్నాడని నమ్మే వారికి ఆ భగవంతుడు జ్ఞాన రూపంలో హృదయంలో వసించే ఉన్నాడు. నమ్మకంలేని వారికి కలుషిత మనస్సులో ఉండనే ఉండడు (గోచరమవడు). కనుక మనోమాలిన్యాన్ని పోగొట్టుకొని, నిర్మోహమైన (స్పష్టమైన) దృష్టితో చూస్తే ఆ దైవమే ఆత్మగా స్పష్టంగా ప్రకాశిస్తాడు.

1084. జ్ఞానమయమైన ఆత్మ స్వరూప సత్యాన్ని బోధపరచుకొన్న జ్ఞానే ఆస్తికుడనే పేరుకి అర్హుడు.

వివరణ : భగవంతున్నాడని చెప్పే ప్రతి వాడూ నిజమైన ఆస్తికుడు కాలేడు. తాను పరమాత్మ స్వరూపుడనని గ్రహించిన జ్ఞాని ఒక్కడే నిజమైన ఆస్తికుడు అని ఇక్కడ సూచించారు.

## 39. శాశ్వత ముక్తి

1085. జ్ఞాన సూర్యుడు, చిదాకాశ స్వరూపము అయిన స్వరూప స్థితిని తెలుసుకొన్న జ్ఞానికి దేహాత్మ బుద్ధి అనే మాయాంధకారం ఉండదు. దేహమే నేను అని ఎంచే అంధులకే అజ్ఞానాంధకారం నిజము అని అనిపిస్తుంది.

1086. అవిద్యాపాశ బద్ధ జీవులకే విచారణ చేయటం, తద్వారా జ్ఞానాన్ని పొందటం అనేవి ఉంటాయి. శాశ్వతులై నిర్మోహమనస్కులై కేవల స్వరూపులైన జ్ఞానులకు విచారణ అవసరం లేదు. ఆ విచారణ ద్వారా జ్ఞానం పొందటమనేది కూడా లేదు.

1087. అన్నింటిలోను ఉనికిగా నిండియున్న ఆత్మ ఎండమావి వంటి మాయచేత వశమయ్యే ఒక వస్తువా? కాదు. కనుక ఆత్మయైన నీవు బంధంలో చిక్కుకున్నట్లు ఎంచి భయపడక నిదానంగా, సమబుద్ధితో విశ్లేషించి, సత్యాన్ని గ్రహించెదవు గాక!

1088. నిన్ను ఒక ఉపాధిగా, ఒక శరీరంగానెంచి నీవు ఎందుకు అనవసరంగా కష్టపడటం? ఆ ఉపాధియైన శరీరం లేక నీవు నిద్రించునపుడు కూడా నీ ఉనికి ఎటువంటి అడ్డంకులు లేక ప్రకాశిస్తునే ఉందని నీవు గ్రహించాలి.

## 40. సదాచార జీవనం

1089. జీవించాలని కాంక్షించే లోకుల్లారా! ఎట్లాగ జీవించాలో మీరు గ్రహించటం లేదు. మాయలోపడి పగటి కలలాంటి ఈ జాగ్రదావస్థను పొంది, ఈ నికృష్ట స్థితిలో ఉండటమే నిజమైన జీవితమనుకొని, వాదించి మోజుపడి గర్విస్తున్నారే! ఈ మాయను “ఉన్నాను” అని వెలిగే ఎఱుకచేత ఛేదించి మీ నిజ జీవితమైనటువంటి ఆత్మ స్థితిని పొంది సదా జీవింతురుగాక.

1090, కామ క్రోధాదులను విడనాడు. భ్రాంతిని కలిగించే ఈ మాయని ధ్వంసం చేయి. అన్నిటను ఉదాసీన భావంతో ఉండు. అదే సద్వస్తువును కోరి జీవించే (ఆధ్యాత్మక సదాచార) జీవితమవుతుంది. ఈ విధంగా ఆచరించు.

1091. నీ ఉనికి సహజ స్థితియై నిరాటంకమై హృదయంలో నెలకొన్న ఆనందమయమైన జీవితమే ఆత్మ శివభోగము. అదే జ్ఞాన సుందరము, మోహరహితము, అహంతా వర్జితము.

1092. తన జీవిత భారాన్నంతా భగవంతుని పాదాలపై అర్పించి, దేనినీ పట్టించుకోకుండా, ఉదాసీన భావంతో గంభీరమైన జీవనాన్ని గడుపుతూ, ఆత్మానందమగ్నులైయుండు జ్ఞానులే నిజమైన సౌందర్యవంతులు. వారే శ్రేష్ఠమైన పురుషార్థాన్ని సాధించినవారు.

1093. ప్రేమమయమైన ఆత్మ జ్ఞానానుభవం నిండిన హృదయంలో బ్రహ్మానందం పొంగిపొరలుతుంది. అక్కడ కోరికలుండవు. కోరికల వల్ల కలిగే దుఃఖాలుండవు. ఈ పరిశుద్ధ తత్వమైన ఆత్మస్వరూప జీవనం శాంతి మయమైన జీవనం.

1094. బ్రహ్మానందదాయకము; జ్ఞాన స్వరూపము అయిన ఆత్మయే మనం ప్రయత్నించి సాధించవలసిన ధ్యేయం. మఱపెఱుగని అహంస్ఫురణతో హృదయంలో తానుగా ఉండటమే పరిపూర్ణ జీవితం.

1095. పైన చెప్పిన విధంగా జ్ఞాన నిష్ఠలో నుండే పరిపూర్ణ దివ్య జీవితమే పరతత్త్వ జీవితము. ఈ ప్రాపంచిక జీవితం మోహం నిండిన జీవితము. ఇట్లాగ జీవించడం మాయలో మునగటమే కాని జీవించటం కాదు.

1096. పంచేంద్రియాల ద్వారా గోచరించే ఈ జగత్తును నిజం అని నమ్మి, అల్పమైన ఆ ఇంద్రియాల ద్వారా బహిర్ముఖమై మోహమునకు గురిచేసే ప్రపంచాన్నే పట్టుకోకుండా బ్రతకడం తెలిసినవారికి ఇక తపస్సు చేయవలసిన అవసరం లేదు.

1097. విజృంభించే అహంకారం పూర్తిగా అణగి, సుఖదుఃఖాలనే ద్వంద్వాలని దాటి సకలమూ తానైన ఆత్మానుభవము పొందిన వారికి వేరే తపస్సు ఏదీ చేయనవసరం లేదు.

## 41. నిరాకారం

1098. మనకు రూపమున్నట్లయితే అన్నిటికీ మూలమయిన ఆ భగవంతుడు కూడా రూపంతోనే కన్పిస్తాడు. మనం ఈ శరీరం కాదన్నట్లయితే, మనకి ఎటువంటి అన్యవిషయ జ్ఞానం కలుగదు. ఆ స్థితిలో 'దైవం రూపం గలవాడు' అని చెప్పటం ఎట్లు పొసగుతుంది?

వివరణ : ఉన్నది నలుబదిలోని 4వ పద్య భావాన్ని ఇక్కడ సమన్వయించుకోవలెను.

1099. ఉపాధి సంబంధం చేత శివుడు లెక్కలేని నామరూపాలను ధరించి దర్శనమిస్తాడు. అలా భక్తులు వారి భావనలతో చాలా కాలం ధ్యానించి ఊహించుకొన్న రూపాన్నే ధరించి దర్శనమిచ్చినా, నిజానికి రూప రహితమైన జ్ఞానమే పరమేశ్వరుడు.

వివరణ : భగవద్గీతలో అర్జునునకు శ్రీకృష్ణుడు అనుగ్రహించిన తన విశ్వరూప దర్శనం ఇటువంటిదేయని భగవాన్ ఒకసారి సెలవిచ్చారు. "ఇంకా వేరే ఏయే రూపాలను నీవు చూడాలని ఇచ్ఛగిస్తున్నావో వాటిని చూడు" అని చెప్పారే తప్ప, "నేను నిజంగా ఎలాగున్నానో నా నిజస్వరూపం ఏదో దానిని చూడు అని చెప్పలేదు.!! తనచిత్తంలో నిలదొక్కుకొని ఉన్న ఈశ్వర నామరూప భావనలనే అర్జునుడు స్థూలంగా చూడటానికి శ్రీకృష్ణులు సహాయపడ్డారని ఇక్కడ గ్రహించవలసినది. అర్జునునకు కలిగింది దివ్యదృష్టి తప్ప జ్ఞానదృష్టి కాదు. జ్ఞాన దృష్టిలో జ్ఞానం తప్ప నామరూపాలు గోచరించవు.

1100. నామరూపములు ఆకాశపు నీలిమి వలె మిథ్యయైనవి. హృదయంలో వెలిగే ఆద్యవస్తువైన ఆత్మ పూర్ణము, చిత్ప్రకాశ స్వరూపము. మనస్సును నిగ్రహించి హృదయంలో వెలిగే పరావాక్కుతో అనగా అహం స్ఫురణతో ఆ ఆత్మను అనుసంధానం చేయటమే నిజమైన స్తోత్రము.

వివరణ :అహంత లేవని ఆత్మ నిష్ట ఒక్కటే భగవంతుని భక్తితో స్తుతించుటమవుతుంది.

1101. పైన తెల్పిన విధంగా ఆత్మానుసంధానం చేసే జ్ఞానాచార్యులు చేసిన స్తోత్రాలు ఏవైనా, ఆ స్తోత్రాల సారాంశం ఒక్కటే. "ఆత్మయే అతి శ్రేష్ఠమైన దైవము" అంతేగాని, దైవానికి ఏవో నామరూపములు కల్పించి చేసిన స్తోత్రములు కావు.

వివరణ : శ్రీ భగవాన్ రమణులు "అరుణాచలం, అణ్ణామలై" అని స్తుతి పంచకం వంటి గ్రంథాలలో రచించినదంతా ఆ సగుణరూపమైన ఆత్మను సూచిస్తున్నారని మనం అనుకోవాలని దీనిని బట్టి తెలుస్తున్నది.

1102. శివతాండవం (ఒంటికాలి భంగిమలో చేసిన నాట్యం) యొక్క తత్త్వం ఏమిటంటే, తమ భక్తులను ఆత్మ విచారణమనే నాట్యం చేత, మూలమైన హృదయాన్ని పొందమని చెప్పే భగవంతుని లీల. ఇది ప్రతిబింబమైన చంద్రుడు తన ఆధారబింబమైన సూర్యునితో ఏకమైనట్లు సూచించే టువంటి ఒక అద్భుతం.

1103. జీవితంలో వివిధ లక్ష్యాలు సాధించేందుకు అన్ని దిశలా వెదుకుతూ పరుగులు తీస్తూ, వేసారి విమోహితులు కావటం అవివేకం. విజృంభించి తిరిగే అహంత యొక్క చాంచల్యాన్ని అణచివేసే శివంకరమైన మౌన స్వరూపమును (ఆత్మను) అనుసంధానం చేసి నిలుకడ చెందు.

1104. హృన్నిషులై ఆత్మస్థితులైన వారు మాత్రమే ఆ సహజ స్థితిని పొందగల్గుతారు. ఇతరులు పొందలేరు. ఎందుకంటే మనస్సుకు మెలకువలో తలపు ఉంటుంది. నిద్రలో మఱపు ఉంటుంది. ఈ రెండూ సహజ స్థితిని కప్పి వేస్తాయి. ఇది తెలుసుకో.

## 42. సహజ నిష్ఠ

1105. జ్ఞాని శరీరంలో ఉన్నప్పటికీ, తన సహజాత్మ స్థితిలో ఉంటాడు. నిద్ర కాని నిద్రలో ఉంటాడు. అయినా, శరీరంలో చేసే వ్యవహారంగాని, నిష్ఠ కాని, నిద్ర గాని వీటిలో ఏ ఒక్కటీ అతనికి తెలియదు. ఎడ్ల బండిలో నిద్రిస్తూ పయనిస్తున్న ప్రయాణీకునికి, ఆ బండి వెడుతూండడమో, ఆగిపోవడమో, ఎడ్లను విప్పి వేయడమో ఇవి ఏవీ తెలియవు. అటువంటిదే జ్ఞాని స్థితి కూడా.

ఈ భావాన్ని శ్రీ భగవాన్ 21వ వచనంగా రచించారు..

## భగవాన్ - 21

ఎండ్లబండిలో నిద్రపోయే ప్రయాణీకునికి ఆబండి వెళ్ళటం, ఆగటం, ఎడ్లని విప్పేసినప్పుడు బండి వేరుగా ఉండటం ఎట్లాగ తెలియవో, అట్లే బండి వంటి మృణ్మయ శరీరమును ధరించిన జ్ఞాని శరీరంలో నిద్రపోకుండా నిద్రపోతుంటారు. అందుచేత వానికి శరీరస్థములయిన కర్మ, ధ్యానమను నిద్ర- ఇవేవీ తెలియవు.

వివరణ: ఉన్నది నలుబదిలోని 31వ పద్య భావాన్ని ఇక్కడ అన్వయించు కోవాలి.

1106. బంధరహితుడై సాక్షిగా ఉండే జ్ఞాని మనసు ఆకాశమువలె నిర్మలమై ఉంటుంది. అజ్ఞానుల మనస్సులు దోష భూయిష్టమైన తలపులతో నిండి ఉంటాయి. జ్ఞాని వద్దకు అజ్ఞానులు వచ్చినప్పుడు వారి తలపులు శుభ్రమైన అద్దమువలె ఉన్న జ్ఞాని మనస్సులో ప్రతిబింబిస్తాయి. అందువల్ల లోకులు ఆ జ్ఞానిని వశపరచుకొన్నట్లు భ్రమిస్తారు. తెలివి తక్కువగా ప్రవర్తిస్తారు.

1107. త్రిగుణాలలో శ్రేష్ఠమైన సత్వ గుణాన్ని కూడా దాటిన సహజనిష్ఠలో జ్ఞానులు జీవిస్తారు. కర్తృత్వ బుద్ధితో కలవరపడే బుద్ధిహీనుల కళ్లకు దోషపూరితమైన రాజస గుణాలను కలిగిన వారివలె కొన్ని సమయాలలో కన్పిస్తారు. (అయితే అది చూసేవారి రజోగుణవృత్తుల ప్రతిబింబమే) కనుక ఆ కారణం చేత ఆ సహజ నిష్ఠాపరుల జ్ఞానాన్ని సందేహించవద్దు.

1108. మహాత్ములైన జీవన్ముక్తులకు ఎవరైనా దోషం అంటగడితే, వారు ఈ జన్మలో ఘోరమొనర్చినవారవుతారు. వారాపాప భారాన్ని వచ్చే జన్మలో మోయవలసి వస్తుంది.

1109. నూనె కారుతున్న గానుగకొయ్యకూ, భగవద్రూపమైన శివలింగానికి భేదం తెలియక రెండింటిని ఒకే లాగున నాకే కుక్కలాంటి నీచులు, జ్ఞానులను, అజ్ఞానులను వేర్వేరుగా చూడలేని వారై, ఇద్దరికీ ఒకే విధంగా అపచారం తలపెడుతారు.

1110. సూర్యుని చూసి కుక్క మొరిగితే ఆ హేళన సూర్యునికి అంటదు. అట్లాగే సూర్యుని వంటి అత్యంత జ్ఞానశక్తి, తేజస్సు కలిగిన జ్ఞానులను అల్పుల నీచపు మాటలు అంటవు.

## 43. స్థిత ప్రజ్ఞుడు

1111 అంతర్ముఖత్వం, బహిర్ముఖత్వం అనే భేదం లేకుండా కేవలం "ఉన్నాను" అనే ప్రజ్ఞతో చిన్మయైక దృష్టితో నిల్చి ఉండే జ్ఞానియే స్థిత ప్రజ్ఞుడు.

1112. ఆత్మనిష్ఠుడై, అహంకార వర్జితుడై, శివస్వరూపుడై, నిశ్చలుడై, పూర్ణుడై, మౌనస్వరూపుడై వెలుగొందే జ్ఞానియే స్థితప్రజ్ఞుడు.

## 44. గ్రంధి భేదం తర్వాత

1113. చంచల మనస్కులైన పామరులు విషయాలతో బంధింప బడినటు వంటి ప్రపంచాన్నే అంతటా చూస్తున్నారు. హృదయ గ్రంధి విచ్ఛేదమయిన జ్ఞానికి, అహంకారం నశించిన కారణంగా, సర్వమునకు ఆధారమైనిల్చిన ఆత్మ చిద్రూపమే అంతటా దర్శనమిస్తుంది.

1114. అనేక భేదాలతో విచిత్రంగాను, అన్యవస్తువులుగానూ గోచరించే ఈ ప్రాపంచిక దృశ్యం, సూర్యునివలె స్వయం ప్రకాశమైన జ్ఞాని దృష్టికి అన్యంగా గోచరించదు.

1115. హృన్నిష్టుడై తన్మయానందుడైన జ్ఞాని జగత్తును మిథ్య అనిగాని, తనకంటె అన్యమైనదనిగాని భావించడు.

1116. జగత్తును అంతటినీ జ్ఞాని ఎఱుకగా చూస్తాడు. ఎఱుక వినా జగత్తుకు ఉనికి లేదని గ్రహిస్తాడు. నిత్యమూ ఆత్మచైతన్య రూపునిగా అంతః స్ఫురణతో ఉంటాడు.

117. అద్వితీయమైన పరిపూర్ణ వస్తువులో మునిగి మనస్సు నశించిన మాహాత్ములు అసత్తయిన ద్వంద్వాల మోహంలోపడరు. "నేనున్నాను" అని వెలిగే విశుద్ధ జ్ఞాన స్వరూపంలో పూర్ణాత్మ ఒక్కటే ఉంటుంది గాని "నేను ఇది", "నేను అది" అనే ఉపాధిగత భేదాలుండవు.

1118. కర్తృత్వ భావనా గ్రంధి విచ్ఛేదమైన జ్ఞానికి తదుపరి చేయవలసిన కర్మలేవీ లేవు. ఆ జ్ఞాన దశలో అన్యవిషయములంటూ ఏవీ తెలియబడవు. జ్ఞానికి ఎట్టి సందేహమూ ఉండదు. ఎట్టి వ్యామోహమూ ఉండదు.

1119. జ్ఞాని మనస్సుకు మునుపటివలెనే శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకమయిన పంచేంద్రియ విషయములు గోచరించవచ్చు. అయినా ఆత్మవిచారణా బలం కారణంగా గ్రంథిచ్ఛేదమయి జ్ఞాని మనస్సు నశించే ఉంటుంది.

1120. జ్ఞానమయ జీవితాన్ని పొందిన మహాత్ములు, అల్పమైన ఇంద్రియాలతో కూడిన భౌతిక జీవితంలో ఏమాత్రం ఆనందాన్ని పొందరు. అఖండము అనంతము అయిన ఆ మౌన స్వరూప స్థితియే పరబ్రహ్మానుభవం కదా!

(అఖండానందం ముందు అల్పానందం ఎంత?)

1121. సముద్రంలో కలిసిన నది సముద్ర రూపంగా మారిపోతుంది. అది తిరిగి నదిగా మారి ప్రవహించలేదు. అలాగే ఆత్మ స్వరూపాన్ని పొందిన జ్ఞానికి ఆత్మ విస్మృతిగాని పునర్జన్మగాని ఉండవు.

1122. స్మృతి, విస్మృతులతో కూడిన మనస్సు గల మనుషులు మరణిస్తారు. మరల జన్మిస్తారు. కాని మనస్సు నశించిన జ్ఞానులు పరమాత్మయందు ప్రతిష్ఠితులై జనన మరణ రహితులై మహోత్తమ పరతత్త్వరూపులై ఉంటారు.

(మఱుపు ఉంటే ఆత్మ విస్మృతి.)

1123. తనను తాను ఉనికిగా ఎఱుకగా చూచినవాడే సదాశివుని దర్శించినవాడు. భీతి గొలుపు ద్వంద్వముల అంతాన్ని చూచినవాడు. తన సహజ స్థితి అయిన తురీయావస్థను పొందినవాడు. పునర్జన్మను ఎఱుగని ప్రాజ్ఞుడతడు.

1124. ఒకసారి గ్రంథి విచ్ఛేదమయినవాడు మరల ఇక ఎన్నడూ బద్ధుడు కాడు. అతనెప్పుడూ సహజస్థితిలోనే నెలకొని ఉంటాడు. గ్రంథి విచ్ఛేదమయిన స్థితియే దైవీస్థితి. అదే ఈశ్వర శక్తి. అదే పరమశాంతి..

## 45. జ్ఞానుల మహిమ

1125. సర్వేశ్వరుని తన ఆత్మ స్వరూపంగా లోదృష్టితో చూస్తూ, ఏబంధములు లేని జ్ఞాని లోకంలో సంచరిస్తున్నప్పుడు సర్వేశ్వరుడే ఏ ఆపదలు రాకుండా రక్షకుడై ఉండి జ్ఞాని వెనుక నడుస్తుంటాడు.

1126. మనస్సు నశించిన జ్ఞాని శివమయుడే. అతడు సకల జీవులలో ప్రాణంగా ఉంటాడు. అఖండ జ్ఞానిగా కూడా వ్యాపించి ఉంటాడు. అట్టి జీవన్ముక్తుని రూపాన్ని భక్తితోధ్యానిస్తే ఆయన అనుగ్రహం చేత మన హృదయం వికసిస్తుంది. ఆత్మ ప్రకాశిస్తుంది.

1127. మృతమైన మనస్సుతో, శత సూర్యులొకటైనట్లు నిత్యం ప్రకాశించి జీవించే జ్ఞానుల అనుగ్రహ వీక్షణాలనే గంగలో మునిగిన వారికి అద్వితీయమైన జ్ఞానం అలవోకగా లభిస్తుంది. అమరత్వం సిద్ధిస్తుంది.

1128. అనన్యమైన ఏకాత్మగా వెలుగొందే సత్యజ్ఞాన శివభోగ రసంలో మునిగిన జ్ఞానులు, జీవుని మనస్సనే ఎడారి భూమిని దేవతలు సయితం ఇచ్చగించే (భక్తి జ్ఞానములనెడి పంటలు పండే) సస్యశ్యామల భూమిగా మార్చగలరు.

1129. ఆత్మ శాంతి పొంగే మనస్సు గల జ్ఞానుల వద్దకు వచ్చే వారి చిత్తం కూడా మహానందం పొందుతుంది. బ్రహ్మానందములో మునిగి అనుగ్రహంతో వెలిగే ఆ జ్ఞానుల ముఖ మండలం భక్తభ్రమరములు మూగే వికసిత జ్ఞానపద్మమే మరి!

## 46. జ్ఞానులకు సేవ

1130. జ్ఞానులకు దివ్య సేవలనందించే భక్తులకు మాయా మోహం నశిస్తుంది. అనుగ్రహ సంపద లభిస్తుంది. ఆ భక్తులు అభీష్టసుఖములను అనుభవిస్తారు.

## 47. వాసనాక్షయం

1131. జ్ఞాని “ఈ శరీరమేనేను" అనే అహంకారము లేనివాడు. సమస్తవాసనలు నశించినవాడు. అందుచేత అతడు కలలో కూడా వ్యాకులత చెందడు.

1132. మనుష్యుల కంటే తక్కువైన జంతువులు పక్షులు మొదలైన ప్రాణులన్నీ ఎప్పుడూ ఎడతెగక చలించే మనస్సులతో జీవిస్తాయి. జ్ఞాని మనస్సు అలా ఏ తలపులతోనూ విచలితంకాదు. సత్తా మాత్రముగా జీవించే జ్ఞానియే నిజముగా జీవించేవాడు.

వివరణ : మనోనాశమైన మౌన జీవితమే మానవ జీవితం. అట్లాగ కాకుండా, చంచల మనస్సుగల మానవ జీవితం మృగపక్ష్యాదుల జీవితమేయని భావం.

1133. తన మనస్సు ఎక్కడో ఉంది. పురాణ ప్రసంగాన్ని మాత్రం చాలా సమయం కూర్చొని వింటున్నట్టు కన్పిస్తాడు కాని ఏదీవిననివాడే అతను. అట్లాగే వాసనలు నశించిన జ్ఞాని ఎన్నో వ్యవహారాలు నిర్వహిస్తున్నా ఏదీ చేయని వాడేయవుతాడు.

1134. శరీరం నిద్రలో అచేతనమై పక్క మీద ఉండినా, స్వప్నంలో ఒక కొండపైకి ఎక్కి లోయలో తల క్రిందులుగా పడిపోతున్నట్లు చూసి దుఃఖిస్తున్నట్లే, ఏమీ చేయక ఏకాంత వాసంలో ఉన్నాకూడా, మనోవాసనలు నశించని వాడైతే అతను అన్ని వ్యవహారాలను కర్తృత్వబుద్ధితో చేసిన వాడే అవుతాడు.

## భగవాన్ - 22

ఒక కథ వింటున్నట్లుగా కనిపించే వారిలా వాసనాక్షయమైన మనస్సుగలవాడైన జ్ఞాని ఏ వ్యవహారాలలో వున్నట్టు కనిపించినా ఏమి చేయని వాడే అవుతాడు.

వాసనలు నిండిన మనస్సుగల వారైన మనుష్యులు ఏకార్యమూ చేయక కళ్ళుమూసుకొని వూరకయున్నా అన్ని వ్యవహారాలు చేసినవారే అవుతారు. ఎందువలనంటే నిద్రపోతున్న ఒకని శరీరం అచేతనమైయున్నా, తాను చూసే స్వప్నంలో, తాను ఒక కొండ ఎక్కి అక్కడి నుండి లోయలో పడిపోతున్నట్లు చూసి దుఃఖపడుతున్నాడు కదా! అట్లాగేయని గ్రహించు!

వివరణ : 1133, 1134 భావాలను పై వచనంగా రచించారు శ్రీ భగవాన్. ఈ భావాన్నే ఉన్నది నలుబది అనుబంధంలోని 30వ పద్యంలో చూడగలరు.

## 48. జీవన్ముక్తులు

1135.-1136 ఈ రెండు భావాలు పరస్పర పూరకాలు. అందువల్ల రెంటికి భావం ఇక్కడయిచ్చారు.

"కర్తృత్వం నశించిన ఆ ముక్తులు కూడా తమకు విధించిన ప్రారబ్ధకర్మలకు లోనైనవారై శరీర ధారులై అనేక ప్రవృత్తులతో జీవితం గడపి, కార్యాలను చేస్తూ కష్టాల నేకం అనుభవించటం చూస్తున్నాము. కనుక వారు కర్మ బంధ ముక్తులు అని చెప్పటం సబబేనా?" అని మీరు ప్రశ్నిస్తే, దానికి సమాధానం వారు కష్టపడుతున్నట్లు కన్పించటం చూసే వారి దృష్టిలోనే తప్ప, తాము కష్టపడుతున్నామని చెబుతున్నారా? చెప్పండి?

వివరణ : ఒకసారి శ్రీ భగవాన్ "రేడియో పాడుతోంది; మాట్లాడుతోంది: అయితే దానిలో ఎవరూ లేరు కదా! అట్లాగే నా ఉనికి ఆకాశంవలె ఉంది. ఈ దేహం రేడియో పెట్టెవలె మాట్లాడినా లోపల కర్త ఎవ్వరూ లేరని తన స్వానుభవాన్ని తెలిపారు!

(ఉన్నది నలుబది అనుబంధంలోని 33వ పద్యభావాన్ని చూడండి)

1137. ఆ జ్ఞానులు సర్వాతీతంగా నుండే ఆత్మనే స్వరూపంగా అనుభవిస్తున్న వారైనప్పటికీ, జడ దేహాన్ని “నేను” అని ఎంచే అజ్ఞానులైన లోకులు ఆ జ్ఞానులను దుఃఖిస్తున్న శరీరంగా చూస్తారు. ఇది చూసేవారి దృష్టి దోషమని పై పద్యంలో తెల్పారు.

1138. కర్తృత్వ భావశూన్యులై భగవదేచ్ఛకి కట్టుబడి ఐహిక జీవితాన్ని గడుపుతున్న జీవన్ముక్తులను భక్తితో స్తుతించే సత్పురుషులకు పుణ్యం కలుగుతుందని, దూషించే దుష్టులకు పాపం కలుగుతుందని గ్రహించు.

1139. జీవన్ముక్తునికి కర్తృత్వం లేనపుడు వాని ద్వారా కర్మలు ఎట్లా జరుగుతాయి? జరుగవు. అయితే వారు కర్మలోనరుస్తున్నట్లు చూస్తున్నామే అని ప్రశ్నిస్తే, వారిలో కర్తృత్వ భావం లేదు. అహంకారం లేదు. భగవంతుడే వారి హృదయంలో ఉంటూ ఆ కర్మలను ఆచరిస్తున్నాడని గ్రహించు.

1140. అహంకార మమకారాలు రెండూ నశించిన పరమమౌన స్థితిలో జీవన్ముక్తులు చేసే పనులన్నీ, గాఢనిద్రలో నుండే శిశువులను కూర్చోపెట్టి వారికి ఆహారం పెడుతున్నప్పుడు నిద్రలో ఆ శిశువులు తినడం వంటిదే అవుతుంది.

వివరణ : నిద్రలో శిశువు తాను తింటున్నాను అనే కర్తృత్వమో, రుచియిది యనే భోక్తృత్వమో లేనివాడైయున్నాడు. అయితే భుజించటం అనే చర్య మాత్రం పూర్తి చేసినట్లు, మౌనస్థితిలో నుండి నిద్రపోని నిద్రలో ఉండే జ్ఞానులలో కూడా కర్తృత్వ భోక్తృత్వాలతో కూడిన కర్మలు కనబడుతున్నాయనేది భావం.

1141. కూలి కోసం బరువును తలపై మోస్తున్నవాడు గమ్యం చేరగానే బరువును దింపి సంతోషిస్తున్నట్లు జీవన్ముక్తుడు కూడా తన శరీర భారాన్ని అంతిమ సమయం వరకు మోసి, అప్పుడు బరువును దించుకున్నట్లుగా భావించి, త్యజిస్తాడు.

వివరణ : శ్రీ భగవాన్ భౌతిక జీవితం చివరి రోజుల్లో భక్తులు "భగవాన్! ఇంకా అనేక సంవత్సరాలు మీరు ఈ శరీరంతో జీవించి వుండాలి" అని ప్రార్థించినపుడు "భోజనం చేసి అవసరం తీరిన పిదప విస్తరాకును పారవేయమా!" అని వారు సమాధానం చెప్పారు.

1142 అల్పక్రిమి ఒకటి సముద్రపు అలల లోతుల్లో చిక్కి మరణించే క్షణంలో మరల లేవలేదు. పెద్ద అల వచ్చి దానిని ముంచేస్తుంది. అలాగే సత్యజ్ఞాన తరంగములు ఉప్పొంగినపుడు, శరీరాన్ని నేను అని అభిమానించే అల్పమైన అహంకారం కించిత్తయినా తలెత్తి నిలువగలదా?

1143. “నేను ఇది” అనే అహంకారం నశించి, ఆత్మ స్వరూప మహిమను గ్రహించిన మనస్సు (జ్ఞానం) ఈ లోకపు దృశ్యాల మోహంలో పడుతుందా? అట్లాగే నామ రూపరహిత చిదాకాశ సమమైన జ్ఞాన స్థితిలో అసత్యపు ద్వైత దృశ్యాలు సత్యత్వాన్ని పొందుతాయా? (సత్యం కాదన్నట్లు).

1144. జనన మరణాలకు లోనై దుఃఖపడే జీవుడు ఉత్సాహంతో శ్రమించిపొంద దగిన జీవన్ముక్తి దశ ఎట్టిది? స్వరూప విస్మృతి వల్ల జన్మించిన అహంకారం అనగా జీవుడు తిరిగి ఆత్మ స్వరూపమును తెలుసుకొనటమే.

1145. భర్త మరణిస్తే ముగ్గురు భార్యలూ వైధవ్యాన్ని పొందుతారు. అలాగే కర్త నశిస్తే ప్రారబ్ధ ఆగామి సంచితములనే త్రివిధ కర్మలూ నశిస్తాయి. ఆగామి సంచితములు మాత్రమే నశించి ప్రారబ్ధం మాత్రం మిగులుతుందని చెబితే, అది భర్త మరణానంతరం ఇరువురు భార్యలే విధవలై ఒక భార్య మాత్రం సుమంగళిగా ఉంటుందని చెప్పినట్లువుతుంది కదా!

వివరణ : ఆ జ్ఞానులకు ప్రారబ్ధం మాత్రమే మిగిలి ఉంటుందన్నది నిజంకాదని భావం.

## భగవాన్ - 23

భర్త మరణించిన వెంటనే అతని అనేక భార్యలు ఎవ్వరూ వైధవ్యం పొందని వారుగా ఉండలేరు. అట్లాగే, కర్త జ్ఞానం చేత నాశమైన పిదప కర్మత్రయాలూ ఆ జ్ఞానికి లేనట్లే పోతాయి.

(ఉన్నది నలుబది అనుబంధం 33వ పద్య భావమే యిది)

1146. ప్రారబ్ధం వల్ల పుట్టిన ఈ శరీరం ప్రారబ్ధ కర్మ ఫలాన్ని అనుభవింపక తప్పదు. అయితే జడ శరీర సంబంధాన్ని త్రెంపుకొని, శరీరం కంటె భిన్నంగా ఉన్న జీవన్ముక్తుడు ప్రారబ్ధ కర్మ ఫలాన్ని దాటిన వాడవుతాడు.

1147. ఈ దేహం ప్రారబ్ధం వల్ల పుట్టింది కదా! జ్ఞానం వల్ల ప్రారబ్ధం నశిస్తుందని చెబితే ప్రారబ్ధా ధీనమైన దేహం కూడా నశించాలి. కాని జ్ఞాని శరీరంతో తిరుగుతున్నాడు కదా! ఎలాగ? అని ప్రశ్నిస్తే స్థూల శరీరం రాలిపోకుండా ఇంకా ఉన్నదని తెలిసేది ఎవరికి? జ్ఞానికా? లేక దానిని చూసే అజ్ఞానికా? నీవే న్యాయం చెప్పు.

1148. చిత్తుగా త్రాగి మత్తెక్కి కండ్లుకాననివానికి తన వంటిమీద గుడ్డలున్నాయో లేదో తెలియదు. అట్లాగే ఆకాశం వంటి తన చిత్స్వరూపాన్ని తెలుసుకొని తన్మయుడై ఉన్న జ్ఞానికి కూడా తన శరీరం ఉందో లేదో తెలియదు.

## భగవాన్ - 24

పై భావాన్ని శ్రీ భగవాన్ తమ అనుగ్రహ వాక్కులతో చెప్పినది.

కల్లుతాగిన మైకంలో కండ్లు కనిపించని వానికి తన వంటిమీద ధరించిన వస్త్రాన్ని గురించి తెలియదు. అట్లాగే, ఆత్మని గ్రహించిన జ్ఞాని, అస్థిరమైన ఒక దేహం తనని చేరినా, ఉన్నా, పనులు ఆచరిస్తున్నా, ఆచరించక పోయినా దానిని తెలుసుకోడు.

1149, నిరంహకార స్వరూపులైన జీవన్ముక్తులు ప్రాణంతో దేహం ఉన్నట్లు కన్పడతాడు. ఇది కాలి బూడిదైన ఎర్రని పట్టు చీర నిజమైన వస్త్రంవలె కనబడుతూండటానికి సమానం.

1150. పాము కాళ్లు పాముకే తెలుస్తాయి. అట్లాగే జ్ఞాని సహజస్థితి జ్ఞానికే తెలుస్తుంది. ఆత్మ జ్ఞానం లేని వారు జ్ఞాని యొక్క సహజ స్థితిని ఉన్నదున్నట్లు తెలుసుకోలేరు. తప్పుగా అర్థం చేసుకుంటారు.

1151. అహంకారం నశించి, ఆత్మ స్వరూపమౌన స్థితిలో నిలుకడ చెంది మహానంద మగ్నుడైన జ్ఞాని యొక్క అద్వైత బ్రహ్మానుభవాన్ని ఎవరూ అర్థం చేసుకోలేరు.

## భగవాన్ - 25

(1151వ భావాన్ని శ్రీ భగవాన్ అనుగ్రహించిన ఈ వచనం ఉన్నది నలుబది గ్రంథములోని 31వ పద్యమే) అహంకారం నశించి, ఆత్మ స్వరూప జ్ఞానం పొందిన జ్ఞానికి ఇక చేయవలసిన కార్యాలేముంటాయి? తమ స్వరూపం తప్ప అన్యంగా దేనినీ చూడలేరు. వారి మహోన్నతమైన స్థితిని మనం ఎట్లాగ ఊహించుకోగలం?

## 49. జ్ఞానులు

1152. జ్ఞానుల గొప్పదనం మాటలకందనిది. వారి స్థితి వారొక్కరికే తెలుస్తుంది. జ్ఞాని ఆకాశం కంటే విశాలమైనవాడు. పర్వతంకంటే దృఢమైనవాడు. నీ దేహాత్మ బుద్ధి నశించిన తర్వాతే నీవు జ్ఞానియొక్క గొప్పదనాన్ని బాగా తెలుసుకొనగలవు.

1153. తనకి ఎటువంటి రూపములేకుండా సకల నామరూప జగత్తులను నిజంగా ఉన్నట్లుగా గోచరింపచేసే ఆత్మ స్వరూపమైన సత్యజ్యోతిని "అది నేనే" అని ఎరిగిన జ్ఞాని, బ్రహ్మవిష్ణు శివలోకాలన్నిటికీ ప్రభువగునని తెలుసుకో.

1154. ఆత్మ స్వరూప నిరతిశయానంద సాగర గర్భంలో ఉంటూ, తురీయ స్థితిలో చొక్కియుండే జ్ఞాని. ఇక లోకంలో ఏ కారణం చేతనూ త్రిపుటుల మోహంలో పడి దుఃఖించడు.

1155. ఆత్మ స్వరూపానుభవాన్ని ప్రమత్తులై జారవిడచి, స్వప్నం వంటి ఈ జగత్తునూ, దానిని తెలుసుకొనే అహంకార మయ జీవితాన్నే జాగ్రత్తు అనుకొని దానినే వాంఛించు పండితులు లౌకిక తెగలకు చెందుతారు. అట్లుగాకుండా, తనను (ఆత్మని) తెలుసుకొన్న జ్ఞానులు మరొక తెగవారు.

1156. శాస్త్రగ్రంథాలను ఎంతగా చదివి శోధించి విశ్లేషించినా, అవి "నిన్ను నీలోనే బాగా విచారించి తెలుసుకో" అని చెప్పటంతోనే సరి. అద్దాన్ని ఎందుకు చూసుకుంటారు? అందులో కనబడే ప్రతిబింబాన్ని బట్టి తమ ముఖాన్ని స్పష్టంగా చూసుకోటానికే కదా!

వివరణ : అద్దం అలంకారానికి పనికొస్తుంది. అద్దంలో తన ముఖాన్ని చూసుకోవటానికే గాని అద్దం యొక్క గొప్పతనాన్ని వర్ణించటానికి కాదు. అట్లాగే గ్రంథాలు కూడా. గ్రంథాలు "నీవు బ్రహ్మం" అని చెప్పగానే తాను అనుభవం చేసుకోవాలి. అంటే తనలో తాను అంతర్ముఖుడై విశ్లేషించుకోవాలి. అది గ్రంథ ప్రయోజనం. ఇక్కడ శ్రీభగవాన్ రచించిన "నేను ఎవరు?" అనే గ్రంథంలోని భావాన్ని చూడండి.

1157. తన్ను తెలుసుకోవలసిన వస్తువుగా వివరించే అద్దంవంటి శాస్త్రాలను అధ్యయనం చేసిన వారిలో బ్రహ్మసూత్రాలు, మరల దానికి భాష్యాలు ఇత్యాదులు యింకా అలాపరిస్తూనే ఉండేవారు ఎందరో లెక్కలేదు. ఆ శాస్త్రాలు బోధించినట్లు తమ ఆత్మ స్వభావాన్ని విచారించి తెలుసుకొని మోక్షం పొందేవారు చాలా కొద్దిమందే.

1158. నిజానికి, ఆత్మజ్ఞానం పొందిన జ్ఞానులు వేరు. ఆ ఆత్మజ్ఞానాన్ని గురించి చెప్పే శాస్త్ర పండితులు వేరు. కనుక అజ్ఞానబంధం తొలగి ముక్తి పొందగోరువారు శాస్త్ర పండితులను వదలి పరమాత్మనిష్టలో నుండే జ్ఞానుల వద్దకు పోవడమేమంచిది.

1159. ఏ సద్వస్తువు తన దివ్యశక్తి చేత ఈ ప్రపంచాన్నంతా భరిస్తున్నదో, ఆ పరమ వస్తువుని తెలుసుకొన్న జ్ఞాని ఉపదేశించే మాట అజ్ఞాన మోహాంధకారవశమై చాలాకాలం దుఃఖిస్తున్న జీవులకు తరించటానికి తగిన ఆధారమవుతుంది (ఊతకర్ర).

## 50. జ్ఞానుల కర్మలు

1160. కర్మచేయకుండుటయే (నిష్క్రియయే) జ్ఞానావధియని తీర్మానిస్తే, ఏపని చేయలేని కుష్ఠరోగి స్థితి కూడా జ్ఞానావధే కదా! అది తప్పు. చేసే కర్మల ఫలితాలపై ఇష్టానిష్టాలు లేకుండా కర్తృత్వ భావం లేకుండా ఉండే యుత్కృష్ట స్థితే సరైన జ్ఞాన స్థితియని తెలుసుకో.

1161. ఆలోచనలు లేని ఆత్మ స్థితిలో జీవించే జ్ఞానులకు ఆలోచించవలసిన ఏ తలపూ లేదు. ఆత్మలో వారు పొందేది మౌనానుభవం ఒక్కొటే. ఆ పరమస్థితిలో తన కన్యంగా ఒక్కవస్తువూ ఉండదు. పొందవలసినదీ లేదు.

1162. కేవలం “ఉన్నాను" అన్న ఎరుకే తన నిజస్థితియని గ్రహించి, ఎటువంటి ఆలోచనలు లేక తన ఆత్మస్థితిని గాంచిన జ్ఞానులు, గొప్ప కార్యాలలో నిమగ్నులైనా, ఆ కార్యాలకి తామే కర్తయని భావింపరు. వారు అకర్తలే. కర్తృత్వము లేనివారే.

1163. స్వధర్మమైన ఆత్మ నిష్ఠలో నుండి సర్వాతీత సహజ స్థితిని పొందిన జీవన్ముక్తులు (దేహ ప్రారబ్ధానుసారం కలిగిన) బాహ్య జీవితంలో నియమ నిష్ఠలను వదలక పాటించవచ్చు. లేదా ఆ నియమాలను పూర్తిగా వదలి వేయవచ్చు. ఎలా చేసినా, వారిలో ఆత్మ సౌందర్యమే తొణికిసలాడు తుంటుంది.

1164. ఆత్మ స్వరూపుడైన జీవన్ముక్తుడు లోకంలో చూచేవారికి ఒక శరీరధారిగానే సంచరిస్తున్నట్లు కన్పించినా, త్రిలోకాలను తన వశం చేసుకొని తన మూడు పాదాలతో కొలచిన త్రివిక్రముడైన వామనునిలాగా సచ్చిదాకాశములో రెండు పాదాలతో సంచారం చేస్తుంటాడు.

1165. శ్రోత్రము, త్వక్కు, చక్షుసు, జిహ్వ, ఘ్రాణము ఇవి జ్ఞానేంద్రియాలు. వాక్ పాణిపాద పాయూపస్థలు కర్మేంద్రియాలు. ఈ పదితో కూడిన మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారములతో కలిసినవి కార్యకరణాలు. "కార్యకరణాల సంఘాతమైన ఒక వ్యక్తే సకల కార్యాలను చేసే కర్త అవుతాడు (అయితే నేను ఇవికాను కనుక అకర్తను)" అని తెలుసుకొని త్రోసిపుచ్చి, వాటితో ఎటువంటి సంబంధములేని జ్ఞాని ఎన్ని కర్మలు చేసినట్లు ఇతరుల దృష్టికి తోచినా అతను నిజానికి ఏమీ చేయనివాడే.

1166. (ప్రారబ్ధానుసారం) యాదృచ్ఛికముగా లభించిన దానితో తృప్తి చెందినవారై, ద్వంద్వాలకు అతీతులై, అసూయలేనివారై, జయాపజయాలలో సమభావంతో ఉంటూ శాంతమనస్కులైన జ్ఞానులు కర్మలచేత బంధింపబడరు.

### భగవాన్ - 26

(1166వ భావాన్ని శ్రీ భగవాన్ ఒకే ద్విపద వెణ్బాలో రచించినది ఇది). దొరికిన దానితో తృప్తి పడి, అసూయలేనివాడై ద్వంద్వాతీతుడై సమాధి స్థితుడైన జ్ఞాని ఆచరించినా (కర్మలని) బంధరహితుడేయవుతాడని గ్రహించు.

## 51. ఆత్మ నిష్ఠ ( Self Abidance )

1167. బాహ్య చిహ్నములను బట్టి జ్ఞానిని గుర్తించటానికి ప్రయత్నించే వారు అతని వద్ద ఏదీ చూడలేక వెనుతిరుగుతారు. తమ చర్మచక్షువులతో జ్ఞానిలోని అంతర్జ్యోతిని వారు చూడలేరు.

1168. జీవన్ముక్తుల మహిమను వారి సిద్ధులతో అంచనా వేయడం అతి తెలివి తక్కువ తనం. వారిలో సిద్ధులున్నవారు సిద్ధులు లేనివారు అని రెండు రకాలుగా ఉంటారు. కనుక. సిద్ధులను చూసి ఆశ్చర్యపోయే పామరులు జీవన్ముక్తుల మహిమను తెలుసుకోలేరు.

1169. సర్వాతీత జ్ఞాన స్థితిలో నుండే జీవన్ముక్తుల నిజమైన మహిమను తమ అల్పబుద్ధితో తెలుసుకున్నామని విర్రవీగి, ఆ జ్ఞానులకు అనేక సిద్ధులను ఆపాదించి వారి మహోన్నత మహిమను కించపరిచే మూఢులతో నిండినదే ఈ ప్రపంచం.

1170. పరవస్తువే అయిన పరిపూర్ణ జ్ఞానుల సిద్దులను చూచి వారి మహిమను నిర్ణయించటం ఇంటి పైకప్పులోని చిన్న రంధ్రం ద్వారా ప్రసరిస్తున్న కిరణాలలో ఒక కిరణకాంతిని బట్టి కోటి ప్రభల సూర్యకాంతులను కొలిచినట్లుంటుంది.

117% శరీరంతో సహా ఈ జగత్తంతా తానైన సచ్చిత్ స్వరూపమే ఆత్మయని 1177 అనుభవం చేసుకొన్న జ్ఞాని, ఈ శరీర జగత్తులతో ఏకమై జీవిస్తుంటాడు. శరీరంతో తాను బద్ధుడైనట్లు కన్పిస్తాడు. చూచేవారిని మోహవశులను చేస్తాడు. ఆ జీవన్ముక్తుని బాహ్య రూపాన్ని బట్టి ఎవరు వానిని యథార్థంగా తెలుసుకొనగలరు? (లేరని భావం).

## 52. మౌన శక్తి

1172. స్వచ్ఛమైనది, జ్ఞానాన్నిచ్చేది. శబ్ద రూపంలో అన్ని అక్షరాలకి మూలమైనది, అసమానమైన అక్షరమొకటి తానుగా నిరంతరం హృదయంలో ప్రకాశిస్తున్నది. దానిని ఎవరు అక్షరరూపంలో వ్రాయగలరు? (వ్రాయ లేరు అని)

వివరణ : ఒకసారి ఒక భక్తుడు భగవానునికి తన నోటు పుస్తకమిచ్చి వారి స్వహస్తాలతో ఏదైనా ఒక అక్షరం వ్రాసి ఇవ్వమని ప్రార్థించారు. భగవాన్ ఈ పద్యంలోని చివరి పంక్తులని వ్రాసి యిచ్చారు. తర్వాత దీనిసే ఒక వెణ్బాగా రచించారు. దాని భావం అక్షరం అంటే ఒక అక్షరమే. దాన్ని ఈ నోటు పుస్తకంలో వ్రాసి ఇవ్వమని నువ్వు యాచిస్తున్నావు. అవినాశియగు ఆ ఒక్క అక్షరం హృదయంలో నిరంతరం తానుగా నేను నేను అని చిద్రూపంగా ప్రకాశిస్తున్నది. కనుక దానిని ఎవరు అక్షర రూపంలో వ్రాయగలరు? పిదప ఈ పద్యాన్ని సంస్కృతంలోను, తెలుగులోను రచించారు. తదుపరి ఈ భావాన్ని శ్రీమురుగనార్ ఈ గ్రంథంలో 1172వ వచనంగా రచించారు.

ఇక్కడ తెల్పిన 'ఒకే అక్షరం' అంటే ఆత్మ స్వరూపమే. మౌనమే దాని నిజరూపము. నేను నేను అనే అహం స్ఫురణ, వెలుగు శబ్దములకు ఆవల గోచరించేది. ఎటువంటి శబ్దంలేక స్ఫురణ మాత్రంగా గోచరించుటచేత అది నాదానికి అతీతమైనది. అందువల్ల భాషకి అందనిది. అట్లాగే అది రూపానికి అతీతమైనది. నేను అనే పరమ తత్త్వస్ఫురణ యొక్క ప్రకాశంగా తదుపరి పుట్టిన దాని శబ్ద రూపమే 'ఓం' అనే ప్రణవం. అయితే 'నేను' అనే అది ఈ ఓంకార శబ్దానికి భావంగా గోచరించుట చేత, శ్రీభగవాన్ దానిని "ఓంకార వాక్యార్థ ఉత్తమ సమహీన నిన్నెవరెరుగువారరుణాచలా!" అనీ ఓం అనే శబ్దానికి మారు పేరు 'అహం (నేను)' శబ్దరూపాలు దాటిన స్ఫురణయేయని చెప్పారు.

ఈ గ్రంథంలోని 712, 713వ వచనమును కూడా ఇక్కడ ఒకమారు చదువుకోవాలి.

ఆత్మయే ఆది వస్తువు. దానిని వ్రాయగలవారు ఎవరు? ఎక్కడుండగలరు అని శ్రీ భగవాన్ ప్రశ్నిస్తున్నారు. తానుగా ప్రకాశిస్తున్నదానిని ఉన్నది ఉన్నట్లే తెలుసుకోవాలే తప్ప చెప్పడానికి గాని వ్రాయడానికి గాని వీలు లేదని, నోటు పుస్తకం ఇచ్చిన ఆ భక్తుని ద్వారా ఈ లోకానికి ఒక ఉపదేశాన్ని అందించారు శ్రీ భగవాన్.

1173. చాలా స్పష్టమైనది, సత్యమైనది, అన్ని భాషలకు మూలమైన ఒక దేశ భాష ఏదని ప్రశ్నిస్తే, మర్రిచెట్టు నీడన పరమాత్మ జ్ఞానమే రూపమై అవతరించిన ఆది గురువులు శ్రీ దక్షిణామూర్తి ఉపదేశించిన పరమౌనమే ఆ భాష అని చెప్పాలి.

1174. అనేక వ్యాఖ్యాన గ్రంథాలు కూడా వివరించలేని శ్రేష్ఠమైన ఆ బ్రహ్మ స్వరూపం, సద్గురువుల మౌనం ద్వారానే తేటతెల్లమవుతుంది. కాబట్టి, ఆ మహాగురువుల మౌన వ్యాఖ్యానమే చాలా శ్రేష్ఠమైన వ్యాఖ్య.

1175. నిజమని భ్రమింపచేసే ఈ శరీర లోకాదుల ఉనికికి, మరణం వరకు వుండే దేహాత్మ బుద్ధియైన మనస్సే ఆధారము. ఈ మనస్సు యొక్క ఉత్పత్తి లయములకు హేతువై దానికి ఆధారంగా ఉంటున్నది అది వస్తువైన మౌనమే.

వివరణ : ప్రపంచం కనబడటానికి ఆధారం మనస్సు. మనస్సుకి ఆధారం మౌనమైన ఆత్మ. కనుక అవినాశియగు మౌనమే సకలానికి ఆధారమని భావం.

1176. పరతత్త్వము ఒకటి ఉన్నదని, లేదని, దానికి రూపమున్నదని, లేదని, అది అద్వైతమని, ద్వైతమని వాదించుకొనటం మతం కాదు. అట్లాగ వాదించక, ఎప్పటికీ తరగని అనుభూతియైన సచ్చిదానంద ప్రకాశ మౌనమే, నిజమైన మతం.

వివరణ : ఉన్నది నలుబదిలోని 34వ పద్యాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి.

1177. సర్వాతీతమైనది, ఆదిమతమైన మౌనజీవితం హృదయంలో నిల్చి ఆత్మజ్ఞానము ఉదయించనంత కాలం జాతి మతాలకు ఆధారముగా నిల్చియున్న అంతులేని ఆచారాలతో కర్మకాండలతో అజ్ఞానంతొలగిపోతుందా? భేద బుద్ధి నశిస్తుందా? (నశించదు).

1178. సముద్రంవైపు ప్రవహిస్తూ అందులో కలిసిపోయే నదులులాగా మతాలన్నీ చిదానంద సాగరమైన శివునిలో విలీనమవుతాయి. వాని గమ్యం అదే. అవి అన్నీ చివరికి శివమయమే అవుతాయి. కనుక మతాల లక్ష్యంలో భేదాలుండటానికి తావులేదు.

1179. మత సిద్ధాంతాలలో భేదాలను చూసే నేనెవరు? అని ఆత్మ విచారణ చేస్తూ, తనలో తాను మునిగియున్నట్లయితే, ఆత్మ అయిన తాను తప్పనేను అనే ప్రత్యేకమైన వ్యక్తి లేకుండాపోవడం తెలుస్తుంది.

1180. అటువంటి మహామౌన స్థితిలో భేదభావం ఉండదు సరే (ఆ ద్వంద్వాలలో) అభేద భావం అయినా ఉంటుందా అని ప్రశ్నిస్తే, జ్ఞానులు చెప్పే అభేదానుభవం సమస్త భేదభావ శూన్యస్థితినే సూచిస్తుంది.

1181. ఈ చిక్కు ప్రశ్నలూ వాటి జవాబులూ రెండూ ద్వైత భాషకు చెందినట్టివి. మౌనం అనే అద్వైత జ్ఞాన భాషలో అవి వుండవు.

వివరణ : ఈ పద్యం పంచదశి నుండి అనువదింపబడినది.

## భగవాన్ - 27

ప్రశ్నలు జవాబులు అన్నీ ద్వైత భాషలోనే. అద్వైత భాషయైన మౌనంలో అవి లేవు.

1182. గురు శిష్యుల మధ్య జ్ఞాన విషయ బోధన ఇద్దరి మధ్య సంవాద రూపంలో జరుగుతుంది. ఏ స్థితిలోనుంటే ఇద్దరి మనస్సులు ఏకమవుతాయో, ఆ మనస్సు లేని మౌన స్థితిలో నుండటయే ఉత్తమమైన సంవాదము.

## 53. శుద్ధ మౌనం

1183. పరమానందానికై చేయతగ్గ తపస్సు విచారణ. దానితో హృదయంలో సాక్షాత్కరించే ఆత్మ స్వరూపము భేదంతో కూడిన అజ్ఞానం నశింపగా మిగిలిన మౌనస్థితియే.

వివరణ : విచారణ ఫలితం అవిద్య నశించిన మౌనమేయని భావం.

1184, దుష్టాహంకార రూప మనః కల్పనలు నశిస్తే తాను అనంతమైనదిగా గోచరిస్తాడు. అదే అనంత జ్ఞానానుభూతి. అద్వితీయ మౌనస్థితి.

(మనః కల్పనలు నశించిన స్థితే మౌనస్థితి అని భావం)

1185. తలపుల రూపమైన మనస్సు నశించి, ఉనికిగా వెలిగే ఆత్మస్వరూపమైన మౌనమే ముక్తికి ముఖద్వారం. కనుక ఏదారిలో వచ్చినా ముక్తి నగరంలోకి మనస్సులేని మౌనం ద్వారానే ప్రవేశించాలి. అదే చివరికి ఆశ్రయమవుతుంది.

1186. అద్వితీయ పరతత్త్వమైన ఆత్మ స్వరూపాన్ని ఎడతెరిపి లేకుండా ఏకాగ్రతతో అవలోకించటమే పరమోత్తమ శుద్ధమౌనము. అంతేగాని సోమరితనంతో జడ స్థితిలో ఉంటే అది తామసిక స్థితి అవుతుంది.

(మనస్సు యొక్క సోమరితనం మౌనం కాదు. ఆత్మావలోకనమే శుద్ధమౌనం అని భావం)

1187. అహంకారం విజృంభించని ఆత్మావలోకనం చేత నిరంతరం భగవంతుని పాదాలని స్తుతించి, పట్టువిడవని హృదయం యొక్క మౌన స్థితియే సహజమైన నిజమైన ఆరాధనయని గ్రహించు.

1188. శివమే తమ స్వరూప సత్యమనే అనుభవం గలవారే మహత్తర మౌన స్థితిని పొందినవారు. కనుక, శివమును తప్ప మరేదానిని "నేను" అని అభిమానించి ఏకర్మలు చేయవలసిన అవసరము లేక శివరూపంలోనే నిష్ఠగలవాడవై యుండు.

1189. "నేను ఇది" అని ఎగసే మొదటి తలపు అయిన మిథ్యాహంకారాన్ని "ఎవరు? అని విచారణ చేసినట్లయితే "నేను" అనే అహంత నశిస్తుంది. అహంతారహితమై ఆత్మ మిగులుతుంది. ఆ దివ్య స్థితియే శరణాగతి తత్త్వము.

1190. కర్మబద్ధుడైన జీవుణ్ణి, ప్రారబ్ధం మిగిలి ఉన్నంతవరకు పరమేశ్వరుడు తదనుగుణంగానే నడిపిస్తుంటాడు. ప్రారబ్ధం ప్రకారమే అంతా జరుగుతుంది. జీవుడు ఎంత ప్రయత్నించినా జరుగనిది జరుగనే జరుగదు. జరిగేది ఎంత వద్దనా జరిగే తీరుతుంది. కనుక మౌనముగా నుండుటయే మంచిది.

వివరణ: శ్రీ భగవాన్ ప్రధమంగా తమ తల్లిగారికి వ్రాసిచ్చిన ఉపదేశమే ఈ వచన భావం.

1191. భగవదాజ్ఞకి విరుద్ధంగా ఎవరూ ఏమీ చేయలేరు. అందుచేత అన్నిచింతలూమాని భగవత్పాదాల వద్ద మనస్సుంచి మౌనంగా నుండటయే చేయతగ్గ పని.

1192. ప్రవహిస్తున్న నీటివలె ఉన్న మనస్సులో అహంత ప్రతిబింబించి చలిస్తుంటుంది. ఆ చలనాలే తలపులు. ఆ తలపుల చలనాన్ని పూర్తిగా ఆపటం ఎలా? ఆ తలపులను కదలికలను గమనించకూడదు. అలాచేస్తే స్వస్థితి నుండి జారిపోతారు. తలపులను గమనించటానికి బదులు తననే తాను గమనిస్తూ మౌనంతో ఉండాలి. అదే శ్రేష్ఠం.

1193. అహంతారహిత జ్ఞాన సమాధియే మౌనం అనీ అదే తపస్సు అనీ బ్రహ్మజ్ఞానులంటారు. హృదయంలో సదా ఆత్మాభిముఖుడై ఉండటమే దేహాత్మభావ శూన్య మౌన తపస్సును సాధించే మార్గం.

1194. అన్యవస్తువులను నిజమని నమ్మి మోసపోకుండా బహిర్ముఖమై ఉన్న మనస్సును అంతర్ముఖమొనర్చి హృన్నిష్ఠుడైతే "నేను ఈ దేహమే" అనే అహంకార భావంపోయి శుద్ధ మౌనం ప్రకాశిస్తుంది. అదే జ్ఞానం యొక్క పరమావధి.

1195. కలలో ఎన్నో విషయాలు చూస్తాం. అవి అన్ని మేల్కొన్న పిదప మిథ్య అనీ, హాస్యాస్పదమైనవనీ తెలుస్తుంది. అలాగే జ్ఞానమనే మెలకువ కలిగినపుడు ఆత్మయందు కల్పితమయిన జనన మరణాది జీవిత సంఘటలన్నీ నశించిపోతాయి. కాబట్టి బంధము, ముక్తి అనే వన్నీ మిథ్యా విషయములే.

1196. భగవదనుగ్రహం కారణంగా స్వస్వరూప దర్శనమైనపుడు, అజ్ఞానాంధ కారంలో కొట్టుమిట్టాడుతున్న జీవుడు సచ్చిద్రూపమైన శివానందలహరిలో మునిగి, ఆత్మసాక్షాత్కార రూపమైన మౌనంలో కరిగి పోతాడు.

1197. త్రోసి పారేయవలసిన సంకల్పవికల్పాలనే కల్పితాలన్నిటినీ తీసేసి, అహంకారం హృదయంలో అణగి రూపరహితమైనప్పుడు అక్కడ ప్రకాశించే పరిపూర్ణాత్మ స్వరూప జ్ఞానమైన మౌనమే 'పరావాక్కు' అని శ్లాఘిస్తారు.

వివరణ : భగవాన్ రచించిన 12వ వచనంలో, 706, 715 వచనములలో చెప్పిన పరావాక్కు అంటే ఏమిటో ఈ వచనం వల్ల బాగా, తేట తెల్లమవుతుంది. కనుక వాటిని ఇక్కడ మరొకసారి చదువుకోవలెను.

1198. చలించే మనస్సు అణగి, హృదయంలో నశించి, అక్కడ వెలిగే పరావాక్కు అయిన (ఆత్మయొక్క) ఈశ్వరుని దివ్యవాక్కుల మాధుర్యాన్ని విని అనుభవించని మానవులే, పిల్లనగ్రోవి మధురమని, వీణావాదం మధురమని, ఈ రెంటి నాదాలకంటే తమ చిన్నారుల పసిడి పల్కులే అత్యంత మధురమైనవని శ్లాఘిస్తారు.

1199. అవిశ్రాంతంగా ఎగసే తలపుల సాగరతరంగాల హోరు తగ్గితే కాని, మాటలలో వర్ణించలేని మౌన స్థితి తెలియదు. మనో వ్యాపారాన్ని నశింపజేసిన జ్ఞానులు, మహాసంగ్రామంలోని భయంకరమైన కేకల మధ్య తాముఉన్నా కూడా శక్తివంతమైన తమ మౌన స్థితి నుండి పైదొలగరు.

1200. దేహాన్ని "నేను" అని అభిమానించకుండా హృద్గతమైన మౌనాన్ని అనుభవించలేనివారు, ఆత్మవిచారణ చేయనివారు పాటించే వాఙ్మౌనం విశ్రాంతి లేని మనోవ్యాపారమే అవుతుంది. కదా! నీవే చెప్పు!

వివరణ : అంతర్ముఖులు అవకుండా కేవలం వాఙౌనం పాటించే వారి ప్రయత్నం నిరుపయోగమైనదని ఉపదేశం.

1201. మిథ్యా విషయ వ్యామోహం నశించాలి. అహంత తన మూలమైన ఆత్మలో లీనమై అణగి నశించి పోవాలి. అప్పుడు గోచరించే మౌనమే పరమానందమయ స్థితి అవుతుంది.

1202. విశుద్ధ మౌనస్థితిలో స్పష్టంగా గోచరించే ఆత్మ స్వరూపామృతాన్ని గ్రోలి మహానందంతో హృదయం ఉప్పొంగియున్న జ్ఞానులు ఈలోకంలో ఇంద్రియాల వెంటబడి పోయి నశించడు.

1203. ఋషులు దర్శించిన సకల వేదాగమ సిద్ధాంతాల సారమైన సత్యము, అనుష్ఠించవలసిన సదాచారము, ఏదంటే మౌనమనే పరమశాంతస్థితే.

వివరణ : మనోనాశమే పరిపూర్ణ మౌనమని శ్రీ భగవాన్ "నేనెవరు?" అనే గ్రంథంలో ఉపదేశించిన సత్యమే ఈ వచనంలో కూడా వివరించారు.

1204. ధర్మార్థకామాలనే మూడింటిని పూర్తిగా వదలిపేస్తేనే శాంతి ప్రదమయిన మోక్షసిద్ధి కలుగుతుంది. అందువలన ఆ మూడు విధాలైన అసత్ పురుషార్థాలను గురించిన సకల ఆలోచనలను పూర్తిగా త్యజించి పరమాత్మ స్వరూప ధ్యానంలో నుండే మౌనాన్నే ఆచరించాలి.

వివరణ : ఈ గ్రంథంలోని 8వ వచనమును ఇచ్చట చదువుకోవలెను.

## 54. పరాభక్తి

1205. పరాభక్తి అంటే భగవంతునికి తనను తాను సంపూర్ణముగా సమర్పించుకొన్న శ్రేష్ఠస్థితి. అక్కడ ప్రార్థించటానికీ, కష్టాలు విన్నవించుకోవటానికీ కొంచెమైనా ఇష్టం ఉండదు.

వివరణ : ఇది సంపూర్ణ శరణాగతి తత్త్వం. అరుణాచల నవమణిమాలలోని 7వ పద్యభావాన్ని ఇక్కడ జ్ఞాపకం చేసుకోవలెను.

1206. భగవదనుగ్రహానికి పాత్రమై పూర్ణానంద స్థితిలో నుండి ప్రకాశించే హృదయంలో, మానసిక వ్యధలు తలెత్తవు. అవి దేహాత్మ బుద్ధికి గుర్తులు. దేహాత్మ బుద్ధి అవిద్యా రూపము.

1207. ఇతరమైన తలపులు ఉన్నంతకాలం మనస్సుతో చేసే దైవధ్యానం కూడా జరుగుతుంది. పరాభక్తి అయిన ఆత్మ సమర్పణంలో ఇతర ఆలోచనలన్నీ నశించుటచేత, ఆ దైవచింతన కూడా నశిస్తుంది. అదే సత్యమైన బ్రహ్మ ధ్యానమవుతుంది.

1208 లేచేటువంటి తలపులన్నీ, నశించిన తర్వాత, ఊరకయుండే స్థితి కూడా ఒక తలపేనని శాస్త్రాలు చెబుతున్నాయి. పూర్ణ స్థితియైన "ఉన్నాను" అనే భావం ఎటువంటి మఱపులేని స్థితితో ప్రకాశించుట చేత అట్లు చెప్పబడినదని గ్రహించు. (అవిచ్యుత నిజ ప్రజ్ఞ)

1209. అజ్ఞానాంధకారమయమైన దేహాత్మ బుద్ధినశించి, హృదయం చిదాకాశంవలె ప్రకాశించి జ్ఞానం చేత నిర్మలము, శాంతము అయినపుడు అక్కడ పొంగి పొరలేది నిజమైన శివభక్తియే.

1210. భగవంతుడైన ఆత్మ స్వరూపమే నిరంతరం అన్నిటనూ శ్రేష్ఠమైన ఆశ్రయమని తలిచే భాగ్యశాలురు మాత్రమే ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతారు. అలా తలచని వారికి మోక్షము దుర్లభం.

1211. అన్ని విధాలుగా ఆత్మని భక్తి విశ్వాసాలతో కొలిచే భక్తులే పరంధామమైన మోక్షాన్ని సంపూర్ణంగా అనుభవిస్తారు.

## 55. జ్ఞానసిద్ధి

1212. అనేక రకాల సిద్ధులలో (తపస్సుతో పొందే సిద్ధులు అణిమాదులని చెప్పినా) జ్ఞానసిద్ధియే శ్రేష్ఠమైనది. అన్ని రకాల సిద్ధులలో జ్ఞానం తప్ప తక్కిన వాటిని పొందినవారు ఆత్మజ్ఞానం కొరకై తపిస్తారు. జ్ఞాన సిద్ధిని పొందినవారైతే ఇతర సిద్ధులను వాంఛించరు. కనుక జ్ఞాన సిద్ధినే కోరుము.

1213. జ్ఞానసిద్ధి పూర్ణసిద్ధి. దానిని పొందిన జ్ఞానులు యితర సిద్ధులను కూడా పొందినవారే. విశాలాకాశంలో లోకాలన్నీ ఇమిడి ఉన్నట్లు, ఆత్మజ్ఞానిలో మనం చూసినవి చూడనివి అయిన సకల సిద్ధులూ ఉన్నాయని తెలుసుకో.

1214. హృదయంలో లోతుగా మునిగి యుంటే, తాను ఒక అల్పజీవుడననే దీనభావం పూర్తిగా నశిస్తుంది. దేవేంద్రుడు కూడా తలవంచి నమస్కరించే అత్యంత గౌరవప్రదమైన జ్ఞాన సామ్రాజ్యం లభిస్తుంది. /

## 56. బ్రహ్మం

1215. బ్రహ్మం నుండి వేరుగాని మహామాయ తాను జగజ్జీవేశ్వరులనే మూడు పాచికలతో నిత్యం ఆడే పాచికల ఆటకు (మాయావిలాసానికి) ఆధారమైన చదరంగం ఆ మహానంద మౌన బ్రహ్మమే.

1216. చలన చిత్రాలను చూసేవారు వాటి ఆధారమైనటువంటి తెరను చూడరు. అట్లాగే, నిశ్చలమైన తెరను చూసే వారు చిత్రాలను చూడరు. ఇది చిత్రశాలలో (సినిమాహాలులో) సహజంగా జరిగే విషయం.

1217. చిత్రశాలలో నిశ్చలమైన తెర లేకపోతే చలన చిత్రాలే ఉండవు. తెరమీద కదలే బొమ్మల కంటే కదలని తెర పేరు.

1218. ఆధారమైనటువంటి నిశ్చలమైన తెరయే బ్రహ్మము. నిశ్చలమైన ఆ తెరపై కదలాడే బొమ్మలే జగజ్జీవేశ్వరులగు త్రిపదార్థాలు. కనుక దృశ్య మానజగత్తంతా మాయ యొక్క లీలలనీ అసత్యమనీ గ్రహించు.

1219. చలన చిత్రం వంటి జీవుడే, తనలాంటి ఇతర ప్రాణులైన చిత్రాలనో లేదా (ఈ జగత్తు జీవులను సృష్టించి, కాపాడి, సంహరించే) ఈశ్వరుడైన చిత్రాన్నో పొందాలని కోరి ఈ అసత్యపు చిత్రమైనటువంటి ప్రాపంచిక జీవితంలో తపిస్తూంటాడు.

వివరణ : ఈ గ్రంథంలోని 161వ వచనమును ఇక్కడ అన్వయించుకోవాలి.

1220. ఆధారమైన తెరయను తనను (ఆత్మను) జననమరణ కర్మాదులుగా చలించే జీవునిగా నెంచి దుఃఖించు చిత్తవృత్తి పూర్తిగా నశించిన మౌనంలో నిలుకడ చెందటమే యోగ్యమైన పని.

## 57. ముక్తి

1221. బద్ధుడనైన నేనెవరు? అని తన్ను తాను విచారణ చేస్తే బంధభావన నశిస్తుంది. దానితోపాటు బంధవిముక్తి భావన కూడా వదలిపోతుంది. ఆత్మతత్త్వం శేషిస్తుంది. దాన్ని గ్రహించటమే ముక్తి.

1222. (పై వచనంలో సూచించిన ప్రకారం) శేషించిన జ్ఞానంగా, శాంతి స్వరూపంగా ఏది వెలుగునో అదే సదాశివ స్వరూపం అంటారు. అలా వెలిగే 'ఆ తత్త్వమే నేను' అని గ్రహించి, 'శరీరం నేను' అనే అహంభావము లేనటువంటి మౌనమే ముక్తి యొక్క అవధి.

వివరణ : శ్రీ భగవాన్ గ్రంథం ఉన్నది నలుబది అనుబంధం 40వ పద్యభావమే ఇందు సూచించడాన్ని గ్రహించండి.

1223 జగజ్జీవేశ్వరులు గోచరించుటకు ఆధారమైన జ్ఞానమగు తన్ను (ఆత్మని) విచారించుటలో నిమగ్నులై, అందువలన ఉప్పొంగే శాంతిలో దృఢముగా నుండి, దాని నుండి అలసత్వంతో జారిపోకుండా అన్నిటినీ వదలి వేయటమే ముక్తి అనబడుతుంది.

1224. బాహ్య విషయ జ్ఞానం నశిస్తేనే తప్ప, ఇంద్రియాలతో కూడిన లోకబంధాల నుండి మానవులు విడిపడరు. స్వరూప నిష్ఠతో ఆత్మలో ఉండుటవలన ఆ అహంకారము నశిస్తుంది. అదే మహానందమైన ముక్తి.

1225. కామమే మన శత్రువు. అదే జన్మలకు హేతువు. మహాత్ములైనవారు కామాన్ని లక్ష్యపెట్టరు. హేయంగా చూస్తారు. శత్రువైన ఈ కామమును హతమార్చే మార్గాన్ని తెలుసుకోవాలి. కామనారహిత స్థితిలో దృఢంగా నిల్చి ఊరక ఉన్నట్లుండాలి. మోక్షం అంటే అదే.

1226. ఉనికి మాత్రంగా ప్రకాశించే శుద్ధాత్మ జీవితాన్ని పొందటమే మోక్షపదం. ఇదే ఋషులు దర్శించి వెల్లడించిన వేదసారమయిన అంతిమ సత్యం.
58. పరమార్థం
1227. ఏదీ సృష్టించబడుటలేదు. నశించుటలేదు. బంధించబడిన వారు లేరు. బంధవిముక్తి కొరకు సాధన చేసే వారూ లేరు. మోక్షాన్ని కాంక్షించే ముముక్షువులూ లేరు. ముక్తి నొందిన వారు లేరు. ఇదే పరమార్థమని తెలుసుకో.

## శ్రీ భగవాన్ - 28

పైన తెల్పిన వచనమునకు శ్రీ భగవాన్ సంక్షిప్తంగా వెణ్బారూపంలో ఉపదేశించినదే ఈ వచనం.

సృష్టి, లయము, బంధవిముక్తి, బంధవిముక్తిని కోరేవారు, దానికై సాధన చేసేవారు, ముక్తి నొందినవారు, ఇవన్నీ యేమీ లేవు. ఇదే పరమార్థం.

వివరణ : ఈ గ్రంథంలో 100వ వచనమును (అజాత సిద్ధాంతం), అమృతబిందూపనిషత్తులోని 10వ శ్లోకాన్ని, ఆత్మోపనిషత్ లోని 30వ శ్లోకాన్ని, మాండూక్యకారికలోని 2-32వ శ్లోకాన్ని, వివేక చూడామణిలోని 574 శ్లోకాన్ని ఇక్కడ అన్వయించుకోవాలి. వాటి భావాన్నే ఇక్కడ భగవాన్ సెలవిచ్చారు.

పరమార్థం దీపం అనే ఈ గురూపదేశ రత్నమాల శ్రీ రమణులు అంతిమ మాటగా అనుగ్రహించిన పరమార్థసత్యం, "ఆద్యంత రహితమై, ఉన్నాను అనే రూపమై, సచ్చిదానంద ఏకస్వరూపంగా, నిర్వికారంగా నిరంతరం ప్రకాశించే "నేనే" పరమార్థం. ఇతరములన్నీ మాయావిలాసమే కనుక అసత్యము" అని ప్రబోధించారు. భగవాన్ దీనిని సూచించినపుడు శ్రీ మురుగనార్ దానిని తమిళంలో అనువదించి ఈ గ్రంథంలో 1227వ ఉపదేశరత్నముగా కూర్చారు. శ్రీ భగవాన్ దానిని ఇంకా సంక్షిప్తంగా ఒక ద్విపదగా రచించారు. అదే శ్రీ భగవానుల 28వ వచనం.

1228. ఉన్న వస్తువైన ఆత్మని లేనిదిగను, లేనిదైన నామ రూప ప్రపంచ దృశ్యాలు ఉన్నవిగను చెప్పటం కేవలం భ్రాంతి. అందువల్ల సర్వమూ సద్వస్తువైన జ్ఞానస్థితిలో ఏకాత్మయే. చిన్మాత్రయే.

1229. "ధాన్యం నుండి బియ్యాన్ని వేరు చేసినట్లు, బంధంతో కూడిన జీవాత్మ బంధాన్ని తీసేస్తే పరమాత్మయవుతోంది" అని శాస్త్రాలు ప్రారంభంలో చెప్పినా, ఇట్లాగ జీవాత్మ పరమాత్మయని (బంధమోక్షాలని) చెప్పేదంతా జ్ఞానరూపమైన ఆత్మలో తోచే భ్రాంతమనోభావన.

## 59. సత్ స్థితి

1230. ఏయే వస్తువులున్నాయని నీవు అనుకుంటున్నావో అవన్నీ నిజానికి లేనివే. పైగా ఏ వస్తువు (ఆత్మ) ఉన్నదనిగాని లేదనిగాని నీ మనసు ఎఱుగదో అదొక్కటే ఉన్న వస్తువు.

123 అనేక విద్యలవల్ల కలిగినటువంటి భేదాలు, దోషాలు నశించునట్లు తనలో ఇముడ్చుకోగలిగినది, సర్వత్రా వ్యాపించి నిండియున్నది. అన్నిటినీ ఛేదించుకొని పోగల అత్యున్నతమైన మహిమగల ఉనికిని మనస్సు కాదనగలదా? .

1232. ఒక వస్తువున్నదనో లేదనో తలపక హృదయంలో ఊరక ఉండినట్లయితే, అప్పుడు నామరూప రహితంగా ఏదైతే నిత్యం “నేను” అనే స్ఫురణతో ప్రకాశించునో ఆ జ్ఞానమే అసలైన సత్యమైన ఉనికి.

1233. అనాది అయిన షడ్దర్శనాలలో అంతము లేనిదని చెప్పతగ్గది అద్వైతం ఒక్కటే (ఆత్మయే). తక్కిన ఐదూ (అనాది అయినప్పటికీ) అంతం కలిగినవే అని స్పష్టంగా తెలుసుకో.

వివరణ : కపిల మహర్షుల సాంఖ్యం, పతంజలి యోగం, కణాదుని వైశేషికం, గౌతముల న్యాయం, జైమిని పూర్వమీమాంస, వ్యాసుల వేదాంతం ఇవి మన కున్న షడ్దర్శనాలు. ఈ ఆరింటిలో వేదాంతమే అద్వైతమని పై పద్యభావంలో సూచించారు. మాయాతీతమై ఏకమైన బ్రహ్మమే సద్వస్తువని వేదాంతం చెప్పే మాట. తక్కిన ఐదు సిద్ధాంతాలను దృఢపరచటం మాయాలీలకు లోనుకావడమే అవుతుంది. అందువల్ల అనాది ఐనప్పటికీ అంతముగల మాయవలె, ఈ పంచదర్శనాలు మాయ నశించుటవల్ల తామూ నశించునవే, అంటే అంతముగలవని తెల్పబడింది.

1234. ఉన్న వస్తువు ఒకటే. అతి సూక్ష్మబుద్ధితో హృదయంలో అన్వేషించి తెలుసుకొన్న జ్ఞానులు ఆ పూర్ణసద్వస్తువు ఒకటే యని శాస్త్రాలలో పలు రకాలుగా ప్రబోధించారని ఎరుగుము.

1235. మతాలు ఎన్నో ఉన్నాయి. అవి ఎంతగానో వ్యాపించి ఉన్నాయి. వాని అన్నింటిలో అద్వైతమే మకుటాయ మానమైనట్టిది. అది జ్ఞానమయంగా ప్రకాశించే పరామౌనము. మతాల నడుమ విభేదాలు సృష్టించిన అహంత ఆ అసద్రూపమైన విషబీజం నశింపజేయవలసినట్టిది.

1236. ఆద్యంతాలు లేనిది, మార్పు, కారణం, ఉపమానాలు లేనిది, మనోబుద్ధ్యతీతమైన ఆత్మ వస్తువును తెలుసుకున్న వారే ఉత్తమ స్థితిని పొందిన జ్ఞానులు.

## 60. భావనాతీతం

1237. అద్వైత మహిమ, దేనితోను బంధంలేక స్వతంత్రమైన పరావస్తువుగా జ్ఞానుల హృదయంలో తెలుస్తుందే తప్ప, ధ్యానించే వారికి అల్పేంద్రియాల ద్వారా అసత్యంగా గోచరించే ద్వైత దృశ్యాలవలె తెలియబడేదికాదు.

1238. జ్ఞాన స్వరూపమును, మనో రహితమైనబ్రహ్మమును, మనోమూలమయిన హృదయంలో నిలకడ చెందిన ప్రాజ్ఞులు తెలుసుకొంటారే తప్ప, కలత చెందిన చిత్తం గల మానవులు తెలుసుకోరు.

1239. అద్వైత మహిమను అనుభవం చేసుకోవాలని తపించే తీవ్ర ముముక్షువుల్లారా! చిత్త వాసనలు పూర్తిగా అణగి, శాంతం పొంగి, సద్వస్తువులో నిష్ఠగలవారికే అద్వైతానుభవం లభిస్తుంది. ఆత్మ విచారణ మార్గాన్ని అవలంబించి సత్యంలో నిలకడ చెందటానికి ఇష్టపడని మందబుద్ధులకు ఆ అనుభవం ఎట్లాగ లభించగలదు? తెల్పండి!

## 61. అనుభవ వర్ణన

1240. సద్గురువులు శ్రీ రమణ భగవానుల ఉపదేశంతో పొందిన నాస్వానుభవాన్ని చెబుతున్నాను. "ఇంత వరకు మహాభయంకర పాశారణ్యమని ఎంచిన ఈ ప్రపంచమంతా లోకాతీతమైన జ్ఞానమౌనాకాశమే తప్ప మరేది కాదు. ఇంతకాలం తెలుసుకొన్న ఇంద్రియ జ్ఞానమంతా స్వప్నం వంటిదే."

(ఈ వచనం నుండి 1248 వరకు అంటే తొమ్మిది వచనములలో శ్రీ రమణ సద్గురువుల అనుగ్రహంతో తమకు సిద్ధించిన జ్ఞానాన్ని శ్రీ మురుగనార్ తెల్పుతున్నారు)

1241. బుద్ధి భ్రమతో ఇంతకాలం పరమార్ధ స్వరూపానికి అన్యంగా నన్ను భావించాను. ఇప్పుడు తెలిసింది. బంధం, ముక్తి మొదలైనవన్నీ నిజంగా కొంచెం కూడా నేను పొందనే లేదు (అంటే బంధమూ పొందలేదు! దానినుండి ఇప్పుడు ముక్తి పొందలేదు). అతీతమై స్వయం స్ఫురణమై ప్రకాశించు పరమార్ధ స్థితిని తెలుసుకున్నాను.

(ఉపదేశసారంలోని 29వ పద్యం, ఉన్నది నలుబదిలోని 50వ పద్యాన్ని పోల్చి చూసుకోవలెను)

1242. మనం ఏ మతాన్ని పరిశీలించినా, ఆయా మతాలలో ఏయే విధాల వాదనలను విన్నా, ఆ మతవాదనలన్నీ, ఒక పరమోద్దేశ్యాన్నే నిశ్చయంగా చెబుతున్నాయని తెలుసుకున్నాను.

1243. వేదము బోధించే సచ్చిదాత్మకమైన పూర్ణ స్వరూపంలో నెలకొని ఉంటే ఇక పురుషత్రయం, కాలత్రయం, త్రిపుటులు యివియేవీ అక్కడ గోచరింపవు.

వివరణ : పురుష త్రయం: ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలు, కాలత్రయం: భూత, భవిష్యత్ వర్తమానం, త్రిపుటి ద్రష్ట, దృశ్యం, దృక్.

1244. ఆలోచించిచూస్తే నేను పైన తెల్పిన ఈ అతి సూక్ష్మజ్ఞానం, మహాజ్ఞానియైన జ్ఞాన రమణ గురునాథులు నా ముందు నిల్చి కరుణతో అనుగ్రహంతో మౌన వ్యాఖ్యాన రూపంగా ప్రసాదించిన అనుభవమే.

1245. "నా అద్వైత దృష్టిలో సత్తైన నేను ఉన్నాను. నీవు అని చెప్పేందుకు ఇంకొక వస్తువు లేదు. నీవే సత్పదార్థమని తలచే నీ దృష్టిలో "నీవు" తప్ప "నేను" అని మరొక వస్తువు లేదు. జ్ఞాన దృష్టితో చూసినపుడు ఆత్మే ఉన్నది. నేను, నీవు, వాడు అనే భేదాలు గోచరించటం లేదు. నిజం తెలుసుకొంటే నేను, నీవు, వాడు అన్నీ ఆత్మయే.

1246. నేను ఎవరికీ చెందిన వాడనుకాను. నాకు చెందిన వారు ఎవరూ లేరు. నేను ఎవరికి బానిసను కాను. నాకెవరూ బానిస కాదు. నేను నిర్వర్తించవలసిన బాధ్యతలు లేవు. కర్తవ్యాలు లేవు. అలాగే నేను కర్మఫల భోక్తను కాను. నేను కర్తను కాను, ఇది నిజం. గ్రహించండి.

1247. మాయలో బడినట్లు భ్రాంతిచెందిన నా కళ్ల ముందు రమణ సద్గురువుగా కనబడి నన్ను అనుగ్రహించినది నా ఆత్మే కాబట్టి, ఆ సద్గురు స్వరూపంగానే ప్రకాశించు నాపూర్ణాత్మకే నా వందనాలు.

1248. శివస్వరూపమైన శ్రీ రమణపరమాత్మకు మాత్రమే లోబడునే తప్ప, ఈ మురుగన్ (శ్రీమురుగనార్) దుఃఖాన్నిచ్చే పేదరికాన్ని ఎంత అనుభవించవలసి వచ్చినా సరే క్షుద్రమైన జగన్మాయాశక్తికి ఎప్పుడూ లోబడడని మాత్రం తెలుసుకోండి.

## 62. సమదృష్టి

1249. అన్ని ధర్మాలకి మూల ధర్మము ఆత్మజ్ఞాన నిష్ఠ. ఆ నిష్ఠ కలిగిన ఉత్తములకు జాతి, కుల, ధర్మాలేవి ఆచరించవలసిన పని లేనే లేదు. ఈ మిథ్యా శరీరానికే గాని సద్వస్తువైన ఆత్మకు ఏ విధులూ ఏ నియమాలూ లేవు. ఆత్మలో ఏ విభజనలూ లేవు.

1250. ఇంద్రియముల ద్వారా మనం చూచే సమస్తంలోను ఆత్మయైన తానొక్కడే వెలుగుతున్నట్లు అనుభూతిపొంది, అంతటా సమత్వాన్ని దర్శించటమే జ్ఞానులు కీర్తించే "సమదర్శనలబ్ధి".

1251. అహంత నశింపగా, ఆత్మానుభవాన్ని పొంది, శాంతియుతుడై ఉండే జ్ఞాని పొగడ్తలకు పొంగడు, తెగడ్తలకు క్రుంగడు.

1252. మండుటెడారిలో ఎండమావి మంచినీటి సరస్సులాగా తోస్తుంది. అలాగే మిథ్యయైన జగత్తులో ప్రారబ్ధమును బట్టి సంపదలు లభించవచ్చు, ఆపదలు ఎదురుకావచ్చు. జ్ఞానికి సంపదల వల్ల సంతోషమూ లేదు. ఆపదల వల్ల దుఃఖమూ లేదు. వాటి వల్ల జ్ఞాని చలించడు. భ్రాంతికి లోనుకాడు.

1253. తమ అభీష్టము నెరవేరాలనే కోరిక లేక జ్ఞానులు జీవిస్తుంటారు. సత్తులై వారుండటమే అప్రయత్న సిద్ధమైన సహజ తపస్సు. వారి వల్ల లోకంలో జనులకు యోగక్షేమములు సమకూరుతాయి. వారి ఉనికి లోకానికి మహోపకారమని గ్రహించండి.

తత్త్వానుభవం
మూడవ భాగం సంపూర్ణం.

# ప్రార్థన

మంగళం

1254. అరుణాచలం వర్ధిల్లుగాక!🙏 శ్రీ రమణ గురువులు వర్ధిల్లుదురుగాక!🙏 ఆ భగవాన్ మురుగనార్ వర్ధిల్లుగాక!🙏 తెలుగు సేత తాడిమేటి సత్యనారాయణ వర్ధిల్లుగాక!🙏 సద్గురువుల అనుపమ ఉపదేశాలను అనుసరించి జీవించే

భక్తులు వర్ధిల్లుదురుగాక!🙏శ్రీ రమణగురువులు సెలవిచ్చిన శ్రేష్ఠమైన ఉపదేశాలని మాలగా కూర్చిన ఈ గురూపదేశరత్నమాల గ్రంథాన్ని పఠించే వారు పరమార్థజ్ఞానాన్ని పొంది నిత్యం వర్ధిల్లుదురుగాక! 🙏

శ్రీ రమణార్పణమస్తు🌹🙏.